## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

మహాకవి కాళిదాస విరచిత

# మేఘసన్దేశము

వ్యాఖ్యాత

'విద్వాన్' కోసూరు వెంకట నరసింహరాజు



సంస్కృతభాషా ప్రచార సమితి
హైదరాబాదు - 500 001
1995

శ్రీః

# ఉపోద్ఘాతము

కాళిదాసమహాకవి రచించిన మేఘసందేశ (మేఘదూత) కావ్య మొక రసగుళిక.

ఒకానొక యక్షుడు మేఘునిద్వారా తన ప్రేయసికి సందేశ మంపుటయే ఇందలి కథావస్తువు. విప్రలంభశృంగారము ప్రధానరసము. అచేతనమగు ప్రకృతిని రసస్యందిగా తీర్చిదిద్దిన తీరు ఈ కావ్యమున కొక ప్రత్యేకతను కూర్చుటయే కాక కవిభావుకతావైశిష్ట్యమును గూడ వేనోళ్ళ చాటుచున్నది.

నిర్వింధ్యానదిని వర్ణించిన తీరెంత యద్భుతముగా నున్నదో చూడుడు-

శ్లో. వీచిక్షోభస్తనితవిహగశ్రేణికాంచీగుణాయాః
సంసర్పన్త్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః,
నిర్వింధ్యాయాః పథి భవ రసాభ్యంతరః సన్నిపత్య
స్త్రీణామాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు. (పూ.మే.శ్లో.-29)

బారులు కట్టిన హంసల పంక్తి అలల తాకిడిచే కూయుచుండగా సుడులు తిరిగి ఉపలములపై స్ఖలించుచు ప్రవహించుచున్న నిర్వింధ్యానది, మొలనూలి మువ్వలు కాలి తొట్రుపాటుచే మ్రోయుచుండగా నాభి బయల్పడ నడచు నాయికవలె నున్నదట. అట్లు కాలి తొట్రుపాటున నడచుట యొక అందమట. నోటిమాటచే గాక కేవలవిలాసక్రియలచే తమ యనురాగమును ప్రకటించుట స్త్రీల స్వభావమట. కావున ఈ మేఘుడు ఆ నిర్వింధ్యానాయికను కలిసి ఆయమ యనురాగమును సఫలము చేయవలెనట. లేనిచో రసాభ్యంతరుడే (సరసుడే) కాడట. ఎంత హృదయంగమమైనదీ భావన! కావుననే-

శ్లో. శృంగారీ చేత్ కవిః కావ్యే సర్వం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం సర్వమేవ హి.

కవి శృంగారియైన కావ్యప్రపంచ మంతయు శృంగారరసస్యంది యగుననియు, అతడు నీరసుడైన అది నీరస మగు ననియు చెప్పిన పలుకులు ఎంతయో సముచితములు. ఈ మేఘసందేశకావ్యమున నీరసమగు శ్లోకమే లేదనిన నతిశయోక్తి కాదు. కావున ఎందరో కవు లీ మేఘసందేశకావ్యప్రభావమునకు లోనై హంససందేశాదికావ్యముల నెన్నింటినో రచించిరి.

వానిలో సాంగణకుమారుడగు విక్రమకవి రచించిన నేమిదూత కావ్య మొకటి. ఇతరకావ్యములకంటె ఈ నేమిదూతకావ్యమున నొక విశేషము కానవచ్చుచున్నది. కాళిదాసమేఘదూతకావ్యశ్లోకముల చతుర్థచరణముల గ్రహించి ఈ నేమిదూతకావ్యము రచింపబడినది.

శ్లో. తద్దుఃఖార్తం ప్రవరకవితుః కాలిదాసస్య కావ్యా-
దన్త్యం పాదం సుపదరచితా న్మేఘదూతాద్గృహీత్వా,
శ్రీమన్నేమేశ్చరితవిశదం సాంగణస్యాంగజన్మా
చక్రే కావ్యం బుధజనమనఃప్రీతయే విక్రమాఖ్యః. (నేమి. శ్లో. 126)

ఒక సమస్యను పూరించుట యనిననే ఎంతో వింతగా దోచును. కావ్య మంతయు నిట్లు కథాసూత్రము చెదరకుండునట్లు సమస్యాపూరణ మగుట సామాన్యవిషయము కాదు. అది కవిగతసునిశితభావనానైపుణీవ్యంజకము.

నేమి యను యాదవరాజు విషయవిముఖుడై గిర్యాశ్రమముల తపము సేయ సమకట్టగా అతని వైరాగ్యమును మాన్పి ఇంటికి దెచ్చుటకై అతని ప్రేయసి స్వయముగా నెఱపిన సందేశరూపమగు నీ కావ్యమున మొదటి శ్లోక మిది-

శ్లో. ప్రాణత్రాణప్రవణహృదయో బంధువర్గం సమగ్రం
హిత్వా భోగాన్ సహ పరిజనైరుగ్రసేనాత్మజాం చ,
శ్రీమాన్నేమి ర్విషయవిముఖో మోక్షకామశ్చకార
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు. (నేమి. శ్లో. 1.)

"బాహ్యోద్యానస్థితహరశిరశ్చంద్రికాధౌతహర్మ్యా" అనుదానిని పూరించి రచించిన ఈ శ్లోక మెంత హృద్యముగా నున్నదో చూడుడు-

శ్లో. తుంగం శృంగం పరిహర గిరేరేహి యావః పురీం స్వాం
రత్నశ్రేణీరచితభవనద్యోతితాశాంతరాళామ్,
శోభాసామ్యం కలయతి మనాజ్నాలకా నాథ! యస్యా
బాహ్యోద్యానస్థితహరశిరశ్చంద్రికాధౌతహర్మ్యా. (నేమి. శ్లో.7)

ఉగ్రసేనాత్మజ తననాథుడగు నేమిరాజును ఈ పర్వతశిఖరమును వీడి తమ పట్టణమునకు వెళ్ళుదమని వేడుకొనుచు ఆ పట్టణశోభను వర్ణించు సందర్భము నందలి దీ శ్లోకము. ఆ పట్టణము మణిమయభవనకాంతులచే దిక్కులన్నియు ప్రకాశింపజేయుచున్నదట. కావుననే దానికి బాహ్యోద్యానస్థితుడగు శివుని శిరమందలి చంద్రుని వెన్నెలలచే మెఱయు మేడలు గల అలకాపురి సాటిగాదట. ఔను; స్వయంప్రకాశము గలదానికి పరప్రకాశితము సాటి ఎట్లగును?

మఱి యొకటి-

శ్లో. శశ్వత్సాంద్రస్థతనుమహసం ప్రోల్లసద్రత్నదీపా
మానప్రాంశుం శిఖరనివహైర్వ్యోమమార్గం స్పృశంతః,
గౌరం జ్యోత్స్నావిమలయశసా శుభ్రవర్ణాః సుధాభిః
ప్రాసాదాస్త్వాం తులయితుమలం యత్ర తైస్తైర్విశేషైః. (నేమి. శ్లో. 68)

ఇది ఉత్తరమేఘములోని ప్రథమశ్లోకాంత్యచరణోపేతము.

నేమిరాజునకు పురభవనములతో సామ్యము చెప్పట ఇట ప్రస్తుతము. ఈ రాజు స్వశరీరకాంతిచే మహోజ్జ్వలుడై యుండగా ఆ ప్రాసాదములు సముజ్జ్వలరత్నదీపములు గలవై యున్నవట. ఇతడు శరీరప్రమాణముచే నత్యున్నతుడై యుండెనని తమ యంచులచే నాకసము నంటుచున్నవట. ఇతడు నిజయశశ్చంద్రికల ధవళుడై యుండగా అవి సున్నపుకాంతులచే తెల్లనివై యున్నవట. కావుననే ఆ ప్రాసాదములు ఇతనికి సాటి కాజాలునట. ఈ కావ్యము సమస్యాపూరణప్రాయమయ్యు క్లిష్టకల్పనలకు చోటుచేసికొనలేదు.

మేఘదూతశ్లోకసంఖ్యానవిషయమున విమర్శకులలో మతవైవిధ్యము కానవచ్చుచున్నది. ఈ నేమిదూతము ననుసరించి చూడ మేఘదూతశ్లోకములు 125 అని తెలియుచున్నది. నిర్ణయసాగరముద్రణప్రతిలో మల్లినాథవ్యాఖ్యతో 121 శ్లోకములు మాత్రము కానవచ్చుచున్నవి. వీనిలో పూర్వమేఘములోని 4 శ్లోకములు, ఉత్తరమేఘములోని 2 శ్లోకములు- మొత్తము 6 శ్లోకములు ప్రక్షిప్తములని పేర్కొనుచు మల్లినాథుడు వ్యాఖ్యానించినవి కూడా కలవు. వ్యాఖ్య లేని ప్రక్షిప్తశ్లోకములు అధోజ్ఞాపికయందు పూర్వమేఘమున నొకటి, ఉత్తరమేఘమున 6 శ్లోకములు (1 +6=మొత్తము 7) చూపబడినవి. వీనిలో ఉత్తరమేఘములోని 1. ధారాసిక్త 2. తత్సందేశం 3. శ్రుత్వా వార్తాం అను నీ మూడు శ్లోకములు మల్లినాథుడు ప్రక్షిప్తము లని యెంచక వ్యాఖ్యానించినట్లు తెలుగులిపి ముద్రితప్రతులలో కానవచ్చుచున్నది.

ఈ నేమిదూతకావ్యమున మల్లినాథవ్యాఖ్యతో లభించిన శ్లోకము లన్నియు (121+3 =124) నున్నవి. ఇవిగాక పూర్వమేఘములోని 18వ శ్లోకము పిమ్మట పఠింపదగునని చెప్పబడు ప్రక్షిప్తశ్లోకము-

శ్లో. అధ్వక్లాంతం ప్రతిముఖగతం సానుమానామ్రకూట
స్తుంగేన త్వాం జలద! శిరసా వక్ష్యతి శ్లాఘ్యమానః,
ఆసారేణ త్వమపి శమయేస్తస్య నైదాఘమగ్నిం
సద్భావార్ద్రః ఫలతి న చిరేణోపకారో మహత్సు.

అనుదానికి నేమిదూతములో-

శ్లో. పూర్వం యేన త్వమపి వయసా భూషితోఽంగే సమగ్రే
తైస్తైః క్రీడారససుఖసఖైర్భవ్యభోగైరిదానీమ్,
తత్తారుణ్యం సఫలయ పురీం ద్వారకా మేత్య శీఘ్రం
సద్భావార్ద్రః ఫలతి న చిరేణోపకారో మహత్సు. (నేమి.శ్లో.18)

అను పూరణము కానవచ్చుచున్నది. విచ్ఛిత్తివిశేషమునకై కవు లట్లు ఒకే

యర్థమును రెండు శ్లోకములలో వర్ణించుట కాననగుటచే నేమిదూతకారుడు ఈ శ్లోకము గూడ కాళిదాసరచనగా భావించి తన నేమిదూతమున స్థానము కల్పించెనని తోచెడిది. ఈ శ్లోకమునకు మల్లినాథవ్యాఖ్య లభించకపోవుటకు గల కారణము పరిశీలనీయము.

ఇట్లు నేమిదూతము ననుసరించి 125 శ్లోకములు కాగా మల్లినాథవ్యాఖ్యతో 124 శ్లోకములు మాత్రము లభ్యము లగుచున్నవి. కావున మేఘదూతశ్లోకములు 125 లేదా 124 మాత్రమని గణించుటయే సముచితమని భావించవలసి వచ్చుచున్నది. వీనిలో కొన్ని ప్రక్షిప్తములే యగుగాక! అయిన నవి యన్నియు బంధరామణీయకమునకు నోచుకొన్నవి.

నిర్ణయసాగరప్రతియందలి-

1) స్నిగ్ధాః సఖ్యః
2) అన్వేష్టవ్యాః
3) తస్మాదద్రేః

అను ప్రక్షిప్తములు గాక వారాణసీపండితపుస్తకాలయమువారి ప్రతిలో మరి రెండు ప్రక్షిప్తములు-

1) ఇత్యాఖ్యాతే సురపతి
2) ఇత్థంభూతం

అనునవి కావచ్చుచున్నవి.

ఈ అయిదు ప్రతిక్షిప్తములును రచనాసౌష్ఠవమున కొఱవడి గ్రంథమునకు అర్థపౌనరుక్త్యము నాపాదించునవి యగుటచే మేఘదూతశ్లోకాంతర్గతత్వమును కోల్పోయి యుండవచ్చునని భావించవచ్చును.

విద్వాన్ శ్రీ కోసూరి వెంకట నరసింహరాజుగారు మల్లినాథవ్యాఖ్యతో నుపలబ్ధము లగుచున్న 67 పూ. + 57 ఉత్త. = 124 శ్లోకములనే మేఘసందేశమందలి శ్లోకములుగా నెంచి వానికిని, ప్రక్షిప్తములని నిర్దేశించుచు పై అయిదు శ్లోకములకును గూడ వ్యాఖ్యావివరణాదులు సమకూర్చియున్నారు. ప్రతిశ్లోకమునకు అన్వయప్రతిపదార్థములతోపాటు భావమును, అలంకారాదివిశేషాంశములను గూడ రచించియుండుట ఎంతో ముదావహము. ఈ వివరణ మంతయు మల్లినాథుని వ్యాఖ్య ననుసరించి చేసినట్లు వ్యాఖ్యాతయే చెప్పుకొనినాడు. మల్లినాథుని వ్యాఖ్యతో నుపలబ్ధము కాకపోయినను నేమిదూతకారుని యాదరమునకు పాత్రమైన ప్రక్షిప్తము "అధ్వక్లాన్తం" అనుదానికిని వ్యాఖ్యావివరణాదులు రచించియుండిన నెంతో సమంజసమై యుండెడిది.

అర్థవివరణాదులు సరళము, సుబోధము, సుందరమైన శైలిలో ఎంతో హృద్య

గా నున్నవి. శ్లోకభావమును వివరించునప్పుడు ఈ వ్యాఖ్యాత ప్రదర్శించిన నేర్పు న్యసామాన్యమైనది. పం డొలిచి చేత బెట్టినట్లు, శ్లోకతాత్పర్యవిశేషాంశము ్రయు పఠితల మనఃఫలకములపై చెఱగని ముద్ర వేయునట్లును వెలయించిన యు - మనోహరముగా సాగినది. ఎంత దీర్ఘసమాసమునకైనను చిన్న చిన్న టలతో భావము వివరించుట జిజ్ఞాసువుల కెంతో ఉపకారకముగా నున్నది.

గ్రంథాదిని విపులమగు భూమికయు రచించియున్నారు. కవికాలాదులు, వైశిష్ట్యము, కృతుల పరిచయము, మేఘదూతకావ్యపరిచయువైశిష్ట్యాదులు, సుభా ిసంగ్రహము మున్నగు నంశములు జిజ్ఞాసువులకు కవినిగూర్చి సమగ్రజ్ఞానము ుగజేయునవిగా నున్నవి.

కాళిదాసమహాకవి రచనలను ఎందరో వ్యాఖ్యానించి యున్నారు. ఇప్పటికిని ఖ్యానించుచునే యున్నారు. తెలుగునను మేఘదూతకావ్యమునకు ప్రతిపదార్థ త్పర్యవివరణాదులు ఇంతవరకే కొన్ని వెలువడినవి. అయినను దేని ప్రత్యేకత ికే యున్నది. కావుననే మల్లినాథుడు-

**కాళిదాసగిరాం సారం కాళిదాసః సరస్వతీ,**
**చతుర్ముఖోఽథవా సాక్షాత్ విదుర్నాన్యే తు మాదృశాః.**

అని కాళిదాసమహాకవికవితారహస్యములు తెలియుట సామాన్యము కాదని ్రాయున్నాడు.

ఇట్లే ఈ వ్యాఖ్యాత లేఖినినుండి మఱికొన్ని సంస్కృతకావ్యముల వివరణాదులు ువడి ఆంధ్రప్రజానీకమున కానందము సమకూర్చవలెనని ఆశించుచున్నాను.

ఇట్లు,
సుధీజనవిధేయుడు,
డా. కె. రాజన్నశాస్త్రి, M.A. Ph.D. MOL
సంస్కృత సాహిత్యరత్న, విద్యాప్రవీణ.
Lecturer, P.G. Centre,
Women's College,
O.U. Hyderabad.

్రదాబాద్
-1-1983

# సంస్మరణ

మజ్జన్మదాతలు, పోషకులు, నిరంతరసంస్మరణీయులు, మచ్ఛ్రేయోభిలాషులు, శ్రీ సీతారామరాయ, లక్ష్మీనరసమాంబ లను శుభ నామాంకితులగు మన్మాతాపితల పావనపాదపద్మములకు వినయ వినమ్రుడనై ప్రణతు లొనర్చి సంస్మరించి, నిరాడంబర, నిరంతర విద్యా వితరణశీల సహృదయ, సాధుసత్తమసాహితీపరులు, మద్గురువర్యులు కీర్తిశేషులు నగు శ్రీ పణ్డితసీతారామరాయల (రుద్రరాజు) చరణకమలముల స్మరించి, "గురుదక్షిణగ" భక్తిపురస్సరముగ నే సమర్పించు సుగంధితసుమనోహరసుపుంజ మిది.

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీగురవే నమః.

ఇతి
రచయిత
'విద్వాన్' కోసూరు వెంకటనరసింహరాజు

# ప్రార్థన

శ్లో. జ్ఞానానన్దమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.

సత్ చిత్ రూపుడగుట నిత్యచైతన్యమయుడు. కనుకనే ఆనందస్వరూపుడు. శుద్ధా ంద్వరూపమునకు మాలిన్య మెక్కడిది? అది స్ఫటికమువలె స్వచ్ఛము, నిర్మలము. విశుద్ధపరిపూర్ణజ్ఞానరూపమే సర్వవిద్యలకును బ్రహ్మాదిసర్వదేవతలకును మూలా రమై వెలుగొందుచున్నది. ఇది అది యను విభజన లేక ఎల్లవిద్యలకు ి నాయకత్వము వహించి యెల్లదేవతలకు ఆధారభూతమై విశ్వవ్యాప్తమై యగ్రీవరూపమున వెలుగొందుచున్న శ్రీమన్మహావిష్ణువును మనసార ధ్యానించి వించి ఉపాసింతును.

. శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాన్తయే.

పాలనురుగును, పున్నమివెన్నెల వెలుగును మించి ప్రకాశించు తెల్లని యుడు ు ధరించువాడును, నిండు చందురుని వలె ప్రసన్నరూపమున వెలుగొందు డును, లోకావనదక్షములగు చతుర్భుజముల దేజరిల్లువాడును, దయానిధియు, ంణాసముద్రుడు నగుట ఎల్లవేళల నిండుమోమున భక్తులయెడ అనుగ్రహరూ ుగు కరుణామృతమును చిందించువాడును, ఇందు గల డందు లే డను ందేహమునకు తావులేక ఎల్లజగముల నిండియుండువాడును, పార్వతీప్రియ ుభవుడు నగు విఘ్ననాయకుని అడుగడుగున నెదురగు నాటంకము ంతరించుకొనుటకు వినయవినమ్రభావమున ముకుళితహస్తుడనై మనసార పూజించి ్యానింతును.

. వాగీశాద్యా స్సుమనసః సర్వార్థానా ముపక్రమే,
యం నత్వా కృతకృత్యాః స్యు స్తం నమామి గజాననమ్.

సృష్టిస్థితికారకులగు బ్రహ్మాదులు ఇంద్రాదిసమస్తదేవతలు స్వకార్య స్వప్రయోజ ులు సాధింప నారంభించుటకు ముందు విఘ్ననాయకుడు, విఘ్నచోదకుడు, ూమయుడు, కృపాతరంగితహృదయుడు, పూర్ణపురుషుడు నగు ఏ మహా మునికి నమ్రభావమున అంజలి ఘటించి పూజించి కృతకృత్యు లగుదురో ార్యసఫలత నందుదురో) అట్టి పురాణపురుషుడు, పార్వతీప్రియసుతుడు గజ ంఖుడు నగు విఘ్నేశ్వరునకు, మాటిమాటికి నెదురగు నాటంకములు నివారించు ంణాకటాక్షవీక్షణము లాశించి వినయవినమితశిరస్కుడనై వందన మాచరింతును. క్తిపురస్సరముగ హృదయసుమ మర్పించి అర్చింతును.

రచయిత
కోసూరు వెంకట నరసింహరాజు

# మున్నుడి

శ్లో. యానేవ శబ్దాన్ వయ మాలపామో
యానేవ చార్థాన్ వయ ముల్లిఖామః,
తైరేవ విన్యాసవిశేషభవ్యైః
సమ్మోహయన్తే కవయో జగన్తి.

నిత్యము మనము పలుకునవియే. మన ముల్లేఖించునవియే. అవే మాటలు. తద్భిన్నములు గావు. అయిన నేమి? పరుసవేది స్పర్శకు ఇనుము బంగారమైన యట్లు మహాకవి కలము తాకిన అవే పలుకులు అవే మాటలు కలకండ గుళిక లగును. తేనెల ఊట లగును. మధుబిందువులు చిలకరించును. అందుండి అమృతపు చినుకులు జాలువారును. కవిలేఖినియం దేదియో అనిర్వచనీయమగు శక్తి కలదు. ఒహో యనిపించి మైమరపించు మహిమ గలదు. అందుకు కారణము? వారి ప్రతిభావ్యుత్పత్తులు, పదప్రయోగవైచిత్రి, నిపుణత, నుడికారపు ఇంపుసొంపులు, ఔచిత్యము. మాటల మర్మముల నేర్పు కూర్పు. అట్టి నేర్పు కూర్పుగల మాటలయం దొయ్యారము తొణికిసలాడును. సింగార ముట్టిపడును. ఎనలేని మాధుర్యమార్దవములు శోభాసుషమలు సమకూడును. కవి ప్రతిభావ్యుత్పత్తుల దోగిన శబ్దపల్లవములు సుమనోహరములగు ఇంగిలీకపు రంగు లీనును. రవిశంకరుని చేతి సితారునుండి కమ్మగా కమనీయముగా జాలువారు లలితమాధుర్యరాగమాలికల దలపించును. అందు ఎనలేని శిల్పసౌందర్య ముట్టిపడును. అచ్చెరువు గొలుపు చిత్తరువు రమ్యత దీపించును. రాగసుధారసము ధారావాహినిగా పొంగి ప్రవహించును. అది అక్షరముల ముద్దులొలుకు కూర్పుల మహిమ. శబ్దముల ఒద్దికయగు పొందిక, సుకవి పలుకుల తీరది, తరితీపుల మధుబిందువు లవి, కమ్మతావుల మల్లీకుసుమము లవి, తమ్మిపూవుల దేలు చిక్కనితీపి తేనెల బొట్టు లవి, పున్నమనాటి పండువెన్నెల సోన లవి. అట్టి కమ్మని పలుకుల మధురకావ్యములు రచించి మహాకవులు అజరామరులు, మృత్యుంజయులై భువనములు మోహింపజేతురు. ఓహో! యనిపించి జేజేలు పలికింతురు. వారి ప్రజ్ఞాప్రాభవము లట్టివి. వారు ధన్యజీవులు.

సహజముగా కవులు సౌందర్యోపాసకులు. సత్యశివసుందరరూపమగు పరబ్రహ్మమే వారి ఆరాధ్యదైవము. నిత్యము తన్నిష్ఠయే వారి జీవితపరమావధి. బాహ్యాభ్యంతరమధురమనోహరప్రపంచముననే వారి యునికి.

శ్లో. జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్.

వారు ధన్యజీవులు. ఆచంద్రార్కస్థాయి వారి కీర్తి. మహాకవుల యశశ్శరీరము

నకు ముదిమిచావు లెక్కడివి? వారు అజరామరులు. చిరంజీవులు. రసమున సిద్ధహస్తులు వారు. వారి లేఖిని సదా అమృతనిష్యందిని. సుధారసధారావాహిని. వారిది దివ్యలేఖిని. అది అవిరళమధురసనిష్యందిని. కవులు అపరబ్రహ్మలు. విలక్షణదివ్యసృష్టి వారిది. సౌందర్యసీమల నధిగమించిన విచిత్రసృష్టి యది. మాయక చెరగక ఒక్కరీతిగా దీపించు వినిర్మల విలక్షణ విచిత్ర కమనీయ భవ్య దివ్యసృష్టి యది. వారి రచనలు భావగంభీరతావైశద్యముల రసపుష్టి నొంది యొప్పారును. మఱియు శ్లేషభూషిత ధ్వనివిలసిత అలంకారమండిత నీతిబోధకములై అమృతకల్పములు, నిత్యనూతనములు, మధురరససంభరితములునై ముక్తిదాయకము లగును.

కవులు అనంతము, విలక్షణము, విలాసభూషితము నగు ప్రకృతిని తిలకించి తత్ప్రభావమున ప్రభావితులై మురిసి లోకముల మురిపింతురు. పాఠకులను మంత్రముగ్ధుల జేసి ధన్యు లగుదురు. అందును-

శ్లో. పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా,
అద్యాపి తత్తుల్యకవే రభావాత్ అనామికా సార్థవతీ బభూవ.

మున్నొకప్పుడు కవుల గణనాప్రసక్తి వచ్చెను. ఉద్దండపండితుల సమావేశమది. చిటికెనవ్రేలు ముడువబడినది. అం దధిష్ఠించినది మహాకవి కాళిదాసు. సభలో ప్రథమతాంబూలము ఆయనదే. ఆ గౌరవము, ఆధిక్యము ఆయనకే దక్కినది. అంత తత్తుల్యు డెవరను ప్రశ్న ఉదయించినది. జవాబు లేదు. నాడే కాదు. నేటికిని సమాధానము లభించదు. ఇఱువది శతాబ్దములు గడచినను తత్తుల్యుడు లేనందున ప్రక్కవ్రేలు అనామిక యను సార్థకనామమున వెలయుచున్నదని చమత్కారము.

నాటికిని నేటికిని సంభవతః మఱెప్పటికిని రససంభరితము, ఔచిత్యశోభితము, ధ్వనివిలసితము, అలంకారభూషితము నగు లలితమంజులమనోజ్ఞకమనీయకవితారచనకు అగ్రతాంబూలమును, ఆదిపూజయు ఆయనకే. కవికులతిలకుడు కాళిదాసుని అపూర్వరమణీయ మృదుమధురకవితారచనలు ముగ్ధమోహిని యగు సంస్కృతభాషాయోషకు అమూల్యమనోజ్ఞమణిమయస్వర్ణభూషితములు. ఇంపు సొంపు లొలికించు నవరత్నహారములు. ఆణిముత్తెపు సరములు.

కాళిదాసుని కవితాలలన గుణముల పసందు లెఱిగి, రీతుల భంగిమలు నేర్చి, అలంకారముల సొంపుల మెరసి, పాకముల రుచుల దేలి, మాటల పొందిక లరసి, అందలి మర్మము దెలిసి, సొక్కుచు సోలుచు, ఒయ్యారము లొలికించుచున్నది. ఆమె ముగ్ధమోహన మంజులమనోజ్ఞ లలితమయూరనృత్యభంగిమలను అడుగడుగున రస ముట్టిపడు రాయంచల ఒయ్యారపు నడకల సొంపును దిలకించి, ఆంధ్రపాఠకులు ఆనందడోలికల నూగుదురు గాక. కాళిదాసుని

కమనీయకావ్యసౌరభము లాని రసానందపారవశ్యము నొందుదురు గాక.

సంస్కృతము ఆర్యుల పెన్నిధి. అది వారి సంస్కృతికి ఫలము. తఱుగె ఱుంగని హైందవుల పున్నెముల పంట యది. అనాదిగా నది విజ్ఞులగు ఋషుల పరంపరచే పూనికతో పదిలపఱచబడినది. క్రమవికాసము నొంది అది దశదిశల తన దివ్యసౌరభములను వెదచల్లుచున్నది. ఆ మధురపరిమళముల వింతచవు లారగించి పాశ్చాత్యపండితులు ముగ్ధులైరి. ఆ తేనెసోనల మధురరుచులకు భువనమే మైమరచి నృత్య మొనర్చినది. మోకరిల్లి ప్రణతు లర్పించినది.

ముద్దులొలుకు సాహిత్యపు పోకడలు, వివిధవిజ్ఞానపునిధులు, హద్దు లెఱుంగని వేదాంతపు విలువలు అం దిమిడి యున్నవి. అందు లేని సౌరభములు, సొగసులు మఱెందును లేవు.

సంస్కృతభాషారమణి మహాకవుల యొడిని అల్లారుముద్దుగా బెరిగిన ముద్దు గుమ్మ. ముద్దరాలు. ఇంచుక ప్రౌఢతన మబ్బి, రారాజుల కొలువుకూటముల గజ్జె కట్టి, ఠీవిగా ఒయ్యారములు చిలకరించుచు, లలితమంజులమనోజ్ఞనృత్యములు భావస్ఫూర్తి యగునట్లు రససమంచితముగా నెరపి సదస్యుల నమృతతరంగిణీ వీచీడోలికల హాయిగా నూగించినది. రసధునుల నోలలాడించినది. మఱియు మహారాజుల యాస్థానముల రసజ్ఞుల సమక్షమున ముద్దులొలుక వీణ చేత బట్టి, నీటుగా మీటి, హాయిగా పాడి, అమృతము చిలికించి, హారతు లందుకొన్నది. కాని-

సుధారసపరిప్లావితము సుమధురమంజులమనోజ్ఞమునగు ఆ గీర్వాణభాష ఇంపు సొంపులు తరిగి ఎదుగుబొదుగులు లేక వసి వాడి, పస చెడి, పడియున్నది. వేయిఏండ్లనాటి మాట. హైందవరాజ్యపతన మాదిగా తాను గూడ పతన మొంది, అణగి మణగి యున్నది. మఱి వెలుగు లేదా? నేడు నవభారతమున తగిన దోహదమంది నవనవోన్మేషముగా నాడు పూచిన ఆ సంస్కృతబాలరసాలసాలసు మమంజరులు పిందెలు కాయలునై పండి మధురరసమున దోగవలెను. ఆమె మధురఫలరసము లాని ఆనందపరవశుల మగుదుము గాక.

ఇక ప్రస్తుతము. కావ్యమా! మేఘసందేశము. కవికులతిలకుడు కాళిదాసు కృతి యది. కావ్య మల్పమైనను అనల్పభావముల నొప్పారుచు మహాకావ్యల క్షణముల భాసించుచున్నది. అపూర్వకమనీయభావసౌరభములు వెదచల్లుచు మధువుల జిలుకుచున్నది. మహాకవి కాళిదా సట తానొక విహంగమై అనం తలలితమనోజ్ఞభావనాకాశపథమున ఱెక్కలు విప్పుకొని యథేచ్ఛగా విహరించుచు ప్రకృతిసౌందర్యమును దిలకించి ముగ్ధుడగుచు తన్మయత్వమందిన మహాకావ్య మది.

ఆంధ్రభాషాపఠితలు అలసటలు చూపక, అలసత్వ మొందక, కాళిదాస మధు రకవితారీతుల రమ్యతలు దెలిసి, పదప్రయోగవైచిత్ర్యము లరసి, పొందిక గల సరసలలితపదగుంభనల సొంపు లెఱిగి, అందలి కమ్మని తేనెసోనల రుచు లారగించి ఆనందరసధునీవీచికల నోలలాడెదరు గాక. నిత్యనూతన మధురపరిమళసంభరితము

లగు కాళిదాసుని సుమధురకవితారచనల భావసంపదల సొంపు లరసి ముగ్ధు లగుదురు. గాక. తద్గీర్వాణభాషావల్లరీ సుమపుంజ మధురసౌరభము లానీ అందలి తీపితేనియలు మనసార గ్రోలి ఆనందసంభరితు లగుదురు గాక యని భావించి, కావ్యరసపీయూషపరిప్లావితమగు మేఘసందేశ మహాకావ్యమునకు తెను గున వివరణాత్మకమగు వ్యాఖ్య రచింప బూనితిని. తత్కారణముగ ఆంధ్రపాఠకుల కేమాత్రమైనను సంస్కృతకావ్యపఠనమం దభిరుచి జనించిన నా యీ పూనిక సార్థకమే యగును.

కాళిదాసుని కమనీయకవితారచనలు ఎనలేని భావసంపదలు గలవి. అత్యంతమ ధురరసపరిప్లావితము లవి. అవి సంస్కృతసాహిత్యసారభూముల జక్కగా బండిన పసిడిపంటలు. మధురమంజుల దివ్యస్వప్నము లవి. తనివితీరని కమ్మని కలలు. తీపితేనెల సెలయేఱులు. అమృతపు ఊటలు. శారదారమణి మునువ్రేళ్ళ మీటిన శ్రావ్యముగ పలుకు వీణానాదములు. తీయని పాటలు. తేనెల ఊటలు. అల్పజ్ఞుల కంతగా అందని కమ్మని సుమసౌరభము లవి. అందలి ప్రతిశ్లోకము, పాదము, పదమే కాదు ప్రత్యక్షరము మధురరససంభరితమే. కనుకనే మహనీయులగు రచయిత లెందరో ఈ మహాకావ్యమును తమ తమ భాషల కనువదించిరి.

శ్లోకము నుదాహరించి, యోచన కొలది అర్థమును తెలియజెప్పి, భావ మును వివరింప బ్రయత్నించితిని. శ్రీమల్లినాథసూరి విరచిత సంజీవినీవ్యాఖ్య ననుసరించితిని.

ధీపటిమ గల పాఠకులు శ్రమ యనక విశేషముగ నూహించి అందలి సాహిత్యపు విలువలు గ్రహించి ఆనందింతురు గాక.

రసతృష్ణ లేనిచో కమనీయకవితారసరుచు లెఱుగలేము.

ఇట్లు
బుధజనవిధేయుడు,
'విద్వాన్' కోసూరు వెంకటనరసింహరాజు

# కవి కావ్య పరిచయము

కవికులతిలకుడు కాళిదాసు చదువుల రాణి వాణికి అనుంగు ముద్దుబిడ్డ. శారదాంబ యొడిని వ్రాలి మనసార ఆమె మధురదుగ్ధమున అల్లారుముద్దుగా బెరిగిన మురిపెముల బిడ్డ యతడు. కావ్యకళావైదగ్ధ్యము మెరసి ఆచంద్రార్కముగ అజరామరుడై అలరినాడు. రూపుదాల్చిన శృంగారరసాధిదేవత యతడు. విశ్వసాహిత్యాకాశమున వింత వెలుగులు వెలయించు వినిర్మల మహోజ్జ్వల విలక్షణతార యతడు. ప్రభాతప్రసన్నారుణ కాంతులు భాసిల్లు ఉదయభానుడు కాళిదాసు. ఆణిముత్తెపు సౌరుల బోలు చలువవెన్నెల గూడి వెలుగొందు రాకాసుధాకరు డాతడు. శరత్పూర్ణిమాపూర్ణచంద్రుడు. కవిసార్వభౌముడే కాక కవికులమునకే తిలకుడు. కావ్యప్రపంచమున అద్వితీయస్థాన మతనిది. నవనవోన్మేషముగల అతని ప్రతిభయు వ్యుత్పత్తి పాండితీప్రకర్ష సాహిత్యపరిశీలనా ప్రజ్ఞాప్రాభవములును, కవితానైపుణ్యమును అనితరసాధ్యములు. అపూర్వకవితావిలాసవైభవ మతనిది. అనుపమరత్నరాశి యది. అతని కవితా రచనలు పద్మజురాణికి అపూర్వాలౌకికమణిమయభూషణములు. ప్రముఖప్రాచ్యకవు లెందరో ఆయన లలితసుకుమారపదప్రయోగము, భావబంధురమగు రచనావిధానము, పాత్రౌచిత్యపరిరక్షణజాగ్రుతి, సమంచితరసపోషణవైదగ్ధ్యము, ఉపమాద్యలంకారప్రయోగచాతుర్యము, కల్పనానిపుణత మున్నగు సద్గుణములు గ్రహించి తమ తమ రచనలకు మెరుగులు దిద్దుకొనిరి. ఇక పాశ్చాత్యపండితు లన్నో అతని రచనలు చదివి, కావ్యసౌరభము లాని, కవితా మధువును గ్రోలి, ముగ్ధులై, ప్రశంసలు కురియించిరి. రససిద్ధుడగు కాళిదాసుని అభిజ్ఞానశాకుంతల మను రూపక (నాటక) అనువాదమును జదివి జర్మను మహాకవి గెథే ఆనందపారవశ్యమున మైమఱచి నృత్యమొనరించె నందురు. శాకుంతలమును గుఱించి ఆయన పలికిన పలుకు లివి-

*Would'st thou the young year's blossom
    and the fruits of its decline,
And all by which the soul is charmed,
    enraptured, feasted, fed?
Would'st thou earth and heaven itself
    in one sole name combine?
I name thee, O Shakuntala!
    and all at once is said.

* (ఓ శాకుంతలమా! ధన్యవు నీవు. కావ్యప్రపంచమున విశ్వసాహిత్యమున ఎన్ని ఉత్కృష్టరూపము లున్నను నేను నిన్నే పేర్కొందును. నీవే అగ్రగామినివి. నిన్నే అభిమానింతును. ఏల యందువా! సర్వసమగ్ర కావ్యరూపకలక్షణములు, గుణసంపదలు, అక్షరరమ్యతలు, భావసౌరభములు, కావ్యకళావైదగ్ధ్యములు, అవ్య యానందదాయకములగు రసధునులు ఒక్కుమ్మడిగ నీయం దిమిడి యున్నవి. యౌవనవసంతసుమసౌరభము, తన్మకరందమాధుర్యము, పరిణతవయఃపరిపాకఫలర సమగు అవ్యయానందసంధాయక శాంతరసపీయూషము మఱియు హృదయాకర్షక సమ్మోహజనక ఆనందహర్షోత్కర్షము, ఆత్మపరవశత్వ పుష్టితుష్టిసంతర్పణలు, ఇది అది యననేల! ఆత్మ కావశ్యకము, ఆనందదాయకము నగు సర్వస్వమును, అంతేకాదు; భూమ్యాకాశ స్వర్గమర్త్యములు ఏకత్ర ఐక్యనామమున ఒకే రూపమున వెలుగొందుచున్నవి. పూర్ణరూపమున నీయం దవి రూపు నొంది భాసించుచున్నవి.) అని మెచ్చి వేనోళ్ళ శ్లాఘించినాడు. ఎవరు! జర్మనుపండితుడు విఖ్యాతకవి గెథే. కనుకనే అన్నారు పెద్దలు. - "విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్" - విద్వత్కవిపరిశ్రమ విద్వాంసునికే అవగతమగును. గర్భదోహదోత్సవ సౌభాగ్యసౌర భము గొడ్డురాలి కేమెరుక," అని. ప్రతిభాసంపన్నుడు కవిసార్వభౌముడు మన కాళిదాసుసృష్టి అట్టిది.

ఇక దేశీయకవిప్రశంసలు--

నిర్గతాసు న వా కస్య కాళిదాసస్య సూక్తిషు,<br>
ప్రీతి ర్మధురసార్ద్రాసు మంజరీష్వివ జాయతే.<br>
-ఇతి బాణః.

కుసుమపేశలములు, భావబంధురసురభితములు, మధురరసప్లావితములు, నవ నీతమార్దవములు నగు కాళిదాసకమనీయహృదయమం దుదయమందిన తేనె పలుకులందు మధురరసబంధురములు, సుమధురపరిమళవాసితములు, చిత్రవర్ణ శోభితములు నగు సుమమంజరులందువలె ఎవరికి ప్రీతి జనించదు? అని బాణుని ప్రశంస. 'బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్.' వాఙ్మయప్రపంచము సాహిత్యజ గత్తు బాణుడు నమలి ఉమిసినదని ఒక ప్రతీతి. అనగా ఆయన తడవని విషయము

*గెథె జర్మనుపద్యమునకు E.B. ఈస్ట్విక్ ఆంగ్లానువాదమిది. దీనికి సంస్కృతానువాదమిది -

వాసన్తం కుసుమం ఫలం చ యుగపద్ గ్రీష్మస్య సర్వం చ యద్<br>
యచ్చాన్యన్మనసో రసాయనమతః సన్తర్పణం మోహనమ్,<br>
ఏకీభూత మభూతపూర్వ మథవా స్వర్లోకభూలోకయోః<br>
ఐశ్వర్యం యది వాంఛసి ప్రియసఖే! శాకున్తలం సేవ్యతామ్.

గాని, విడిచిన వర్ణనగాని సాహిత్యసంసారమున లేదని భావము. సాహిత్యాకాశపథమున మహోజ్జ్వలముగ వెలుగొందు తార ఆయన కాదంబరి. ఆ కాదంబరీకావ్యకర్త యగు బాణుని ప్రశంస యది.

యస్యాశ్చోర శ్చికురనికరః కర్ణపూరో మయూరో
భాసో హాసః కవికులగురుః కాళిదాసో విలాసః,
హర్షో హర్షో హృదయవసతిః పఞ్చబాణస్తు బాణః
కేషాం నైషా కథయ కవితాకామినీ కౌతుకాయ.

- ఇతి జయదేవః

ఒహో! ఏమి రూపసంపద! ఏమి వైభవము! చోరకవి(రచనలు) కవితాకామిని యొక్క కుటిలకుంతలసముదాయమట! మయూరుడు కర్ణాభరణమట! భాసుడు హాసమట! కవికులగురువగు కాళిదాసు విలాసమట! హర్షుడు హర్షమట. బాణుడు హృదయాధిష్ఠితుడగు పంచబాణు (మన్మథు)డట! ఏవంవిధకవితాసుందరి భామిని కామిని ఎవరికి మోద మొనగూర్పదు? ఎవరి కానందము కలుగజేయదు ? ఇట చోరమయూరాది మహాకవులు కవితాకామినికి కుంతలకర్ణాభరణ హాసమ నోజహర్షాదులు మాత్రమే. ఇక కవికులగురువగు కాళిదాసన్ననో ఆణిముత్తెపు నునుమెరుగు కాంతి. ఆ కవితావిలాసినికి సర్వాంగసుందరముగ తొణికిసలాడు ఒయ్యారమట! కులుకట! ఏవంవిధశుభలక్షణలక్షిత, గుణభూషిత, కవితాభామిని, ఇంపుసొంపులరాణి యగు కవితాకామిని ఎవనికి హాయి చేకూర్పదు? కౌతుక మొనగూర్పదు? అని పద్మావతీచరణచారణచక్రవర్తి గీతగోవిందకృతికర్త జయదేవ కవిచంద్రుని ప్రశంస.

సాకూతమధురకోమలవిలాసినీకణ్ఠకూజితప్రాయే,
శిక్షాసమయేऽపి ముదే రతిలీలాకాళిదాసోక్తీ.

- గోవర్ధనాచార్యుడు

రసపుష్టి, భావస్ఫూర్తి, విలక్షణకవితాదీప్తి గలిగి రతి ( ఆనందస్ఫూర్తి) లీలా విలసితమగు కాళిదాసుని మృదుమధురోక్తి (కమ్మని కవిత) అభ్యాససమయమున గూడ సాభిప్రాయము, మధురము, కోమలము నగు విలాసినీకంఠకలకూజితమును లలితమంజులధ్వనిని) బోలి అత్యంతముదావహ మగునని గోవర్ధనాచార్యుడు.

కాళిదాసవచః కుత్ర వ్యాఖ్యాతారో వయం క్వ చ,
తదిదం మందదీపేన రాజవేశ్మప్రకాశనమ్.

- వల్లభాచార్యుడు.

రసభావపరిపుష్టములగు కాళిదాసు పలుకు లెక్కడ? అల్పజ్ఞులమగు వ్యాఖ్యాతలము మే మెక్కడ? ఎట్లున్నదన కాంతిహీనమగు దివ్వెచే విశాలరాజప్రసాదమును

ప్రకాశింపజేయుటవలె నున్నదని శ్రీవల్లభాచార్యుని ప్రశంస.

కాళిదాసగిరాం సారం కాళిదాసః సరస్వతీ,
చతుర్ముఖోఽథవా సాక్షాద్విదుర్నాన్యే తు మాదృశాః.

-మల్లినాథుడు.

అమృతోపమానమగు కాళిదాసుని వాగ్రసము (సారము) ఆ సుధాసూక్తుల యందచందములు స్వయముగ కాళిదాసుని కెరుక. ఆ పలుకుల సొగసులు, మర్మములు, మనోజ్ఞతలు ఆ వాగ్దేవికి అవగతములు. కాళిదాసుని కవితావిశిష్టత, అందలి ఇంపుసొంపులు ఆ చతుర్ముఖు డెరుంగగలడు. అంతేగాని అల్పజ్ఞులము, అన్యులము మేమెట్లు తెలియగలము? అని పదవాక్యప్రమాణజ్ఞుడు వ్యాఖ్యాతృసార్వభౌముడు నగు మల్లినాథుని నోట వెలువడిన మాట లవి.

వాల్మీకే రజని ప్రకాశితగుణా వ్యాసేన లీలావతీ
వైదర్భీ కవితా స్వయం వృతవతీ శ్రీకాళిదాసం వరమ్,
యాఽసూతామరసింహమాఘధనికాన్ సేయం జరానీరసా
శూన్యాలఙ్కరణా స్ఖలన్మృదుపదా కం వా జనం నాశ్రితా.

తండ్రి వాల్మీకి పుట్టిన దచ్చోటు. ఆమె గుణదీపిక. సద్గుణముల ప్రోవు. తదుపరి వ్యాసుని జేరి కళ లభ్యసించినది. పలుకుల ఇంపుసొంపు లరసినది. ఒయ్యారపు నడకలు నేర్చినది. ఆ వైదర్భీ (రీతి) కవితాకన్య జవ్వనియై కవికులతిలకుడు అనురూపవరుడు కాళిదాసుని తానుగా వరించినది. అమరసింహ మాఘ ధనికాది కవి పుంగవులను కని మాతృదేవత అయినది. ఇప్పు డామె జరాజీర్ణ. శూన్యాలంకరణ యామె. ముదిమి ఆవహింప జవసత్త్వము లుడిగినవి. నీరస మతిశయించినది. పదములు తడబడుచున్నవి. ఆమె దైన్యస్థితి యట్టిది. ఆలంబన మవసర మగుట ఎవని నాశ్రయించదు? అని యొక వివేచనాపరుని యావేదన.

ఈ విధమున ప్రాచీన, అర్వాచీన, ప్రాక్పశ్చిమకవితల్లజులు, ప్రాజ్ఞులు, పండితులు నేటిదనుక హృదయపూర్వకస్వాగతము పలికి కాళిదాసునియెడ ప్రశంసలు గురియించిరి. కురియించుచునే యున్నారు. ముందును సహృదయులగు విద్వత్కవులు కవిసార్వభౌముని ఉగ్గడించుచునే యుందురని ఊహించవచ్చును. ఆయన ప్రజ్ఞాప్రాభవములు దేశకాలపరిధుల కతీతములైనట్టివి.

అన్యసంస్కృతకవులమాదిరి కాళిదాసజీవితవృత్తాంతముగూడ నిశ్చితరూపమున అలభ్యము. జనశ్రుతిని బట్టి ప్రారంభజీవితదశయందు దాతడు మహామూర్ఖుడు. విద్యోత్తమ యను రాకుమారితో ఆయన వివాహ మెట్లో జరిగిపోయినది. ఆతని మూర్ఖత్వమున కెంతయో విసిగి, వేసారి ఆమె అతనిని ఇంటినుండి వెడలనంపినది.

అంత నాతడు వాగ్దేవి నారాధించి అపూర్వకవితాశక్తి నలవర్చుకొని గృహమునకు మగిడి వచ్చి తలుపు తెరువుమని భార్య నాదేశించెను. ఆమెయు ఎవరు మీరని ప్రశ్నించ విదుషీమణి యగు భార్యను సంభ్రమాశ్చర్యముల ముంచెత్తుచు- 'అస్తి కశ్చిద్వాగ్విశేషః' అని ప్రత్యుత్తర మొసంగెను. పూర్ణపరిచయానంతరము కవాటము తెరువబడినది. కాళిదాసు అస్తిపదముతో నారంభించి కుమారసంభవమ హాకావ్యమును, 'అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః' అనియు, "కశ్చిత్" అను పదముతో నారంభించి మేఘసందేశ మను మహాకావ్య మును 'కశ్చిత్కాన్తావిరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః' అనియు, వాక్ శబ్దముతో మొదలిడి రఘువంశమహాకావ్యరచనను "వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే" అనియు సాగించెన్న. కాళిదాసరచన లన్నియు వేని కవి విలక్షణలక్షణయుక్తములు. విలక్షణకవితాస్ఫోరకములు. రసపుష్టి భావస్ఫూర్తి ఔచిత్యము లతని కవితయం దుట్టిపడుచుండును. అవి అంతగా అనితరసాధ్యములు.

కాళిదాసు లంకాధిపతి కుమారదాసుని మిత్రుడనియు, అతనిని జూడ అత డచటి కరిగి గణికద్వారా హత్య గావింపబడెననియు నొక కింవదంతి.

కాళిదాసు విక్రమాదిత్యుని యాస్థానమందలి నవరత్నములలో ఒకడని జనశ్రుతి.

ధన్వన్తరిక్షపణకామరసింహశఙ్కు
భేతాళభట్టఘటకర్పరకాళిదాసాః,
ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య.

ఈ తొమ్మండుగురు విక్రమార్కుని సభయందలి నవరత్నములని ప్రతీతి. "ఉజ్జయిన్యాం విక్రమార్కముఞ్జభోజనరేశ్వరాః" అని విక్రమార్కముంజభోజులు ఉజ్జయిని రాజధానిగా మాళవదేశము నేలిరని చరిత్ర చాటుచున్నది.

## కాళిదాసుని జన్మస్థలము

కాళిదాసుని పుట్టుకచే పునీతమైన అతని జన్మస్థలమును గుఱించి మత భేదము లెన్నియో గలవు. మహాకవిరచనలయందు 'కేసర' శబ్దప్రయోగము బహుళముగా నుండుటచేతను, కణ్వవశిష్ఠాశ్రమములయొక్కయు అలకానగర ముయొక్కయు హృదయంగమమగు వర్ణనాంశములనుబట్టియు కొంద రతనిని కాశ్మీరీయు డందురు. మిథిలాప్రాంతపండితులు మఱికొందరు- కాళిదాసు తన కుమారసంభవకావ్య అష్టమసర్గయందు, నేటికిని తత్ప్రాంతమందు ప్రచలితాచార మును సూచించు - 'శైలరాజభవనే సహోమయా మాసమాత్రమవసత్ వృషధ్వజః' అని- వివాహానంతరమున శంకరు డుమనుగూడి గిరిరాజభవనమున (అత్తవారింట) మాసపర్యంత ముండెనని వర్ణించుటచేతను తత్ప్రాంతీయులకు మాత్రమే సుపరిచి

క్రీస్తుపూర్వము ప్రథమశతాబ్దివఱకు మతభేదము లెన్నియున్నను క్రీస్తు పూర్వము ప్రథమశతాబ్దికి చెందినవా డనుటయే యుక్తమని తేలుచున్నది. ప్రొఫెసరు ఆర్. యస్. ఆప్టేగారును, కాళిదాసు క్రీస్తు పూర్వము ప్రథమశతాబ్ది మధ్యవాడనియే అభిప్రాయపడిరి. గ్రీసు చక్రవర్తి అలెగ్జాండరు క్రీస్తు పూర్వము ప్రథమశతాబ్దియందే భారతదేశముపై దండెత్తి వచ్చెననియు ఆప్టేగారి నిశ్చితాభిప్రాయము. మఱియు శాకుంతలనాటక చతుర్థాంకమున ఉదాహరించిన సంతానహీనుల ఆస్తిపాస్తులు ప్రభుత్వపరమగునను ఆచారము క్రీస్తు పూర్వము ప్రథమశతాబ్దమందు ప్రచలితముగ నున్నదని కళింగగ్రీసుచరిత్రలు సూచించుచున్నవి. కొందరు కాళిదాసు అశ్వఘోషుల రచనలందలి సామ్యమును ఎత్తిచూపుచు కాళిదాసు అశ్వఘోషుని ఆదర్శముగ నిడుకొని తన రచనలను రూపొందించినాడనియు, అశ్వఘోషుడు క్రీస్తు పూర్వము ప్రథమశతాబ్ది ఉత్తరార్ధమునకు చెందినవాడు గాన కాళిదాసు తదనంతరకాలమునకు చెందినవా డనియు భావించెదరు. అది భ్రమమూలకము. అశ్వఘోషుడు బౌద్ధదార్శనికు డౌటచేతను అతని గ్రంథము సౌందరనందము అతడే యనినట్లు 'మోక్షార్థకృతి'. ధర్మమోక్షముల ప్రచారదృక్పథము కలదగుటచేతను కవితారసపుష్టిగల కాళిదాసుకు తత్త్వవేత్తయగు అశ్వఘోషుని రచన లాదర్శ మనుట అసంగతము. ఔచిత్యరహితము. బలదేవ ఉపాధ్యాయ అను పండితుడు—అనుకరించినది కాళిదాసు కాదనియు అశ్వఘోషుడే తన బుద్ధచరితమందు కాళిదాసు ననుకరించెననియు నుడువుచు మచ్చున కుదాహరణ లిచ్చుచున్నాడు—

కాళిదాసు—
తాసాం ముఖై రాసవగన్ధగర్భై
    ర్వ్యాప్తాన్తరాః సాన్ద్రకుతూహలానామ్,
విలోలనేత్రభ్రమరై ర్గవాక్షాః
    సహస్రపత్రాభరణా ఇవాసన్. –ర. వం. VII - 11
అశ్వఘోషుడు—
వాతాయనేభ్యస్తు వినిస్సృతాని
    పరస్పరోపాపితకుణ్డలాని,
స్త్రీణాం విరేజుర్ముఖపఙ్కజాని
    సక్తాని హర్మ్యేష్వివ పఙ్కజాని.

ఇం దచ్చుటచ్చుట పోలిక లగపడుచున్నను కాళిదాసుని కవితాసౌందర్యము అశ్వఘోషుని రచనలయం దంతగా నగపడదు. పైవిషయ మాధారముగా కాళిదాసు అశ్వఘోషుని కంటె పూర్వికుడనియు, అతని యునికి క్రీ. పూ. ప్రథమశతాబ్దపూర్వభాగమం దనియు స్పష్టమగుచున్నది. అది సహేతుకము, సమర్థనీయము, యుక్తియుక్తము నని భావింపబడుచున్నది.

## కాళిదాసుని కావ్యకళ - భాష - శైలి

కాళిదాసు సర్వతోముఖప్రజ్ఞాశాలి యగు మహాకవి. ప్రతిభావ్యుత్పత్తు లతని సొత్తులు. అందత డద్వితీయుడు. ప్రతిభ యన నవనవోన్మేషశాలిని యగు బుద్ధి లేక ప్రజ్ఞ. శబ్దజ్ఞానస్ఫూర్తి యగు కాల్పనికశక్తి వ్యుత్పత్తి. కాళిదాసునియం దీ రెండును నవనవోన్మేషములే. పూర్ణరూపమున ఉద్బుద్ధము లవి. కాల్పనికౌన్నత్యము, హృదయాంతర్గతభావములకు స్పష్టమగు రూపకల్పన, మానవహృదయసూక్ష్మపరిశీలన, విలక్షణప్రకృతి ప్రభావప్రాభవముల చిత్రీకరణ, అక్షరరమ్యత, పొందిక, మృదుమధురభావముల కోమలకమనీయశబ్దముల స్పష్టీకరణ యనునవి కాళిదాసునకు సహజసిద్ధములు. సంస్కృత సాహిత్యాకాశమున దేదీప్యమానముగ వెలుగొందు దివ్యనక్షత్ర మతడు. పున్నమ చందమామ. రాకాసుధారుడు. అతని కవితాశక్తి కూర్పునేర్పు అసాధారణములు, అనితరసాధ్యములు, అపూర్వములు, దివ్యములు. ఆయన కవితాకళ యొక త్రివేణి. గంగాయమునా సరస్వతుల సంగమస్థల మది. ఆయన రచనలయందు స్వర్గీయానందము, భౌతికవిలాసవిన్యాసము, దైవీసంపత్తి, మానవతామనోజ్ఞతలు, సాత్వికసమ్మోహకత్వము పుష్కలముగా కలవు. కాళిదాసునకు భాషపై సర్వాధిపత్యమున్నది. తత్కారణముగ పదప్రయోగనైపుణ్యమతనికి స్వాభావికము. అక్షరరమ్యత, పదముల కూర్పు, వాక్యరచన అతనికి వెన్నతో పెట్టిన విద్యలు. ఆయన భాష సంస్కరింపబడి పరిష్కృతమై సరళము, సరసమునై సర్వసుందరముగ నొప్పుచు హృదయంగమము, మనోరంజకము అగుచున్నది. తన రూపకములం దతడు ప్రయోగించిన సంభాషణాత్మకమగు పదప్రయోగము, నుడికారము ఇంపుసొంపు లీనుచు అత్యంతమనోజ్ఞములై హృదయాకర్షకములగుచున్నవి. ఆయన కథాకథనసంవిధానము, పాత్రోచితమగు పదప్రయోగము, ఔచిత్యపరిపాలనము అనితర సాధ్యములు. కాళిదాసు రచనలయందలి పాత్రలు తమ తమ యంతస్తులకు తగిన భావములను, అందుల కనువగు పలుకులను పలుకుచు స్వాభావికములు, సజీవములు, హృదయాహ్లాదజనకములు అగుచున్నవి. కాళిదాసు లోకప్రియతకు ప్రధానకారణము ప్రసాదగుణభూయిష్ఠ మగు అతని శైలి - 'ప్రసిద్ధార్థపదత్వం యత్ స ప్రసాదో నిగద్యతే' - క్లిష్టత్వము లేక, పఠించుటతోడనే అర్థస్ఫోరకమగు రచనావిధానము ప్రసాదగుణభూయిష్ఠ మనబడును. మహాకవిరచన లన్నియు వైదర్భీరీతి ననుసరించియే రూపొందినవి. 'రీతిర్నామ గుణాశ్లిష్టపదసంఘటనా మతా' ప్రసాదమాధుర్యాదికావ్యగుణములతో గూడిన పదముల కూర్పు రీతి యనబడును.

> బన్ధపారుష్యరహితా శబ్దకాఠిన్యవర్జితా,
> నాతిదీర్ఘసమాసా చ వైదర్భీ రీతి రిష్యతే.

సంధిగతదోషవర్జితమై, వాక్యశుద్ధి గలిగి, శబ్దకాఠిన్యమును వర్జించి, మృదుమధుర

పదగుంభనముల శోభిల్లుచు, దీర్ఘసమాసములు లేక, అలతియలతి సమాసములగూడి లలితపదవిన్యాసము గలదియై, సుమనోమనోహారిణియై, సరసమార్దవమగు శైలి వైదర్భీరీతి యనబడును. 'వైదర్భీరీతిసందర్భే కాళిదాసో విశిష్యతే.' అట్టి కుసుమ సుకుమార మంజుల మనోజ్ఞ మృదుమధుర లలితశైలియగు వైదర్భీరీతి సందర్భమున గూడ కాళిదాసునిదే అందెవేసిన చేయి. అందటి కన్న మిన్న. అతని దొాక ప్రత్యేకత. అతని రచనలయం దచ్చటచట సమాసగత పదప్రయోగము లున్నను క్లిష్టతకు తావీయక స్వాభావికమగు ధారాశుద్ధి గలిగి పదలాలిత్యమునకు, భావసౌందర్యమునకు పోషకములైనవే కాని తద్వ్యతిరేకము లెంతమాత్రమును గావు.

కాళిదాసుని దొాక విలక్షణమైన శైలి. అనితరసాధ్య మది. ఏ భావమును చిత్రీకరించగోరినను అతడు స్పష్టమగు శబ్దముల సూటిగా చెప్పక, వ్యంజనావృత్తి నాశ్రయించి పాఠకుని మెదడునకు పదునుబెట్టి భావమునకు వన్నె దెచ్చును. కనుకనే జయదేవకవిచంద్రుడు కాళిదాసునకు "కవితాకామినీవిలాస" మను బిరుదు నిచ్చి సంభావించినాడు. వ్యంజనావృత్తి యన కావ్యశరీరభూతమగు వాక్యార్థపోషణకొఱకు హృదయరంజకమగు అన్యార్థద్యోతక శబ్దవ్యాపారము.

కాళిదాసు తన రచనలయందు తీర్చిదిద్దిన యలంకారము లెంతయు స్వాభావికములు, మనోజ్ఞములు, మనోరంజకములు. చదువులరాణి కవి అమూల్యమణి భూషణములు. తేటవెలుగుల ఆణిముత్తెపు సరములు. అనర్ఘరత్నహారములు. ఆయన ఉపమలు, ఉత్ప్రేక్షలు అత్యంతమనోజ్ఞములు. అవి ఆయన సొంతములు, స్వార్జితములు. అన్యుల కందరానివి. మధురఖండము లవి. అవి తేనె తొనలు, జున్ను గడ్డలు, మీగడ తఱకలు, కలకండ గుళికలు, అమృతకలశములు, అంతకంటె మిన్నలు. వాని కవియే సాటి. ఒకటి రెండు ఉదాహరణలు- శ్రీరాముని తాతకు తాత దిలీపుడు. ధార్మికుడగు మహారాజతడు, కాని సంతానహీనుడు. భార్య సుదక్షిణ. పుణ్యశీల. నందినీధేనువు నారాధించిన సంతానప్రాప్తి యగునని పెద్దల పలుకు. ఇపు డా పుణ్యదంపతుల కర్తవ్యము గోరక్షణ, పోషణ, అర్చన. ఉదయముననే ధేనువు వెంట వనగమనము, చర్వణానంతరము నీరిడి పరిమార్జన మొనరించి సాయంసమయమున మగిడి వచ్చుట. ఆ పుణ్యదంపతుల నిత్యకృత్యము లవి. ఒకనాటి సాయంసమయమున దేవి ముందు నడచుచున్నది. నడుమ నందిని. దానినంటి దిలీపుడు. ఆ దృశ్యమిది. కవిసార్వభౌముడు కాళిదా సా దృశ్యము నెట్లు చిత్రించెనో ఇంచుక గమనించుడు- 'దినక్షపామధ్యగతేవ సన్ధ్యా' ఆ పావని నందినీధేనువు దివారాత్రుల మధ్యగత యగు పావని సంధ్యవలె ఉన్నదట. అట్లాదరణీయమైన పూజనీయమై వెలుగొందుచున్నదట! ఎంత అతిలోకసుందర మీ యుపమ. ఎంత చక్కని భావ కల్పన! ఎంత మధురసన్నివేశము! ఎంత రమణీయ చిత్రీకరణము! అట్టిదే మఱియొక సందర్భము. ఇందుమతీదేవి స్వయంవరసన్నివేశ

మది. ఆమె అతిలోకసుందరి. ఎవరి మట్టుకు వారు ఆమె తమనే వరించునను గంపెడాశతో భ్రాంతితో రాకుమారు లెందరో వచ్చి సభాస్థలి నలంకరించిరి. ఆ సన్నివేశమును కాళిదా సెంత రమ్యముగా హృదయరంజకముగా వర్ణించెనో తిలకించుడు.

సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ
యం యం వ్యతీయాయ పతింవరా సా,
నరేన్ద్రమార్గాట్ట ఇవ ప్రపేదే
వివర్ణభావం స స భూమిపాలః.

ఆమె నడయాడెడి దీపశిఖ యట. అవును. ఆమె రూపవతి, లావణ్యవతి, విలాసవతి. కాంతిపుంజ మామె నావరించి యున్నది. ఆ మీదట కళ్యాణా లంకరణము. ఆమె పతింవర. సర్వవిధముల తన కనురూపుడు, అర్హుడు నగు పతి నెంచుకొన నుత్కంఠ. స్వయంవరస్థలి దేశదేశముల రాకుమారులతో నిండియున్నది. వారర్హాసనముల వరుసలు దీరి ఉత్సుకతతో వేచియున్నారు. ఆమె తమను వరించకపోవునా? అను ఆశ, భ్రాంతి, తహతహ వారి నావహిం చియున్నది. ప్రస్ఫుట మగుచున్నది. ఆమె కరగ్రహణమునకు వా రెంతగానో ఉవ్విళ్లూరుచున్నారు. ఆమె రూప మట్టిది. గుణము లట్టివి. శీల మట్టిది. ఇందుమతి వరాన్వేషిణియై ఒక్కొక్కరిని పరికించుచు రాకుమారు లధిష్ఠించియున్న మార్గమున రాజమార్గమున సంచరించెడి దీపశిఖవలె ముందుకు సాగిపోయెను. వెంటనే వెనుకబడిన రాకుమారుల వదనకమలములు కాంతిహీనము లగుచున్నవి. వారి మోముదమ్ముల చీకటులు గ్రమ్ముచున్నవి. అవును; ఉజ్జ్వలమగు దీపశిఖ ముందుకు సాగిపోగా మిగులునది అంధకారబంధురమే గదా! ఈ ఉపమకు ముగ్ధులైన విజ్ఞులు, రసజ్ఞులు కవిసార్వభౌమునకు 'దీపశిఖ' యను బిరు దొసంగిరని ప్రతీతి. ఎంత మనోహరసన్నివేశ మిది! ఎంత హృదయంగమచిత్రీకరణ మిది! ఎంత లలిత మనోజ్ఞ ఉజ్జ్వలభావస్ఫోరకచిత్రణ మిది! మన మహాకవిప్రతిభ యట్టిది. కాళిదాసుని విలక్షణకవితావిధానమునకు తార్కాణ మది. అది అన్యుల కసాధ్యమే. కనుకనే- 'ఉపమా కాళిదాసస్య'- ఉపమకు కాళిదాసునే పేర్కొనవలయు నన్నారు విజ్ఞులగు పెద్దలు. కవిపండితరసజ్ఞులు కాళిదాసుని రచనలయం దివి కోకొల్లలుగా నున్నవి. ఉపమయే కాదు, ఉత్ప్రేక్ష గూడ ఆయన సొత్తే. మేఘసందేశమున- 'మధ్యే శ్యామః స్తన ఇవ భువః శేషవిస్తారపాణ్డుః' అమ్రకూటాద్రి వర్ణనమిది. యక్షుడు మేఘునితో- జలదా! కాంతల కమనీయకేశబంధము పోలి ఎంతయు నల్లనైన నీవు ఆ కొండ కొన నధివసింప నడుమ నీలవర్ణము గలిగి విశాలపార్శ్వ భాగముల పండిన చూతఫలముల నిండి పాండురమైన ఆ యామ్రకూటము పుడమి పడతికి గబ్బిగుబ్బయా? అనునట్లు సురదంపతుల కెంతయు ముదము

గూర్చుచున్నది. ముచ్చట గొల్పుచున్నది అని యుత్ప్రేక్ష. పుడమి యొక పడతి. ఆ పుడమిపడతికి ఆ గుబ్బలి పొంకముగల గబ్బిగుబ్బ యట. కొండకోన నధివసించిన మబ్బు చనుమొనయట! ఆ పర్వతపార్శ్వములు పండిన చూత ఫలముల నిండి పాండురములు గాగ, పార్శ్వముల పాండువర్ణము గలిగి నడుమ నీలవర్ణము గల గబ్బిగుబ్బను పోలి, అట విహరించు సురదంపతుల కెంతయు ముదము గూర్చుచున్నదట! మహాకవి కాళిదాసుని హృదయకుహరమునుండి వెలువడిన మధురభావన ఇది. మఱియొకటి-

"రాశీభూతః ప్రతిదిన మివ త్ర్యమ్బక స్యాట్టహాసః " ఇది మేఘునితో యక్షు డన్న మాట. గంతవ్య మలకానగరము. మార్గమున కైలాసమున్నది. శంకరుని నివాస మది. జలదా! నీ వింకను మీదికి పొమ్ము. ఊర్ధ్వముగ నెగయుము. ఎదుట జగత్ప్రసిద్ధమగు కైలాసమున్నది. పౌలస్త్యుదుద్ధతుడై భుజబలదర్పమున కైలాసమును కదలించిన, కుదుప, దాని శిఖరములు శిథిలములై సానువులు పట్టుదప్పినవి. త్రిదశుల కది చేతిదర్పణము. మార్గమున దాని కతిథివై విశ్రాంతి గొనుము. 'మంచుతో నిండి పుండరీకధవళమై మిన్నంటుచున్న ఆ కైలాసము దినదినప్రవర్ధమానమై రాశీభూత మగుచు గగనతల మంటుచున్న మహేశ్వరుని భూరిహాసమా అనునట్లు ఒప్పుచున్నది'. అని ఉత్ప్రేక్ష. ఆ రజతగిరి కైలాసము దినదినప్రవర్ధమాన మగుచు రాశివలె పేరుకొనిన హాసము (నవ్వు) వలె నున్నదట! ఎంత చక్కని యుత్ప్రేక్ష! ఎంత మనోహరచిత్రీకరణము? కవిసార్వభౌముని అమృతహృదయమునుండి మొలకెత్తిన మధురభావన. అల లలలుగా బయల్వెడలిన అమృతఝురి. (హసము తెలుపని కవిసమయము) ఉపమోత్ప్రేక్షలయందే కాక అర్థాంతరన్యాసమందు గూడ ఆయన సిద్ధహస్తుడు. శాకుంతలమున --"కిమివ హి మధురాణాం మణ్డనం నాకృతీనామ్" అని ప్రశ్న. సుందరాంగనల కన్నియు ఆభరణములే యగునని ఆకాంక్షతో గూడిన సమర్థన. 'క్లేశః ఫలేన హి పున ర్నవతాం విధత్తే'. ఫలించిన శ్రమ శ్రమ యనిపించక నూతనోత్సాహోత్తేజములకు ారి చూపును.

కాళిదాసు వర్ణనయం దద్వితీయుడు. ఎట్టి సందర్భమునైనను సజీవముగ అతి కసుందరముగ చిత్రీకరించగలడు. వృక్షగుల్మలతాదు లేమి, పశుపక్ష్యాదు లేమి, రికాననదీనదము లేమి, ఏవైనను అగుగాక అనితరసాధ్యముగ అద్భుతముగా చిత్రీకరణ చేయగలడు. హృదయోల్లాసకరముగ వర్ణించగలడు.

కాళిదాసునకు లలితకోమలరసము లన్నను, తద్రసపోషణచిత్రీకరణ మన్నను ఆసక్తి మెండు. ఉత్సాహ మెక్కువ. భవభూతిమహాకవి కున్నంతగా గంభీరరసములం దనురక్తి తక్కువ. తద్విషయమును కాళిదాసు స్వయముగనే అంగీకరించినాడు.

కావ్యేషు నాటకేష్వేవ వయం వా వయ మేవ వా,
ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే.

గులు సంతరించుకొని ఒయ్యారము లొలుకబోయుచున్నది. గమనించితివా?ఒక్కచో నిర్మలనీలకాంతుల దీపించు ఇంద్రనీలములు పొదిగి ప్రస్తరించిన తరళకాంతుల మేలమాడు ఆణిముత్తెపు సరమువోలెను, ఇంకొక్కచో అంతరాంతరమున శ్యామసుందర నీలకమలములు కూర్చి వింతసొరుల నింపున ట్లమర్చిన పుండరీక (ధవళము) మాల పగిదిని, మఱియొకచో నల్లహంసల గూడి దోబూచులాడుచు పయనించు మానసప్రియములగు రాజహంసల పంక్తివోలెను, మఱియొక తావున తెలుపునలుపుల సమ్మిశ్రణమున చందనపరికల్పితమగు కస్తూరికాపత్రలేఖల తీర్చిదిద్దిన పుడమిపడతి యలంకరణ రచనావిధానమా యన, కొండొకతావున పాదపచ్ఛాయలయం దణగి మణగిన చీకటుల గలసి తిలతండులన్యాయమున చిత్రవర్ణముల దీపించు వెన్నెలవెలుగు చందమునను, ఇతరత్ర ఎడమనెడమ అగపడీ అగపడని నీలాకాశమున ఇంపుసొంపులు మెఱయ విశదమై భాసిల్లు శరన్మేఘరేఖవలెను మఱియు కృష్ణసర్పపరిభూషితము భస్మలేపపరిశోభితము నగు ఈశ్వరుని దేహమును పోలియు, దశదిశల సోయగములు చిలుకుచు ముద్దులు మూటగట్టుచున్నది. ఒయ్యారములు పచరించుచున్నది. సొరులు నింపుచున్నది' అనును ప్రియసతి సీతతో రాముడు. ఆ పుణ్యస్థలమున యమునతో నెయ్యము సలిపెడి గంగాతరంగిణి భవ్యవర్ణన మిది. మహాకవి హృదయజలధిని కదలి మెదలి మీదికెగసిన మధురమనోజ్ఞభావతరంగములివి. అమృతగుళికలు. శర్కరాకణికలు. మీగడతరకలు. ఆణిముత్తెములు. అనర్ఘరత్నములు. మఱియు శాకుంతలమున-

నీవారాః శుకగర్భకోటరముఖభ్రష్టా స్తరూణా మధః
ప్రస్నిగ్ధాః క్వచిదింగుదీఫలభిదః సూచ్యన్త ఏవోపలాః,
విశ్వాసోపగమాదభిన్నగతయః శబ్దం సహన్తే మృగా
స్తోయాధారపథాశ్చ వల్కలశిఖానిష్యన్దరేఖాంకితాః.

కణ్వాశ్రమవర్ణన మిది. ఒకచో శుకసంచితములగు నీవారధాన్యములు తరుకోటరముల జారి యధోభాగముల చెదరిపడుచున్నవి. మఱియొకచోట శిరోమార్జనార్థము చితుకగొట్టబడిన ఇంగుదీ (కుంకుడు) ఫలరస మంటి నునుపారిన శిలాఖండములు. తమ కెట్టి చేటును వాటిల్లబోదను ప్రగాఢవిశ్వాసమున ఎట్టి ధ్వనికైనను బెదరి చెదరక చనువున సంచరించు ఆశ్రమమృగములు (హరిణములు). మఱియొకదెసను స్నానార్థము నీటిపట్టులకు రాకపోకలు సాగించు ఆశ్రమవాసుల వల్కలాంచలముల జాలువాఱు నీటి బొట్టుల చార లింకని బాట లొకవంకను ఇది మున్యాశ్రమ మనుటను చెప్పకయే చెప్పుచున్నది. ఎంత సుందరస్వాభావిక వర్ణన మిది? కీరముల కిలకిలారావములు, చెట్ల తొఱ్ఱల జాఱు నీవారధాన్యములు, కుంకుడురసమున నునుపెక్కిన రాతిబండలు, చనువున మెలగు హరిణముల కుప్పిగంతులు, కట్టుబట్టల జాఱు నీటిబొట్టుల చారలు ఇది ఆశ్రమమని చాటి చెప్పుచున్నవి. ఆశ్రమము

మన కన్నుల యెదుట మెదలుచున్నది. మఱియొక దృశ్యము- రఘువంశమున-

శ్రుతిసుఖభ్రమరస్వనగీతయః కుసుమకోమలదన్తరుచో బభూవుః,
ఉపవనాన్తలతాః పవనాహతైః కిసలయైః స లయైరివ పాణిభిః.

-IX - 35

ఉపవనము, వనాంతలతలు, అందంతటను విరిసిన కుసుమకదంబములు, ఆ సుమపుంజముల మధుబిందువులకు మూగు షట్పదములు, ఆ భ్రమరముల కలరవములు, గాలితాకున లయబద్ధముగ కదలియాడు కిసలయములు ఇది ఆ దృశ్యము. దానిని కవిసార్వభౌముడు లలితమంజులమనోజ్ఞనృత్యముతో సరిపోల్చినాడు. ఆ సుకుమార సుందర వనలతలు నర్తకులట. కర్ణపేయములైన షట్పదకలరవములు హృదయాహ్లాదకరములగు మధురాలాపనలు కమ్మని పాటలు నట. చక్కగా వికసించిన విశదకుసుమములు దంతరుచు (హాసము)లట! పవనచలితములగు అరుణకిసలయములు లయబద్ధములు భావగర్భితములు నగు హస్తముద్రలట. ఎంత సజీవకమనీయచిత్రణ మిది! ఎంత మనోహరదృశ్యము! మహాకవి ప్రకృతివర్ణన లన్నియు అత్యన్తమనోజ్ఞములే. నిత్యనూతనచైతన్యవిలసితములే. అనితరసాధ్యములగు లలితసుకుమారమనోజ్ఞచిత్రీకరణలే.

## కాళిదాసుని సంగీతనాట్యకళాపరిజ్ఞానము

కాళిదాసునకు పర్యాప్తమగు గాననాట్యకళాపరిజ్ఞాన మున్నది. ఆయన తన కృతులయం దట నట ప్రస్తావించిన వీణామృదంగాదివాద్యపరికరములా విషయమును స్పష్టీకరించుచున్నవి. లలితమంజులమనోహరమగు మయూరనృత్యకేకారవములు ఆయన కత్యంతమోదదాయకములు. కాళిదాసు తన రూపకములందు నాట్యకళావిశేషముల నందందు ప్రస్ఫుటముగ పొందుపఱచి యున్నాడు. ఆయన తన మాళవికాగ్నిమిత్రనాటకమున- 'నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధా ప్యేకం సమారాధనమ్' అని వచించి నాట్యశాస్త్రమందలి తన యభిరుచిని వెల్లడించెను. మఱియు తన విక్రమోర్వశీయనాటకమున- 'మునినా భరతేన యః ప్రయోగో భవతీష్వష్టరసాశ్రయో నిబద్ధః' అని పలికి భరతముని నాట్యశాస్త్రమందు తనకున్న ఆదరాభిమానముల వ్యక్తపఱచెను. దేవలోకసంబంధమగు నృత్యసంగీతముల నేర్పరియగు ఊర్వశి, మర్త్యలోకసంబంధమగు సంగీతనృత్యముల ప్రవీణ మాలవిక, ఉభయుల నాట్యకళానైపుణ్యములను ప్రతిభావంతముగ చిత్రించుటయం దతని నాట్యకళావిదగ్ధత విశదమగుచున్నది. రెండువేలయేండ్లకు బూర్వము మహాకవి - 'నర్తకి పూర్ణాలంకృతయై నాట్యవేదికకు రారాదు' అని పలికిన పలుకులు నేటికిని అనువర్తనీయములై యున్నవి. సర్వాంగసౌష్ఠవాభివ్యక్తయే విరళనేపథ్యయోః ప్రవేశోऽస్తు' అని మాళవికాగ్నిమిత్రము. నేటికి నిది ప్రాచ్యపాశ్చాత్యనాట్యకళాకోవిదులకు సమ్మతమై యొప్పుచున్నది. కాళిదాసు కృతులయందు

సంగీతనాట్యకళాత్మకమగు కమనీయదృశ్యము లెన్నియేని గలవు. మఱియు తన రచనావిధానమం దాయన సూక్ష్మాతిసూక్ష్మమైన నాట్యకళాసౌందర్యమును గూడ ప్రతిభాపూర్వకముగ అత్యంతమనోజ్ఞముగ చిత్రించి ప్రత్యక్షీకరించి తన ప్రత్యేకతను విలక్షణత్వమును నిలుపుకొన్నాడు. తన విక్రమోర్వశీయమున - 'నృత్యతి కల్పతరుః' - 'ఆలోకయతి పయోదాన్ ప్రబలపురోవాతనర్తితశిఖండః' ఇత్యాదు లందుకు ప్రమాణములు.

కాళిదాసుని ధార్మికత

కాళిదాసు వర్ణాశ్రమధర్మానుయాయి. బ్రాహ్మణుడు. శివభక్తుడు. ఆయన తన రచనలన్నింటను శంకరు నారాధించినాడు. విక్రమోర్వశీయమున మంగళాచరణ సందర్భమున మహేశ్వరుని ఇట్లు స్తుతించినాడు.-

వేదాన్తేషు యమాహు రేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ
యస్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయః శబ్దో యథార్థాక్షరః,
అన్తర్యశ్చ ముముక్షుభి ర్నియమితప్రాణాదిభి ర్మృగ్యతే
స స్థాణుః స్థిరభక్తియోగసులభో నిశ్శ్రేయసాయాస్తు వః. I - 1

మాళవికాగ్నిమిత్రమున--

ఏకైశ్వర్యే స్థితోఽపి ప్రణతబహుఫలే యః స్వయం కృత్తివాసాః
కాన్తాసమ్మిశ్రదేహోఽప్యవిషయమనసాం యః పురస్తాద్యతీనామ్,
అష్టాభిర్యస్య కృత్స్నం జగదపి తనుభి ర్బిభ్రతో నాభిమానః
సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వస్తామసీం వృత్తి మీశః.

అభిజ్ఞానశాకుంతలమున ఈశ్వరప్రార్థన-

యా సృష్టిః స్రష్టురాద్యా వహతి విధిహుతం యా హవిర్యా చ హోత్రీ
యే ద్వే కాలం విధత్తః శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్య విశ్వమ్,
యా మాహుః సర్వబీజప్రకృతి రితి యయా ప్రాణినః ప్రాణవన్తః
ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభి రవతు వస్తాభి రష్టాభి రీశః.

రఘువంశమందున మహాకవి కాళిదాసు - 'జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ' అని మహాదేవుని కీర్తించినాడు. ఇక కుమారసంభవకావ్యమన్ననో గౌరీశంకరుల కళ్యాణగాథయే కదా! మిగిలినది మేఘదూతకావ్యము. అందు ఉజ్జయిని నధివసించియున్న మహాకాళ (ఈశ్వర) మందిరభవ్యవర్ణన మనకు ప్రత్యక్షమగును. శివభక్తుడైనను అత డన్యమతద్వేషి కాడు. వాస్తవమున కాయన హైందవమతసారమైన బ్రహ్మావిష్ణుమహేశ్వరుల యభేదమునే ప్రవచించి అద్వైతమునే ప్రతిపాదించినాడు. హైందవమతము ప్రధానముగా పాంచదైవికమగు- గణపతి - దుర్గా - మాధవ - శివ - సూర్య- ఉపాసనావిధానమును

సూచించుచున్నది. ఇందెవరి నుపాసించినను అన్యుల మఱవరాదు.

## కాళిదాసుని రచనలు

కాళిదాసు పేర బహుశ 41 గ్రంథములు పేర్కొనబడినను 7 మాత్రమే ఆయన రచనలుగా గుర్తించబడినవి. అందు రఘువంశకుమారసంభవ మేఘసందేశ ఋతుసంహారములు కావ్యములు. మాళవికాగ్నిమిత్ర విక్రమోర్వశీయ అభిజ్ఞాన శాకుంతలములు రూపకములు. రఘువంశమున దిలీపుడాదిగా రఘువంశరాజుల ధార్మికత, కీర్తి, ఔదార్యాదిసద్గుణసంపత్తి హృదయంగమముగా వర్ణింపబడినది. భావస్ఫూర్తి, కవితాశక్తి ఇమిడియున్న 19 సర్గల మహాకావ్య మది. జగన్మాతాపితరు లగు పార్వతీపరమేశ్వరుల ప్రణయగాథ కుమారసంభవము 17 సర్గలు. అయినను వ్యాఖ్యాతృసార్వభౌముడు మల్లినాథు డష్టసర్గలకు మాత్రమే వ్యాఖ్య రచించుటం జేసి అంతదనుక మాత్రమే కాళిదాసరచన యను ప్రతీతి యొకటి గలదు. ఆ మహాకావ్యమున గిరిజాకళ్యాణము, కుమారజననము, తారకాసురవధ ముఖ్యఘట్టములు. కాళిదాసు తన భావసంపత్కాల్పనిక శక్తికళాసౌరభములను రాశిచేసి జగత్పితరుల దివ్యరూపమునకు భవ్యచేష్టలకు అపురూపమగు మెఱుగులు దిద్దినాడు. కాళిదాసుని ప్రతిభకు భావస్ఫూర్తికి, కావ్యకళానైపుణ్యమునకు వర్ణనావైశద్యమునకు హద్దు కుమారసంభవము.

మేఘసందేశము ఖండకావ్యమైనను పండితులు మహాకావ్యముగనే పరిగణింతురు. పూర్వమేఘము ఉత్తరమేఘము నని సర్గద్వయకావ్య మది. హద్దు మీరిన ప్రతిభతో మహాకవి దానికి మెరుగులు దిద్దినాడు. ఋతుసంహారము 6 సర్గల కావ్యము. ఋతువర్ణన, ప్రాకృతికదీప్తి, మానవహృదయము అందు మనోజ్ఞముగ ఉల్లేఖింపబడినవి. ఇక రూపకములు. మాళవికాగ్నిమిత్రమున అంకము లైదు. రాజు అగ్నిమిత్రుడు, అభినేత్రి మాళవిక. ఆ ఇరువురి గాథ అందభివర్ణితము. మాళవిక అపూర్వమనోజ్ఞనాట్యకళానిపుణతాప్రదర్శన కది పతాక. విక్రమోర్వశీయమునందును అంకము లైదు మాత్రమే. దీనిని త్రోటకమనియు అందురు. ఊర్వశీపురూరవుల ప్రణయగాథ ఇందు రమ్యముగా చిత్రీకరించబడినది. ఇక మిగిలినది అభిజ్ఞానశాకుంతలము. ఏడంకముల నాటక మది. సర్వలక్షణసంపన్నమై సంస్కృతసాహిత్యముననే కాక విశ్వసాహిత్యమున గూడ సర్వశ్రేష్ఠరూపకముగా వినుతి కెక్కినది. సర్వరూపకములందును తలమానికమై వెలసినది. అపురూపము, అతిలోకమునగు ఈ రూపకరచనావిధానమునకు ఇందలి పాత్రల ఔచిత్యచిత్రీకరణకు దివ్యసందేశసౌరభమునకు ప్రాచ్యపాశ్చాత్యపండితులు ముగ్ధులై వేనోళ్ళ ఉగ్గడించిశ్లాఘించి ప్రశంసలు గురియించిరి. కాళిదాసుని పరిణతి చెందిన పాండిత్యమునకు అవధులులేని ప్రతిభకు అమేయమగు సృజనాత్మకశక్తికి పండబాఱిన ప్రసన్నకళావైభవమునకు పరాకాష్ఠ అభిజ్ఞానశాకుంతలము. ఇందలి

పాత్రలు తావి యబ్బిన పుత్తడి బొమ్మలు. చైతన్యవిలసితస్వర్ణప్రతిమలు. అతిలోక సుందరముగా తీర్చిదిద్దిన కళాఖండములు. అలౌకికవర్ణచిత్రములు. అమృతశలాకలు. భారతసాహిత్యమునకు, భారతసంస్కృతికి విజయపతాకము కాళిదాసుని శాకుంతలము. అంతేకాదు, కావ్యకళాభారతికి ప్రసన్నతరళకాంతుల దీపించు ఆణిముత్తెపు సరము. అనర్ఘమణిమయభూషణము. కవితావైభవమునకు కావ్యకళాసౌష్ఠవమునకు రసపుష్టికి ఇప్పటికిని మఱెప్పటికిని దాని కదియే సాటి. కాళిదాసున కది శాశ్వతవిజయపతాకము. శకుంతలాదుష్యంతుల ప్రణయగాథ అతిలోకసుందరముగ ఔచిత్యశోభితముగ ఆదర్శప్రాయముగ అం దభివర్ణితము.

## మేఘసందేశము

సుమధురసుమనోహరసుందరఖండకావ్య మది. దానిని మేఘదూత మనియు నందురు. లయబద్ధములు రాగయుక్తములు గానయోగ్యములు నగు మందాక్రాంతా వృత్తములతో గూడిన గేయకావ్య మది. మఱియు మానవహృదయస్వాభావికములగు ప్రేమశోకభక్త్యాది కోమలకమనీయభావములు చక్కగా ప్రతిబింబించు దర్పణము వంటిది. "తద్భావపావనగంగాజలములను అప్రతిహతముగా ప్రవహింపజేయు గంగాభవాని యది. సామాన్యకవితకు భిన్నముగా విలక్షణముగా విశృంఖలముగా ప్రవహించు అలకనంద యది. గేయకావ్యమందు వృక్షలతాదులకు అన్యసాధు జీవులకు ప్రాధాన్యము హెచ్చు. గేయకావ్యరచయితలు సాదృశ్యసందర్భమున చకోరచక్రవాకములను లతాపంకజాదులను బహుళముగా గ్రహించిరి. కావ్యము అష్టాదశవర్ణనాత్మకము. అందు కొన్ని లోపించుటచే దీనిని ఖండకావ్య మనియు, గీతికావ్యమనియు పండితులు పేర్కొనిరి. పూర్తిగా పద్యాత్మక మిది. భారతీయఖండకావ్యములు పాశ్చాత్యరచయితల నెంతగానో ఆకర్షించినవి. గేయకావ్యములందు మేఘదూతము సర్వశ్రేష్ఠము. ఇందు పూర్వమేఘము ఉత్తరమేఘము నని రెండు భాగములు. కావ్యాంతర్గతశ్లోకములు ప్రధానముగా 110 లేక 111 మాత్రమే అనియు అందు పూర్వమేఘమున 63ను, ఉత్తరమేఘమున 48 అనియు సుశీలకుమారదేవుని మతము. వావిళ్ళవారి ప్రతియందు పూర్వమేఘమున 67 శ్లోకములు, ఉత్తరమేఘమున 57 శ్లోకములు మొత్తము 124 గా చూపబడినవి. ఇతరత్ర పూ.మే. న 67, ఉ.మే.న 62 వెరసి 129 శ్లోకము లగపడుచున్నవి. చివరి శ్లోకము లైదును ప్రక్షిప్తము లందురు. అయినను రసవత్తరము లగుట వాటికిని వ్యాఖ్యలు రచింపబడినవి.

పూర్వమేఘమున కథ - ఒకానొక యక్షుడు కర్తవ్యదూరుడగుట ప్రభువు కుబేరుని యాగ్రహము(శాపము)నకు గుఱియై అలకానగరమును బాసి ఏడాదిపాటు ప్రవాసితు డాయెను. అంత నా యక్షుడు కాంతావియోగదుఃఖసంతప్తుడగుట ఉన్మత్తు డగుచు కృశించి రామగిర్యాశ్రమ (చిత్రకూట) పుణ్యభూముల దిరుగు

చుండెను. ఆషాఢము సమీపింప అంత ప్రథమదివసముననే మేఘఖండ మొకటి అతని కంటబడెను. ప్రియురాలు జ్ఞప్తికి వచ్చినది. వర్షాగమము మదనోద్దీపకమగుట అబల యగు తన ప్రేయసి వియోగదుఃఖభార మెట్లు భరించగలదను శంక వొడమి, విరహసంతప్త యగు యక్షిణి జీవితమునెడ సంశయము గలిగి, ధైర్య మంతరింప, ఏదో విధముగా ప్రేయసీ ప్రాణసంరక్షణ అతని ధ్యేయమైనది. కామార్తుడగుట చేతనాచేతనవివేకము దక్కి ప్రత్యక్షమైన ఆ మేఘుని పుష్కలావర్తక వంశసంభూతుడగు కులీను డని సంభావించి, తన కాంత కతనిపరమున సందేశ మంపి ఆమె ప్రాణముల రక్షింప నెంచెను. మేఘు డుత్తమకులసంజాతు డగుట తన ప్రార్థన తిరస్కృతమైనను యాచనాలాఘవ ముండదనియు, అందుచే నది దుఃఖహేతువు కాజాలదనియు భావించి యక్షు డతని తన సందేశము గొనిపొమ్మని అర్థించినాడు. మఱియు మేఘుడు పయనించవలసిన మార్గమును నిర్దేశించి తిలకించవలసిన దృశ్యములను వివరింపగోరెను. జలదా! గాలిపొ ెంతయు అనుకూలము. మందపవనము నీకెంతయు తోడై నిన్ను ముందుకు గొనిపోగలదు. చాతకము మధురమధురముగా మృదువుగా కూయుచున్నది. ఇవన్నియు శుభసూచకములు. మఱియు నో జలదా! బాలమృణాలశకలపాథేయము గైకొని హంసలు మానస (సరోవరము) పర్యంతము ని న్ననుగమించగలవు. మార్గమున అలసి సొలసిన, శైలాగ్రముల విశ్రమింపుము. గమనాయాసమున శక్తి యుడిగిన మార్గమున ఆ యా నదుల మధురజలముల నాస్వాదించుము. అందందు పొటమరించిన కార్చిచ్చు చల్లార్చి, ముదము గూర్చు నిన్నా య్యామ్రకూట మెట్లు మఱువగలదు? శిరమున ధరించి సన్మానించగలదు. ప్రతిపర్వతమందు వనమయూరముల కేకారవములు నీకు స్వాగతము పలుకగలవు. తత్కారణముగ అలసత్వ మూని కార్యసాధనకు జాగొనరింపకుము. ఇంచుక ముందుకు సాగి జగత్ప్రసిద్ధమగు విదిశానగరము జేరి అట ప్రవహించు వేదవతీమధురజలముల నాస్వాదింపుము. ఉత్తరమునకు పయనించు నీకు మార్గ మించుక వక్రమైనను ఉజ్జయినీనగరప్రాసాదోత్సంగానందోత్సవమును జాఱ విడువకుము. అచట మహాకాళేశ్వరపూజాసమయమున మురజ (మృదంగము) వాద్యమ ట్లురిమి పుణ్యమున బొమ్ము.

తద్రాత్రి సౌధోపరిభాగమున ఎందైనను విశ్రాంతి గొనుము. అచ్చటి ముచ్చటలు నీ కెంతయు ముదము గూర్చును. అచటినుండి నీవు పయనించు మార్గమున గంభీరానది నీ కెదురగును. అందలి మధురసలిలములు ద్రావి అలసత్వము మాని సందేశ మూని ముందుకు సాగిపొమ్ము. దేవగిరిదెస నీవు పయనమై పోవునపుడు అధోభాగమున ప్రసరించు చల్లగాలి నీ కత్యంతమోద మొనగూర్చును. నీవట ఉఱిమిన కార్తికేయుని మయూరము నేత్రోత్సవముగ పురివిప్పి యాడును. అటనుండి మీది కరుగ చర్మణ్వతీతరంగిణి నీ కంటబడును. రంతిదేవుని యశోరూపమున బ్రవహించు ఆ నదీజలములు నీ వారగించున

పుడు ముత్తెపుసరమందలి నీలమణిప్రాయముగ ప్రకాశించి చూపరులకు నేత్రపర్వ మొనరించగలవు. అటనుండి దశపురము మీదుగా మీదికేగ, బ్రహ్మావర్తమందలి కురుక్షేత్రము ప్రత్యక్షమగును. నీ వట నిర్మలసరస్వతీజలము లానిన కృష్ణవర్ణ మారకున్నను ఆంతరికశుద్ధి పొందగలవు. ఆ చోటు విడిచి ముందుకు పయనించ, పాలపొంగువలె వెన్నెలవెల్లువవలె బ్రవహించు గంగ నీకు దృగ్గోచరమగును. గంగపై నీ నీడ సోకినపుడు ప్రయాగ కితరత్ర గూడ గంగాయమునల సంగమమా! యను భ్రాంతి గలిగి సంభ్రమాశ్చర్యములకు తావిచ్చు కాల్పనికదృశ్య మేర్పడును. అచ్చోటు విడిచి ముందుకు సాగి హిమాద్రి హొయలుకు ముగ్ధుడవగుచు క్రౌఞ్చరంధ్రమున కైలాస మరిగి ఆదిదంపతుల యాతిథ్య మారగింపుము. కాలినడకను గౌరి కైలాస మెక్కుట నీ కంటబడిన సోపానమార్గమై ఆమెకు సహకరించుము. నీవట మానససరోవరనీరములు మనసార గ్రోలి ముందు కదుగిడ అలక యానందముగ నీకు స్వాగతము పలుకును. నీ కన్నుల కది యొకకమ్మని విందగును. ఇది పూర్వమేఘపు గాథ. ఇక ఉత్తరమేఘమున మార్గనిర్దేశానంతరమున యక్షుడు మేఘునితో- మిత్రమా! అలకానగరవర్ణన నాకలవిగానిది. అత్యంతరమణీయము, అతిలోకసుందరము, సకలవైభవోపేతము నగు ఆ నగరమును అల్పజ్ఞుడ నగు నేనెట్లు వర్ణించగలను?

అచటి రమ్యహర్మ్యములు భవత్సదృశముగ మహోన్నతములు. మిరుమిట్లుగొలుపు నీ ప్రేయసి మెఱుపు సదా నిన్నంటి యుండునట్లు సుందరాంగన లెందరో ఆ భవనముల నిండియున్నారు. నిన్నంటి చిత్రవర్ణముల ఇంద్రధనువు కులుకుచుండ ఆ యున్నతప్రాసాదముల వర్ణచిత్రము లెన్నియో ముచ్చట గొలుపుచున్నవి. నీవు మృదులగంభీరగర్జనలు సలుపుచుండ అట గానమకరందమాధుర్యములు మృదంగమధురగంభీరనిస్వనములు శ్రవణపేయము లగుచున్నవి. వినిర్మలనీలనీరములు నీలోన మెదలుచుండ, అచట ఇంద్రనీలములు వెలుగులు వెలార్చుచున్నవి. నీవు మిన్నంటి ఉన్నతుడవు కాగ ఆ రమ్యహర్మ్యములు గగనతల మంటి ముద్దులు గులుకుచున్నవి. అంతేకాదు. ఋతుషట్కపు సొబగు లచ్చట సదా ముచ్చట గొల్పుచుండ దుఃఖ మనునది యేమియో యెఱుగ రచ్చట. కాదనక కల్పవృక్షము, కోరికలు దీర్చ సదా వేచియున్న దచట. నిత్య కళ్యాణము పచ్చతోరణము నగు ఆ పట్టణమున యక్షరక్షకుడగు కుబేరుని ప్రాసాదమున కుత్తరముగ ఇంద్రధనువు బోలి సుందరమగు ప్రాకారాంతరమున నయనానందకరమగు మద్భవనమును దూరము నుండియే చూడగలవు. మద్గేహప్రాంగణమున మత్కాంతచే ప్రేమచే పెంచబడిన కల్పక వృక్ష మొకటున్నది. అచటనే నీలమణిఖచిత సోపానమార్గమున సొంపెసగు బావి గలదు. దాని యొడ్డున క్రీడార్థము కృతకపర్వత మున్నది. మద్భవనోపవనమందలి వకుళఅశోకవృక్షములు నీ కన్నులకు విందొనర్చగలవు.

ద్వారమున రమ్యమగు శంఖపద్మము లమరి యున్నవి. ఉపర్యుక్తభవనమున చక్కని దేహసౌష్ఠవము గలిగి యౌవనమధ్యస్థయు, అమరిన పలువరుసచే ముచ్చట గొలుపుచు బింబఫలసదృశాధరోష్ఠమున సొబగులు నింపునదియు కలదు. లేదను నడుమున నొయ్యారముగ అల్లాడుచు చకితహరిణీప్రేక్షణములు సారించునదియు, సొరుల నింపు లోతు పొక్కిలి గలిగి గబ్బిగుబ్బల బరువున ఇంచుక యొదిగి ముద్దులు గూర్చునదియు, శ్రోణీభారమున అలసగమనయు, అంగనల విషయమున విధాత ఒరవడిగా తీర్చిదిద్దిన ప్రథమనిర్మాణమా యనునట్లు ముద్దులొలుకు నొయ్యారపు బొమ్మయే మత్కాంత యని గుర్తింపుము. ఆమెయే మత్ప్రియతమ. బహిఃప్రాణము, మద్వియోగసంతప్త యామె. దిన మొక యుగముగా గడుపుచుం డును. చెలు లామెను చుట్టు ముట్టి యోదార్ప దిన మెట్లో గడచిపోవును. నిశాసమయమున నీ వట జేరి లేక లేక నిద్ర ఆమెను ఆవహించిన వేగిరపడక యామమాత్రము సద్దుమణగి వేచి యుండుము. తదుపరి తుషారకణముల సవ్వడిని మెల్లగా మేలుకొలిపి మందస్వరమున మత్సందేశము వినిపింపుము. ఆప్తబాంధవా ! సందేశ మేది యన - ఓ కళ్యాణీ! విధి వక్రింప ఎడబాసిన నీ కాంతుడు రామగిర్యాశ్రమముల కుశలుడు. నీ క్షేమ మరయ నారాటపడుచు భవద్విప్రయోగభరమున అత్యంతపరితప్తుడు. ఆయినను శాపాంతమున లభ్యమగు భోగముల నూహించి ఊరట చెందుచున్నాడు. నీవును బేలవై అలసట నొందక ఇంచుక ధైర్యమూనుము. కష్టసుఖములు కలకాలము కాపురముండవు గదా? చక్రనేమిక్రియ దివారాత్రము లవి తిరుగుచుండును. కష్టకాల మచిరకాలమున అంతరించును. మాసచతుష్టయశేష మెట్లో గడుపబూనుము. అంత కాంతుడు చెంత నుండును. అంతయు ఆనందమే యగునని నామాటగా వాక్రుచ్చుము.

మఱల యక్షు డిట్లనియె- జలదా! దూతకృత్యము నీ కప్పజెప్పుట ఉచిత మేమి యగును? ధూర్తత్వ మనియు ఎఱుగుదును. అన్యమార్గములేక నిన్నాశ్రయించితిని. నా దయనీయస్థితి చూచియైనను దూతకార్య మొనరింతువని ఆశించితిని. మీదట నీవెందైన విహరింతువు గాక. విరహవేదనాపీడితుడ నగు నావలె నీ వెన్నడును ప్రేయసి (మెఱుపు) నెడబాయకుందువుగాక. ఇది ఆ యక్షుని యపేక్ష. ఆకాంక్ష. దయనీయమగు ఆ సందేశము వినిన మీదట నిరాలస్యముగ మేఘుడా యక్షపురి కరిగి ప్రేమపూరితము, కరుణామయము నగు యక్షుని సందేశమును యక్షపత్ని కందజేసెను. అంత నా యక్షిణి ప్రియుని కుశలవార్త వీనులకు విందొసగ సంతోషమున ఊరటజెందెను. అంత అలకాపతి కుబేరుడును ఈ యపూర్వవిలక్షణసందేశవార్త విని కారుణ్యభావమున శాపము నంత మొందించెను. అప్పుడా యువదంపతులు సంతోషభరితాంతరంగు లగుచు ఇనుమడించిన భోగము లనుభవించిరి. మేఘదూత ఉత్తరకథన మిది. - ఇక మేఘదూతకావ్యరచనకు

మూల మేది యనునది విచారణీయము. వాల్మీకిరామాయణమున సీతావియో గసంతప్తుడగు రాముడు జనకాత్మజ కంపిన హనుమత్సందేశము ప్రేరకమని వ్యాఖ్యాతృసార్వభౌముడు మల్లినాథుని నిశ్చితాభిప్రాయము. అందుల కుపపత్తి-

1. యక్ష శ్చక్రే జనకతనయాస్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు - మే.సం- 1-1

2. ఇత్యాఖ్యాతే పవనతనయం మైథిలీ వోన్ముఖీ సా- 2-42

ఇట్లు జనకతనయారామపవనతనయుల ప్రస్తావనచే రామాయణకథాచిత్రము పాఠకులకు ప్రత్యక్షమగుచున్నది. మఱియు విరహిణియగు యక్షిణి వర్ణనయు వియోగదుఃఖితయగు జానకిని గుర్తుకు దెచ్చుచున్నది. ఉభయుల స్థితివర్ణన సమానముగనే యున్నది.

హిమహతనలినీవ నష్టశోభా వ్యసనపరంపరయా నిపీడ్యమానా,
సహచరరహితేవ చక్రవాకీ జనకసుతా కృపణాం దశాం ప్రపన్నా.
వాల్మీ. రా. సుం. కాం. 30

తాం జానీథాః పరిమితకథాం జీవితం మే ద్వితీయం
దూరీభూతే మయి సహచరే చక్రవాకీ మివైకామ్,
గాఢోత్కణ్ఠాం గురుషు దివసేష్వేషు గచ్ఛత్సు బాలాం
జాతాం మన్యే శిశిరమథితాం పద్మినీ వాన్యరూపామ్. మే.సం.I-22

ఇవ్విధమున యక్షిణీ జనకనందనలకు సన్నిహితసామ్య మగపడుచున్నందున హనుమత్సందేశము ముందిడుకొని కాళిదాసు రచన సాగించె ననునది స్పష్టము. రామాయణమున వర్ణించిన, హనుమంతునితో గజగిరిశిఖరసాదృశ్యము, కామ రూపత్వము (ఇచ్ఛానురూపవేషధారణము) ప్రస్తుతకావ్యమందున అభివర్ణితమైనది. సువేలపర్వతాగ్రమందలి లంకయందు వాయునందనుడు సాయంసమయమున ప్రవే శించినట్లు మేఘుడును కైలాసశిఖరమందలి అలకానగరమున సంధ్యాసమయముననే అడుగిడుటయు, విశ్వాసార్థము రాముడు ప్రియసతికి హనుమంతునిద్వారా అంగు ళీయక మందజేసినట్లు యక్షుడును తన ప్రేయసికి మేఘునిద్వారా తన వైవాహికజీవితరహస్యమును అభిజ్ఞానముగ పంపించుటయు రామాయణ మేఘ దూత కావ్యములందలి భిన్నఘట్టముల సాదృశ్యమునకు ప్రబలతార్కాణములు. మఱియు బృహత్కథయం దభివర్ణితములైన యక్షుల శాపవృత్తాంతములు, భారత భాగవతజాతకకథలయం దుదాహృతములగు దూతప్రసంగములు చదివి ఉత్తేజితుడై మహాకవి ఏతత్కావ్యరచనకు ప్రేరితుడై యుండనోపు ననియు ఊహింపబడుచున్నది. యక్షుడు యక్షపతి కుబేరునిచే శపింపబడెనను దానికి మూలము పద్మపురాణము. దాని ననుసరించియే కాళిదాసు ఉత్కృష్టభావపరంపరలు పొందుపఱచి ఈ

మధురరసవత్తరకమనీయకావ్యమును లోకమున కందించెను. పద్మపురాణమున (యోగినీ) నామక ఆషాఢకృష్ణ ఏకాదశీ మాహాత్మ్యప్రసంగసందర్భము-

అలకాధిపతిర్నామ్నా కుబేరః శివపూజకః,
తస్యాసీత్పుష్పబటుకో హేమమాలీతి నామతః.
తస్య పత్నీ సురూపాసీ ద్విశాలాక్షీతి నామతః,
స తస్యాం స్నేహసంయుక్తః కామపాశవశం గతః.
మానసాత్పుష్పనిచయ మానీయ స్వగృహే స్థితః,
పత్నీప్రేమసమాయుక్తో న కుబేరాలయం గతః.
కుబేరో దేవసదనే కరోతి శివపూజనమ్,
మధ్యాహ్నసమయే రాజన్ పుష్పాణి ప్రసమీక్షతే.
హేమమాలీ స్వభవనే రమతే కాన్తయా సహ,
యక్షరాట్ప్రత్యువాచాథ కాలాతిక్రమకోపితః.
కస్మాన్నాయాతి భో యక్షా! హేమమాలీ దురాత్మవాన్,
నిశ్చయః క్రియతా మస్య ప్రత్యువాచ పునః పునః.

యక్షా ఊచుః--

వనితాకాముకో గేహే రమతే స్వేచ్ఛయా నృప!
తేషాం వాక్యం సమాకర్ణ్య కుబేరః కోపపూరితః.
ఆహ్వాయామాస తం తూర్ణం బటుకం హేమమాలినమ్.
జ్ఞాత్వా కాలాత్యయం సోఽపి భయవ్యాకులలోచనః,
ఆజగామ నమస్కృత్య కుబేర స్యాగ్రతః స్థితః.
తం దృష్ట్వా ధనదః క్రుద్ధః కోపసంరక్తలోచనః,
ప్రత్యువాచ రుషావిష్టః కోపా ద్విస్ఫురితాధరః.

ధనద ఉవాచ-

రే పాప దుష్ట దుర్వృత్త కృతవా న్దేవహేలనమ్,
అతో భవ శ్విత్రయుక్తో వియుక్తః కాన్తయా సహ.
అస్మాత్స్థానా దపధ్వస్తో గచ్ఛ స్థాన మథాధమమ్,
ఇత్యుక్తే వచనే తేన తస్మాత్ స్థానా త్పపాత సః.

అధికార ప్రమత్తుడు కర్తవ్యదూరుడు నగు యక్షుని శాపవృత్తాంత మిది.

ఇట్లాత్మీయులయొద్ద కెవరినైనను దూతగా బంపుట వేదకాలమునుండియు ప్రచలితమైనదే. శ్రీమద్భాగవతమందు (శిశుపాలునితో తన వివాహనిశ్చయవార్త) విని రుక్మిణి తాను మనసార ప్రేమించిన కృష్ణునొద్దకు బ్రాహ్మణుని సందేశహరునిగా బంపుట సుప్రసిద్ధమే గదా! అట్లే నలదమయంతులవిషయమున హంస

దూతకృత్య మొనర్చుట మన మెఱుగనిది కాదు గదా !

అస్తు, మేఘదూతరచన కేది కారణమైనను, ప్రేరకమైనను మహాకవి కాళిదాసు రచించిన మేఘదూతకావ్యము సర్వప్రథమము, సర్వశ్రేష్ఠము, సర్వకవిజనసమ్మతము అనునది నిర్వివాదాంశము. కాళిదాసునకు బూర్వము చైనీయకవి నూకాంగ్ తన కావ్యమున మేఘుని దూతగా బంపెనని బహుభాషాకోవిదుడు వంగదేశీయుడు నగు హరినాథపండితుడు వ్రాకుచ్చెను. కాని నూకాంగ్ కాలము క్రీ.శ. ద్వితీయశతాబ్దము. కాళిదాసు క్రీ.పూ. ప్రథమశతాబ్దికి చెందినవా డగుట దూతకావ్యసృష్టికి ఆయనయే ఆద్యబ్రహ్మ. ఈ విషయమున మీనమేషములు లెక్కించుటకు తావులేదు.

## మేఘదూతశైలి ఛందము : అలంకారము : రసము

కవిహృద్గతభావములు వ్యవహితముగ పఠనానంతరమే సుబోధకములు, హృదయంగమములు అయిన అట్టి కావ్యము ప్రసాదగుణభూయిష్ఠమై అత్యంతరమణీయమై మనోరంజకమగుట సర్వజనాంగీకృతము. ద్రాక్షపండ్లరసము పైకుబికినట్లు ప్రసాదగుణపరిపుష్టమగు కవితయొక్క కమనీయభావస్ఫూర్తి శబ్దాంతర్గతమగుచునే ప్రస్ఫుటముగ వ్యక్తమగుచుండును. కనుకనే అట్టి కావ్యము హృదయాకర్షకమగుచున్నది. ఏతద్విషయమును గుర్తించియే మహాకవి కాళిదాసు ప్రసాదగుణభూయిష్ఠముగ వైదర్భీరీతి ననుసరించి కైశికీవృత్తియందు తన కావ్యములను తీర్చి దిద్దినాడు. 'రీతి యన- 'రీతిర్నామ గుణాశ్లిష్టపదసంఘటనా మతా' ఇతి. ఇది త్రివిధము. వైదర్భి, గౌడి, పాంచాలి, యని. అందు వైదర్భి- 'బన్ధపారుష్యరహితా శబ్దకాఠిన్యవర్జితా, నాతిదీర్ఘసమాసా చ వైదర్భీ రీతి. రిష్యతే.' దుష్టసంధులను విడిచి శబ్దకాఠిన్యమును వర్జించి దీర్ఘసమాసములు లేక ప్రసాదగుణభూయిష్ఠముగ నుండునది వైదర్భీరీతి యనబడును. మాధుర్యాదిపరతంత్రశబ్దసందర్భము రీతి. కైశికీవృత్తి యన- అత్యర్థసుకుమారార్థసందర్భా కైశికీ మతా' అత్యంతసుకుమారములగు శృంగారకరుణరసముల వర్ణించుసందర్భమున యోగ్యమైన దీ వృత్తి. ప్రసాదగుణమున - ప్రసిద్ధార్థపదత్వం యత్స ప్రసాదో నిగద్యతే' క్లిష్టవర్జితమై ప్రసిద్ధార్థపదత్వము గల రచనను ప్రసాదగుణభూయిష్ఠ మందురు. పారిజాతకుసుమాలనువలె కాళిదాసు తన రచన కనువగు సరససరళమృదుమధురశబ్దముల నెంచుకొనెను. మాధుర్యము, సరళత, స్పష్టత ఇవియే కాళిదాసకవితావిశిష్టలక్షణములు. ఉదాత్తము, తేజోమయము, తీక్ష్ణము నగు కల్పనాశక్తి హేతువగుట కాళిదాసుని రచనావిధానము, శైలి భాగీరథీధారాసదృశముగ అప్రతిహతముగ ముందుకు సాగినది. ప్రకృతిచిత్రీకరణయం దేమి, మానవస్వభావమును విశ్లేషించి చిత్రించుటయం దేమి, అతని కతడే సాటి. అసాధారణప్రజ్ఞాశాలి యతడు. ఉజ్జయినీ అలకానగర

వర్ణనసందర్భమున ప్రతిశ్లోకమందును అత్యంతరమణీయముగ ఆ యా దృశ్యములు శబ్దచిత్రణముచే ప్రత్యక్షీకరించబడినవి. అం దతడు చూపిన ప్రతిభ అత్యద్భుతము, అసదృశము.

యక్షపత్నియొక్క విరహవర్ణన సహృదయులగు పాఠకుల హృదయమున కారుణ్యమును పూరించు ననుటకు సందియము లేదు. కావ్యముయొక్క ప్రతిపంక్తియందును కవియొక్క మృదుమధురభావములు కోమలశబ్దసంచయము పదప్రయోగవైశిష్ట్యము ఉట్టిపడుచు పూర్ణరూపమున అతని కవితారచనకు వన్నె పెట్టుచున్నవి. అతని కవిత ఆదర్శప్రాయము. భాషయును భావానుకూలముగ సరళము, సరసము, సుబోధకమునై నిర్దుష్టశయ్యాపాకముల దేలుచు హృదయం గమ మగుచున్నది. శయ్య యన- 'యా పదానాం పరా ఒన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే' - పదముల అత్యంతసన్నిహితమైత్రి శయ్య యనబడును. పాక మన 'అర్థగమ్భీరిమా పాకః స ద్విధా హృదయంగమః, ద్రాక్షాపాకో నారికేళపాకశ్చ ప్రస్ఫుటాంతరౌ' ఇతి. గంభీరార్థప్రతిపాదకము పాక మనబడును. అది ద్వివిధము. ద్రాక్షాపాకము, నారికేళపాకము. అందొకటి ప్రస్ఫుటము, రెండవది ఆంతరము. 'ద్రాక్షాపాక స్స కథితో బహిరంతః స్ఫురద్రసః' బహిరంతరముల చిప్పిలు రసము గలది ద్రాక్షాపాక మనబడును. 'స నారికేళపాక స్స్యాదంతర్గూఢరసోదయః' - అంతర్గూఢరసోదయము కలది నారికేళపాక మనబడును. కాళిదాసు రచనలన్నియు ద్రాక్షాపాకభూయిష్ఠములే.

కాళిదాసు వివిధచందముల సిద్ధహస్తుడే యైనను ఈ కావ్యమునం దతడు అత్యంతహృదయంగమమగు మందాక్రాంతవృత్తమునే వాడినాడు. ప్రకృతకావ్యనా యకుడు యక్షుడు విరహకాతరుడు. కష్టదుఃఖములు కారణముగ అతని క్రియాశక్తి పూర్తిగా లోపించినది. కనుకనే అతడు విహంగమువలె కారుణ్యపూరితము, హృద యస్పర్శకము నగు ఆర్ద్రకంఠమున మందమందముగ (ఆగి యాగి) నుడువుచు ప్రేయసికి సందేశ మంపుచున్నాడు. తదనుగుణముగ మహాకవి తన కావ్యమున తదర్హమగు మందాక్రాంత వృత్తమునే ఉపయోగించినాడు. 'ప్రావృట్ప్రవాసవ్యసనే మన్దాక్రాన్తా విరాజతే' అట్టిపట్టుల మందాక్రాంతావృత్తము శోభించును. ప్రస్తుతకావ్య మున ఏతద్విషయము ప్రాధాన్యము వహించుచున్నది. . యథార్థమునకు మహాకవి తన కావ్యమంతయు ఈ వృత్తముచే నింపి దూతకావ్యముల కిదియే యుత్తమమని పరంపరాగతదూతకావ్యములకు ఒఱవడిగా తీర్చిదిద్దినాడు. కాళిదాసు ఏతచ్ఛందః ప్రయోగమున సిద్ధహస్తుడు. క్షేమేంద్రుడు కాళిదాసుని మందాక్రాంతవృత్తమును మిక్కిలి ప్రశంసించినాడు-

సువశా కాళిదాసస్య మన్దాక్రాన్తా ప్రవల్గతి,
సదశ్వగమకస్యేవ కామ్భోజతురగాంగనా.

ఈ వృత్తమున కాళిదాసుని సఫలతను జూచి తదనంతరకవులు తమ దూతకావ్యముల నీ వృత్తమునే వాడిరి.

సహజసౌందర్యశోభిత యగు రమణీలలామ అవయవానురూపమగు అలంకారములు ధరించి విశేషశోభావహ యగునట్లు కవితారమణియు అనురూపశబ్దార్థాలంకారముల గూడి అతిశయరామణీయకమున జెన్నొందుచున్నది. కాన భావవైశద్యము, ప్రసన్నత, రసపుష్టికి తోడు అలంకారములు కవితాసౌందర్యమునకు పోషకములే కాని ప్రతిబంధకము లెంతమాత్రము గావు. మేఘదూతము అనురూపాలంకారములు దొడిగి సుమనోమనోహరియై యలరారుచున్నది.

శబ్దాలంకారము (పునరుక్తవదాభాసము)నకు ఉదాహరణ-

ఉత్పశ్యామి త్వయి తటగతే స్నిగ్ధభిన్నాఞ్జనాభే,
సద్యః కృత్తద్విరదదశనచ్ఛేదగౌరస్య తస్య. మే.దూ. I-14

ద్వితీయపంక్తియందలి రద, దశన, శబ్దములు ఏకార్థకములు. దంతమని యర్థము. పర్యాయమున ప్రయోగింపబడుట పునరుక్తవదాభాసచమత్కార మగుచున్నది. కాని భిన్నార్థములందే ప్రయుక్తము లవి. ద్విరద మన రెండు దంతములు గలదని యర్థము. అనగా ఏనుగు. దశన మన దంతము (కోర) గజదంతము. ఛేకానుప్రాస కుదాహృతి-

స ప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ తస్మై
ప్రీతః ప్రీతిప్రముఖవచనం స్వాగతం వ్యాజహార. మే.దూ. I-4

ఇట ద్వితీయచరణమున ప్రీతః ప్రీతిప్రముఖవచనం అనుచోట ప్రీతః యన ప్రసన్నచేతస్కుడు, ప్రీతిప్రముఖవచనమ్ అన స్నేహ లేక ప్రేమపూర్వక వాక్కు అను అర్థభేద మున్నను అవ్యవహితమగు వ్యంజనయుగ్మద్వయపౌనరుక్త్యముచే ఛేకానుప్రాస యగుచున్నది. ప్రకృష్టము, రసాద్యనుగతసామ్యవర్ణవిన్యాసము అనుప్రాస. వర్ణవిన్యాస మన రచనావిశేషము.

అర్థాలంకారసందర్భమున మహాకవి కత్యంతప్రియమగు ఉపమాలంకారము.

దీర్ఘీకుర్వన్ పటు మదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః,
యత్ర స్త్రీణాం హరతి సురతగ్లాని మఙ్గానుకూలః
శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః. మే.దూ. I-32

శిప్రానదీతరంగముల తాకి వచ్చు చల్లగాలి తీరుతెన్నులెట్లున్నవన నర్మవచనముల ప్రేయసి ననునయించు చాటువచనచతురు డగు ప్రియుని ప్రవర్తన బోలియున్న వట! ఎంత చక్కని పూర్ణోపమ కావ్యమునకు మెఱుగులు సంతరించుచున్నది! కావ్యకళాలక్ష్మికి సొగసులు నింపుచున్నది! కవితకు సోయగములు

కూర్చుచున్నది! కాళిదాసు ప్రతిభ కిది యొక నిదర్శనము. ఎంత లలితమనోజ్ఞసుకుమారఉపమాలంకార మిది! మఱియు విరహిణియగు యక్షపత్నిని వర్ణించుచు-

ఆధిక్షామాం విరహశయనే సన్నిషణ్ణైకపార్శ్వాం
ప్రాచీమూలే తనురివ కలామాత్రశేషాం హిమాంశోః. మే.దూ. II-28

విరహతాపోపశమనార్థము కిసలయశయ్యపై శయనించిన విరహక్షామయగు యక్షపత్ని ప్రాగ్దిశాకోణమం దంతంతగా నగుపించు ఏకకళామాత్రశేషయగు చంద్రరేఖవలె నున్నదట! ఎంత హృదయంగమ మీ యుపమ ! ఎంత లలితసుకుమారము! ఎంత మనోజ్ఞము! పతిమగ్నహృదయ విరహపీడిత యక్షిణి క్షీణచంద్రరేఖవలె నున్నదట! పోలిక క్షీణచంద్రరేఖతో! కాళిదాసుని కమనీయహృదయమునకు తార్కాణమది. అది కళ్యాణహృదయము.

పాదానిందో రమృతశిశిరాన్ జాలమార్గప్రవిష్టాన్
పూర్వప్రీత్యా గతమభిముఖం సన్నివృత్తం తథైవ,
ఖేదాచ్చక్షుః సలిలగురుభిః పక్ష్మభిశ్ఛాదయన్తీ
సాభ్రేஉహ్నీవ స్థలకమలినీం న ప్రబుద్ధాం న సుప్తామ్. మే.దూ. II-29

ఇదియు విరహసంతప్తయగు యక్షిణి వర్ణనయే. లలితసుందరమగు ఉపమ - గవాక్షవివరముల శీతభానుని శిశిరామృతకిరణములు ప్రసరించుచున్నవి. ఆనందప్రదములుగదా! యని యక్షిణి ఎప్పటివలెనే వెన్నెల కెదురేగినది. పాపమా శీతకిరణము లామె విరహతాపము నుద్దీపింపజేసినవి. చంద్రకిరణములు సహజముగ సుఖదాయకము లైనను విరహులకు తాపహేతువులుగదా! ఆమె నేత్రములు అశ్రుపూరితములైనవి. కనురెప్పలు బరువెక్కి ముకుళితమైనవి. అప్పటి ఆమెస్థితి మేఘావృత్తదినమున వికసించక ముకుళించకయున్న స్థలపద్మినివలె నున్నదట! మేఘావృత్తమగుట సూర్యకిరణస్పర్శకు దూరమై పద్మిని వికసించను లేదు. పగలగుట ముకుళించను లేదు. తద్విధమున యక్షకాంత ఆనందరాహిత్యమున ఉల్లాసము దక్కి మేఘచ్ఛన్నదివసమున అవికసిత అముకుళిత పద్మినివలె చెన్నుతఱిగి యున్నదట! కవిసార్వభౌముడు కాళిదాసుని వర్ణన యిది. అతని కవితాహృదయ మిది. మహాకవి అమృతహృదయమున మొలకెత్తి వికసించిన పారిజాతకుసుమ మిది. కవిచంద్రుని హృదయ జలనిధిని ఉదయమందిన అనర్ఘరత్నమీ యుపమ.

రూపకాలంకారమున కొక యుదాహరణ -

యస్యాం యక్షాః సితమణిమయాన్యేత్య హర్మ్యస్థలాని
జ్యోతిశ్ఛాయాకుసుమరచితా న్యుత్తమస్త్రీసహాయాః,

చంద్రశిలలు పొదిగిన ప్రాసాదోపరిభాగములందు లలితవనితాసహాయులు లగుచు యక్షులు రత్యుద్దీపకమగు మధువును సేవించుచున్నారట. ఆ రమ్యహర్మ్యోప రిభాగములం దమరియున్న చలువరాళ్ల బ్రతిబింబించిన తారలు కుసుమములుగా రూపొందిన వట. ఇట జ్యోతిశ్ఛాయలు పూవులరూపు దాల్చినవట. ఎంత చక్కని రూపక మిది!

ఇక ఉత్ప్రేక్ష-

శఙ్కాస్పృష్టా ఇవ జలముచ స్త్వాదృశా జాలమార్గై

ర్ధూమోద్గారానుకృతినిపుణా జర్జరా నిష్పతన్తి. మే.దూ. II-9

జలదా! అలకాపురిని సప్తభూమిక (ఏడంతస్తుల) ప్రాసాదములు గలవు అం దుపరిభాగముల నినుబోలు నీరదములు వాయుప్రేరితము లగుచు లోని కేగి మెప్పుగా రచించిన చిత్తరువుల జలకణముల నొత్తి తదపరాధభయావిష్ట ములా యనునట్లు ధూమనిర్గమనానుకృతినిపుణములై శిథిలత్వమున గవాక్షముల నిర్గమించుచున్నవి. శఙ్కాస్పృష్టా ఇవ- సంకోచమొందినవా యనునట్లు. ఇ దెట్లున్న దన- దూతీసహాయమున గూఢమార్గమున అంతఃపురప్రవేశ మొంది అత్యాచార మొనర్చిన ధూర్తుడు అన్య లెదురగుదు రేమో యను శంక వొడమి అపరాధభయమున రూపు మార్చి క్షుద్రమార్గమున నిష్క్రమించున ట్లున్నదవి ధ్వనించుచున్నది. ఇక ప్రేయోఽలంకారమున కుదాహరణము--

జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానాం

జానామి త్వాం ప్రకృతిపురుషం కామరూపం మఘోనః,

తేనార్థిత్వం త్వయి విధివశాద్దూరబంధు ర్గతోఽహం

యాచ్ఞా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా. మే.దూ. I-6

జగత్ప్రసిద్ధమగు పుష్కలావర్తకవంశమం దుద్భవ మందినాడవు. ఇచ్ఛాధీన సంచారివి. దేవరాజునకు ప్రధానకార్యకర్తవు. సర్వజనవిదిత మిది. కనుకనే విన్నర్థించితిని. అభాగ్యుడను. విధివంచితుడను. ప్రేయసి నెడబాసితిని. నా యర్థిత్వము నీ వంగీకరించకున్నను అధికుడ వగుట యాచనాలాఘవమునకు తావు లేదు. అల్పుని జేరి యాచించి కృతార్థు డగుట కంటె అభిజాతునివలని అకృతార్థత మేలందురు గదా! అని యక్షుడు మేఘుని ఆభిజాత్యకామరూపత్వములను దేవరాజు ప్రధానకర్మచారిత్వమును ఉల్లేఖించి ప్రియవచనముల బ్రస్తుతించినాడు. 'ప్రేయః ప్రియతరాఖ్యానమ్' అని దండి.

ఇందలి ప్రధానరసము విప్రలంభశృంగారము. శాపఫలమగు ప్రవాసముచే నైన పతీపతుల (ప్రేయసీప్రియుల) వియోగవర్ణన ఇందు ముఖ్యవిషయము. మహాకవి పూర్వమేఘమున ప్రధానముగా ఉద్దీపకవిషయములను ప్రస్తావించి

ఉత్తరమేఘమున అలకానగరము యక్షగృహము యక్షిణిస్థితి వర్ణనీయములుగా గ్రహించి ప్రవాసానంతర సంభోగశృంగారరసపుష్ట్యర్థము విప్రలంభశృంగారమును అత్యంతరమణీయముగను హృదయంగమముగను వర్ణించినాడు.

'న వినా విప్రలంభేన సంభోగః పుష్టిమశ్నుతే,
కషాయితే హి వస్త్రాదౌ భూయాన్రాగో వివర్ధతే' - అని.

ఇందలి ధ్వనియు హృదయోల్లాసకరము. అంబుదధ్వని యట్లు ఈ కావ్యధ్వనియు గంభీరము, మర్మస్పర్శియు నై మనోహర మగుచున్నది. అసలు ధ్వనియే కావ్యమునకు ప్రాణ మని లక్షణజ్ఞు లందురు. యక్షు డేవిధముగ కర్తవ్యభ్రష్టు డాయెనో కనకవలయ మేరీతి పతన మొందెనో సహృదయులగు పాఠకులకే అవగతమగును. అత్యంత సంతప్త గ్రీష్మాంతమందు మేఘదర్శనమున మానవహృదయమున, అందును, ప్రణయినీప్రణయుల హృదయమం దెట్టి మధురభావము లంకురించెనో సహృదయహృదయములకు మాత్రమే విదితమగును. కావ్యధ్వని, ఛందోరీతులు, యక్షుని కరుణామయకంఠధ్వని మిళితమై యొక అపూర్వరమణీయకావ్యసృష్టికి ప్రోది చేసినవి. కమనీయకవితాకళాసృజనకు కారణమైనవి.

## మేఘదూతమందు ప్రకృతిచిత్రణము

అపూర్వకళాఖండమగు మేఘదూతకావ్యమునకు ఆధారము ప్రకృతి. ప్రకృతివర్ణనయే ఈ కావ్యమునకు జీవగట్టు. ఇందు రమణీయ ప్రకృతిచిహ్నము లెన్నియో కలవు. రామగిర్యాశ్రమవర్ణనతో కావ్య మారంభమగుచున్నది. అసలు హైందవ సంస్కృతి, సభ్యతలకు, ఆదర్శములకు నిలయములు అరణ్యమందలి ఆశ్రమములే కాని నగరములు గావు. కనుకనే ఆశ్రమవర్ణనతో కావ్య మారంభమగుట అన్నివిధముల ప్రశంసనీయము.

అట చల్లని వృక్షచ్ఛాయలు సురభిత సుమపుంజ సుశోభిత వనలతలు మధుర రసభరితములగు వనవృక్షములు గలవు. నిత్య నిర్మల జల సంపన్నములగు కందమూలాదులకు కఱవుండ దచ్చట. మఱియు హైందవసంస్కృతికి పతాకము, భారతనారీలోకమునకు తలమానికము, ఆదర్శప్రాయ, పూజనీయ, పుణ్యశీల, పావని, శ్రీరామపత్ని, జనకాత్మజ, జానకి స్నానపుణ్యోదకముల జెన్నొందు సెలయేరులు, దిగుడుబావులు అల్పసరస్సులు అం దలరారుచున్నవి. మేఘదూత పూర్వభాగ మిట్టి మధురప్రకృతిచిత్రణములతో నిండి సోయగములు వెలార్చుచున్నది. యక్షుడు మేఘు నుద్దేశించి చిత్రించిన మార్గవర్ణన హృదయంగమ మగుచు పఠితల హృదయము నుప్పొంగజేయుచున్నది. అందు ప్రకృతిరామణీయకము వెల్లివిరియుచున్నది. అది తిలకించిన సహృదయహృదయము ఆనందరసప్లావితము

గాక మానదు. అలకానగరమార్గమును నిర్దేశించుచు యక్షు డనిన మాటలు-

ఛన్నోపాన్తః పరిణతఫలద్యోతిభిః కాననామ్రైః
త్వయ్యారూఢే శిఖరమచలః స్నిగ్ధవేణీసవర్ణే,
నూనం యాస్య త్యమరమిథునప్రేక్షణీయా మవస్థాం
మధ్యే శ్యామః స్తన ఇవ భువః శేషవిస్తారపాణ్డుః. 1-18

జలదా! ఆమ్రకూటాద్రి పార్శ్వభాగముల బచ్చని పండ్లతో నిండిన చూత వృక్షము లావరింప ముచ్చట గొల్పుచున్నది. నీ వా సుందరాంగనల వేణీసవర్ణమగు గిరిశిఖర మధిరోహింప పుడమిపడతి కది చనుకట్టును బోలి సొరులు నింపుచున్నది. నలుదెసల గౌరవర్ణము! అగ్రమున శ్యామలము! ముచ్చటయగు నా దృశ్యము నవదంపతులకు నేత్రోత్సవము. సురదంపతుల కది కన్నుల విం దొనర్చును. ఇంకను-

వీచిక్షోభస్తనితవిహగశ్రేణికాఞ్చీగుణాయాః
సంసర్పన్త్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః,
నిర్విన్ధ్యాయాః పథి భవ రసాభ్యన్తరః సన్నిపత్య
స్త్రీణా మాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు. 1-29

నిర్వింధ్యానదీరమణీయతకు తద్విలాసప్రక్రియలకు కాళిదా సెంతయు మురిసి ముగ్ధుడై తన్మయత్వ మొందెను. నది అతనికి నదిగా గాక నాయికగా అగుపించినది. ఉజ్జయినీనగరమార్గమున నిర్వింధ్య ప్రవహించుచున్నది. అలల యలజడులకు కలవర మొనరించు హంసపంక్తి తన్నదికి కటిసూత్రప్రాయముగ సొరులు నింపుచున్నదట. నిమ్నోన్నతమగు ఉపలమార్గమున బ్రవహించుటం జేసి కటిస్పూర్తి మించుక సడల ఆవర్తరూపమున నాభి ప్రదర్శిత మగుచున్నదట! అవును మఱి! ప్రియసన్నిధానమున పడతుల హావభావవిలసితమగు విభ్రమమే గదా ప్రథమ ప్రణయ వచన మని మహాకవి భావన, సమర్థన. ఇంకను-

వేణీభూతప్రతనుసలిలా సా త్వతీతస్య సిన్ధుః
పాణ్డుచ్ఛాయాతటరుహతరుభ్రంశిభి ర్జీర్ణపర్ణైః,
సౌభాగ్యం తే సుభగ! విరహావస్థయా వ్యఞ్జయన్తీ
కార్శ్యం యేన త్యజతి విధినా స త్వయైవోపపాద్యః. 1-30

మహాకవి హృదయ కుహరమున మఱియొక మధురభావన ఉదయించినది. నిర్వింధ్య కాళిదాసున కిప్పు డొక పుణ్యశీల యగు విరహిణిగా అగుపించినది. విరహవేదనా వ్యాకులత కిది యొక విలక్షణచిత్రీకరణము. నిర్వింధ్యానదీపరీవాహ మిప్పు డొక యంగన వేణివలె కార్శ్యత్వ మొందినది. తీరస్థతరువుల

పండుటాకులు రాలి దాని నావహించిన కారణముగ తన్నదీశోభ పలచబడి పాలిపోయినట్లయినది. ఇట్లా నది విరహభారమున నలిగిపోయిన విరహిణి భంగి దీనవదనయై కాళిదాసు కట్టెదుట నిలచినది. అంత 'జలదా! నీవు ధన్యుడవు. ప్రోషితుడవు, ప్రియుడవు నగు నీ యెడబాటు నోర్వజాలమి నిర్వింధ్య విరహతాపమున కరిగి కరిగి కార్శ్యత్వము వెల్లడించుచున్నది. వర్షపాతమున నీ వామె హృదయతాపమును చల్లార్పవలదా? ఉల్లాసమున నుప్పొంగజేయవలదా? అని మహాకవి హృదయజలధిని మెదిలి మొలకలెత్తిన ఆణిముత్తెము లివి. రూపు దాల్చిన మధురభావన యిది. మహాకవి కాళిదాసుని చిత్తవృత్తి ఔచిత్యభంగకరములు కాని మనోభావముల నుద్దీపింపజేయు ప్రాకృతికరమణీయదృశ్యముల జిత్రీకరించు వైపునకే మిక్కిలి ఆకర్షితమగుచున్నది. అది హేతువుగ కాళిదాసు ప్రకృతిని ఊతగా ఆలంబనముగా గొని తన కావ్యమునకు నిండుదనము నిత్యనూతనత్వము సమకూర్చెను. చెదరని సౌందర్యము కల్పించెను. మానవస్వాభావికములగు ఆకాంక్షలు, ఆసక్తులు, అపేక్షలు, ఆశలను వమ్ముచేయక అనివార్యములగు వాటి కొక ఆశ్రయము కల్పించి ఆదరించెను. మఱియు మహాకవి--

దీర్ఘీకుర్వన్ పటు మదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః,
యత్ర స్త్రీణాం హరతి సురతగ్లాని మఙ్గానుకూలః
శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః. 1-32

శిప్రానదీసమీరమందున, ప్రణయవచనచతురుడగు ప్రేమికుని రూపకల్పన అత్యంతమనోజ్ఞము. అది యొక మహాకవికల్పిత చమత్కారము. ఉషఃకాలమున శిప్రానదియందలి మరాళపంక్తుల మధురధ్వనులు కర్ణపేయము లగుచున్నవి. ప్రఫుల్ల పద్మ పరిమళ గ్రాహకములగు శిప్రావాయువులు ఘ్రాణతర్పణము లగుచున్నవి. ఆ మధురమందసమీర మావిధమున లలితసుకుమార సారససంగీతమాధుర్యమును, కమనీయకమలసుగంధసౌరభమును గ్రహించి అత్యంతహృదయాహ్లాదకరముగ అల్ల నల్లన అంగముల స్పృశించుచు రతిపరిశ్రాంత లగు అంగనల యలసటలు దీర్చుచున్నది. కాళిదాసుని హృదయపాథోధిని ఉదయమందిన మధురతరంగ మిది. ప్రకృతిసౌందర్యము నుపాసించు మహాకవి కాళిదాసు అరూపమునకు రూపము, నిర్జీవమునకు జీవము కల్పించుటయందు సిద్ధహస్తుడు. అసమానప్ర జ్ఞాశాలి. ఆయన నదులకు స్వాధీనపతికా నాయికత్వము, మేఘపర్వతములకు దక్షిణ అనుకూల నాయకత్వము రూపకల్పన చేసి అపూర్వచమత్కారమును రూపొందించెను. ప్రకృతియందలి సామాన్యవిషయములగు నదీపర్వతాదులు కావ్యకళాభిజ్ఞు డగు కాళిదాసుని హస్తలాఘవమున అత్యంతమహత్త్వపూర్ణముగను, రమ్యముగను రూపాంతర మొందినవి.

ఇక ఉత్తరమేఘము అలకాపురివర్ణనతో నారంభమగుచున్నది. ఏతన్నగర

వర్ణనావసరమున మహాకవి కాళిదాసు ఒకే యొక శ్లోకమున ఋతుషట్కముయొక్క సౌభాగ్యగరిమను అత్యంతప్రతిభావంతముగ చిత్రించెను. అది యెట్లన-

హస్తే లీలాకమల మలకే బాలకున్దానువిద్ధం
నీతా లోధ్రప్రసవరజసా పాణ్డుతా మాననే శ్రీః,
చూడాపాశే నవకురవకం చారు కర్ణే శిరీషం
సీమన్తే చ త్వదుపగమజం యత్ర నీపం వధూనామ్. 2-2

అలకానగరమున సదా ఋతుషట్కసమావేశ మగుటచే, అచటి యంగనలు హస్తమున లీలాకమలము (శరదృతువు), కురుల మల్లెలు (హేమంతము), వదనమున లోధ్రపుష్పరాగము (శిశిరము), కేశపాశమున పచ్చగోరింట (వసంతము), కర్ణమున శిరీషము (గ్రీష్మము) నీ రాకను ప్రభవమొందిన నీపకుసుమము (వర్షర్తువు) పాపటిబొట్టుగా ధరించి హొయలు చిలుకుచున్నారు. ఇట్లా పూవుబోడులకు షడృతుసౌభాగ్యచిహ్నము లగు ఆ యా కుసుమములు సదా సన్నిహితములు.

ఇట్లా నగరమున ఋతుషట్క నిరంతరావస్థితి విలక్షణమగు కాల్పనిక నైపుణ్యమున సదా వికసితసుమపుంజములు, మధుపమధురనినాదభరితములగు పాదపములు, హంసమాలాపరివేష్టితములగు పద్మలతలు, పంచరంగుల పురులు విప్పి క్రేంకారధ్వనులు ఊతగా నృత్యములు సల్పు మయూరకదంబములు, చీకటుల జొరనీని ప్రసన్న ధవళ చంద్రికా దీప్తుల దీపించు నిశారమణీలలామరామణీయకము ఇవన్నియు సదా ముచ్చట గొల్పుచు ముద్దులు గూర్చుచున్న వచ్చట. ఏతద్విధమున, ఆ నగరము కమనీయ మధుర మంజుల చిత్రీకరణలతో నిండియున్నది.

## మేఘదూతమందు చరిత్రచిత్రణము

కావ్యమం దా యా పాత్రల చరిత్రచిత్రణమునకు విశేషప్రాధాన్యము కలదు. కావ్యకళాకుశలు డగు కవి తన కావ్యమందలి పాత్రల గుణవిశేషములను అత్యంతనైపుణ్యమున హృదయంగమ మగునట్లు జాగరూకుడై తీర్చిదిద్దును. పాత్రల గుణ - అవగుణములను బట్టియే పాఠకుని హృదయమున సానుభూతి గాని, ఏవగింపు గాని యేర్పడును. మేఘదూతము ఖండకావ్యము, అల్పకథానికయు నగుట అధికపాత్రల ప్రవేశమునకు తావు లేకున్నను ఉన్న మూడు పాత్రలు యక్షుడు, యక్షిణి, మేఘుడు పాఠకుల హృదయమున చెరగని ముద్రవేసినవి. ఆ పాత్రల చిత్రణము--

### యక్షుడు

శాస్త్రదృక్పథమున యక్షుడు ధీరలలితుడు, యువకుడు, కళాప్రియుడు.

ప్రేయసియం దత్యంతానురక్తుడు. దేవయోనిసంభవు డగుట కామచారి. కనుకనే అతని భౌగోళికపరిచయజ్ఞానము వాస్తవికము, గంభీరము నై యున్నది. సమర్థుడు, సూక్ష్మదర్శియు నగు పర్యటనశీలునివలె మేఘుని కాతడు మార్గమును నిర్దుష్టముగా నిర్దేశించుచున్నాడు. జీవితవిషయమున అతని దృక్పథము స్థిరము, ఆశాబద్ధమునై యున్నది. ఆ విషయ మీ క్రింద నిరూపితము.

క స్యైకాన్తం సుఖ ముపనతం దుఃఖ మేకాన్తతో వా
నీచైర్గచ్ఛత్యుపరి చ దశా చక్రనేమిక్రమేణ. 2-49

తన ప్రియకాంతకు యక్షు డంపు సందేశము ఆశాబద్ధమగు ఓదార్పు. 'ప్రియతమా! ధైర్యము సడలనీకు. కష్టసుఖము లేరికిని శాశ్వతములు గావు. అవి అస్థిరములు వచ్చుచు పోవుచు నుండును. చక్రనేమిక్రమమున అవి క్రిందుమీదుగా పరిభ్రమించుచుండును.' అని యోదార్పు. యక్షుని జీవనదృక్పథ మీ విధమున ఆశాబద్ధమైనది. అది యెంత దృఢమైనదో దీనిని బట్టి ఋజువగుచున్నది. విరహమం దతని ప్రేమాభినివేశము ప్రవృద్ధమైనదే గాని నిరాశచే నది నివృత్తి నందలేదు. ఈ దిగువ వాక్యమున అది స్పష్టము.

స్నేహానాహుః కిమపి విరహే ధ్వంసిన స్తే త్వభోగా
దిష్టే వస్తున్యుపచితరసాః ప్రేమారాశీభవన్తి. 2-52

ప్రేయసీ! అన్యోన్యవియోగమున ప్రేమ నష్టమగునని యెందు కనిరో తెలియకున్నది. అది సరి కాదు. భోగాభావమున అభీష్టవిషయమం దది ప్రవృద్ధమగుచు ప్రణయరాశిగా రూపొందుచున్నది. ఇదీ యక్షుని జీవనదృక్పథము.

యక్షుని వ్యావహారికజ్ఞాన మేమంత తక్కువ గాదు. మానవస్వభావపు లోతుపాతులు బాగుగా తెలిసిన విదగ్ధు డతడు. కనుకనే తన సందేశహరుడగు మేఘుని సోదరునిగా, మిత్రునిగా సంబోధించి తన భార్యను సోదరపత్ని (వదినె) గా భావింపుమని పరోక్షముగా సూచించు టతని గడుసరితనమును, వ్యావహారికజ్ఞానమును చాటుచున్నది. మఱియు అతనికి సంగీతచిత్రకళయం దభిరుచి యధికము. తాను స్వయముగా రచించిన సందేశమునే మేఘునిద్వారా తన ప్రియసతి కంపెను. మేఘుని వాక్యముచేతనే ఇది స్పష్టమగుచున్నది.

త్వా ముత్కణ్ఠావిరచితపదం మన్ముఖే నేదమాహ. 2-42

'ఓ యక్షపత్నీ! నీ కాంతుడు నిన్నుద్దేశించి ప్రణయోత్కంఠము (ప్రేమోద్వేగము)న తానుగా రచించిన పదబంధము (పదముల కూర్పు లేక వాక్యరచన) గల సందేశమును నానోట బలుకుచున్నాడు. మాట లతనివి. నేను నిమిత్తమాత్రుడను'. మేఘు డనిన పలుకు లివి. యక్షుడు తన ప్రేయసి చిత్తఱువు లిఖించుట మన

మిదివరకే గుర్తించితిమి. యక్షుని విరహకాతరత్వము, స్వాభావికకోమలత్వము పరికించిన మన కతనియెడ సహానుభూతి జనించుట సహజము.

## యక్షిణి

యక్షిణి కావ్యనాయిక. ఆమె అతిలోకసుందరి. ఈ క్రింది శ్లోకమున అమె రూప మెట్టిదో విదితమగుచున్నది. మహాకవి ఆమె రూపమును అత్యంతరమణీయముగా చిత్రీకరించెను.

తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబిమ్బాధరోష్ఠీ
మధ్యే క్షామా చకితహరిణీప్రేక్షణా విమ్నునాభిః,
శ్రోణీభారా దలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్ర స్యా ద్యువతివిషయే సృష్టి రాద్యేవ ధాతుః. 2-21

ఇదీ ఆమె రూపసంపద! చక్కని దేహసౌష్ఠవము, మాధ్యమికయౌవనము, పొందిక గల చక్కని పలువరుస, దొండపండు బోలు అరుణాధరోష్ఠము, లేదున్నదను నెన్నడుము, సోయగములు వెలార్చు చంచల దృగంచలములు, సొరులు నింపు లోతుపొక్కిలి, పిరుదుల బరువున ఒయారపు నడకలు, మేలిమి గబ్బిగుబ్బల బరువున సొంపు లొలుకు మేనువంపులు ఇదీ యక్షపత్నిరూపము. ఎంత అతిలోకసుందరము! అంతే కాదు. అంగనల సృష్టించు శుభసమయమున సృష్టికర్త ఒరవడిగా తీర్చిదిద్దిన ఒయ్యారముల మేలుబంతి యామె. ఒప్పులకుప్ప. పదియారువన్నె బంగారుబొమ్మ. గానవిద్యయం దామె నిపుణ. అదిగో! అటు! అంకమున వీణ జేర్చి, ప్రియనామాంకితములగు పదములు కూర్చి, గొంతు సారించి పాడ ప్రయాసపడుచున్నది.

ఉత్సఙ్గే వా మలినవసనే సౌమ్య నిక్షిప్య వీణాం
మద్గోత్రాఙ్కం విరచితపదం గేయ ముద్గాతుకామా,
తన్త్రీ మార్ద్రాం నయనసలిలైః సారయిత్వా కథంచిద్
భూయో భూయః స్వయమపి కృతాం మూర్ఛనాం విస్మరన్తీ. 2-25

ఆమె పావనచరిత. ప్రోషితభర్తృక గాన మలినవస్త్ర ఉబుసుపోకకు వీణ నెట్లో యొడిని జేర్చినది. ప్రియుని నామాంకితముగ గేయము ప్రస్తరించి యెలుగెత్తి మనసార గాన మొనరింప బ్రయత్నించినది. పాపము! ప్రియుని నామాంకిత మగుట ప్రియస్మరణమున నయనము లశ్రుపూరితము లైనవి. నేత్రజలముల తంత్రులు చెమ్మగిల్లినవి. కన్నీట దడిసిన వీణ తంత్రుల నెట్లో పరిమార్జన మొనర్చినది. కాని ప్రయోజనము! ప్రియస్మరణమున సమ్మోహ మడ్డు తగిలినది. తానుగా రచించిన మూర్ఛనను (స్వర ఆరోహణ అవరోహణ

క్రమము) ఆమె మరపున పాటించుటయే లేదు. అప్పటి ఆమె మానసికస్థితి యది. అది దయనీయస్థితి. మహాకవి మూర్తీభవించిన కారుణ్యదృశ్యము. రూపుదాల్చిన కరుణరసతరంగిణి యామె. కాళిదాసు సృష్టించిన యపురూపసృష్టి యది. పాఠకుని హృదయమును ఆర్ద్రి మొనరించు కరుణామయచిత్రణము.

తన్నిమిత్తముగ వీణావాదనమందును, పదముల కూర్పునందును, గాన మందును ఆమె ప్రవీణ యని తెల్లమగుచున్నది. చిత్రకళయందును ఆమె సిద్ధహస్త. విరహతాపపీడితుడగు ప్రియుని ప్రతిబింబమును ఊహించి భావానుకూలముగ చిత్రింప బూనుచున్నది. మఱియు విరహపీడిత యగు నామె మితభాషిణి, ఏకాకిని. యక్షుని పలు కిది -

తాం జానీథాః పరిమితకథాం జీవితం మే ద్వితీయం
దూరీభూతే మయి సహచరే చక్రవాకీ మివైకామ్. 2-22

జలదా! క్షణమైనను విడువనొల్లని సహచరుడనగు నేను ప్రవాసమున దూరస్థుడను కాగా ప్రియు నెడబాసిన చక్రవాకి పగిది ఆమె అత్యంతదుఃఖిత, ఏకాకిని. ఆశించిన ఆనందసౌధములు మధురస్వప్నములు శిథిలము కాగా జీవనమాత్రావశేషి యగు అభాగ్య యామె. ఆమె నా బహిఃప్రాణము. అంతే కాదు. నా ప్రాణమునకు ప్రాణము. ఆమెయే నా జీవితము. మఱియు-

పృచ్ఛన్తీ వా మధురవచనాం శారికాం పఞ్జరస్థాం
కచ్చిద్భర్తుః స్మరసి రసికే త్వం హి తస్య ప్రియేతి. 2-24

'మిత్రమా! నీ వట జేరునపుడు మత్ప్రియసతి, 'శారికా! అనుక్షణము నీ క్షేమ మఱయు నా స్వామిని నీ వెప్పుడైన స్మరించుచుంటివా! సదా నీవు ఆయనకు మోద మొనగూర్చు ప్రేమపాత్రవు గదా! అని పంజరస్థశారికను ప్రశ్నించుచునైన నుండవచ్చును. లేక ముంజేతి రత్నకంకణ లలితమంజుల ధ్వనుల తాలమానములు కాగా పుత్రసదృశమగు గృహమయూరమును నృత్య మొనరింపుచునైన నుండవచ్చును. (2-18) అథవా ఆమె సుతనిర్విశేషముగ బెంచు బాలమందారవృక్షమునకు తానుగా నీరుపోయుచు నైన నుండవచ్చునని యక్షు డూహించి చెప్పుచున్నాడు. యక్షపత్ని ప్రణయమృదుమధుర సాధుశీలయే గాక నృత్యసంగీతసాహిత్యచిత్రకళలయందును ప్రవీణ. ప్రకృతిసౌందర్యమందును అనురాగిణి. మృదుమధురభాషిణి. సాధ్వి. పతివియోగమున ఆమె భోగవస్తుసం చయమును పరిత్యజించినది. ఇపు డామె నయనములు అంజనశూన్యములు. కుఱులు సంస్కారహీనములు. ఆమె మలినవసన. చెన్ను తఱిగిన కపోలములు. వన్నె మాసి పలుచబాఱిన మేను. పుడమిపై పడక. నిద్ర లేమి. సుఖము శూన్యము. ఆమె వ్రతము బ్రతుకు అట్టిది.

తాముని్నద్రా మవనిశయనాం సౌధవాతాయనస్థః.

భవనగవాక్షము నుండి ఆమెను గమనించుము. నిద్రకు దూరమైనది. పర్యంకమును వీడి అవనిపైననే యామె పడక. పతియందు దైవమును వీక్షించు పడతియొక్క నడవడిక తీరువది.

ఇవ్విధమున కావ్యనాయిక యక్షకాంత రతిసుఖమునకు దూరమై పతి నెడ బాసి, పతివ్రత యగు ఉత్తమగృహిణిగ పతివాల్లభ్యమున ఉత్కటప్రేమమూర్తిగ రూపొందినది. రూపు దాల్చిన ప్రణయమూర్తి యగు ఆమెను జూచిన పఠితల హృదయమందు ప్రేమకరుణసహానుభూతు లుదయమందు టబ్బురము గాదు.

మేఘుడు

మేఘదూతకావ్యమున మేఘుడు వార్తాహరుడగు దూతగా రూపొందించబ డినాడు. మేఘుని దూతగా వంపు టసంగత మని భావించినను కవికథనమున-

యక్షశ్చక్రే జనకతనయాస్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు. 1-1

యక్షునికి ఏకత్ర ఉనికి లేదు. ఉన్మాదావస్థ. స్థిరుడు కాడు. స్తిమిత మెఱుగడు. ఇటు అటు తిరుగుచున్నాడు. ఇట్టి దశయం దతనికి చేతనాచేతనవివేక మెట్లుండును? అట్టి పట్టున వివేక మంతరించు టబ్బురము గాదు. కాన ప్రియపతికి మేఘు నుద్దేశించి పందేశ మంపగోరుట సంగతవిషయ మనిపించదు.

కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు. 1-5

కామపీడితులు స్వాభావికముగా అవివేకులు, వివేకహీను లగుట దీనులు. ఇది యుక్తము అయుక్తము అను జ్ఞాన మెక్కడిది? అని ప్రశ్నించుచు మేఘుని దూతగా పంపుట యందలి అనౌచిత్యమును కవియే పరిహరించుచున్నాడు. ఇక దూతకు ఉండవలసిన గుణసంపత్తి-

బ్రహ్మచారీ బలీ ధీరో మాయావీ మానవర్జితః,
ధీమా నుదారో నిశ్శఙ్కో వక్తా దూతః స్త్రియాం భవేత్.
దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్రవిశారదమ్,
ఇఙ్గితాకారచేష్టజ్ఞం శుచిం దక్షం కులోద్గతమ్.
అనురక్తః శుచిర్దక్షః స్మృతిమాన్ దేశకాలవిత్,
వపుష్మాన్ వీతభీర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే.

అసామాన్యప్రతిభావంతుడగు మహాకవి కాళిదాసు మేఘునియం దీ శుభ లక్షణములను పొందుపఱచెను. మేఘు దున్నతవంశసంభూతుడు.

దేవేంద్రుని కొలువుకూటమున ప్రధానకర్మచారి. ఏరూపమునైన ధరింప సమర్థుడు. సంతప్తులకు సహాయపడగల ఉదారగుణసంపన్నుడు. కర్షకుల కతడు జీవితాలంబనము. అతని హృదయము కారుణ్యజలపూరితము. అంగనలయెడ అత డత్యంతసత్ప్రవర్తనాశీలుడు. అత డీశ్వరభక్తుడు. కనుకనే మహాకాళాలయమున పూజాసమయమునం దతడు పటహధ్వని సలిపి ధన్యుడగుచున్నాడు. శివచరణన్యాసతీర్థమును ప్రవేశించుట తడవుగా అత డా తీర్థరాజమున కభివాదన పూర్వకముగ ప్రదక్షిణ మాచరించుచున్నాడు. అవివాహితుడుగా డతడు. క్షణమైనను ఎడబాయని విద్యుదతని ప్రియసతి. ఉజ్జయినీనగరవనితలతో నతడు మేల మాడగలడు. ఎడ నెడ శరభముల యాక్రమణసమయమునను, సురయువతుల అనుచిత ప్రవర్తనసమయములందును గర్జించి పురుషోచితసాహసమును ప్రదర్శించకనూ పోలేదు. మఱియు మహాకవి సఖుడా! సౌమ్యుడా! సహృదయుడా! సోదరా! ఆప్తబాంధవా! యని యక్షుని నోట బలికించి మేఘుని యుదారచరితమును చాటుచున్నాడు.

## మేఘసందేశకావ్యమున నగరవర్ణన

ఈ కావ్యమున ఉజ్జయినీ - అలకానగరవర్ణనలు ప్రధానమైనవి. పూర్వమేఘమున ఉత్తరదిశకు పయనించు జలదునితో ఉజ్జయినీనగరమార్గ మించుక వక్ర(చుట్టు)మైనను, ఆ నగర గగనచుంబిత రమ్యహర్మ్యముల యందచందములను అచటి యంగనల సోయగములను హావభావవిలాసవైఖరులను చంచలవీక్షణ ప్రేక్షణములను వీక్షించక పోవలదనియు కన్ను లున్నందుకు ఫల మందవలయుననియు నొక్కి వక్కాణించుచున్నాడు.

వక్రః పన్థా యదపి భవతః ప్రస్థితస్యోత్తరాశాం
సౌధోత్సఙ్గప్రణయవిముఖో మా స్మ భూరుజ్జయిన్యాః,
విద్యుద్దామస్ఫురితచకితైర్యత్ర పౌరాఙ్గనానాం
లోలాపాఙ్గైర్యది న రమసే లోచనైర్వఞ్చితస్స్యాః. 1-28

ఉజ్జయినీనగరవైభవ మెట్టిదో ఊహించుట కీ క్రింది కవికథనము చాలు -

స్వల్పీభూతే సుచరితఫలే స్వర్గిణాం గాం గతానాం
శేషైః పుణ్యై ర్హృతమివ దివః కాన్తిమత్ఖణ్డ మేకమ్. 1-31

ఇక ఆ నగరసౌభాగ్య మెట్టిదన-

హారాం స్తారాం స్తరళగుటికాన్ కోటిశః శఙ్ఖశుక్తీః
శష్పశ్యామాన్ మరకతమణీ మున్మయూఖప్రరోహాన్,
దృష్ట్వా యస్యాం విపణిరచితాన్ విద్రుమాణాం చ భఙ్గాన్
సంలక్ష్యన్తే సలిలనిధయ స్తోయమాత్రావశేషాః. 1-33

ఉజ్జయినీ విపణివీథుల విక్రయార్థము ప్రదర్శించు శుక్తి ముక్తా ప్రవాళ రత్నాద్యనర్ఘ వస్తుసంచయమును పరికించినచో జలనిధులు తోయమాత్రావశేషములు గాక అందేమి మిగిలియుండు నని తోచుచున్నదట. మఱియు-

జాలోద్గీర్ణై రుపచితవపుః కేశసంస్కారధూపై
ర్బన్ధుప్రీత్యా భవనశిఖిభిర్దత్తనృత్యోపహారః,
హర్మ్యే ష్వస్యాః కుసుమసురభిష్వధ్వఖేదం నయేథా
పశ్యన్ లక్ష్మీం లలితవనితాపాదరాగాఙ్కితేషు. 1-36

వైభవోపేతమగు ఆ నగరప్రాసాదగవాక్ష నిర్గత మధుర కేశసంస్కార ధూపముల బుష్టి నొంది, లలితమంజుల మనోహరమయూరనృత్యము లుపహారము(కానుక)లు గాగ, ఆ దివ్యహర్మ్యముల కమనీయకుసుమరచనలు చూచి, సుగంధసౌరభము లాఘ్రాణించి, లాక్షారసరంజితములగు లలితవనితాపాదముద్రలు తిలకించి నగర సౌభాగ్యమును గుర్తించి, విశ్రాంతి గొనుమని హితవు. కేశసంస్కారధూపములు, మనోహరమయూరనృత్యములు, కుసుమరచనలు, సుగంధపరిమళములు, లాక్షారస రంజిత లలితవనితాపాదముద్రలు తన్నగరసౌభాగ్యచిహ్నములు. ఇంకను-

దీర్ఘీకుర్వన్ పటు మదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః,
యత్ర స్త్రీణాం హరతి సురతగ్లాని మఙ్గానుకూలః
శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః. 1-32

ఉజ్జయినీనగరమున సాంసారికసుఖసంతోషములు ప్రాకృతికసౌందర్యదృశ్యములు మిక్కుటములు. ప్రత్యూషమున శిప్రానదీ తటగతకలహంసకలకూజితము లతిశ యించి విరిసిన తమ్మిపూవుల మధుర పరిమళములు లలితమంజుల సారససంగీతములు సంగ్రహించి శీతల మంద మధుర గంధవాహములు రతిశ్రాంతలగు తన్నగరాం గనల అలసటలు తీర్చుచున్నవట. ప్రాకృతికసౌందర్యము సాంసారిక సౌఖ్యముల నోతప్రోతమగు ఆ నగరమున అభిసారికలు నిబిడాంధకారబంధుర మగు నిశాసమయమున ప్రియుల సంకేతస్థలముల జేరు విధానము-

గచ్ఛన్తీనాం రమణవసతిం యోషితాం తత్ర నక్తం
రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యై స్తమోభిః. 1-41

ఇవ్విధమున మహాకవి కాళిదాసు ప్రకృతిశోభ, సాంసారికవిభవములు, మాన వీయభావములను గుర్తించి ఉజ్జయినీనగరమును కన్నులపండువుగ అత్యంత రమణీయముగ చిత్రించి తీర్చిదిద్దుట మనము గమనించగలము. అదే విధముగ అలకానగరమును ఉదాత్తము, భవ్యము నగు రీతిని చిత్రీకరించుటయు మనము గమనించగలము. కైలాసము నధివసించియున్న అలకానగరిని గుఱించి యక్షుడు

మేఘుని కీ క్రింది విధమున పరిచయ మొనర్చుచున్నాడు -

తస్యోత్సఙ్గే ప్రణయిన ఇవ స్రస్తగఙ్గాదుకూలాం
న త్వం దృష్ట్వా న పునరలకాం జ్ఞాస్యసే కామచారిన్,
యా వః కాలే వహతి సలిలోద్గార ముచ్చైర్విమానా
ముక్తాజాలగ్రథిత మలకం కామినీ వాభ్రబృందమ్. 1-67

అలకానగరిని, కైలాసగిరిని నాయికానాయకులుగా ప్రేయసీప్రియులుగా చిత్రించి చక్కని ఉపమ కల్పించినాడు కవిసార్వభౌముడు కాళిదాసు. తన్నగరమందలి ఉన్నతసౌధములు, గానమాధుర్యములు, మంజులమనోజ్ఞమురజధ్వనులు, రత్నకంబళములు అన్నిటిని తలదన్ని ఒయ్యారములు పచరించు దివ్యాంగనల సోయగములు హృదయంగమముగ తీర్చిదిద్దబడినవి -

విద్యుత్వన్తం లలితవనితాః సేన్ద్రచాపం సచిత్రాః
సంగీతాయ ప్రహతమురజాః స్నిగ్ధగమ్భీరఘోషమ్,
అన్తస్తోయం మణిమయభువస్తుఙ్గ మభ్రంలిహాగ్రాః
ప్రాసాదాస్త్వాం తులయితుమలం యత్ర తైస్తైర్విశేషైః. 2-1

ఇందు మేఘప్రాసాదముల అన్యోన్యసాదృశ్యము ఆ యా విశేషములతో జక్కగా సమగ్రముగా చిత్రీకరించబడినది.

మఱియు, ఋతుషట్కమునకు సంబంధించిన కుసుమములు సదా లభ్యమగుట ఆ నగరాంగనలు సదా సర్వాంగసుందరముగ అలంకరించుకొని పొంగిపోదురు.

హస్తే లీలాకమల మలకే బాలకున్దానువిద్ధం
నీతా లోధ్రప్రసవరజసా పాండుతా మాననే శ్రీః,
చూడాపాశే నవకురవకం చారు కర్ణే శిరీషం
సీమన్తే చ త్వదుపగమజం యత్ర నీపం వధూనామ్. 2-2

ఆ నగరాంగనలను రత్నభూషణభూషితలుగా చిత్రించక సహజకుసుమాలంకృతల జేసి ప్రకృతి ప్రసాదించిన సహజకోమలకమనీయకుసుమములయందే ఆ మగువలకు మక్కువ ఎక్కువని మహాకవి నిరూపించినాడు. మఱియు మహాకవి తన్నగరమున చిత్రించిన ప్రాకృతికరమణీయదృశ్యములు దర్శనీయములు మఱికొన్ని గలవు -

యత్రోన్మత్తభ్రమరముఖరాః పాదపా నిత్యపుష్పాః
హంసశ్రేణీరచితరచనా నిత్యపద్మా నళిన్యః,
కేకోత్కణ్ఠా భవనశిఖినో నిత్యభాస్వత్కలాపా
నిత్యజ్యోత్స్నాః ప్రతిహతతమోవృత్తిరమ్యాః ప్రదోషాః. 2-3

ఉదాత్తసమృద్ధమైన అలకానగరవర్ణన ఇది. ఉజ్జయినీ - అలకానగరములకు సామ్యము లనేకము. అలకానగరమున అచ్చరలేమలు పణ్యాంగనలు. ఉజ్జయిని యం దన్ననో రూపాజీవిక లగు వేశ్యలు. వారు మహాకాళమందిరమున చామరనృత్య మొనర్తురు. పశుపతినాథ పూజావిధాన ముభయత్ర సమానము. ఉజ్జయినియందు సాయంసమయమువ పూజాదికము పరిసమాప్తి నొందినంతనే పటహవాద్యము. అలకానగరిని గానముతోడి మురజధ్వని. అలకానగరమున బాలబాలికలు స్వర్ణవాలుకల గుప్తమణిక్రీడల వినోదింతురు. ఉజ్జయినియందన్ననో సుదతులు గంధవతీనదీతరంగముల నోలలాడుచు ప్రొద్దు పుచ్చెదరు. అలకానగరమున చంద్రకాంతశిలావేదికలు రతిశ్రాంత లగు మగువల అలసటలు పోద్రోలును. ఉజ్జయినియం దన్ననో ప్రభాతమున వికసించు కమలగంధ మూని ప్రసరించు శిప్రావాయువు రతిపరిశ్రాంతలగు అంగనల సురత గ్లాని నపనయించును. ఇట్లుభయనగరములకు పోలిక లగుపడుచున్నవి.

## మేఘదూతమున కనుకరణములు-

మేఘదూతము సుసంపన్నము, మధురము, ప్రౌఢము, ఉజ్జ్వలము, సాహితీసౌరభోపేతము నగుట విశ్వసాహిత్యమున దీని యనుకరణము లెన్నియో వెలువడినవి. ప్రాచ్యకవుల యనుకరణములే అష్టాధికశతముగా నగపడుచున్నవి. అందు 12వ శతాబ్దికి చెందిన ధోయికవి విరచితమగు పవనదూతము, 13వ శతాబ్దికి జెందిన వేదాంతదేశికకవి రచిత హంససందేశము, 15వ శతాబ్దికి చెందిన కృష్ణానందసార్వభౌముని పదాంకదూతము ప్రసిద్ధములు. మఱియు 14వ శతాబ్దివాడైన ఉద్దండుని కోకిలసందేశము, జైనపండితుడు మేరుతుంగకవి రచించిన జైనమేఘదూతము, 17వ శతాబ్దికి చెందిన దేవీచంద్రుని పవనదూతము, 18వ శతాబ్దీయుడగు వైద్యనాథసూరి తులసీదూతము ప్రసిద్ధములే. అయినను కవికులతిలకుడు కాళిదాసుని మేఘదూత మందలి కమనీయత, కర్ణపేయత, నిత్యనూతనత ఇత్యాదిగుణవిశేషము లేవియు వీనియందు కానరావు. కాళిదాసుని కావ్యకళానైపుణ్యము అతిలోకము, విలక్షణమునై యున్నది. దాని కొక ప్రత్యేకత గలదు. దాని కదియే సాటి. దానికి పోలిక లమరవు. సంస్కృతసాహిత్యమున అత్యంతప్రతిభాశాలియు నాటకకర్తయు నగు 'ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' అని సాహిత్యసమీక్షకులచే శ్లాఘించబడిన భవభూతియు తన మాలతీ మాధవప్రకరణ మందు మేఘునిద్వారా మాధవునిచే పంపించిన సందేశమందు మేఘదూతముయొక్క ఛాయలు నింపకపోలేదు.

అంతే కాదు. అనుకరణకావ్యములందు మేఘదూతముయొక్క శ్లోకపాదము గాని పంక్తిగాని. సమ్మిళితములు గావింపబడుట కారణముగ కావ్యప్రతిష్ఠ ఇనుమడించుటయే గాక ఇందలి శ్లోకములు సురక్షితములైనవి. ఇవ్విధమున

భరతవర్షముననే గాక ప్రాచ్యపాశ్చాత్యదేశములందును ఏతత్కావ్యానుకరణముచే కావ్యప్రతిష్ఠ పెంపొందుట విదితమగుచున్నది. 18వ శతాబ్దమున జర్మను కవి శీలరు మేఘదూతకావ్యము ననుకరించుచు 'మారియా స్టూవర్టు' అను కావ్యమును రచించెను. అందు నిర్బంధితురాలగు రాణి తన యౌవనమును సౌఖ్యావహముగ గడిపిన ఫ్రాన్సుదేశమునకు మేఘునిద్వారా కృతజ్ఞత నందజేయగోరినది.

## మేఘసందేశ కావ్యవిశిష్టత

ఏతత్కావ్య మల్పమైన దయ్యును సర్వాంగ సుందరము, విపులార్థబోధకము, ప్రకృతిసౌందర్య ప్రదర్శకము, శృంగారరస భూయిష్ఠము, హృదయరంజకము, వర్ణనావైశిష్ట్యశోభితము, శిక్షాగర్భితము నగు అనర్ఘకావ్యరత్నము. ఏతత్కావ్యమున దోషము తక్క కల్పనాప్రాచుర్యము, రచనాచాతుర్యము, భావగాంభీర్యము, అలంకారసౌందర్యము, శబ్దమాధుర్యము, రసోత్కర్షము మున్నగు సుగుణము లన్నియు పుష్కలముగా గలవు. ఇందు పర్వతములు, నదీనదములు, దేశములు, ప్రాంతములు ఇత్యాదుల వర్ణనచే అపూర్వమగు ప్రాకృతిక సౌందర్య చిత్రణము లెన్నియో అత్యంతరమణీయముగా, హృదయంగమముగా చిత్రీకరించబడినవి. మరియు తీర్థములు, పుణ్యస్థలముల ఉదాత్త - ఉత్కృష్టవర్ణనలును గలవు. యక్ష కాంతవియోగవ్యాజమున పాతివ్రత్యధర్మమును , గార్హస్థ్యసుఖసారమగు దాంపత్య అన్యోన్యానురాగములు ఇందు సూచితములు. ఉన్నతభావనాత్మకశృంగారప్రాచు ర్యము ప్రదర్శితమైనంతమాత్రమున ఇది శృంగారమయకావ్య మెంతమాత్రమును గాదు. వాస్తవ మేమన ఈ కావ్యమున కాంతాసమ్మిత (కోమలమధురమనోహర) శబ్దము ద్వారా లౌకికవ్యవహారోపయుక్త మగు అలౌకికశిక్షణ గరపబడుచున్నది. కావ్య మల్పమైనను ఇది కావ్యకళాప్రియులకు హృదయంగమ మగుటయే గాక విద్యార్థులకును శిక్షాదాయకము, మనోరంజకము నగుట అత్యంతసమాదరణీయము.

మేఘదూతమును బోలు మనోరంజకము, శిక్షాగర్భితము, కవిపండిత సమాద రణీయము, సర్వజనసమ్మతము నగు కావ్యమును రచించుట కవికుల చూడామణి యగు కాళిదాసుని అసాధారణప్రతిభాశక్తికే సాధ్యమగును. మేఘదూతము యొక్క కర్తవ్యబోధకము, మనోరంజకము నగు కవితాసౌందర్యమునకు ముగ్ధుడై ఆర్యాసప్తశతీకారుడు గోవర్ధనాచార్యు డనిన పలుకులు స్మరణీయములు-

సాకూతమధురకోమలవిలాసినీకణ్ఠకూజితప్రాయే,
శిక్షాసమయేఽపి ముదే రతిలీలాకాళిదాసోక్తీ.

అభ్యాససమయముననను ఆనందదాయక మగునవి రెండే రెండు విషయములు. ఒకటి భావపూరితము, మధురము, కోమలము నగు విలాసినీకంఠకూజితప్రాయము (వాఙ్మాధుర్యప్రాచుర్యము గలది) అగు కాళిదాసుని కమనీయతకవిత. రెండవది

భావగర్భితము, మధురము, కోమలము నగు కంఠనాదము(ధ్వని) గల జవ్వని, విలాసిని, కామిని యగు కోమలియొక్క రతిలీల.

ఇక భరతముని వచనానుసారము వర్షఋతువునందు వర్ణనీయవిషయములు-

కదమ్బనిమ్బకుటజైః శాద్వలైః సేన్ద్రగోపకైః,
మేఘైర్వాతైః సుఖస్పర్శైః ప్రావృట్కాలం ప్రదర్శయేత్.
మేఘౌఘనాదగమ్భీరైర్ధారాప్రపతనైస్తథా,
విద్యున్నిర్ఘాతఘోషైశ్చ వర్షారమ్భం సమాదిశేత్.

అని నాట్యశాస్త్రము. కదంబనింబకుటజములు, శాద్వలములు, ఇంద్రగోపకములు, మేఘములు, స్పర్శసుఖదాయకము లగు పవనములు వర్షఋతుసూచకములు. మేఘపరంపర, గంభీరగర్జనలు, ధారాపాతవర్షములు, మెఱుపుల యురపిడులు, పిడుగుపాటులచే వర్షారంభము వ్యక్తమని భరతముని నాట్యశాస్త్రము.

ఉపర్యుక్తవిషయములను కాళిదాసు చిత్తాకర్షకముగ అభివర్ణించినాడు. మేఘమండలమునుండి అగుపించు ప్రాకృతికదృశ్యవైచిత్ర్యము పురాణేతిహాసములందలి నదీనదములు, పుణ్యతీర్థస్థలమాహాత్మ్యములు, హిమాలయనగాదిసృష్టివైచిత్ర్యవైభవములు ఇత్యాదులను కాళిదాసు యథాతథముగ చిత్రించి మన కన్నులయెదుట సాక్షాత్కరింప జేసినాడు. ఉజ్జయినీ అలకానగర అద్వితీయశోభావర్ణన అన్యాన్యస్థలప్రసంగముల కమనీయవర్ణనములచే నీ కావ్యముయొక్క శోభ మఱింత హెచ్చి నిరుపమానమైనది. మఱియు యక్షపత్నియొక్క హృదయవిదారకమగు విరహావస్థ కరుణరసాత్మకమగు యక్షుని సందేశవర్ణన హృదయమును ద్రవీభూతమొనర్చును. యథార్థమునకు ఏవంవిధ కాల్పనిక ఆనందమయప్రపంచమున యథేచ్ఛగా విహరించు నధికారము మేఘదూతరచయితవంటి మహాకవికే చెల్లును.

మరాఠీపండితుడు విష్ణుకృష్ణశాస్త్రి యథార్థమునే వక్కాణించెను. కాళిదాసుయొక్క ఇతర రచన లుపలబ్ధములు గాకున్నను మేఘదూత మొక్కటియు సాహిత్యసంసారమున నిలిచియున్నంతదనుక ఆయన స్థానము మహాకవుల ప్రథమపంక్తి యొక్క ప్రథమస్థానముననే పదిలపరుపబడి యుండును. ఈ కావ్యకథాసూత్రసాధనసంపత్తి కవి కల్పనాశక్తియొక్క ఉదాత్త ఉత్కృష్ట హృదయంగమ భావనాపరంపరలు మాత్రమే. ఏతత్కావ్యకథ నితాంతసరళమైనను చమత్కారజనకము. ఏతాదృశరసస్ఫోరక కల్పనామాధురీలసిత - కథాత్మకమగు కావ్యము సంస్కృతసాహిత్యమున మాత్రమే గాక బహుభాషావ్యాపృత మగు విస్తృతవిశ్వసాహిత్యమున గూడ అలభ్యము, ఇత్యాది.

స్వనామధనుడగు మహావీరప్రసాద్ ద్వివేదియు మేఘదూతకావ్యవిషయమున వెలిబుచ్చిన అభిప్రాయము - 'మహాకవి కాళిదాసు తన మేఘదూతకావ్యమున

ఆదర్శప్రేమను చిత్రించినాడు. దాని నతడు సవిశేషముగను, హృదయంగమముగను, యథార్థతావ్యంజకముగను నిరూపించుటకుగాను యక్షుని కావ్యనాయకుని జేసి తన కవితాకౌశలమునకు పరాకాష్ఠను సమకూర్చెను. నిస్స్వార్థము నిర్వ్యాజమునగు ప్రేమయొక్క చిత్రీకరణము మేఘసందేశకావ్యమున దక్క మరెందును, ఏ భాషయందును ఏ కావ్యమందును అగపడదు. మేఘదూతకావ్యనాయకు డగు యక్షుని ప్రేమ నిర్దుష్టమైనది. పవిత్రమగు నిట్టి ప్రేమ ఎట్టి కార్యమునైనను సాధించగలదు. ప్రేమవలన జీవితము పవిత్రమగును. ప్రేమవలన జీవితమున కొక అలౌకిక సౌందర్యము సమకూడుటయే గాక సార్థకత యేర్పడును. మానవప్రేమ వలననే ఈశ్వరప్రేమ జనించుచున్నది. కావున కాళిదాసుని మేఘదూత శృంగారకరుణరసాత్మకము, రసపరిప్లుతము అయినను ఉదాత్తమగు ప్రేమ కది సజీవమగు ఉదాహరణము (రఘువంశ భాషానువాదభూమిక).

## మేఘసందేశమందలి భౌగోళికశబ్దపరిచయము

అలక - కైలాసమందలి యక్షనగరము. తత్సమీపముననే మానససరోవరము. నే డచ్చట ఏతన్నగరచ్ఛాయ లేమియు అగపడవు. 1-7.

అవంతి - ఆధునిక మాళ్వదేశపు పశ్చిమభూభాగము. ఉజ్జయిని దీని రాజధాని. 1-31.

ఆమ్రకూటము - అమరకంటక మనియు నందురు. 3498 అడుగుల యెత్తు. మధ్యభారతము. నర్మదానది పుట్టుక ఇచ్చటనే. 1-17

ఉజ్జయిని - మాళవరాజధాని. అవంతి, అవంతిక, విశాల అనియు నందురు. నేడు దీనిని ఉజ్జయిని అందురు. ఆనాడు భరతఖండమందలి అయోధ్య మున్నగు సప్త నగరములలో నిది యొకటి. 1-25

కనఖలము - హరిద్వారసమీపమందలి తీర్థస్థల మిది. దీనిగురించి స్కాంద పురాణ మిట్లు చెప్పుచున్నది - 'ఖలః కో నాత్ర ముక్తిం వై భజతే తత్ర మజ్జనాత్' అని. 1-54

కురుక్షేత్రము - స్థాణ్వీశ్వర్ (థానేసర్) నకు ఆగ్నేయదిశనున్న విశాలమైదానము. మహాభారతయుద్ధ మిచ్చటనే జరిగిన దందురు. 1-52

కైలాసము - హిమాలయ ఉత్తరభాగమం దున్నది. ఎత్తు 20 వేల అడుగులు. పురాణములయం దిది దేవభూమి యని వర్ణించబడినది. దీని దక్షిణభాగమున మానససరోవర మున్నది. ఇది శంకరుని ఆవాసస్థల మని ప్రసిద్ధి. 1-11

క్రౌఞ్చరంధ్రము - హిమాద్రిమీదుగా కైలాసము దెస మానససరోవరమునకు బోవు ఇరుకైన పర్వతమార్గము. బహుశః నేటి 'లిపూలేఖ' మార్గమున కిది పూర్వనామము గావచ్చును. కార్తికేయుడు క్రౌఞ్చపర్వతమును ఛేదించెనని పురాణకథనము. 1-61

గంధవతి - ఉజ్జయినిసమీపమున ప్రవహించుచు శిప్రానదిని జేరుచున్నది. 1-37

గంభీర - మాళవదేశమున బ్రవహించు ఒకానొక నది. శిప్రానది కిది యొక పాయ. 1-44

చరణవ్యాపము - హరిద్వారసమీపమందలి పర్వతసోపానమార్గము. దీనిని ఈశ్వరుని కాలిబాట (పాద ముంచిన చోటు) యందురు. 'ఇది పాదముంచిన చోటు కాదు. చరణన్యాసము కైలాసపర్వతప్రాంతమం దుండుట సంభవ' మని కొందరి భావన. 1-59

చర్మణ్వతి - ఇది వింధ్యపర్వతవాయవ్యకోణమం దుద్భవించినది. దీని ఆధునిక నామము చంబల్. రాజస్థానమందలి ప్రసిద్ధనగరము (కోటా) ఈ నదియొద్దుననే యున్నది. రాజా రంతిదేవుని 'గజాలమ్బ' యజ్ఞమునుండి ఉద్భవించినదని పురాణగాథ. 1-49

జాహ్నవి - హిమాలయమందు గంగావతరణమును గంగోత్రి యందురు. అందుద్భవించిన మహానది. గంగ, భాగీరథి అనియు పిలువబడుచున్నది. 1-54

దశపురము - చర్మణ్వతీనదికి ఉత్తరభాగమం దున్న పురాణప్రసిద్ధమగు రంతిదేవుని నగరము. దీని యాధునికనామము మన్దసోర్. కొందఱు దీనిని ధోల్‌పూర్ అనియు బేర్కొందురు. 1-51

దశార్ణము - మాళవదేశ పూర్వభాగము. దీని రాజధాని విదిశా (ఆధునికనామము భిలసా) నగరము. ఏతత్క్షేత్రమందు వేత్రవతీ (భేతసా) నది ప్రవహించుచున్నది. కొందఱు ఆధునిక (ఛత్తీస్‌గడ్) ను దశార్ణమని భావింతురు. 1-24

దేవగిరి - ఉజ్జయిని - మన్దసోర్ నడుమ నున్న ఆధునిక దేవగడ్. దీనిని దౌలతాబాద్ అనియు పిలుతురు. 1-46

నిర్వింధ్య - వింధ్యయం దుద్భవించినది. మాళవదేశమున బ్రవహించు పార్వతీ నదియే నిర్వింధ్యానది యని కొందఱి యోచన. 1-29

నీచైర్గిరి - ఇది విదిశాసమీపమందలి ఒకానొక పర్వతమై యుండనోపు. ఉదయగిరియే నీచైర్గిరి యని కొందఱి మతము. 1-26

| | | |
|---|---|---|
| బ్రహ్మావర్తము | - | సరస్వతీదృషద్వతీనదుల మధ్యభాగ మిది. నేడు కాన్పూర్ సమీపమందలి 'బిఠూర్' నే బ్రహ్మావర్త మనుచున్నారు. 1-52 |
| మానసము | - | కైలాసమున బ్రహ్మచే నిర్మితమైన సరోవరము. నేడది మానససరోవరమని వ్యవహరింపబడుచున్నది. 1-11 |
| మాల | - | ఛత్తీస్‌గఢ్‌కు సంబంధించిన 'రతన్‌పూర్' నగరసమీపమందలి మాల్డాప్రదేశమును 'మాల' యనుచున్నారు. 1-16 |
| యమునా | - | ఉత్తరభారతమున మిక్కిలి ప్రసిద్ధి నందినది. హిమాద్రి నుదయించి ప్రయాగయందు గంగను కలియుచున్నది. 1-55 |
| రామగిరి | - | మధ్యప్రదేశమందలి రామగఢ్‌ను రామగిరి యందురు. మల్లి నాథుడు దీనిని చిత్రకూటమని భావించెను. కొందఱు నాగపుర సమీపమందలి 'రామ టేక్' పర్వతమును రామగిరి యందురు. 1-1 |
| రేవా | - | నర్మదానదికి నామాన్తరము. వింధ్యాచలపూర్వభాగమున మేఖల (అమరకంటక) పర్వతమున జనించినది. చాల నిడివి కలది. 1-19 |
| వననది | - | మాళవమున బ్రవహించు ఒకానొక నది. దీనిని (వేస్) అనియు బిలుతురు. ఇది భిలసా (విదిశా) సమీపమున బేతవానదితో గలియుచున్నది. కొందఱు దీనిని శిప్రానదితో గలియు పార్వతీనది యందురు. 1-27 |
| విదిశా | - | దశార్ణదేశపు రాజధాని. నేడు దీనిని 'భిలసా' యని పేర్కొనుచున్నారు. 1-25 |
| వింధ్య | - | ఆర్యావర్త దక్షిణ భారతములనడుమ నున్న పర్వతమిది. కులపర్వతము లేడింటిలో నిది యొకటి. 1-19 |
| విశాల | - | ఉజ్జయినికి మారు పేరు. |
| వేత్రవతి | - | ఆధునిక బేతావానది. వింధ్యాచల ఉత్తరభాగమునపుట్టి మాళవ ప్రయాగల నడుమ భూముల నాప్లావిత మొనర్చి యమునతో గలియుచున్నది. 1-25 |
| శిప్ర | - | ఉజ్జయినియందు ప్రవహించుచున్నది. గంధవతీ గంభీరాన దులు దీని ఉపనదులు. 1-32 |
| సరస్వతి | - | హిమాద్రియం దుద్భవించి కురుక్షేత్రవాయవ్యమున ప్రవ హించినది. కాని నేడది లుప్తమైనది. 1-53 |
| సింధు | - | ఇది మాళవమున బ్రవహించు కాళీ సింధునది. చంబలనది కిది యొక శాఖ. 1-30 |

హిమాలయము - భారతదేశమున కుత్తరదిశను రమారమి 2500 కి.మీ. నిడివి 5000 కి.మీ. వెడల్పున విస్తరించి ప్రపంచప్రఖ్యాతి నందిన పర్వత మిది. దీని ఉన్నతశిఖరము (గౌరీశంకర్) 8720 మీటర్ల యెత్తు. 1-56

మహాకవి శ్రీకాళిదాసవిరచిత

# మే ఘ సం దే శ ము

ప్రతిపదార్థ విపులభావ వివరణాత్మకమగు
సుజనమనోరంజనీనామక
ఆంధ్రవ్యాఖ్యా సముపేతము

మేఘసందేశ పూర్వభాగ మను

# ప్ర థ మ స ర్గ

శ్లో. కశ్చిత్కాన్తావిరహగురుణా స్వాధికారాత్ ప్రమత్తః
శాపే నాస్తంగమితమహిమా వర్షభోగ్యేన భర్తుః,
యక్షశ్చక్రే జనకతనయాస్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు.

సుజనమనోరంజనీవ్యాఖ్య

మాతాపితృభ్యాం జగతో నమో వామార్ధజానయే,
సద్యోదక్షిణదృక్పాతసంకుచద్వామదృష్టయే. (1)

ఆదిదంపతులు, జగన్మాతాపితలు ఆధ్యాత్మికసంపద్విలసిత ప్రణయమూర్తులు, ఎడమెఱుంగని పుణ్యదంపతులు, అర్ధనారీశ్వరులని గదా యందురు. ఎడమభాగము సతి పార్వతి, కుడివైపు ఈశ్వరుడు. శంకరుని దక్షిణవీక్షణము ప్రణయభావమున ఉత్తరమునకు ప్రసరింప, అది గమనించిన గౌరి వామనేత్రము వెంటనే ప్రణయమున నమ్రతాసూచకముగ కుంచితమైనది. భారతసంస్కృతీప్రతీకలగు ఆ చూపుల దోబూచులకు నమ్రభావమున ప్రణతు లర్పింతును.

అన్తరాయతిమిరోపశాన్తయే శాన్తపావన మచిన్త్యవైభవమ్
తన్నరం వపుషి, కుఞ్జరం ముఖే, మన్మహే కిమపి తున్దిలం మహః. (2)

విఘ్నతిమిర (చీకటి) మంతరించుకొఱకు శాంతము, పావనము, ఊహించరాని వైభవము. అదేమి చిత్రమో!- మోమున కుంజరాకృతి, దేహమున నరరూపము- ఏతద్విశేషవిశిష్టమగు ఇట్టిదట్టిదని నుడువశక్యము గాక బొద్దుగా నగుపించు ఆ మహాతేజస్సునకు నా నమోవాకములు.

శరణం కరవాణి శర్మదం తే చరణం వాణి చరాచరోపజీవ్యమ్,
కరుణామసృణైః కటాక్షపాతైః కురు మామమ్బ కృతార్థసార్థవాహమ్. (3)

అమ్మా ఓ వాణీ! చరము అచరము నగు సకలప్రపంచము (జీవసముదాయము)నకు ఆశ్రయణీయము, సుఖశాంతిసౌభాగ్యములకు నిలయము నగు నీ చరణకమలము నాశ్రయింతును. కారుణ్యాపూరితములు, అనుగ్రహదక్షములు నగు నీ చల్లని మృదువీక్షణముల నన్ను కృతార్థుని జేసి, ధన్యు నొనరింపు మమ్మా యని ఇష్టదేవతాప్రార్థన. మఱియు-

భారతీ కాళిదాసస్య కువ్యాఖ్యావిషమూర్ఛితా,
ఏషా సంజీవనీ టీకా తామద్యోజ్జీవయిష్యతి. (4)

కాళిదాసుని మేఘదూతకావ్యమున కెందరో వ్యాఖ్యలు రచించిరి. అవన్నియు సవ్యములు గాకుండుటచే భావస్ఫోరకములు గాక విషతుల్యములని, జగత్ప్రసిద్ధమగు కాళిదాసుని ఈ కావ్యభారతి (మధురకవిత) వికృతవ్యాఖ్యావిషమూర్ఛిత (కలుషిత) యైనదని మల్లినాథుని భావన, తపన. తా రచించిన ఈ సంజీవనీవ్యాఖ్యచే నది పునరుజ్జీవిత యగునని ఆ వ్యాఖ్యాతృసార్వభౌముని యాకాంక్ష.

ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా,
నామూలం లిఖ్యతే కిఞ్చి న్నానపేక్షిత ముచ్యతే. (5)

ఇట అన్వయపూర్వకముగ కాళిదాసుని భావానుగామినై సమగ్రముగ వ్యాఖ్యానింతును. మూలభావవిరుద్ధమైన దించుకయు లిఖించబడదు. నిరపేక్షితమగున దొకింతయు పలుకబడదని శ్రీమల్లినాథుని ప్రతిన.

నా భావవివరణ శ్రీ మల్లినాథవ్యాఖ్య ననుసరించినది.

అ. స్వ - అధికారాత్=తన కర్తవ్యము నెడల, ప్రమత్తః=శ్రద్ధాహీనుడును (తత్కారణమున), కాంతా-విరహ-గురుణా=ప్రేయసీవియోగముచే భరించ నలవి గానిదియు, వర్ష-భోగ్యేన=ఏడాదిపా టనుభవించతగినదియు నగు, భర్తుః=ప్రభువు కుబేరునియొక్క, శాపేన=శాపముచేత, అస్తం-గమిత-మహిమా=మఱుగు పఱుపబడిన ప్రభావముగల, కశ్చిత్=ఒకానొక, యక్షః=యక్షుడు, జనకతనయా-స్నాన-పుణ్య-ఉదకేషు=జానకి జలకమాడుటచే పునీతములగు జలములు గలవియు, స్నిగ్ధ-చ్ఛాయాతరుషు=ఛాయాప్రధానమగు సురపొన్నచెట్లు గలవియు నగు,

రామగిరి–ఆశ్రమేషు=చిత్రకూటాద్రియందలి ఆశ్రమములందు, వసతిం=ఉనికిని, చక్రే=ఏర్పఱచుకొనెను.

భావము. సదా పూజనీయుడు అభినందనీయుడు నగు మహాకవి శ్రీ కాళిదాసు–

కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే.

కావ్యము కీర్తిదాయక, ధనార్జనసహాయక, వ్యావహారికనిపుణతాప్రదాయక, అనిష్టనివారక, స్వర్గసౌఖ్యసంధాయక, అనిర్వచనీయ అలౌకిక ఆత్మానందానుభూతి ప్రదాయక మగుటయే గాక అది వేదములవలె శాసించక, పురాణేతిహాసములవలె సుదీర్ఘములగు నయోక్తులు పలుకక, శర్కరతోడి క్షీరము బోలి రుచికరములు, సరసములు, సాభిప్రాయములు నగు తీపిమాటల సొంపుల బ్రేయసి అన్యాపదేశముగ బలుకు హితవచనముల భాతి హృదయంగమమును, ఆలంకారికప్రామాణ్యము ననుసరించి, 'కావ్యస్య అనేకశ్రేయస్సాధనతాం, కావ్యాలాపాంశ్చ వర్జయే దితి విషేధశాస్త్రస్య అసత్కావ్యవిషయతాం చ పశ్యన్' కావ్యము బహువిధశ్రేయస్సాధక మని గుర్తించియు, కావ్యప్రసంగములు వర్జనీయము లనునది అసత్కావ్యవిషయక మనునది గమనించియు, మేఘసందేశమను మహాకావ్యమును రచింపగోరి తద్విఘ్ననివారణార్థము సాంప్రదాయిక మగు 'ఆశీ ర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్' ఆశీస్సుగాని, నమస్కృతిగాని, వస్తునిర్దేశముగాని కావ్యముఖ మను శాస్త్రము ననుసరించి కావ్యాదియందు యక్షుని గిరినివాసరూపమగు వస్తువును కశ్చిదిత్యాది శ్లోకముచే నిర్దేశించుచున్నాడు.

అనిర్దిష్టుడగు ఆ యక్షు డెవడు? అత డొనర్చిన యపరాధ మేమి? కర్తవ్యోల్లంఘన మెట్టిది? అను ప్రశ్న లుదయించుట సహజము. అతడు దేవజాతిసంభవుడు, యువకుడు, వివాహితుడు. అలకాపురి నివాసి. కుబేరుని కర్మచారి. మానససరోవరసంరక్షణ మతని కర్తవ్యము. స్వర్ణకమలపరిరక్షణ, శివపూజార్థము తత్కమలసేకరణ ఆ కర్తవ్యపరిధిలోనివి. యక్షరాజు కుబేరుని నియోగ మది. కాంతాలోలు డగుట ప్రమత్తుడై యక్షుడు స్వామి కార్యము నుల్లంఘించెను. ఫలితము యక్షు డిపుడు కర్తవ్యభ్రష్టుడే గాదు, పదవీభ్రష్టుడును, కాంతావిరహితుడును. అది యక్షరాజు ఆజ్ఞ, ఆంక్ష, శాపము. పద్మపురాణమున–

అలకాధిపతిర్నామ్నా కుబేరః శివపూజకః,
తస్యాసీ త్పుష్పవటుకో హేమమాలీతి నామతః.
తస్య పత్నీ సురూపాసీ ద్విశాలాక్షీతి నామతః,
స తస్యాం స్నేహసంయుక్తః కామపాశవశం గతః.

మానసాత్పుష్పనిచయ మానీయ స్వగృహే స్థితః,
పత్నీప్రేమసమాయుక్తో న కుబేరాలయం గతః.
కుబేరో దేవసదనే కరోతి శివపూజనమ్,
మధ్యాహ్నసమయే రాజా పుష్పాణి ప్రసమీక్షతే.

భట ఉవాచ -

హేమమాలీ స్వభవనే రమతే కాన్తయా సహ,
యక్షరాట్ ప్రత్యువాచేదం కాలాతిక్రమకోపితః.

అలకాధిపతి కుబేరుడు శివపూజాతత్పరుడు. యక్షు డాతని కర్మచారి. పేరు హేమమాలి. భార్య విశాలాక్షి. అపురూపసౌందర్యవతి యామె. యక్షు డామెయం దత్యంతానురక్తుడు. కామపాశవశంగతుడు. మానసమునుండి పుష్పనిచయము దెచ్చి కుబేరనిలయము చనక పత్నీప్రేమసమాకర్షితు డగుచు స్వగృహము జేరి కాంతతో వినోదించుచున్నాడు. అట కుబేరు డీశ్వరాలయమున అర్చన కుద్యమించి పద్మములకై వేచియున్నాడు. వేళ యతిక్రమించినది. యక్షుని జాడలేదు. పూజాకమలములు లేవు. ధనదు డుగ్రుడై హేమమాలి యెచటని భృత్యునడుగ యథార్థము నివేదించబడినది. ఆ కబురందిన యక్షుడు కాలాతిక్రమణము గుర్తించి భయవిహ్వలుడై నమ్రభావమున వందన మాచరించి స్వామియెదుట నిలచినాడు. అంత యక్షరాజు-

రే పాప దుష్ట దుర్వృత్త కృతవాన్ దేవహేలనమ్,
అతో భవ శ్విత్రయుక్తో వియుక్తః కాన్తయా సహ.
అస్మాత్ స్థానాదపధ్వస్తో గచ్ఛ స్థాన మథాధమమ్,
ఇత్యుక్తే వచనే తేన తస్మాత్ స్థానాత్ పపాత సః.

ఓ పాపీ! దుష్టా! దుష్ప్రవర్తకా! దైవహేళన క్షంతవ్యము గాదు. అపచార మొనర్చితివి. కాంతావియుక్తుడవు, శ్వేతకుష్ఠపీడితుడవు, స్థానభ్రష్టుడవునై అధోలోకము నాశ్రయింపు మని శపించెను. ఆ యాజ్ఞ ననుసరించి యక్షు డా స్థానమునుండి భ్రష్టుడాయెను. మఱియొక తావున అపరాధహేతు విట్లగపడుచున్నది.

సరోవరరక్షణబాధ్యత తనదైనను ఒకనాటిరేయి చరమయామమున నవోఢయగు స్వకాంతావిరహము నోర్వజాలక కర్తవ్యము నావలకు నెట్టి ఇల్లు జేర, నింతలో దిగ్గజము లట కేగి సరోవరము నల్లకల్లోలపఱచి స్వర్ణకమలముల సమూలముగ నూడ బెరికి అస్తవ్యస్త మొనర్చినవి. ప్రభాతమున ఆ యుదంత మంతయు దెలిసి యక్షపతి కుపితుడై కాంతాప్రణయలోలత్వ మిందుకు హేతువగుట తద్వియోగ మతనికి శిక్షగా విధించెను.

యక్షు దున్మత్తుడు అనగా కర్తవ్యమునెడ అజాగరూకుడు. కర్తవ్య మన విధినిర్వహణ. బాధ్యత నిర్వహించుట అనగా ధర్మదూరము గాకుండుట. చిన్నదైనను పెద్దదైనను కర్తవ్యము కర్తవ్యమే. కాంతాలంపటత్వ మను మైకమున మైమరచి, విశ్వాసమును కాల రాచి, ఈశ్వరపూజావిషయ మనియు తలచక, ప్రభువు కపచార మొనర్చెను. 'భర్తురాజ్ఞాం న కుర్వన్తి యే చ విశ్వాసఘాతకాః, తేషాం నామాపి న గ్రాహ్యమ్' స్వామి యాజ్ఞ నుల్లంఘించు విశ్వాసఘాతకుల పేరెత్తగూడదని ధర్మవిదు లందురు. కనుకనే 'హేమమాలి' యను పేరెత్తక యక్షు డని అనిర్దిష్టముగా వదలినాడు. కర్తవ్యమునెడ అలక్ష్యమునకు ఫలము పాపము శాపము. కాంతావియోగము, స్థానభ్రష్టత, రోగగ్రస్తత దానికి ఫలము. ధర్మ మనతిక్రమణీయము. ప్రజాశ్రేయమునకు, శాంతి విస్తరణకు, లోకకళ్యాణమునకు కర్తవ్యనిర్వహణ రాచబాట. క్రమశిక్షణ, కట్టుబాటు లేమి కల్లోలములకు, అవ్యవస్థకు ఆలవాలము. విధియెడ అలక్ష్యము క్షంతవ్యము కాదు. గాన యక్షునికి శిక్ష విధించబడినది. తత్కారణముగ దేవజాతికి సహజసిద్ధములగు అణిమాద్యష్టసిద్ధు లతనియం దంతరించినవి. కామగమనాదులకు తావు లేదిక. అస్తంగమితమహిము డతడు. కాముకునికి కాంతావియోగమును మించిన కఠినశిక్ష మఱియొక టుండబోదు. అదియు వర్షభోగ్యము. సంవత్సరపర్యంతము! ఎంత కష్టము! భారమైన కాంతావియోగము. ఆమె నవపరిణీత. అందాల చందమామ, చందనగంధి, సొగసుల మేలుబంతి, సోయగముల రాశి, ఒయ్యారమున కులుకు తొలకరి మెఱుపు. ఆమె శరత్పూర్ణిమాచంద్రబింబము. అట్టి ప్రేయసి నెడబాసి యక్షుడు ఏడాదిపా టెట్లుండగలడు? యౌవ్వనపుపొం గింకను చల్లారలేదు. నవనవోన్మేషముగ హృదయకుహరమున చెలరేగు మధురభావనల యుద్వేగ మించుకంతైనను సడలలేదు. అట్టితరి పాప మా కఠినశాపము. శిక్ష వారి కోమలకమనీయజీవితచందనతరువునకు గొడ్డలిపెట్టు. వారి లేత హృదయముల కది అశనిపాతము. నిజమే! కాంతావిషయకప్రణయానురాగములు సమాదరణీయములైనను కర్తవ్యమున కవి అడ్డు రారాదు. కర్తవ్య మతినిష్ఠురము. కనికర మెరుగనిది. యక్షు డపచార మొనర్ప దోష మాపాదితమై ప్రవాసము శిక్షగా విధింపబడినది. దానికి ప్రాయశ్చిత్తము? రామగిర్యాశ్రమములం దావాసము. రామగిరి (చిత్రకూటము) అనినంతనే హైందవమనోవీథుల మధురభావన లెన్నియో మెదలుచుండును. అది యొక తపోభూమి, తీర్థస్థలము, పున్నెముల కూడలి. సీతారామలక్ష్మణుల యునికిచే నది పునీతమైన పుణ్యభూమి. ఉదారభావసంపన్నులు త్యాగమూర్తులు నగు శ్రీరామభరతుల సంగమపుణ్యస్థల మది. పూర్ణపురుషుడు రామచంద్రుడు లోకరీతి ననుసరించి పితృకార్య మాచరించిన పుణ్యతీర్థము. పెల్లుబికిన భరతుని భక్తిరసప్లావితమైన దివ్యస్థల

మది. భక్తి, కరుణ (ప్రేమ) రసధునులు పొంగి యొండొంటి నొఱయుచు ప్రవహించిన స్వర్గభూమి, స్వర్ణభూమి. సంసారము రోసి సర్వమును బాసి కందమూలాదు లశనముగ ప్రశాంతజీవితము గడపు మునిముఖ్యుల ఆశ్రమము లెన్నియో గల వచ్చుట. గుబురుగా పెరిగి, చల్లని నీడ నిచ్చు సురపొన్న లెంతయు ముచ్చట గొలుపుచున్నవి. ఫలపుష్పదాయకములగు తరులతలును గలవు. మఱియు నా యాశ్రమములు జనకతనయాస్నానపుణ్యోదకములు గల సరస్సులతో నలరారుచున్నవి. ఇట కవి, శ్రీరామపత్ని సీత యనక, మమత లెరుంగని జ్ఞానయోగి, కర్మయోగి, రాజయోగియు నగు జనకుడు అల్లారుముద్దుగా సాకిన పుణ్యశీల, జనకతనయ, జానకి అన్నాడు. జనకుని యొడిని వాత్సల్యమున బెరిగి, హైందవసంస్కృతిని, సభ్యతను ఆపోశనము బట్టి తద్విధముగ రూపొందిన పరమసాధ్వి యామె. భారతసంస్కృతి ప్రసాదించిన అనర్ఘరత్న మామె. ఆమె హైందవుల పున్నెముల పంట. నాటికిని నేటికిని మఱెన్నటికిని పవిత్రతకు ప్రపంచమున ఆమెయే ఏకైకప్రతినిధి. ఆమె లోకపావని. భవభూతిమహాకవి తన ఉత్తరరామచరితనాటకమున జానకిని గూర్చి రాముని నోట బలికించిన మాటలు --

> త్వయా జగన్తి పుణ్యాని త్వయ్యపుణ్యా జనోక్తయః,
> నాథవన్త స్త్వయా లోకాస్త్వమనాథా విపత్స్యసే. I - 43

జానకీ! నీ పుట్టుకమాత్రమున లోకములు పునీతములైనవి. సమస్తజగత్తునకు నీవ శరణ్యము. ఏడుగడయు నీవ. అయినను నీ వనాథవు. లోకులు నీ యెడ పలుగాకులు. పాపులు. వారు పలికెడివి పాపోక్తులు, నీచోక్తులు. నిరపరాధివై ఇడుమ లనుభవించుటకేనా నీ వవతరించినది? విషవృక్షమును నన్నేల ఆశ్రయించితివి? విశ్వాసఘాతకుడను. నమ్మి మోసపోతివి జానకీ యని పలువిధముల వాపోయినాడు రామచంద్రుడు. అట్టి లోకపావని, జనకసుత స్నానములచే ఆ సరోవరజలములు పునీతములు. మహనీయులు మెట్టిన చోటులు పున్నెముల పట్టు లందురు గదా! నిర్మలజలములు, స్నిగ్ధచ్ఛాయలు, సజ్జనసాంగత్యములకు నెలవు లా యాశ్రమములు. తా నొనర్చిన యపరాధ ముడుగ యక్షు డా పుణ్యాశ్రమముల నాశ్రయించెను. కాంతావిరహమున ఉన్మత్తుడగుట నిలకడ లేక యత డా యాశ్రమముల చరించుచుండెను. ఏకత్ర వసతి కాదు. శాపమునకు కర్తవ్యపరాఙ్ముఖత కారణ మగుట కావ్యలింగ మలంకారము. 'హేతోర్వాక్యపదార్థత్వే కావ్యలిఙ్గ ముదాహృతమ్' అని దాని లక్షణము. కథాప్రారంభ ప్రథమశ్లోక మిది. కావ్యమం దంతంతగా అద్రి-నదీ - నగర-సముద్రాదివర్ణన లుండుటం జేసి మహాకావ్యత్వ మబ్బినది. విప్రలంభశృంగార మిందలి రసము. అందున నాయకునికి ఉన్మాదము. కనుకనే ఏకత్ర అనవస్థానము. సీత

నుద్దేశించి హనుమంతుని ద్వారా రాము డంపిన సందేశమును మననమునం దిడుకొని మహాకవి కాళిదా సీ కావ్యమును రూపొందించె నని ప్రతీతి. కావ్యమం దంతటను మందాక్రాంతావృత్తము. మ-భ-న-త-త గణములు, గురువులు రెండు, మందాక్రాంతా వృత్తలక్షణము. 4-6-7 అక్షరములపై యతి (విరామము).

కర్తవ్యోల్లంఘన మెంత యనర్థదాయకమో యక్షుని యుదంతము చాటు చున్నది. దాని నూతగా గొని కవిసార్వభౌముడు కాళిదాసు విధినిర్వహణ అనతిక్రమణీయ మను ఉపదేశ మొసంగుటయే గాక పాఠకుల సమక్షమున మాతృ దేశసమగ్రసౌభాగ్యసంపదలను స్వాభావికరామణీయకమును ప్రత్యక్షీకరించుటయే పరమార్థముగా నెంచి ఈ కావ్యరచనకు పూనిక వహించి యుండనోపు.

*అవ. విరహియగు యక్షుని మేఘదర్శనము --*

శ్లో. తస్మిన్నద్రౌ కతిచిదబలావిప్రయుక్తస్స కామీ
నీత్వా మాసాన్ కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠః,
ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం
వప్రక్రీడాపరిణతగజప్రేక్షణీయం దదర్శ. 2

అర్థము. అబలా-విప్రయుక్తః=ప్రేయసి నెడబాసినవాడును, కనక- వలయ-భ్రంశ-రిక్త-ప్రకోష్ఠః=స్వర్ణకంకణము జారుటచే శూన్యమగు మణిబంధము కలవాడును, కామీ=కాముకుడు నగు, సః=ఆ యక్షుడు, తస్మిన్=ఆ, అద్రౌ=చిత్రకూటాద్రియందు, కతిచిత్=కొన్ని (ఎనిమిది), మాసాన్=నెలలను, నీత్వా=గడపి, ఆషాఢస్య=ఆషాఢమాసముయొక్క, ప్రథమ-దివసే=మొదటి రోజున, ఆశ్లిష్ట-సానుం=ఆక్రమించిన సానువు కలదియు, వప్ర-క్రీడా- పరిణత-గజ-ప్రేక్షణీయం=వప్రక్రీడయందు నిమగ్నమైన ఏనుగువలె నగుపించు, మేఘం=మేఘమును, దదర్శ=చూచెను. రాళ్ళు రప్పలు మున్నగువాటిని కొమ్ముల (దంతముల) మీది కెగజిమ్ము క్రీడను వప్రక్రీడ యందురు. అట్టి క్రీడ సలుపు దానినే తిర్యగ్దంతప్రహారి యందురు. అనగా దంతము లడ్డముగా త్రిప్పికొట్టునది.

భావము:- యక్షుడు విప్రయుక్తుడు. ఆమెయూ వియోగిని, అబల. ఎడబా టెరుంగని ప్రేమికులు వారు. వారిది ఆనందమయజీవితము. అనురాగపు జంట యది. దైవవిధి నెవరు గుర్తించగలరు? అది అనుల్లంఘనీయము. అజాగరూకత, అలక్ష్యత, కారణముగ ఇంతింతలు సంభవించె. స్వామి కార్యోల్లంఘన దైవపూజాతిక్రమణల కిది ఫలము. అనుభవించక తప్పదు. అనతిక్రమణీయము. పురుషు డగుట తా నీ వియోగభారము నెటులో భరించి బయటపడగలడు. మఱి అబల ఎడబా టెరుంగని తన కాంత ఈ విరహభారము నెట్లు భరించగలదు?

మనగలదు? అను ఆవేదన అతనిని వెన్నంటి వేధించుచున్నది. అతివలు శక్తిహీనలు. అది నైసర్గికము. ఇక నాతడు కామి. కాముకునికి విరహావేదన భరించరానిది. శరీరము శుష్కించినది. అవయవములు శక్తిహీనములు. ముంజేతి కంకణము జాఱినను అతని కా విషయము తెలియనే తెలియదు. అంతగా బక్క చిక్కినాడు. చిత్రకూటమున ఆ యా యాశ్రమములం దస్థిమితముగ ఎట్టెటులనో ఎనిమిది మాసములు గడచినవి. 'శేషాన్ మాసాన్ గమయ చతురో లోచనే మీలయిత్వా' అను ద్వితీయసర్గ 50వ శ్లోకము ననుసరించి వర్షభోగ్యమగు శాపమున మాసచతుష్టయము శేషించి యున్నదని తెలియుచున్నది. అదియును దిన మొక యుగముగా కష్టమున నెట్టబడుచున్నది. ఆషాఢమాస ప్రథమదివసమున (ఆషాఢానక్షత్రముతో గూడిన పూర్ణిమ కలదగుట ఆ మాసమున కా పేరు వచ్చినది) అనుటకు మారుగా 'ప్రశమదివసే' యను పాఠమును గ్రహించుచున్నారు. ప్రశమదివస మన అంతిమ దివసము. ఇదే సర్గయందు 4వ శ్లోకము 'ప్రత్యాసన్నే నభసి' అని యున్నది. ఆషాఢ ప్రథమదివసము శ్రావణసామీప్యము కాదు గనుక ప్రశమదివస మను పాఠము యుక్తమని వీరి భావన. ఆషాఢాంతిమదినము శ్రావణసమీప మైనను వారి భావన సరికాదు. ఉపర్యుక్తశ్లోకమున సామాన్యప్రత్యాసత్తి అనగా శ్రావణమాససామీప్యము మాత్రమే పేర్కొనబడినది గాని అవ్యవహిత ఉత్తరకాలము చెప్పబడనందున 'ప్రథమదివసే' యను పాఠము గ్రహించుటయం దనుపపత్తి (అభ్యంతరము) యుండనక్కరలేదు. ప్రశమదివస మను పాఠమును స్వీకరించుటయే అసంగతమని తోచుచున్నది. ఆషాఢాంతమున యక్షుడు మేఘునిద్వారా సందేశ మంపుట అంత ఔచిత్య మనిపించదు. వర్షాకాల మొక మాసము గడపి తీరికగా ప్రేయసికి సందేశ మంపుట ప్రియుని యుత్కంఠను కాక ఔదాసీన్యమునే వ్యక్తపరచును. మరియు 'శాపాంతో మే భుజగశయనాదుత్థితే శార్ఙ్గపాణౌ' (ఉత్తరమేఘం 50 శ్లో.) ననుసరించి శాపావధి ఉత్థాన ఏకాదశీపర్యంతము. విష్ణువు భుజగశయనమునుండి లేచు పర్యంత మన్నమాట. యక్షు డన్నట్లు సందేశ మంపు దినమునుండి ఇంకను నాలుగుమాసములు గడువవలసియున్నవి శాపాంతమునకు. ఆషాఢశుద్ధ ఏకాదశి శయనైకాదశి కార్తికశుద్ధఏకాదశి బోధనైకాదశి. అపుడు ప్రథమదివసమను పాఠమున పదిదినము లధికమగును. ఇది యొక అనుపపత్తియే. ప్రశమదివస మను పాఠమునగూడ ఇఱువదిరోజులు తక్కువ. వాస్తవమున కిట కవి నిశ్చిత రూపమున ఖండితకాలమును తెలుపక ఊహామాత్రముగ నాలుగుమాసము లని నుడివి యుండవచ్చును. అదియును గాక యక్షుడు మేఘునిద్వారా సందేశ మంపిన దినమునుండి అత డలకానగరము చేరి యక్షపత్నికి తత్సందేశ మందజేయుటకు కొన్ని దినములు పట్టవచ్చును. కాన పదిదినముల ఆధిక్యత

అనుచిత మెంతమాత్రమును గాదు. శంకల నావల ద్రోసి ప్రథమదివస మను పాఠమును గ్రహించుటయే ఉత్తమమని విదిత మగుచున్నది. సాను వనగ పర్వతోపరిసమతలము. దాని నంటియున్నది మేఘము. ఆశ్లేషమన ఆలింగనము. పర్వతాగ్రమున నంటియున్న మేఘుని దర్శించగనే ప్రణయవిశ్లేషపీడితుడగు యక్షునికి ప్రియాశ్లేషము జ్ఞప్తికి వచ్చినది. అనుదినము ప్రణయహృదయమున హత్తుకొని తన్నాదరించి, యలరించు నిజకాంత దూరమగుటచే, పరితాప మతిశయించినది. వియోగపరితాప మోర్వలేని ప్రణయోపాసకులు వారు. ఆషాఢప్రథమదివసమున వర్షారంభసూచకమగు మేఘము ప్రత్యక్షమైనది. అదియు వప్రక్రీడాపరిణతగజప్రేక్షణీయముగ. యక్షు డావిధముగ మేఘుని దర్శించినాడు. గజప్రేక్షణీయ మనుచోట ఇవశబ్దలోపమున లుప్తోపమాలంకారము.

అవ. మేఘదర్శనమున యక్షుని హృదయవ్యాకులత --

శ్లో. తస్య స్థిత్వా కథమపి పురః కౌతుకాధానహేతో
రంతర్బాష్ప శ్చిరమనుచరో రాజరాజస్య దధ్యౌ,
మేఘాలోకే భవతి సుఖినోఽప్యన్యథావృత్తి చేతః
కంఠాశ్లేషప్రణయిని జనే కిం పున ర్దూరసంస్థే. 3

అ. రాజరాజస్య=కుబేరునియొక్క, అనుచరః=భృత్యుడగు యక్షుడు, అంత ర్బాష్పః సన్=స్తంభింపజేయబడిన కన్నీరు కలవా డగుచు, కౌతుక-ఆధాన-హేతోః=ప్రణయోద్దీపన కారకమగు, తస్య=ఆ మేఘునియొక్క, పురః=ఎదుట, కథమ్ అపి=అతికష్టమున, స్థిత్వా=నిలద్రొక్కుకొని, చిరం=చాలసేపు (మనోవి కారోపశమనపర్యంతము), దధ్యౌ=చింతించెను. మేఘ-ఆలోకే సతి=మేఘదర్శన మగుచుండ, సుఖినః అపి=ప్రేయసిగూడి సుఖమున ఉన్నవానియొక్కయు, చేతః=చిత్తము, అన్యథావృత్తి=కలతజెందునది, భవతి=అగుచున్నది. కంఠ-ఆశ్లేష-ప్రణయిని=ఆలింగనసుఖ మభిలషించు, జనే=జనుడు (ప్రియుడు), దూర-సంస్థే సతి=దూరమున నున్నవాడు కాగా, కిం పునః=ఇక చెప్పెడి దేమున్నది?

భా. రాజు లన యక్షులు. యక్షులకు రాజు కుబేరుడు. అతని భృత్యుడు యక్షుడు కథానాయకుడు, ప్రవాసితుడు, ప్రణయోపాసకుడు, కాంతాలోలుడు. మేఘదర్శనమున యతని ధైర్య మంతరించినది. చిత్తము వికలత్వ మొందినది. మనోవైకల్యమున నయనముల నీరు క్రమ్మినది. కంఠ మవరుద్ధమైనది. అతని దైన్యస్థితి యది. అయినను అతడు ధీరోదాత్తుడు. కన్నుల గ్రమ్మిన అశ్రుబిందువుల అణచిపట్టి ధైర్యమున ఎట్టెటులనో అతికష్టమున కాలూని మేఘుని సమక్షమున నిలిచినాడు. మేఘదర్శనము మదనోద్దీపకము గదా! అది

అభిలాషోత్పాదకము. ప్రణయప్రేరకము. నోట మాట వెలువడలేదు. నిశ్చేష్టుడై అట్లే నిలచినాడు. మనోవైకల్య మంతరించు దనుక మనసు కలకదేరునంతవఱకు చేత మన్యథావృత్తి విడుచువరకు నోరు మెదపలేదు. ఏలయన ఆషాఢమున మేఘోదయము 'సుఖినోఽపి' ప్రియాలింగనమునకు దూరము గాక కాంతాజనసామీప్యమున సుఖాసక్తితో నున్నను కామ ముద్దీపింప, సుఖాభిలాష అతిశయించ, ఉత్కంఠ రేకెత్త, మనసు వికృతినందక మానదు. అట్టితఱి ప్రవాసితుల మాట చెప్పవలయునా? వా రెటనున్నను వర్షారంభకమగు ఆషాఢమున మేఘదర్శన మగునంతనే ఇష్టజనవియోగము నోర్వలేక సుఖాసక్తులై గృహోన్ముఖులగుదురు. ఆషాఢమున రిమఝిమమని చల్లని జల్లులు పడుచుండును. ఆ చల్లదన మంతటను నిండి యుండి మానసోల్లాసము చిగురింప హాయి గొల్పుచుండును. పైరుల పచ్చదనము శాద్వలముల, మరకతచ్ఛాయల ముచ్చటలు కన్నులకు విందు లందించును. వర్షోదకముల దడిసిన తరువులు ఆకుజొంపముల ఆణిముత్తెపు సౌరులు వెలార్చును. వనమయూరముల క్రేంకారములు, హరిణముల కుప్పిగంతులు, పక్షుల కిలకిలారవములు వీనులకు పసందైన విందులు, నయనములకు పండుగ లగుచుండును. ఏతత్కారణముగ భోగాసక్తి ప్రవృద్ధమగుట చిత్త మన్యథావృత్తి నొంద ఇష్టజనకంఠాశ్లేషములకు, సరససల్లాపములకు, రత్యానందప్రక్రియలకు కాంతాజనసమాకర్షితు లగుదురు. యక్షుడు యువకుడు, ప్రణయోత్సుకుడు, కాముకుడు, అబలావిప్రయుక్తుడు, శాపనిర్వాసితుడు, అవశుడు. అతని మనోవైకల్య మెట్లు ఊహించగలము! పూర్వార్ధము ఉత్తరార్ధముచే సమర్థితమగుట అర్థాంతరన్యాసాలంకారము.

అవ. యక్షుడు మేఘునికి స్వాగతము పలుకుట --

శ్లో. ప్రత్యాసన్నే నభసి దయితాజీవితాలమ్బనార్థీ
జీమూతేన స్వకుశలమయీం హారయిష్యన్ ప్రవృత్తిమ్,
స ప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ తస్మై
ప్రీతః ప్రీతిప్రముఖవచనం స్వాగతం వ్యాజహార. 4

అ. నభసి=శ్రావణము, ప్రత్యాసన్నే సతి=సమీపించిన దగుచుండగా, దయితా-జీవిత-ఆలమ్బన-అర్థీ=ప్రేయసి జీవితధారణ నర్థించు, సః=ఆ యక్షుడు, జీమూతేన=మేఘునిచేత, స్వ-కుశల-మయీం=తన క్షేమముతోగూడిన, ప్రవృత్తిం=సమాచారమును, హారయిష్యన్=పంపగోరినవాడై, ప్రత్యగ్రైః=అప్పుడే వికసించిన, కుటజ-కుసుమైః=గిరిమల్లికాసుమములతో, కల్పిత-అర్ఘాయ=కల్పింపబడిన పూజాదికములు గల, తస్మై=ఆ మేఘునికొఱకు, ప్రీతి-ప్రముఖ-వచనం (యథా తథా) ప్రేమపూర్వకవాక్కులు కలుగునట్లుగా, స్వాగతం=స్వాగతమును,

ప్రీతః=స్నేహభావము కలవా డగుచు, వ్యాజహార=పలికెను.

భా. అట్లు చింతనాచిత్తుడగు యక్షుడు చిత్తమున ఇంచుక కలతదేరి ఆశ్వస్తచిత్తు డైనాడు. యక్షుడు సామాన్యుడు. కొలువుకూటమున కర్మచారి. అలక్ష్యమున కర్తవ్యదూరు డగుట అపచారమైనది. 'ప్రమాదో ధీమతా మపి'. బుద్ధిమంతులును పొరబడుదురు. పొరబడుట సర్వజనసామాన్యము. అతని అలక్ష్యమునకు శిక్ష విధించబడినది. ఆ శాపఫలమే యీ ప్రవాసము. కాంతావియోగము. అతడు భోగి కాని యోగి కాడు. సుఖాసక్తుడే గాని విరక్తుడు కాడు. చిత్రకూటమున నున్నను అతడు ప్రణయలోలుడే. ధర్మచింతన యున్నను ఐహికసుఖములందే అతని మనసు లగ్నము. కాంతావిరహవేదన మతనిని క్రుంగదీసినది. దైన్యము తొలగలేదు. అయినను కోరిక లతని పైకొని నిరంతరము వేధించుచునే యున్నవి. అనుభవమునగాని శాంతి లభించదు. ప్రేయసీప్రియులు సజీవులైయుండినగదా అనుభవము? ఆషాఢము ప్రారంభమైనది. అనంతర సామీప్యమున శ్రావణము. విరహిణుల కది సంతాపకరమేగాక ప్రణాంతకము గూడ. పురుషుడు తానెట్లో ధైర్యమూని శాపావధిని గడచి గట్టెక్కగలడు. మాసాష్టకము గడవనే గడచినది. మిగిలినది మాసచతుష్టయము మాత్రమే. అయినను అబల. ఆమె ఈ విరహాంబుధి నెట్లీదగలదు? ఈ గండము గడచి గట్టెక్కగలదా యని అతని యావేదన. ఆమె జీవితము శంకించబడినది. ఏమైనను ఆమె సజీవయై యుండవలె. అనంతర మామెను గూడి భోగసంతృప్తి నందవలె. తమ జీవితము ఆనందమయము గావలె. ఇది అతని ప్రగాఢవాంఛ. అనర్థమునకు ముందే ప్రతిక్రియ నాలోచించుట ఉత్తమ మను విజ్ఞుల మాటను బట్టి ప్రియకాంతాప్రాణసంరక్షణము తన ప్రథమకర్తవ్య మని భావించినాడు యక్షుడు. దాని కుపాయము! తన క్షేమవార్త ప్రియసతి కందవలె. ఆశాజీవుల కదియే ఆలంబనము. ఆమె బ్రతుకున కదియే ఆధారము. ఆమె దాని నూతగా గొని ఈ వియోగజలధిని తరించగలదని అతని ప్రగాఢవిశ్వాసము. కాన యక్షుడు తన ప్రియసతికి సందేశము గొనిపోవ మేఘు నర్థించ నిశ్చయించినాడు. జీవన (జలము) ప్రదాతయే జీవన (ప్రాణ) మిచ్చి రక్షించ నర్హుడను విశ్వాసమున జీమూతము (మేఘుని) ద్వారా సందేశ మంపగోరి అందుల కర్హమగునట్లు కమనీయ మధురసౌరభముల నొప్పు కొండమల్లెలు సేకరించి, అర్ఘ్యపాద్యములు కల్పించి ఆర్ద్రహృదయుడై ప్రీతిపూర్వకములగు మాటల ప్రణయ ముట్టిపడ కుశలమా? నీ యాత్ర సుఖప్రదమా? వినోదదాయకమా? మనోరంజకమా? యని స్వాగతము పలికినాడు. కార్యార్థి కార్యసాధకుని మంచిమాటల పల్కరించు టుచితమే గదా!

చేతనాచేతనవివేచనాశక్తి కొఱవడినది. కనుకనే అతడు ఇది తగునా తగదా యను వివేచన విడిచి తన సందేశమును గొనిపొమ్మని మేఘు నర్థించెను. అందసహజ మేమి కలదు? కామపీడితులు సహజముగా మూఢులు, మందబుద్ధులు, స్వభావదీనులు. ఏది జడము, ఏది చేతనము, ఏది యుక్తము, ఏది అయుక్తము అను జ్ఞానము వారి కెక్కడిది? ఉన్మత్తులకు విచక్షణాజ్ఞాన మంతరించు టేమంత అబ్బురము గాదు. విరూపములగు మేఘ- సందేశముల ఘటనవలన విరూపఘటనారూపమగు విషమాలంకారము. ఇది అర్థాంతరన్యాసానుప్రాణితము.

వాల్మీకిరామాయణమున రాము డున్మత్తుడై సీతకై విలపించుట --

అస్తి కచ్చిత్త్వయా దృష్టా సా కదమ్బప్రియా ప్రియా,
కదమ్బ యది జానీషే శంస సీతాం శుభాననామ్.
వకులానథ పున్నాగాంశ్చన్దనాన్ కేతకాం స్తథా,
పృచ్ఛన్ రామో వనే భ్రాన్త ఉన్మత్త ఇవ లక్ష్యతే.
అథవా మృగశాబాక్షీం మృగ జానాసి మైథిలీమ్,
మృగవిప్రేక్షణీ కాన్తా మృగీభిః సహితా భవేత్.

ఓ కదంబమా! (కడిమిచెట్టా) నా ప్రేయసి జానకి నీకంటబడినదా! ఆమెకు నీ యెడల ఎంత ప్రీతి! నీ కామెజాడ తెలిసిన నా కెఱిగింపుము. నా సీతను నీ వెఱుగవా! ఆమె శుభానన. ఆమె నెమ్మోము నిరంతరము ముద్దులు గూర్చుచుండును. మఱియు నతడు వకుళ పున్నాగ చంపక చందనాది వనవృక్షముల లతల నదేవిధముగ పృచ్ఛించుచు విభ్రాంతుడై ఉన్మత్తునివలె తిరుగుచున్నాడు. మఱియొకప్పుడు 'ఓ హరిణమా! హరిణపోతపు వెడదకన్నుల బెదరుచూపుల సుందరాంగి మత్ప్రేయసి జానకిని నీవు చూడలేదా? ఆ చపలేక్షణ కురంగాక్షి మత్కాంత మైథిలి మిమ్మంటియే యుండనోపు. ఎఱింగించరా?' యని వాపోవును. చెట్టు చెట్టును పక్షి పక్షిని మృగ మృగమును జేరి విచక్షణ గోల్పోయి సీతజాడ దెలుపుడని దీనుడై యర్థించుచు ఉన్మత్తుడగు లోకనాథుడు దశరథరామునికంటె యక్షు డధికుడా! ఉన్మత్తునకు విచక్షణజ్ఞాన ముండదు. విచక్షణ జ్ఞాన మున్నవాడు ఉన్మత్తు డెట్లగును?

అవ. యక్షుని యాచనావిధానము --

శ్లో. జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానాం
జానామి త్వాం ప్రకృతిపురుషం కామరూపం మఘోనః,
తేనార్థిత్వం త్వయి విధివశా ద్దూరబన్ధు ర్గతోఽహం
యాచ్ఞా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా. 6

అ. హే మేఘ=ఓ జలదా! త్వాం=నిన్ను, భువన-విదితే=జగత్ప్రసిద్ధమగు, పుష్కల-ఆవర్తకానామ్=పుష్కలములు, ఆవర్తకములు నగు కల్పాంతకాలమేఘ ములయొక్క, వంశే=కులమందు, జాతమ్=పుట్టినవాడవు, కామ-రూపం=కోరిన రూపము ధరించగలవాడవు. మఘోనః=ఇంద్రునియొక్క, ప్రకృతి-పురుషం=ప్రధాన కర్మచారివి, అని, జానామి=ఎరుగుదును. తేన=తత్కారణమున, విధి-వశాత్=దైవ ఘటనవలన, దూరబన్ధుః=కాంతావియుక్తుడనగు, అహం=నేను, త్వయి=నీయందు, అర్థిత్వమ్=యాచకత్వమును, గతః=పొందినవాడను. అధి-గుణే=గుణసంపన్నుని యందు, యాచ్ఞా=యాచన, మోఘా అపి=ఫలించకున్నను, (ఈషత్=కొంచెము) వరం=మంచిదే. అధమే=నిర్గుణునియందు, లబ్ధ-కామా అపి=ఫలించిన కోరిక కలదైనను, న వరమ్=అంతగా మంచిదిగాదు.

భా. జలదా! నీది మహోన్నతవంశము. జగత్ప్రసిద్ధములగు పుష్కలావర్తక ములు నీ కులదీపకులు. మీ జాతి ఉదారము, ఉదాత్తము నైనది. సద్గుణములు మీయం దిమిడియున్నవి. త్యాగము మీ ప్రధానాశయము. జీవనదానము మీ వ్రతము. నిగ్రహానుగ్రహములు మీ యధీనములు. సృష్టిప్రళయములు మీ సంకల్పసంభవములు. మీ యనుగ్రహచిహ్నము సృష్టి, సంపద, సుఖము, ఆనందము. మీ యాగ్రహనిగ్రహములకు గుర్తు ప్రళయము, నాశనము, లేమి, దుఃఖము. ప్రళయమును సృష్టించి లోకములను ముంచెత్తునది మీ మూలపురుష (వంశ్యు)లగు పుష్కలావర్తకములే గదా! అనుకూలముగ వర్షించి లోకములను బోషించునదియు మీరే. మీరు లేనిది నదులు లేవు. జలనిధులు లేవు. ఇక నదము లెక్కడ! సరస్సు లెక్కడ! నీరములు లేనిది సస్య మెక్కడిది? తరుగుల్మలతాదు లేవి? అన్న మెక్కడిది? జీవ మేది? ఇక బ్రతు కెక్కడ? జీవమునకు జీవన (ఉదకము) దానమే కదా మూలము? అది మీ యధీనము. మీ యనుగ్రహము. సృష్టిప్రళయములు అతివృష్ట్యనావృష్టులు మీ ఇచ్ఛాధీనములు. మీరు కామరూపులు. ఏ రూపమునైన ధరించగలరు. ఆవిరిగా, దూదిపింజవలె ధవళరూపమున మెలగగలరు. సందెకాలముల స్వర్ణరూపము ధరించి సువర్ణకాంతులు వెదజల్లగలరు. కుంకుమాంకితులై ప్రేక్షకుల వీక్షణములకు విందులు సమకూర్చగలరు. మఱియు హృదయరంజకముగ చిత్రరూపములు ధరించి చూపరులకు ముచ్చట చేకూర్చగలరు. ఇక మీకు చొరరాని చోటు లేదు. నదనదీజలనిధులుగాని గిరికాననములు గాని చెట్టుపుట్టలుగాని మీ గమనమున కడ్డు రాజాలవు. ఆఖండలుని యాస్థానమున ప్రధానపురుషుడవు నీవు. జలదా! అడ్డులేని యధికారము నీది. నీ కసాధ్య మనునది లేదు. విధివంచితుడను. బుద్ధిమాంద్యము కర్తవ్యమున కడ్డుపడినది. అది దైవపూజ కాటంకమైనది. పశ్చాత్తప్తుడను; విపన్నుడను, కాంతావియుక్తుడను,

ప్రణయపీడితుడను. నిన్నాశ్రయించితిని, అర్థించితిని. నీ వధికగుణుడవు, అధికుడవు. నా అభ్యర్థన వ్యర్థమైనను చింతించను. అందు యాచనాలాఘవము లేదు. అల్పుని యాచించి సఫలీకృతు డగుటకంటె గుణవంతు డగు అధికు నాశ్రయించి విఫలుడైనను ఇంచుక మంచిదే కదా అని తలంతును. అర్థాంతరన్యాసాలంకార ఉపజీవితమగు ప్రేయోలంకారము.

అవ. యక్షుడు తన సందేశము గొనిపొమ్మని మేఘు నర్థించుట --

శ్లో. సంతప్తానాం త్వమసి శరణం తత్పయోద ప్రియాయాః
సందేశం మే హర ధనపతిక్రోధవిశ్లేషితస్య,
గన్తవ్యా తే వసతి రలకా నామ యక్షేశ్వరాణాం
బాహ్యోద్యానస్థితహరశిరశ్చన్ద్రికాధౌతహర్మ్యా. 7

అ. హే పయోద =ఓ నీరదా!, త్వం=నీవు, సంతప్తానాం శరణమ్=ఆతప సంతప్తులకు వర్షముచేతను, ప్రవాసితులకు స్వస్థలప్రాపణముచేతను రక్షకుడవు, అసి=అయితివి. తత్=అందుచే, ధనపతి-క్రోధ-విశ్లేషితస్య=కుబేరుని యాగ్రహమున కాంతావియుక్తుడ నగు, మే=నాయొక్క, సన్దేశమ్=కుశలవార్తను, ప్రియాయాః=ప్రేయసికి, హర=కొనిపొమ్ము. తే=నీకు, బాహ్య-ఉద్యాన-స్థిత-హర-శిరశ్చంద్రికా- ధౌత-హర్మ్యా=బాహ్యఉద్యానమందున్న శంకరశిరస్సునందలి వెన్నెలచే ధవళమైన ప్రాసాదములు గలదియు, అలకా నామ=అలకాపురి యని ప్రసిద్ధినందినదియు నగు, యక్షేశ్వరాణామ్=యక్షప్రభువుయొక్క, వసతిః=నివాసస్థలము, గంతవ్యా=పోదగినది.

భా. జలదా! ఉదారుడవు నీవు. కారుణ్యపూరితము నీ హృదయము. సంతప్తులయెడ అత్యంతద్రవీభూతము. జడచేతనముల భేద మెరుగని సమతాదృక్పథము నీది. సంతప్తులకు నీ వాశ్రయుడవు, శరణ్యుడవు, రక్షకుడవు. ఆతపసంతప్తములగు తరులతాగుల్మాదులకు, పశుపక్ష్యాదులకు, క్రిమికీటకాదులకు ఇది యది యననేల; సమస్తజీవకోటికి జీవదానము(వర్షపాతము)న సంతాప ముడిగించి రక్షణ కల్పింతువు. ప్రవాసితులయెడ నీ హృదయ మత్యంతద్రవీభూతము. నీది జాలి గుండె. ఆర్ద్రార్ద్రమది. వారి తాపమును నీ వోర్వజాలవు. వారి బాధలు నీవు చూడలేవు. కనుకనే విరహవేదనాపీడితులగు ప్రవాసితులను గృహోన్ముఖుల జేసి, స్వకాంతల జేర్చి సంతృప్తి నందెదవు. నీ హృదయవైశాల్యమున కది తార్కాణము. అది కారణముగ నిన్నర్థించితిని; ఆశ్రయించితిని. విపన్నుడను; విశ్లేషితుడను; ధనపతిక్రోధమున నిర్వాసితుడను. శాపఫలపరిణామ మిది. దుర్విధిపరిపాకము. విధివైపరీత్యము. అంతగా చేయని పాపమున కింతటి

కఠినశిక్ష! విధివిలాసము నెవ రధిగమించగలరు! సజీవుడ నని, కుశలుడ నని, శాపాంతము సన్నిహిత మని, అచిరకాలమున పునస్సమాగమ మగునని నా సతికి సందేశ మందింతు వని ఆశించెదను. అర్థించెదను. ప్రార్థించెదను. ఆమె విరహసంతప్త. అబల. విరహపీడన కోర్వజాలదు. ఆమె యధీర. క్షేమవార్త దెలిపి ప్రాణదాన మొసంగ వేడెదను. అలకాపురి ఆమె యునికి. యక్షరాజ్యమున కది ముఖ్యపట్టణము. కుబేరుని రాజధాని. ధనికుల కావాసము. నయనానందకరమగు ఉన్నత భవనములు, హర్మ్యములు, రాజప్రాసాదములు ముచ్చట గొల్పుచుండును. అట కైలాసమున కమనీయ సుమసౌరభములు వెదజల్లు బాహ్యఉద్యానమున ఆసీనుడగు మహేశ్వరుని జటాజూటమందలి అర్ధచంద్రుని ధవళకిరణధావళ్యమున తెలిమెఱుగులు దిద్దుకొని చూపరులకు కమ్మని విందులు సమకూర్చుచుండును. ఆ నగరము భోగముల ఉనికి. ముచ్చటైన పట్టణ మది. విలక్షణభవ్యహర్మ్యములు లక్ష్మికి నిలయములు. నీవు పోవలసిన దచటికి.

అవ. మేఘదర్శనమున విరహిణుల మానసప్రవృత్తి --

శ్లో. త్వామారూఢం పవనపదవీ ముద్గృహీతాలకాన్తాః
ప్రేక్షిష్యన్తే పథికవనితాః ప్రత్యయా దాశ్వసన్త్యః,
కస్సన్నద్ధే విరహవిధురాం త్వయ్యుపేక్షేత జాయాం
న స్యాదన్యోఽప్యహమివ జనో యః పరాధీనవృత్తిః. 8

అ. పవన-పదవీం=వాయుమార్గము(ఆకాశము)ను, ఆరూఢమ్=అధిరోహించిన, త్వాం=నిన్ను, పథిక-వనితాః=పాంథస్త్రీలు, (పోషితభర్తృకలు) ప్రత్యయాత్=ప్రియులు వత్తురను నమ్మికతో, ఆశ్వసన్త్యః=ఊరటకలవారై, ఉద్గృహీత-అలక-అన్తాః(సత్యః)=ఎగద్రోసిన ముంగురుల అంచులు కలవారగుచు, ప్రేక్షిష్యన్తే=వీక్షింతురు. త్వయి=నీవు, సన్నద్ధే సతి=వ్యాపృతుడవు (విస్తరించిన వాడవు) కాగా, విరహ-విధురామ్=వియోగసంతప్తయగు, జాయామ్=భార్యను, కః=ఎవడు, ఉపేక్షేత=ఉపేక్షించును? అన్యః అపి=అన్యుడైనను, యః జనః=ఏ వ్యక్తి, (జనుడు) అహమ్ ఇవ=నావలె, పర-అధీన-వృత్తిః =పరాయత్తజీవనము (బానిసబ్రతుకు) గలవాడు, న స్యాత్=కాకుండునో.

భా. జలదా! ఉన్నతము నీ యునికి. మహోన్నతము నీ ఆశయము. ఫలభారమున వంగిన తరువును బోలి దాతవై వినయమున అవనతమగుదువు. నీవు గుణభూషితుడవు. నేల నంటని విహారము నీది. అడ్డులేని ఆకాశగమనము. గగనవీథి నీ క్రీడాస్థలము. పవనవీథిని నిన్ను జూచి పథికాంగనలు ఆశ్వస్తహృదయు లగుదురు. స్వస్థచిత్త లగుదురు. ఏల నందువా? నీ రాక వారి కొక

ఆశ. ఆశ్వాసనము. వర్షాంతమున నీ వస్తమించ కార్యార్థులై తమ్ము విడిచి దేశాంతరముల ప్రవాసితులగు ప్రియు లరుదెందురని గంపెడాశ; ఆకాంక్ష. (కథాభిః కమనీయాభిః కామ్యైర్భోగైశ్చ సర్వదా, ఉపచారైశ్చ రమయేద్యస్స కాన్త ఇతీరితః) కమనీయకథలచే వార్తాలాపములచే ఇచ్ఛానుకూలములగు భోగములచే ఆదరపూర్వకక్రియాకలాపములచే (ఉపచారములు) సదా భార్య నలరించు నతడు కాంతు డనబడును. (దేశాన్తరగతే కాన్తే ఖిన్నా ప్రోషితభర్తృకా) కాంతుడు దేశాంతరగతుడు కాగా దుఃఖిత యగు మగువ ప్రోషితభర్తృక యనబడును. తిరిగి నీ వుదయమంద వారి ఆశలు మొలకలెత్తును. వారి కోరికలు చిగురించును. వారి చిరవియోగదుఃఖ మంతరించును. అచిరకాలమున ప్రియు లరుదెంతు రను సంతోష మతిశయించ స్వస్థచిత్త లగుచు ఆనందమున అలక (ముంగురులు) లెత్తి కన్ను లింతింతలు చేసి పథికాంగనలు సాదరముగ వీక్షించి నీకు స్వాగతము పలికెదరు. మత్సందేశహరుడవగు నీకు అనుకొనని యువిదల సత్కార మది. జలదా! నీ రాకకు పాంథుల గృహోన్ముఖతకు సంబంధమేమి యందువా? నీ వుదయమంది వ్యాపృతుడవు (విస్తరించినవాడవు) కాగా విరహవేదనావిధుర యగు ప్రియసతిని విడిచి దూరదేశమం దెవ డుండగలడు? నేను తక్క! నీ చల్లదనమున జీవతతి యంతయు నవనవోన్మేషముగ అంతరంగ ముప్పొంగ భోగలాలస యగును. ఇక నిర్వాసితుల మాట చెప్పనేల! నే నభాగ్యుడను. నా సతి మందభాగ్య. విధివంచితుడను. పరాధీనవృత్తి. అస్వతంత్రుడను. బానిసబ్రతుకు. ననుబోలు మందభాగ్యుడు తక్క ప్రియకాంతను బాసి దూరస్థు డెవడగును? అర్థాంతరన్యాసాలంకారము.

అవ. తన సతి నిరపాయతను యక్షుడు మేఘునికి విశదపఱచుట --

శ్లో. తాం చావశ్యం దివసగణనాతత్పరా మేకపత్నీ
మవ్యాపన్నా మవిహతగతి ర్ద్రక్ష్యసి భ్రాతృజాయామ్,
ఆశాబన్ధః కుసుమసదృశం ప్రాయశో హ్యంగనానాం
సద్యఃపాతి ప్రణయిహృదయం విప్రయోగే రుణద్ధి. 9

అ. జలద!=ఓ మేఘుడా! అవిహత-గతిః సన్=సఫలీకృతయాత్ర (నిరాటంకగమనము) కలవాడవై, దివస-గణనా-తత్పరామ్=శేషదివసముల గణనయందు లగ్నహృదయ (సావధానచిత్త)యు, ఏక-పత్నీం=ఏకభర్తృక (పతివ్రత)యు నగు, తాం=ఆ, భ్రాతృ-జాయాం=సోదరపత్ని (నీకు సోదరతుల్యుడ నగు నా ప్రేయసి)ని, అవశ్యం=తప్పక, అవ్యాపన్నాం=ప్రమాదరహితనుగా, ద్రక్ష్యసి=చూడగలవు. ఆశా-బన్ధః=ఆశ (తృష్ణ) యను బంధము (తొడిమ), ప్రణయి=ప్రేమమయమును, కుసుమ-సదృశం=పుష్పసుకుమారమును, సద్యః పాతి=తత్క్షణపతనాభిముఖము

నగు, అఙ్గనానాం=అతివలయొక్క, హృదయమ్=జీవితమును, విప్రయోగే=వియోగమందు, ప్రాయశః=తఱచుగా, రుణద్ధి=అదిమిపట్టుచున్నది.

భా. జలదా! సోదరప్రాయుడ వగుట నీ కామె భ్రాతృజాయ. వదినె. మాతృసదృశ. ఆమె నీ కత్యంతప్రేక్షణీయ. సంకోచ మొందక చనవున నీ వామెతో పలుకాడవచ్చు. ఆమె అవ్యాపన్న. అనపాయిని. ఆమె జీవితము శంకింప తగినది గాదు. నీ యాత్ర సఫలమే యగును. ఆమె పుణ్యశీల. పతివ్రత. ప్రణయజీవిని. ఆమె నా ప్రాణములకు ప్రాణము. నా హృదయమున కామె అధిదేవత. ప్రేమరాశి యామె. అతిజాగరూకత నామె ఒకటి, రెండు, మూ డనుచు శాపావధి శేషదినములు లెక్కించుచు విరహభారమున కృంగి, కృశించి బక్కచిక్కిన బడుగు దేహమున యెట్లో బ్రతుకును వెళ్ళబోయుచు దిన మొక యుగముగా గడుపుచుండును. జలదా! విశ్లేష (వియోగ) భారమున పతనోన్ముఖమగు మగువల జీవితమును ఆశాబంధము తొడిమ పూవును వలె అదిమిపట్టును. వియోగదుఃఖసంతప్తలగు అంగనల ప్రణయహృదయమునకు ప్రత్యాశ (అచిరకాలమున ప్రియు లరుదెంతు రను నమ్మకము) పట్టుగొమ్మ. జగద్విదిత మిది. మిత్రమా! నా జీవనజ్యోతి, నా యేదుగడ, నా ప్రణయరాశి, మత్ప్రేయసి నా రాకకై దైన్యభావమున నెదురుచూచుచుండును. జాగుచేయక తరలిపొమ్మని యక్షుడు అంజలి ఘటించి మఱీ మఱీ మేఘుని అర్థించెను; ప్రార్థించెను. అలంకారము అర్థాంతరన్యాసము.

అవ. ప్రయాణమునకు శుభశకునములు --

శ్లో. మన్దం మన్దం నుదతి పవనశ్చానుకూలో యథా త్వాం
వామశ్చాయం నదతి మధురం చాతకస్తే సగన్ధః,
గర్భాధానక్షణపరిచయాన్నూనమాబద్ధమాలాః
సేవిష్యన్తే నయనసుభగం ఖే భవన్తం బలాకాః. 10

అ. అనుకూలః =అనుకూలమైన, పవనః చ= గాలియు, త్వాం = నిన్ను, మన్దం మన్దం యథా= మందమందముగా, నుదతి = భావిఫలానురూపముగ వీచుచున్నది. అయం= ఈ, సగన్ధః = గర్విష్ఠి, చాతకః చ=చాతకపక్షియు, తే = నీకు, వామః = ఎడమభాగమున నున్నదై, మధురమ్ = శ్రావ్యముగా, నదతి= కూయుచున్నది. గర్భ-ఆధాన-క్షణ-పరిచయాత్ = గర్భ ఉత్పాదక సుఖపరిచయమువలన, ఖే = ఆకాశమందు, ఆబద్ధమాలాః = పంక్తులు గట్టిన, బలాకాః=బెగ్గురుపక్షులు, (బలాకాంగనలు) నయన- సుభగమ్= నేత్రానందకరమగు, భవన్తమ్ = నిన్ను, నూనమ్ = తప్పక, సేవిష్యన్తే = సేవించును.

భా. జలదా! ప్రయాణమున కిది అనుకూలసమయము. అత్యంత

జేర వేగిరపడుచున్నవియు నగు, రాజహంసాః = రాజహంసలు, నభసి = ఆకాశమందు, ఆకైలాసాత్ = కైలాసపర్యంతము, భవతః = నీకు, సహాయాః = సహాయపడు (తోడుండు)నవి, సంపత్స్యన్తే = కాగలవు.

భా. జలదా! ఘనదుందుభిస్వనగంభీరమగు నీ గర్జనయం దెంతయో శక్తి ఇమిడియున్నది. భావబంధురమగు నీ యుఱుము అప్రమేయబలసంపన్నము. నీ ప్రభావ మనంతము. నీ యాగమనము పుడమిపడతికి ఆనందదాయకము. నీ దర్శనమాత్రమున పృథివీసతికి హర్షము మొలకెత్తును. నీ ఘనమ ధురనాదమునకు ఆమె మురిసిపోవును. ఆమె యొడలు పులకరించును. నిన్ను జూడ ఆమె మురిపె మట్టిది. జలదా! నీ గంభీరగర్జనకు పుడమిని శిలీంధ్రము లుద్భవించును. (వాటినే కుక్కగొడుగు లందురు) అవి భావిసస్యసమృద్ధిసూచకములు (నీలమేఘస్వన సంపర్కమున దట్టముగా నేల నుద్భవించిన పుట్టగొడుగులు సస్యసమృద్ధిని సూచించునని నిమిత్తనిదానము చాటుచున్నది.) జలదా! నీ సంపర్కసాహచర్యమున పుడమి నవనవ లాడు పచ్చని పైరుల వైభవముతో, ఫలవృక్షముల పసందులతో గుబురుగుబురుగా ఏపుగా నెదుగు లతాగుల్మముల రామణీయకముతో అందచందములు చిందించు నవకిసలయముల ముద్దుముచ్చటలతో నవ్వులొలుక, సొరులు నింపు సొబగు లతో చిరునవ్వులు చింద, ముద్దులు నటింప, ఒయ్యారము తొణికిసలాడ, కులుకు రమణీయవివిధకుసుమగుచ్ఛరాజితవనలతలతో నవచైతన్యము వెల్లివిరియు సంపూర్ణసౌభాగ్యమున విలసిల్లు ముత్తైదువను బోలి నేత్రోత్సవ మొనరించును. హృదయమునకు హాయి గొల్పును. మనమునకు ముదము గూర్చును. తన సౌభాగ్యమున కామెయే మురిసిపోవును. పుడమి జనుల కదియే కదా హర్షదాయకము! సుభిక్ష మన నదియే కదా! మిత్రమా! నీమహత్త్వ మట్టిది! ఇక శ్రవణసుఖదము, శుభదము, గంభీర మృదంగ స్వన సదృశము నగు నీ గర్జన రాజహంసలకు మంగళతూర్యసదృశము. మానసము రాజహంసలకు ఆవాస మనునది జగద్విదితముగదా! శీతలమునకు వెరచి, హిమమునకు జడిసి ఇంత దనుక వలసబోయిన రాజహంసలు నీ రాక నూతగా గొని, నీ నిస్వనమును హెచ్చరికగా నెంచి నిజసదనమగు మానసమునకు తరలిపో నుత్సహించును. బిసకిసలయశకలములు పాథేయముగా నోట గఱచి పయనమై పోవును. మిత్రమా! ఏకాకివి గావు నీవు. ఒంటరి బాటసారి నని భయపడజనదు. కైలాసము జేరుదనుక రాజహంసలు నీకు తోడు గలవు. కలసి పయనించు సన్మిత్రులు మీరు. హిమము హంసలకు రోగహేతువు. కాన కాలాంతరమున వలసబోయి వర్షకాలమున క్రుంగిడి మానసము జేరును. చంచుచరణములు అరుణవర్ణము, తక్కినది తెలుపు గలవి రాజహంసలు. 'కైలాసశిఖరే రామ మనసా నిర్మితం సరః, బ్రహ్మణా ప్రాగిదం యస్మాత్తదభూన్మానసం సరః' అని వాయుపురాణము.

పౌరాణికగాథల ననుసరించి కైలాసము హిమాలయమునకు రత్నగర్భ. ధనపతి కుబేరుని రాజధాని. శంకరుని నృత్యమండపమచట కలదు. (నాట్యవేదిక)

అవ. రామగిరియొద్ద సెలవు గైకొనుమని యక్షుడు మేఘు నర్థించుట -

శ్లో. ఆపృచ్ఛస్వ ప్రియసఖ మముం తుఙ్గ మాలిఙ్గ్య శైలం
వన్ద్యైః పుంసాం రఘుపతిపదై రఙ్కితం మేఖలాసు,
కాలే కాలే భవతి భవతా యస్య సంయోగ మేత్య
స్నేహవ్యక్తిశ్చిరవిరహజం ముఞ్చతో బాష్పముష్ణమ్. 12

అ. ప్రియసఖమ్ =ప్రియమిత్రము, తుఙ్గం = ఉన్నతము, పుంసామ్ = జనులకు, వన్ద్యైః = వందనీయములగు, రఘుపతి -పదైః = శ్రీరామచంద్రుని పాదములచేత, మేఖలాసు =చరియలయందు, అఙ్కితమ్ =ముద్రితము నగు, అముం= ఈ, శైలం=చిత్రకూటమును, ఆలిఙ్గ్య =కౌగిలి జేర్చి, ఆపృచ్ఛస్వ=వీడ్కోలిమ్మని వేడుకొనుము. కాలే కాలే= సమయసమయమున (ఋతువుఋతువున) భవతా=నీతో, సంయోగమ్=సంబంధమును, ఏత్య=పొంది, చిర-విరహజమ్= చిరకాల వియోగజనితమగు, ఉష్ణమ్= వేడి యగు, బాష్పమ్=కన్నీటిని, ముఞ్చతః =విడుచుచున్న, యస్య=ఏ రామగిరియొక్క, స్నేహ-వ్యక్తిః=ప్రేమప్రవృత్తి, భవతి= అభివ్యక్త మగుచున్నదో!

భా. జలదా! గ్రీష్మోష్ణతకు తాపమొందిన అద్రులకు నీ వాప్తుడవు. నీ రాక వాటికి హృదయతాపము హరించి ఉల్లాస మొనగూర్చును. అందున నీ చిరకాల మిత్రము చిత్రకూటము. జనవంద్యములగు రఘుకులతిలకుని పావన పాదముద్రలు సానుసానువున అమరియున్నవి. సీతారామలక్ష్మణుల పాదచిహ్నము లెంత రమ్యముగా కొండచఱియల ముద్రితమై ముచ్చట గొల్పుచున్నవో గమనించుము. కౌసల్యానందవర్ధనుడు, పితృవాక్పాలనాదక్షుడు, భ్రాతృవత్సలుడు, జానకీరమణుడు రామచంద్రుని పాదముద్రలు ఎంత పునీతములు! ఇది యొక పుణ్యగిరి. పవిత్రక్షేత్రము. రామభరతుల సంగమస్థలము. భక్తివాత్సల్యములు పొంగి సంగమించిన పుణ్యభూమి. పవిత్రతకు మహత్త్వమునకు నెల విది. జలదా! మీ స్నేహ మీనాటిది కాదు. అనాదినుండియు అది అవిచ్ఛిన్నముగ సాగిపోవుచు నే యున్నది. ప్రవృద్ధి అగుచునే యున్నది. మీఅన్యోన్యప్రేమానురాగములు ఋతువుఋతువున ప్రస్ఫుట మగుచునే యున్నవి. జలదా! నీ యెడబాటు దానికి అపరిమితసంతాపహేతువు. నీ రాక రామగిరికి శ్రీరామరక్ష. సంతాప హరము. మీ స్నేహ మట్టిది. అన్యోన్యసంభావన ఆప్తమిత్రుల లక్షణము. సఖ్యత ఔన్నత్యపవిత్రతలకు అనువగు రీతిని చిత్రకూటమును కౌగిట గ్రుచ్చి ఎత్తి సంభావింపుము. పోయి వచ్చెదనని పలుకరించి సెలవు గైకొనుము.

చిరవియోగానంతరము సమాగతులగు సన్మిత్రుల కన్నులనుండి అశ్రువులు చిందునట్లు మేఘదర్శనమున (వర్షాగమనమున) పర్వతములు ఊష్మము (తాపము)ను వెలువరించును.

అవ. యక్షుడు మేఘునికి మార్గము నిర్దేశించుట -

శ్లో. మార్గం తావచ్ఛృణు కథయత స్త్వత్ప్రయాణానురూపం
సన్దేశం మే తదను జలద శ్రోష్యసి శ్రోత్రపేయమ్,
ఖిన్నః ఖిన్నః శిఖరిషు పదం న్యస్య గన్తాసి యత్ర
క్షీణః క్షీణః పరిలఘు పయః స్రోతసాం చోపభుజ్య. 13

అ. హే జలద! = ఓ యంబుదా!, తావత్=ఇక, కథయతః= మార్గమును నిర్దేశించు నానుండి, త్వత్-ప్రయాణ-అనురూపం= నీయాత్ర కనుకూలమగు, మార్గమ్=మార్గమును, శృణు=వినుము. తదను=అనంతరము, శ్రోత్రపేయం=కర్ణపేయమగు, మే=నాయొక్క, సన్దేశమ్=సందేశమును, శ్రోష్యసి=వినగలవు. యత్ర=మార్గమం దెచ్చట, ఖిన్నః ఖిన్నః సన్=అలసి సొలసినవాడ వగుచు, శిఖరిషు= పర్వతములయందు, పదం=పాదమును, న్యస్య=మోపి, (విశ్రమించి) క్షీణః క్షీణః సన్=అంతగా కృశించినవాడవు అగుచు, స్రోతసామ్= ప్రవాహముల యొక్క, పరిలఘు=మిక్కిలి తేలికయగు, (దోషరహితమైన), పయః=జలమును, ఉపభుజ్య=సేవించి (బలవృద్ధికి జలపాన మొనర్చి) గన్తాసి=పోగలవు.

[13వ శ్లోకమాదిగా 62వ శ్లోకపర్యంతము మేఘుని యాత్రకు సంబంధించిన భౌగోళికవర్ణన. యక్షుడు తన ప్రవాసదినములు గడపు నాగపురమందలి రామగిరి (1వ శ్లోకము) శృంగమునుండి మేఘుడు కైలాసోపరిభాగమున (62వ శ్లోకము) అవస్థితమగు యక్షపురి [అనగా విరహిణి యగు యక్షపత్ని ప్రవాసదినములు లెక్కించుచు (శ్లో. 9 ద్వితీయసర్గ) ప్రియుని రాక కెదురుచూచుచు వేచి యున్న అలకానగరము] జేరవలసియున్నది. మార్గమంతయు గిరికాననములతో, నదీనదములతో, తీర్థరాజములతో, దేవాయతనములతో, దైవలీలాప్రదర్శనములతో, చారిత్రకసత్యములతో, పౌరాణికస్మృతులతో నిండియున్నది. మేఘుడు వాటిని దర్శించుచు పయనించవలసియున్నది. ఈ విషయమును మనమునం దిడుకొనియే యక్షుడు మేఘునికి మార్గమును సవిస్తరముగా నిర్దేశించుచున్నాడు.]

భా. జలదా! ముందుగా ప్రయాణమున కనువగు మార్గమును వివరింతును. ఆ మీదట మత్సందేశము. సుగమమార్గ మున్ననుగదా యాత్ర సుఖదమగుట. మిత్రమా! నీవు పోవు మార్గము ఇహపరసుఖదాయకము. హృదయోల్లాస సంవర్ధకము. నేత్రానందసంధాయకము. ప్రకృతి సంతోషమున పులకించి

పరవశత్వమున ఆడిపాడిన చోటులు. ఆమె నృత్యముల కవి నాట్యవేది కలు. గిరికాననములు, నదీనదములు, ప్రసన్నసరోవరములు, మంజులనిర్ఝరిణులు, తరులతాగుల్మములు, సుగంధిత సుమపుంజములు, మధురఫలరసపానీయములు అవన్నియు అందచందముల కందలములు. ప్రకృతి తన సౌందర్యమును మిక్కుటముగ ప్రదర్శించిన చోటు లవి. ఒయ్యార మొలకబోసిన మార్గ మది. ఎంత నేత్రోత్సవము! ఎంత మానసోల్లాసకరము! అట నుండు శకుంతసంతానముల మధురమంజులకలకూజితము లెంత మనోజ్ఞములు! ఎంత కర్ణపేయములు! మార్గపార్శ్వముల శాద్వలములలో హరిణపోతముల కుప్పి గంతు లెంత ఆనందసంధాయకములు! ఆ మీదట పవిత్ర తీర్థరాజములు! మృదంగవీణానాదములు! శిల్పకళావిన్యాస మొప్పారు దేవాయతనములు! వాటి సందర్శనము మనో వికాసమున కెంతో దోహదకరము! జలదా! యాత్ర సుగమమగుట కివన్నియు ముఖ్యమే గదా! నేత్రముల కానందము, శ్రవణములకు ప్రీతి, మనస్సున కుల్లాసము ఉన్ననే కదా యాత్ర సుఖకరమగుట. నీ కిట అవన్నియు సమకూడినవి. అయినను మార్గము దీర్ఘమగుట నీ కలసట తప్పదు. ఆపన్నుడను. అలసి సొలయుదునని అనాదరింపకుము. శీఘ్రగామి వగుట అంతగా అలసత్వ మూనవని ఆశించెదను. విశ్రాంతి గొనుట కచటచట అద్రిశిఖరములు గలవు. అలుపు వచ్చినచోట ఆద్రిశిఖరముల వ్రాలి, అలసట పోద్రోలి ఆపైని పయనమై పొమ్ము. మార్గమధ్యమున హిమాద్రి వెడలి ప్రవహించు పుణ్యనదు లెన్నియో గలవు. ఉపలచ్ఛేదనమున గురుత్వదోషరహిత నిర్మలోదకము లందు బ్రవహించుచున్నవి. జలదానమున (వర్షింప) శుష్కించి నీరసించినయెడల అందందు తీపి నీరు కడుపార ద్రావి దుర్బలత పోద్రోలి, శక్తిమంతుడవై ముందుకు సాగిపొమ్ము. మిత్రమా! నా సందేశ మందువా! కర్ణపేయ మది. ఆనందసంధాయకము. అత్యంతమధురము. వీనుల కది విందు. తదుపరి వివరింతును. ముందుగా మార్గవివరణము. ఆ మీదట మత్సందేశము.

అవ. యక్షు డుత్తరదిశకు తరలి పొమ్మని మేఘునికి నిర్దేశించుట -

శ్లో. అద్రేః శృఙ్గం హరతి పవనః కిం స్విదిత్యున్ముఖీభి
ర్దృష్టోత్సాహశ్చకితచకితం ముగ్ధసిద్ధాఙ్గనాభిః,
స్థానాదస్మాత్సరసనిచులాదుత్పతోదఙ్ముఖః ఖం
దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్. 14

అ. పవనః=వాయువు, అద్రేః=చిత్రకూటాద్రియొక్క, శృఙ్గం = శిఖరమును, హరతి కింస్విత్=హరించి గొంపోవుచున్నదా యేమి, ఇతి =అని, ఉన్ముఖీభిః= మోము పైకెత్తిన, ముగ్ధ-సిద్ధ-అంగనాభిః= మూఢు (సంశయాత్మ)లగు సురకాం

తలచే, చకితచకితం యథా తథా= సంభ్రమాశ్చర్య మగునట్లుగా, దృష్ట-ఉత్సాహః సన్=వింతగా చూడబడినవాడ వగుచు, సరస-నిచులాత్=ఆర్ద్రిమగు స్థలవేతసము, (వినమ్రుడగు నిచులకవి) గల అస్మాత్=ఈ, స్థానాత్=స్థలమునుండి, పథి=ఆకాశ (సారస్వత) మార్గమున, దిఙ్నాగానామ్=దిగ్గజము (దిఙ్నాగాచార్యు) లయొక్క, స్థూల- హస్త-అవలేపాన్=తీవ్రమగు తొండపు విసురు (తీవ్రహస్తనిర్దేశపూర్వక ఆక్షేపణ)లను, పరిహరన్ = త్రోసిపుచ్చుచు, ఉదఙ్ముఖః సన్ =ఉత్తరాభి (ఉన్నత) ముఖుడవై, ఖమ్= ఆకాశమును, ఉత్పత =అంటి పొమ్ము (ఉద్ధతుడ వగుము).

భా. జలదా! ఎంత విడ్డూరము! ఎంత వింత! ఎంత వినోదము! ఎచ్చటైన ఇంత ముచ్చట గలదా? వింత యున్నదా? ఎన్నడైన ఎక్కడైన ఎవరైన ఈ విడ్డూరము చూచియుందురా? సిద్ధాంగన లెంత ముగ్ధలు! అభము శుభము ఎఱుగని వా రెంత అమాయకులు! ఎచ్చటైనా గిరిశృంగము గాలి కెగురునా? ప్రచండవాయువైనను పర్వతాగ్రమును పైకి లేవనెత్తునా? తనతో గొనిపోగలుగునా? అమాయకత్వమో మూఢత్వమో ముగ్ధత్వమో తెలియదు గాని ఇటనుండి గగనమార్గమున నిన్ను జూచి వర్ణసామ్యమున అద్రిశిఖర మెరుగుచున్నదని భ్రమియుదురు. నీలవర్ణపు తరళకాంతుల భాసిల్లుచు నింగి నంటి తరలిపోవు నిన్ను జూచి పర్వతాగ్ర మెరుగుచున్నదని భ్రమసి అఱ్ఱులు చాచి, మోములు పైకెత్తి, సంభ్రమాశ్చర్యములు ముప్పిరిగొన చకితచకితలై చపలవీక్షణముల నిన్ను వీక్షింతురు. పాప మెంత సంశయాత్మలు! వినోదవైభవ మది. అమరకాంతలు వారు. నీలమణిరూపు నీది. భీత్యాశ్చర్యవినోదసమ్మిశ్రవీక్షణములు. అదియొక విలక్షణమనోజ్ఞదృశ్యము. జలదా! నీ మార్గమున నీటిప్రబ్బలితోడి చిత్తడినేల యున్నది. గగనవీథిని ఎగిరిపొమ్ము. నిచుల మన స్థలవేతసము. నీటి ప్రబ్బలి. ఒక జాతి రెల్లు. పేము అని గూడ యందురు. ప్రవాహవేగమున కది వంగి తదుపరి యథాతథముగ నిరపాయముగ నిలచియుండును. మఱియు నిచులః అన నిచులుడను మహాకవి. కాళిదాసుని మిత్రు డతడు. సమకాలికుడు సహాధ్యాయియుగూడ. కాళిదాససన్మిత్రుడు నిచులమహాకవి యాశ్రమమును దర్శించి గౌరవపురస్సరముగా వతని సంభావించి ముందుకు సాగిపొమ్ము. అంత ఆకాశము నంటి పోవు నీకు దిగ్గజము లెదురగును. వాటి కరాఘాతములు సరకు గొనక ఉత్తరాభిముఖుడవై తరలిపొమ్ము. (జలదా! దిఙ్నాగ ఆచార్యుడు ఉద్దండపండితుడు, విమర్శకాగ్రేసరుడు. కాళిదాసు ప్రత్యర్థి యతడు. హస్తవిన్యాసపూర్వకముగ కాళిదాసకవితను విమర్శించుచుండును. ఆ కువిమర్శను గణుతించక సారస్వతపండితులచే సోత్సాహముగ వీక్షింపబడుచు ఉన్నతపథము నధిరోహింపుము.' - ఈ శ్లోకార్థమును వ్యాఖ్యానించుచు మల్లినాథుడు కాళిదాసు జీవికకు సంబంధించిన సమకాలీనులగు ఇరువురు ప్రముఖ వ్యక్తుల గురించి

మహాకవియొక్క ప్రచ్ఛన్నసంకేతమును ప్రస్తావించుచున్నాడు. అందొకడు కాళిదాసు సహాధ్యాయి నిచులనామక కవిపుంగవుడు. వినయభూషణుడు. అన్యుడు కాళిదాసు ప్రత్యర్థి దిఙ్నాగాచార్యుడు. ఉద్దండపండితుడు, విమర్శకుడు. అతడు కాళిదాసుని కవితయందలి దోషములను హస్తవిక్షేపములచే ఎత్తి చూపి ఆక్షేపించెడివాడనియు, వాటిని సప్రమాణముగా పూర్వపక్షము జేసి నిచులకవిచంద్రుడు పరిహరించెడివాడనియు లోకప్రతీతి. (ఇది ఆధారరహితమని కొందరు) ఆ కింవదంతి ఆధారముగ మల్లినాథుడు శ్లోకమునకు అర్థాంతరము (అన్యార్థము) ను గూడ సూచించుచున్నాడు. ఏమని? ఓ నా యనుంగు కావ్యభారతీ! కవితాసంపుటీ! నన్నోమిన ఓ యమ్మా! భారతీ! అవ్యాహతగతి నద్రికల్పుడగు దిఙ్నాగాచార్యుని ప్రతిభాశృంగభంగ మొనర్చి ప్రియసహచరులగు సారస్వతసిద్ధులచే సంభ్రమాశ్చర్యములు ముప్పిరిగొన ఉత్సాహపూర్వకముగ వీక్షింపబడుచు, మత్ప్రియసఖుడు నిచులకవీంద్రుని యాశ్రమమును దర్శించి, సాదరముగ సంభావించి, దిఙ్నాగుని స్థూలహస్తవిక్షేపఆక్షేపణలను సరకుగొనక, ఉన్నతపథమున గగనవీథి నంటి విహరించ ప్రార్థన. సిద్ధాంగనలకు మేఘమందు గిరిశిఖరమను భ్రాంతి గలుగుట నిట అభేదోక్తి. సందేహాలంకారము.

*అవ. ఇంద్రధనువు కారణముగ మేఘుని అతిశయశోభావర్ణన -*

శ్లో. రత్నచ్ఛాయావ్యతికర ఇవ ప్రేక్ష్యమేతత్పురస్తా
ద్వల్మీకాగ్రాత్ ప్రభవతి ధనుఃఖణ్డమాఖణ్డలస్య,
యేన శ్యామం వపురతితరాం కాన్తి మాపత్స్యతే తే
బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః. 15

అ. రత్న-చ్ఛాయా-వ్యతికరః ఇవ=పద్మరాగాది మణికాంతుల కలయిక వలె, ప్రేక్ష్యం=వీక్షింపదగిన, ఆఖణ్డలస్య=ఇంద్రునియొక్క, ఏతత్=ఈ యగపడు, ధనుఃఖణ్డమ్=ధనుర్భాగము, పురస్తాత్= ఎదుటనున్న, వల్మీక-అగ్రాత్=పుట్టకొననుండి, ప్రభవతి=ప్రభవించుచున్నది. యేన=ఏ ఇంద్రధనస్సుచే, తే= నీయొక్క, శ్యామం=నల్లని, వపుః=శరీరము, స్ఫురిత-రుచినా= ఉజ్జ్వల కాంతి గల, బర్హేణ=పింఛముతో, గోపవేషస్య=గోప(కృష్ణ) వేషధారి యగు, విష్ణోః=విష్ణువు (కృష్ణుని) యొక్క, (శ్యామం వపురివ =నల్లని దేహమువలె) అతితరాం=అత్యధికమగు, శోభామ్ =కాంతిని, ఆపత్స్యతే=పొందగలదు.

భా. జలదా! ఆ రూప మత్యద్భుతము. అత్యంతప్రేక్షణీయము. హృదయాహ్లాదకరము. అదిగో! అటు చూడుడు; ఆనందించుడని సకలజీవులకు ప్రకృతి ప్రసాదించిన, అత్యద్భుతరమణీయదృశ్య మది. సొగసులు వెలార్చు

రంగుల మేలు కలయిక, అమరిక, అనర్ఘమణిప్రభాసమ్మోహనసమ్మిశ్రమ మది. అదియొక అమూల్యమహోజ్జ్వల వజ్రవైడూర్యాధిరత్నకాంతుల భవ్యసంకలనము. మణిదీప్తుల విలక్షణవిలసన మది. అదిగో! ఆ పుట్టనుండి ఆవిర్భవించుచున్నది ఇంద్రధనస్సు. చిత్రవిచిత్రవర్ణ సమ్మేళనముతో కన్నులపండు గవుచున్నది. హృదయమును స్పందించి రంజిల్లజేయుచున్నది. ఎంత మనోజ్ఞదృశ్య మది! ఆలోచనల రేపుచున్నది. ఆ యపురూపవర్ణదీప్తులు నీ నీలదేహమున ఎనలేని సొరులు నింపుచున్నవి. ఆ కాంతు లన్యోన్యము కలసి మెలసి వింతరంగు లీనుచు దోబూచులాడుచున్నవి. చూపరుల కవి గిలిగింతలు. ఆ మహోజ్జ్వల వర్ణసమ్మిశ్రమమున దేజరిల్లు నీకు వింతరంగుల నెమలిపింఛము ధరించి భాసించు గోపవేషధారి ఆ వెన్నుడు (కృష్ణుడు) దక్క మరెవ్వ డీడు రాగలడు! సరితూగగలడు! బర్హిబర్హము ధరించు టేమంత ఘనత గాదు. బర్హిబర్హము ధరించు టేమంత కష్టము గాదు. నెమలిపింఛము ధరించిన గోపబాలు రెందఱు లేరు! నెమలియీకలు దాల్చిన చెంచు లెందఱు లేరు? వారందఱు నీకు సాటి వత్తురా? దేవకి నోములపంట. తన్నోమిన తల్లి యశోదకు ఈరేడు లోకములు అంగిట జూపి మోహాబ్ధిముంచిన మాయామయుడు, గీతామృతదోగ్ధ, ఆనందమయుడు, ఆర్తరక్షకుడు, గోపవేషధారియు నగు శ్రీకృష్ణుడు నీకు సాటి. ఆఖండలధనుఃఖండవిలక్షణవర్ణశోభితుడ వగు నీకు బర్హిబర్హము దాల్చిన నల్లనయ్య వెన్నుడు ఈడు- జోడు. జలదా! ఎంత ధన్యుడవు నీవు! ఇందు ప్రథమచతుర్థపాదముల శ్రౌతీ ఉపమాద్వయము. సాక్షాత్సాదృశ్య ప్రతిపాదకయథే వాదిశబ్దప్రయోగముచే శ్రౌతి. అదియు సాపేక్షితము కాదు గాన సంసృష్టి యలంకారము.

అవ. మేఘుని మాళవదేశప్రవేశవర్ణన-

శ్లో. త్వయ్యాయత్తం కృషిఫలమితి భ్రూవికారానభిజ్ఞైః
ప్రీతిస్నిగ్ధైర్జనపదవధూలోచనైః పీయమానః,
సద్యః సీరోత్కషణసురభి క్షేత్రమారుహ్య మాలం
కించిత్పశ్చాద్వ్రజ లఘుగతిర్భూయ ఏవోత్తరేణ. 16

అ. కృషి-ఫలం=సేద్యఫలము (పంట), త్వయి=నీయందు, ఆయత్తమ్ = ఆధారపడినది, ఇతి =అని, ప్రీతి-స్నిగ్ధైః= ప్రేమార్ద్రములు, భ్రూ- వికార-అనభిజ్ఞైః =భ్రూభంగము (కనుబొమముడిపాటు) లెఱుగని, జనపద-వధూ-లోచనైః=పల్లె పడుచుల అకుటిలవీక్షణములతో, పీయమానః సన్=ఆప్యాయముగ వీక్షింపబడిన వాడ వగుచు, మాలమ్=మాల యని ప్రసిద్ధి వడసిన, క్షేత్రమ్=ఉన్నత

సమతలమును, సద్యః=ఆ క్షణమున, సీర-ఉత్కషణసురభి 'యథా తథా'= నాగలిచే దున్నుటవలన మృత్తికాపరిమళ ముట్టిపడునట్లుగా, ఆరుహ్య= అభివర్షించి, కించిత్=కొంచెము, పశ్చాత్= పశ్చిమముగా, వ్రజ= వెళ్ళుము. భూయః= తిరిగి, లఘు-గతిః సన్=శీఘ్రగమనము కలవాడవై, ఉత్తరేణ ఏవ = ఉత్తరదిక్కుగనే, వ్రజ=పయనించుము.

భా. జలదా! జలములు నీ యధీనము. నీవు లేనిది జలము లేవి? జలము లేనిది పంట లేదు గదా! పంట లేనిది వంట యెక్కడ? వంట లేనిది అన్న ముండునా? అన్న ముండినగదా జీవు లుండునది. జగత్తంతయు నీయందు నిర్భరమై యున్నది. ఇక కృషీవలుల సంగతి! జనపదముల మాట! కర్షకుల కృషి! శ్రమ, స్వేదఫలము నీయం దాయత్త మై యున్నది. క్షేత్రము దున్ని, చదునుపఱచి, విత్తులు చల్లి, చెమటోడ్చి, కష్టించి వా రాశించిన సస్యఫలము నీయం దధిష్ఠితము గదా! నీ వనుగ్రహించి వర్షించిన గదా వారు సఫలీకృతు లగుట! వారి ఆశలు ఫలించుట! వారికి శ్రమఫలము దక్కుట! గండములు గడచి బ్రతుకులు బాగుపడుట! జలదా! మాట లేల! వారి బ్రతుకే నీ యనుగ్రహముపై ఆధారపడియున్నది. వారికి నీ వాత్మబంధుడవు. అనుంగుమిత్రుడవు. నీ యండదండలు, తోడునీడలు వారి కత్యంతావశ్యకములు. వారి ఆశలు, ఆశయములు నీయందే కేంద్రీకృతమై యున్నవి. నీ యాగమనము వారి కత్యంతప్రమోదజనకము. వారి కది సంక్రాంతి. నీ రాకకై వారు వేచియుందురు. హృదయ ముప్పొంగ, ఆనందాశ్రువులు అక్షిగోళములు నిండ (చింద), ఆప్యాయమున నీకు స్వాగతము పలుక వేచియుందురు. భ్రూభంగము నెఱుగరు. చూపుల మర్మములు తెలియని పల్లెపడుచులు వారు. అన్నెపున్నెము లెఱుగని అమాయికలు వారు. వీక్షణవైఖరు లెరుగకున్న నేమి? ఆ చూపులు స్నేహసిక్తములు. ప్రేమార్ద్రములు. అందెంతయో ఆదర మిమిడి యున్నది. అకుటిల ప్రేమవీక్షణము లవి. ఆప్యాయత తొణికిసలాడ, ఆనందమున కన్నులు చెమ్మగిల్ల, సాదరముగ నిన్ను వీక్షింతురు. జలదా! అంతకంటె నీకు కావలసిన దేమున్నది? నీ కది అత్యంతగౌరవము కదా! ఆ వల్లీలలామల (వనితల) ముగ్ధమనోహరవీక్షణముల దోగి, ఆ యన్నుల మిన్నల నాదరించి ఆ మీదట మాల యను క్షేత్రమును దర్శింపుము. ఉన్నతసమతల మది. హలకర్షణమున పరిష్కృతము. జలదా! ఘ్రాణతర్పణము గాగ కమ్మని మృత్తికాగంధము లెగయ జనపదవధువుల ఆశలు దీర, పూర్ణముగ వర్షించి వారికి ముదము గూర్చుము. పూర్ణవర్షమున భారరహితుడవై శీఘ్రగమనమున ఇంచుక పశ్చిమమునకు మరలి, అటనుండి మఱల సూటిగా ఉత్తరముగ పయనించుము. అలంకారము పరివృత్తి. మాల మన ఉన్నత సమతల మని

వ్యాఖ్యానము. మాల దేశమని కొందరు. మఱికొందరు మాళవదేశమనియు, ఆధునికులు కొందరు ఛత్తీస్ గఢ్‌కు సంబంధించిన మాల్వాను మాల యనియు వచింతురు. నాగలితో చక్కగా దున్నిన భూమియందు ప్రథమవర్షపాతమున కమ్మని మృత్తికాసౌరభము వెలువడుట సుప్రసిద్ధము. మఱియు నిట బహువల్లభ (భార్య)లు గల పతి యొకడు ఒకానొక భార్యతో గూఢముగ విహరించి దాక్షిణ్యభంగ మగు నను భీతిచే గుప్తమార్గమున నిర్గమించి తిరిగి సర్వాధ్యక్షుడై సంచరించు పగిది, మేఘుడు పల్లీవనితల ప్రేమవీక్షణముల రుచు లారగించి, మాలదేశము మీదుగా వక్రమార్గమున పశ్చిమమున కేగి, మరల ఉత్తరమునకు మరలి తీవిగా పయనించుట ద్యోతితము.

అవ. ఆమ్రకూటపర్వతము మేఘునికి స్వాగతము పలుకుట -

శ్లో. త్వా మాసారప్రశమితవనోపప్లవం సాధు మూర్ధ్నా
వక్ష్య త్యధ్వశ్రమపరిగతం సానుమా నామ్రకూటః,
న క్షుద్రో ఽపి ప్రథమసుకృతాపేక్షయా సంశ్రయాయ
ప్రాప్తే మిత్రే భవతి విముఖః కిం పున ర్యస్తథోచ్చైః. 17

అ. ఆమ్రకూటః=ఆమ్రకూట మను (శిఖరములపై చూతవృక్షములు గల), సానుమాన్ = పర్వతము, ఆసార-ప్రశమిత-వన-ఉపప్లవమ్= ధారావర్షపాతముచే నుపశమింపజేయబడిన దావాగ్ని కలవాడవు, అధ్వ-శ్రమ-పరిగతం = మార్గా యాసముతో గూడినవాడవు నైన, త్వామ్= నిన్ను, సాధు= లెస్సగా, మూర్ధ్నా= శిరస్సుతో (మస్తకమున), వక్ష్యతి = వహించ (ధరించ) గలదు. క్షుద్రః అపి = నీచు (అల్పు)డును, సంశ్రయాయ= ఆశ్రయము కొఱకు, మిత్రే =మిత్రుడు, ప్రాప్తే సతి = వచ్చినవాడు కాగా, ప్రథమ-సుకృత-అపేక్షయా= పూర్వ-ఉపకారపర్యాలోచనచేత, విముఖః= పరాఙ్ముఖుడు, న భవతి = కాజాలడు. యః= ఏ యామ్రకూటము, తథా ఉచ్చైః = ఆ ప్రకార మౌన్నత్యము గలదో (దాని విషయమై) కిం పునః=ఇక చెప్పనేల! (ఆశ్రయము, అతిథ్య మిచ్చి ఆదరించుటకు వెనుకాడునా?)

భా. జలదా! ఆమ్రకూటము నీ మొదటి విడిది. విశ్రాంతి కనువగు తావు. ఆమ్రకూట మెంత నిండైనది ! ఆ యద్రిశిఖరముల సానువులయం దంతటను, చూత (మామిడి) వృక్షములు ఫలభారమున వంగి, నమ్రభావమున నీ కాతిథ్యమీయ నువ్విళ్ళూరుచున్నవి. స్వాగతము పలుకుచున్నవి. ఆ గిరికి నీయెడల నెంత గౌరవము! ఎంత ఆదరము! ఎంత ప్రీతి! ఆ యామ్రకూటమునకు గ్రీష్మతాప ముడిపి, చలువ గూర్చి, మే లొనరించిన ఆప్తమిత్రుడవు నీవు. అంతియ కాదు. ధారాపాతముగ వర్షించి కార్చిచ్చు రూపుమాపి హృదయతాప మంత

మొందించిన ఆప్తబంధుడవు. ఆ యామ్రకూటము నీ మే లెట్లు మరువగలదు? కృతోపకారుడవు. అధ్వపరిశ్రాంతుడవు. ప్రయాణప్రయాసమున అలసి సొలసిన వాడవు. నిన్ను జూచి, నీవు చేసిన మేలు తలచి నిన్నాదరించక విడుచునా? నిండుమనమున నెత్తి నిడుకొని గౌరవించును. ఆతిథ్యమిచ్చి నిన్నాదరించును. మధురరసాలఫలరసము లాని బడలికలు బాపుకొనుము. పేద దేర్చుకొనుము. మిత్రమా! అల్పుడైనను తన్నాశ్రయించిన మిత్రుని విడువజాలడు. క్షుద్రుడైనను చేసిన మేలు మరువగలడా? కృతోపకారమును దలచి ఆదరించునే గాని తిరస్కరింపనోపడు. విముఖుడైనను వెన్నుజూపడు. జలదా! దావాగ్ని యన నెంత భయంకరము! ఎంత బీభత్సము! కాననముల రూపుమాపును. అద్రులను తపింపచేయును. ఎంత భయంకరము! తలచినంతనే గుండె లవియును. ధారాపాతవర్షమున దావాగ్ని చల్లార్చితివి. జలదా! నీవు జీవనదాతవు. కృతఘ్నత యన నేమియో తెలియక ఔన్నత్యమున మెలగు ఆమ్రకూటము ఆశ్రయ మిచ్చి, ఆతిథ్య మిచ్చి ఆదరించక నిన్నెట్లు విడువగలదు? సంకోచము వలదు. నీ వట విశ్రమించి శ్రమ నపనయింపుము. ఆదివిరామ మెంతయు ఆహ్లాదకరము గాన నీ యాత్ర ఆద్యంతము సుఖావహము. కార్య సిద్ధి కది హేతువు. (మొదటి విడిది ఆమ్రకూటము. అది సుఖదాయకము గాన మేఘునికి యాత్ర సౌఖ్యప్రదము, సఫలము నని ధ్వనించుచున్నది. అమరకటకపర్వతమును కొందరు ఆమ్రకూట మందురు. సాను వన పర్వతశిఖరమందలి సమతలము. ఈ శ్లోకమందలి పూర్వార్ధము ఉత్తరార్ధముచే సమర్థింపబడుట అర్థాంతరన్యాసము.

అవ. ఆమ్రకూట సౌందర్యవర్ణన -

శ్లో. ఛన్నోపాన్తః పరిణతఫలద్యోతిభిః కాననామ్రై
స్త్వయ్యారూఢే శిఖర మచలః స్నిగ్ధవేణీసవర్ణే,
నూనం యాస్యత్యమరమిథునప్రేక్షణీయామవస్థాం
మధ్యే శ్యామః స్తన ఇవ భువః శేషవిస్తారపాణ్డుః. 18

అ. హే మేఘ=ఓ యంబుదా!, పరిణత-ఫల-ద్యోతిభిః=పండిన ఫలములచేత ప్రకాశించునట్టి, కానన-ఆమ్రైః=అడవియందలి చూతవృక్షములతో, ఛన్న-ఉపాన్తః=ఆచ్ఛాదితపార్శ్వభాగములు గల, అచలః= ఆమ్రకూటాద్రి, స్నిగ్ధ-వేణీ-సవర్ణే=చిక్కని కేశబంధసదృశమగు, త్వయి=నీవు, శిఖరమ్= శృంగమును, ఆరూఢే సతి = అధిరోహించినవాడవు కాగా, మధ్యే=నడుమ, శ్యామః = నలుపును, శేష-విస్తారపాణ్డుః=శేషించిన విశాలపార్శ్వభాగముల పాండువర్ణము (శ్వేత పీత మిశ్రమము) కలదగుట, భువః=పుడమియొక్క, స్తనః ఇవ= స్తనమువలె, అమర-మిథున-ప్రేక్షణీయామ్=సురదంపతులకు దర్శనీయమగు, అవస్థామ్=స్థితిని,

మూనమ్=తప్పక, యాస్యతి=పొందగలదు.

భా. జలదా! నీ వెంతయు ధన్యుడవు. నీ యాత్ర వినోదసంభరితము, వైభవోపేతము, మధురము, మనోజ్ఞము నైనది. నీవు భూసతికి యౌవనరూపము దిద్దుచున్నావు. యౌవనాభరణ మగుచు ఖేచరమిథునముల కొక విలక్షణదృశ్యము ప్రసాదించుచున్నావు. ఆ గిరిపార్శ్వముల రసాలసాలముల పండిన పండ్లు అంతటను గౌరవర్ణమున దీపించుచున్నవి. స్నిగ్ధము, మసృణము, శ్యామము నగు కామినీకేశబంధముబోలు నీ వా శిఖరము నధిష్ఠించితివా ఇక చెప్పెడి దేమున్నది? ఆ శోభ అద్వితీయము. అది చూచుకప్రాయమ్మై పుడమిపడతికి గబ్బిగుబ్బ యగుచున్నది. మిత్రమా! పుడమి యొక పడతి. అచలము కుచము. నీవు చూచుకము. ఏమి శోభ! ఏమి భావన! వినువీథుల సంచరించెడి అమరమిథునముల హృదయకుహరముల మెదలెడి మధురభావన యది. వయసు జంటలు. నిత్యనూతన యౌవనులు. కనుకనే వారి కా యూహ. ఆ దృశ్యమును వా రత్యంతకాంక్షతో వీక్షింతురు. జలదా ! ఇదీ ఆ స్థితి. నీకు విశ్రాంతి. ఆమ్రకూటమునకు విలక్షణరమణీయశోభ. పుడమిపడతికి అపురూపరూపసంపద. ఎంత చక్కని అమరిక! రమ్యమగు సన్నివేశ మది. ఇదంతయు నీ మూలముననే కదా సంభవము! ఉపమాఉత్ప్రేక్షల సంసృష్టి. 'పరిశ్రాంతుడగు ఒకానొక కాముకుడు కామినియొక్క కుచకలశమున విశ్రాంతికై నిద్రించునట్లు నీవును నాయిక యగు పుడమిపడతి చనుమొనపై విశ్రమించ మని ధ్వనించుచున్నది.

అవ. మేఘుని దృష్టిపథమున వర్తించు నర్మదానదీవర్ణన -

శ్లో. స్థిత్వా తస్మిన్వనచరవధూభుక్తకుఞ్జే ముహూర్తం
తోయోత్సర్గద్రుతతరగతిస్తత్పరం వర్త్మ తీర్ణః,
రేవాం ద్రక్ష్య స్యుపలవిషమే విన్ధ్యపాదే విశీర్ణాం
భక్తిచ్ఛేదై రివ విరచితాం భూతిమఙ్గే గజస్య. 19

అ. హే మేఘ= ఓ జలదా!, వనచర-వధూ-భుక్త-కుఞ్జే = కిరాతాంగనలచే అనుభవింపబడిన పొదరిండ్లుగల, తస్మిన్ =ఆ యామ్రకూటమందు, ముహూర్తమ్=క్షణకాలము, స్థిత్వా=విశ్రమించి, తోయ-ఉత్సర్గ- ద్రుతతర-గతిః సన్=వర్షపాతమున శీఘ్రగమనము కలవాడవై, తత్పరమ్= ఆ మీదటి, మార్గమ్=మార్గమును, తీర్ణః=దాటినవాడవై, ఉపల-విషమే = రాళ్లచే నెగుడు దిగుడుగా నున్న, విన్ధ్య-పాదే = విన్ధ్యపర్వతపాద (సమీప) ప్రదేశమునం దంతటను, విశీర్ణాం= శిథిలమై వ్యాప్తిజెందిన, రేవామ్=నర్మదానదిని, గజస్య=ఏనుగుయొక్క, అఙ్గే=శరీరమున, భక్తి-చ్ఛేదైః=రచనాభంగిమలచేత, విరచితామ్ = రచింపబడిన,

భూతిమ్ ఇవ =సింగారమును వలె, ద్రక్ష్యసి =చూడగలవు.

భా. జలదా! మార్గమున నీ కెన్నియో వింతలు, విశేషములు ముచ్చటలు ఎదురగును. నీ కన్నులకు విందు లవి. ఆ యామ్రకూటనికుంజవిలసనములు! ఆ పొదరిండ్ల మురువుముచ్చటలు! ఆ లతాగృహముల సొరులు! ఏమని ముచ్చటించను? ఎన్నని వివరించను? ఆ నికుంజనిలయములు ఆ లతామంటపములు అందు మసలిన వనచరవధూవినోదవిలాసవిభ్రమములు ఏమని నుడువగలను? ఆ కిరాతమిథునముల ముగ్ధమనోహరమధురచేష్ట లెట్లు నిర్వచించగలను? అవన్నియు నయనానందకరములు. మఱియు మనస్సున కుద్దీపకములు. కన్నుల కఱువుదీర ఆ పొదరిండ్ల సొబగులు వీక్షించుము. జా గొనరింపకుము సుమీ! అది కార్యభంగమునకు హేతు వగుట నీ పూనిక వ్యర్థమగును. అల్పకాల మా నికుంజముల విశ్రమించి అధ్వశ్రమ నపనయించి శీఘ్రముగ కార్యసాధన కుద్యమింపుము. జలదా! పూర్ణవర్షమున ఆ యద్రికి మేలుగూర్చి వీడ్కొని ముందుకు సాగిపొమ్ము. జలోత్సర్గమున భావరహితుడ వగు నీ కిక ప్రయాస యెక్కడిది? అదిగో! ఆ కనబడునది వింధ్యాద్రి. మహోన్నతమైనది. అం దుదయమంది తత్పాదమున ఉపల (రాళ్ల)మార్గమున బ్రవహించుచున్నది. గమ నించితివా? పాషాణసంకీర్ణ మగు వింధ్యపాదమున విశీర్ణమై (చెదరి) వింతచెలువు లుపచరించుచు నిమ్నోన్నత ఉపలమార్గమున గంతులిడుచు మధురస్వరమున ముందుకు సాగిపోవు నర్మద ముచ్చట గొలుపుచున్నది. గండుశిలల యొత్తిడికి చెదరి చెదరి ముచ్చటగ బ్రవహించు ఆ స్రోతోవాహిని గజశరీరమందలి విభూతిరేఖలవలె శృంగార (అలంకరణ) రచనల బోలి నయనానందకరముగ ప్రత్యక్షమగుచున్నది. హృదయమున మాధుర్యము నింపుచున్నది. మిత్రమా! ఎంత మనోజ్ఞదృశ్య మది! ఎంత హృదయంగమసన్నివేశము!

విశేషము- విన్ధ్యాచలము ఆర్యావర్తము (ఉత్తరభారతము) నకు దక్షిణపు టెల్ల. ఉత్తరదక్షిణభారతములకు విభజనరేఖ. దీనిని చరణాద్రి అనియు నందురు. బానూర్- గయలయందు స్థాపితమగు చరణముచే వింధ్య అగస్త్యుని పూజయం దనవరతము సాష్టాంగవందనపూర్వకముగ నతమై యున్నదని పౌరాణికగాథలయం దుల్లేఖితమై యున్నది. మఱియు లోకబాంధవుడు సూర్యభగవానుడు మేరువున కేల ప్రదక్షిణ మాచరించుట; తన కేల యాచరించ దని ఈర్ష్య వహించి అది ఆకసము నంట పెరుగుచునే యుండెను. అంత దేవతలు భయ మొంది దాని యౌద్ధత్యము నాప అగస్త్యు నాశ్రయించిరి. ఆ మహర్షి దక్షిణాపథమునకు బోవుచు, 'నాయనా! నేవచ్చుదనుక నీ వీ విధముగ ప్రణామముద్రయందే పడియుండు మని ఆజ్ఞాపించి ఆయన మఱి తిరిగి రాలేదని పౌరాణికగాథ. 'రేవా తు నర్మదా సోమోద్భవా మేఖలకన్యకా'

అనుదానిని బట్టి నర్మదానది ఉత్పత్తిస్థానము అమరకంటకపర్వత మగుచున్నది. మేఖల యనునది తత్పర్వతమునకు పర్యాయపదము. నర్మద మేఖలపుత్రికయని ఉదాహరింపబడినది. ఈ శ్లోకమున రేవావింధ్యలయందు లింగకార్యముల సాదృశ్యము నాయికానాయకులయం దారోపితమగుట సమాసోక్తిశ్రాలీఉపమలు. ఉభయమునకు అంగాంగిభావ ముండుట సంకరాలంకారము. 'వింధ్యపాదే విశీర్ణామ్' అనుటచే ఒకానొక కామినికి ప్రియతమచరణతాడనము ధ్వనితము.

అవ. యక్షుడు మేఘునికి నర్మదాజలపాన మొనర్ప హితము పలుకుట -

శ్లో. తస్యా స్తిక్తైర్వనగజమదై ర్వాసితం వాంతవృష్టి
ర్జమ్బూకుంజప్రతిహతరయం తోయమాదాయ గచ్ఛేః,
అంతఃసారం ఘన! తులయితుం నానిలః శక్ష్యతి త్వాం
రిక్తః సర్వో భవతి హి లఘుః పూర్ణతా గౌరవాయ. 20

అ. హే మేఘ=ఓ జలదా!, వాంత-వృష్టిః సన్=వెలువరించిన వర్షము కలవాడవై, తిక్తైః=కషాయసురభితము లగు, వన-గజ-మదైః =అడవి యేనుగుల మదములచే, వాసితం = పరిమళించునదియు, జమ్బూ- కుంజ-ప్రతిహత-రయమ్ =జమ్బూ (నేరేడు) వృక్షములచే నిలువరింపబడిన వేగముకలదియు నగు, తస్యాః=ఆ నర్మదయొక్క, తోయం=జలమును, ఆదాయ= గ్రహించి, గచ్ఛేః= పయనించుము. హే ఘన=ఓ యంబుదా! అంతఃసారం=అంతస్సారము (జలము)గల, త్వాం =నిన్ను, అనిలః =వాయువు, తులయితం =త్రోయుటకు, న శక్ష్యతి = సమర్థము కాజాలదు (కదల్పజాలదు). హి=ఏలయన, రిక్తః = సారహీనమగు, సర్వః =సర్వమును, లఘుః =చులకనైనది, భవతి =అగుచున్నది. పూర్ణతా =పూర్ణత్వము (శక్తిమత్త్వము), గౌరవాయ =గౌరవమునకు, భవతి =అర్హమగుచున్నది.

భా. జలదా! మత్కార్యసాధన కుపక్రమించితివి. మత్ప్రయోజనార్థము పథికవృత్తి స్వీకరించితివి. మార్గము సుదీర్ఘము. కొండలు, గుట్టలు, వనములు, నదీనదములు, సానువులు, సరస్సులు, అన్నియు నీ కెదురగును. ఆటంకము లెక్కువ. ప్రయాస తప్పదు. ఆరోగ్యము పదిలము సుమీ! అవాంఛితజలము లుజ్జగించి మార్గమధ్యమున పథ్యపానీయములు స్వీకరింపుము. స్వస్థత యున్ననే గదా కార్యసాధనము! ఆస్వాదించిన భారజలమును వర్షరూపమున వెలువరించుము. అదిగో! నర్మద. గండశిలల తాకిడికి చింది చులకనగు ఆ నదీజలము లెంత రుచ్యములు! అత్యంతపానయోగ్యము లవి. మిత్రమా! విన్ధ్యాటవులు మత్తేభముల కునికిపట్టులు. అంతులేని యాహారము. అలస టెఱుంగని విహారము. ఏవంక

జూచినను సులభసాధ్యములగు నర్మదాతోయములు. ఇంతకంటె వాటికి కావలసిన దేమున్నది! తన్నదీజలముల జలకమాడు వనగజమదసుగంధితములగు ఆ తోయములు తిక్తకషాయరూపమున పథ్యములగు పానీయములు. అంతియు కాదు. అవి జంబూ (నేరేడు) కుంజ కదంబ నిరోధిత ప్రవాహవేగమున తేరి, నిర్మలము లగుట హృదయాహ్లాదకరములు. ఆరోగ్యప్రదములు. బలవర్ధకములు. కాన భారజలమును విడిచి తజ్జలపానమునకు సంసిద్ధుడవు కమ్ము. మిత్రమా! మధురలఘుతిక్తములగు నర్మదాతోయములు మనసార గ్రోలి బలము పుంజుకొని అంతస్సారమున మత్కార్యసాధన కుద్యమింపుము. నిన్నేదియు నడ్డజాలదు. నీ మార్గమున కడ్డులేదు. వాయువుగూడ నిన్ను ప్రక్కకు నెట్టజాలదు. కదల్పలేదు. అవును జలదా! సారహీనుడు సర్వత్ర వర్జనీయుడు. అతడు నయవంచితుడు. అతని నెవరు గౌరవింతురు? దుర్బలుని ఎవరు పరిగణింతురు? ధనహీను నెవరు ప్రస్తుతించెదరు? అతడు నీతిబాహ్యుడు. పరిహాసాస్పదుడు. అతని నెవరు లక్ష్యపెట్టరు. అతని నందరు ధిక్కరింతురు. అతని కన్నివైపుల నిరాదరణము, నిరాకరణము. ధనమున్నవారిని, బలము గలవారిని లోకము గౌరవించును. మన్నన ఇచ్చి ప్రస్తుతించును. వారు సదా ఆహ్వానితులు. ఆదరణీయులు. వారే కులీనులు. వారే అధిపతులు. వారి నెవ్వరు కదపజాలరు. అడ్డజాలరు. జలదా! అంతేకాదు. దుర్బలుడు వధ్యుడు; సబలుడు వంద్యుడు. అల్పత్వము నింద్యము; గురుత్వము గౌరవహేతువు. లోకము తీటిది. పోకడ యిది. నీకు తెలియనిదికాదు. ఇందు మేఘునికి వృష్టిరూపవమనానంతరము తిక్తమద మిశ్రితజలపానమున వాయుపీడన యుండనేరదని నుడువుటచే వమనశోధితుడు తదనంతరము శ్లేష్మశోషణార్థము లఘుతిక్తకషాయంబు పానమున లబ్ధబలు డగుటం జేసి వానికి వాతప్రకోప ముండదని ధ్వనించుచున్నది. ఇందు తృతీయచరణమందలి విశేషార్థము చతుర్థచరణమందలి సామాన్యార్థముచే సమర్థింపబడుటంజేసి అర్థాంతరన్యాసాలంకారము.

అవ. సారంగములు మేఘునికి మార్గము సూచించుట -

శ్లో. నీపం దృష్ట్వా హరితకపిశం కేసరై రర్ధరూఢై
రావిర్భూతప్రథమముకులాః కన్దలీశ్చానుకచ్ఛమ్,
జగ్ధ్వారణేష్వధికసురభిం గన్ధమాఘ్రాయ చోర్వ్యాః
సారఙ్గాస్తే జలలవముచః సూచయిష్యన్తి మార్గమ్. 21

అ. సారఙ్గాః=హరిణమత్తేభములు, అర్ధ-రూఢైః=సగ మావిర్భవించిన, కేసరైః= కింజల్కములచేత, హరిత-కపిశం = పాలాశవర్ణమగు, నీపం =కదంబ వృక్షమును,

దృష్ట్వా = చూచియును, అనుకచ్ఛం =చిత్తడినేల ననుసరించి, ఆవిర్భూత-ప్రథమ- ముకుళాః =ఉదయమందిన ప్రథమకలికలుగల, కన్దళీః=నేలయరటితీగలను, జగ్ధ్వా చ =భక్షించియు, అరణ్యేషు =వనభూములందు, అధిక-సురభిమ్= మిక్కిలి పరిమళించు, ఉర్వ్యాః=భూమియొక్క, గన్ధం=గంధము (సౌరభము)ను, ఆఘ్రాయ చ =ఆఘ్రాణించియు, జల-లవ-ముచః =జలకణముల వర్షించుచున్న, తే=నీయొక్క, మార్గం=మార్గమును, సూచయిష్యన్తి =సూచించగలవు.

భా. జలదా! నీ మార్గము దాగమన్నను దాగదు. నీ జాడ అడుగకున్నను దానంత టదియే చాటుచున్నది. నీవు వదాన్యుడవు. ధర్మపరుడవు. దానశీలుడవు. జీవన (నీరు)దానమున నీవు జీవలోకమును సజీవ మొనర్చుచున్నావు. నీవు లేనిది జీవకోటికి జీవమేది? బ్రతు కెక్కడిది. చరాచరాత్మకమగు ఈ ప్రపంచ మంతటికిని నీ వాధారభూతుడవు. ఆప్తబంధుడవు. ఆపద్బాంధవుడవు. చేతన - అచేతన భేదభావ మెఱుగక సమభావమున మెలగు ధీమంతుడవు నీవు. ఆర్ద్రీభావమున వర్షించు వదాన్యతయే నీ గమనమార్గమును వేనోళ్ళ చాటుచున్నది. నీ దయాదృష్టి యగు వృష్టి యెట నున్న అట ప్రకృతి పులకించి నవ్యరూపము భవ్యరూపము ధరించుచున్నది. పుడమి చిత్రవర్ణమున దీపించుచున్నది. చాతకము లవిగో నీకు స్వాగతము పలుకుచున్నవి. నీ జలకణములేగదా వాటికి జీవనాధారములు. నీవు లేమి వాటికి నీరము లేదు. వాటి కది దుర్దినము. (నేలబడిన నీరు ముట్టదు చాతకము) ఇక భృంగముల మాటయా! నీ రాక వాటికి కుసుమరససంతర్పణ. మధుర మధురప పానీయము. నీ యాగమనమున కవి మురిసి మైమఱచి ఝుంఝుమ్మని అవ్యక్త మధురాలాపముల సుస్వాగతము పలుకుచున్నవి. నీవు వర్షించినగదా తరులతాదులు పుష్పసంభరితము లగుట. అవి నిన్నెట్లు మరువగలవు? ఇక హరిణముల కుప్పిగంతులు, ఇభరాజముల ఆర్భాటములు చెప్పనేల? అరవిచ్చిన కింజల్కములు, పచ్చ పచ్చని పచ్చిక బయళ్లు, నీలి నీలిమ కడిమిచెట్లను జూచి ఆనందమున త్రుళ్ళిపడుచున్నవి. మోదమున మిడిసి పడుచున్నవి. జలదా! నీ రాకవలన తేమనేలను తీరము వెంబడిని నేలయరటులు, వాటి కింజల్కములు, ముకుళములు వానికి కమనీయమగు విందులు. మధురభోజనములు. కనుకనే నీ కవి హృదయ పూర్వక స్వాగతము పలికి హృదయభారమున వీడ్కో లొసగు చున్నవి. అంబుదా! గ్రీష్మతాపసంతప్తవనములందు, దావాగ్నిదగ్ధభూములందును నీవు రాల్చిన జలకణముల నెగసిన మధురమృత్తికాసౌరభములు ఘ్రాణతర్పణగ ఆరగించి మోదమందిన, భృంగ కురంగ చాతక మత్తగజములు నీ కత్యంతము కృతజ్ఞత తెలుపగలవు. నీ జలదాన ఔదార్యమును వేనోళ్ళ చాటి మార్గమును జూపుచున్నవి. మిత్రమా! నీ వత్యంత ధన్యుడవు. అనగా కదంబకుసుమము కన్దళీముకుళము పృథివీగంధము జూచి ఇందిందు వర్షించితివని ఈ మార్గమున

పయనించితి వని ఊహించబడుచున్నది.

ఇందు నీపకుసుమ కందళీకళిక పృథివీగంధ కార్యములచే వర్షపాత మూహింపబడుట సందేహాలంకారము.

అవ. సిద్ధులు మేఘునికి ధన్యవాదము లర్పించుట -

శ్లో. అమ్భోబిన్దుగ్రహణచతురాం శ్చాతకాన్ వీక్షమాణాః
శ్రేణీభూతాః పరిగణనయా నిర్దిశన్తో బలాకాః,
త్వా మాసాద్య స్తనితసమయే మానయిష్యన్తి సిద్ధాః
సోత్కంఠాని ప్రియసహచరీసంభ్రమాలిఙ్గితాని. 22

అ. అమ్భో-బిందు-గ్రహణ-చతురాన్ = వర్షోదకబిందువుల గ్రహించుట యందు నేర్పుగల, చాతకాన్ =చాతకపక్షులను, వీక్షమాణాః = చూచుచున్న వారును, శ్రేణీభూతాః =పంక్తిబద్ధము లగు, బలాకాః = బెగ్గురుపక్షు (ఒక జాతిబకము) లను, పరిగణనయా =ఒకటి, రెండు, మూడని లెక్కించుటచేత, నిర్దిశన్తః= వ్రేలితో చూపుచున్నవారు నగు, సిద్ధాః = సిద్ధులు (దేవజాతి), స్తనిత-సమయే =నీవు ఉరిమినపుడు, సోత్కంఠాని =ఉద్వేగముతోకూడిన, ప్రియ సహచరీ -సంభ్రమ-ఆలింగితాని = ప్రియురాండ్ర తత్తరపాటుతోడి కౌగిలింతలను, ఆసాద్య =పొంది, త్వాం = నిన్ను, మానయిష్యంతి =అభినందింతురు.

భా. జలదా! పశుపక్ష్యాదులకుగూడ గ్రహణశక్తి ఏమంత తక్కువ గాదు. సాధారణముగ ఏరికిని అవి తీసిపోవు. చాతకములనే చూడుము. నీనుండి లభ్యమగు జలబిందువుల నవి ఆకసమున ఎగురుచునే గ్రహించుచున్నవి. నేలబడిన నీటిబొట్టుల నవి ముట్టనే ముట్టవు. వాటి కవి గిట్టనే గిట్టవు. వాటి కవి అపథములు, అస్పృశ్యములు. పుడమిబడిన వర్షబిందువులు కలుషితము లని వాటి భావన. వాటి శుచి - శుభ్రత, అభిరుచి అట్టిది. ఎవరు నేర్పిరి వాటి కా విద్య? ఎందు నేర్చినవి? ప్రకృతిలబ్ధ మది. జన్మతః లభించిన వరప్రసాద మది. ఇక బలాకములన్ననో! క్రమబద్ధముగ శ్రేణులు గట్టి గగనవీథి నవి తరలుచుండ ఆ దృశ్య మెంత రమ్యము? ఆ ముచ్చ టేమని చెప్పగలను? మల్లెమాలలు ఆకసమున ఎగురుచున్నవా యనిపించును. తరళతారల విలసనములబోలి చూపరుల కవి కనువిందులు చేయును. ఆకసము ధరించిన ఆణిముత్తెపు సరములట్లు తళతళ మెరయుచు నేత్రపర్వము లగుచున్నవి. అందచందముల సయ్యాట లవి. జలదా! ఆకసమున జలకణములు నిపుణత నందుకొను చాతకముల వీక్షించుచు గగనవీథిని పంక్తిబద్ధములగు బెగ్గురులను ఒకటి, రెండు, మూడని గణన సేయుచు ముగ్ధలగు ప్రియాంగనలకు హస్తనిర్దేశమున వినోదము

గొల్పుచు సిద్ధులు వాయుపథమున విహరింతురు. అట్టితరి నీవు గర్జించితివా! ఇక చూడు ఆ ముచ్చటలు! ఏమని చెప్పను! ముద్దు లొలికించు ఆ ముగ్ధ సిద్ధాంగనలు నీ యుఱుములకు బెదరి, ప్రియుల జేరియు యుద్వేగమున గాఢాలింగన మొనరింతురు. అవి అయాచిత స్వయంగ్రాహకము లగుట ప్రియుల కెంతయు ఆనందదాయకములు. అప్రయత్నలబ్ధమగు సంభ్రమాలింగనము లవి. ఉత్కంఠాపూరితములగు కౌగిలింతలు. మిత్రమా! అందుకు కారకు లెవరు? నీవే కదా! త్వన్నిమిత్తముననే కదా! ఆ సిద్ధులు అప్రయత్న అయాచిత ప్రియసహచరీ గాఢాలింగన సుఖప్రాప్తిచే నీ కత్యంతకృతజ్ఞతను ధన్యవాదము లర్పింతురు. గాఢముగా నిన్ను గౌరవింతురు. స్వాతినక్షత్రమున చాతకములు వర్షబిందువులను ఆకసమున ఎగురుచునే గ్రహించుననియు భూమిపై మఱెచ్చటబడినను ఆ జలమును ముట్టవనియు ప్రసిద్ధి. ఇందు సిద్ధులకు ప్రియాలింగనరూపమగు ఉత్కంఠితార్థము సిద్ధము గాన ప్రహర్షణాలంకారము. శ్రీమల్లినాథసూరి ఈ శ్లోకము ప్రక్షిప్త మనిరి.

అవ. యక్షుడు మేఘుని శీఘ్రముగ పయనించుమని అభ్యర్థించుట -

శ్లో. ఉత్పశ్యామి ద్రుతమపి సఖే మత్ప్రియార్థం యియాసోః
కాలక్షేపం కకుభసురభౌ పర్వతే పర్వతే తే,
శుక్లాపాఙ్గైః సజలనయనైః స్వాగతీకృత్య కేకాః
ప్రత్యుద్యాతః కథమపి భవాన్ గన్తుమాశు వ్యవస్యేత్. 23

అ. హే సఖే =మిత్రమా, మత్ప్రియార్థం = నా ఇష్టసిద్ధికొఱకు, ద్రుతం =శీఘ్రముగా, యియాసోః అపి =పయనించగోరినవాడవైనను, కకుభ-సురభౌ =కుటజకుసుమసురభితమగు, పర్వతే పర్వతే=ప్రతిపర్వతమందున, కాలక్షేపం=కాల విలంబనమును, ఉత్పశ్యామి = ఊహింతును. సజల-నయనైః=ఆనందాశ్రుపూరిత నయనములుగల, శుక్ల- అపాఙ్గైః =మయూరములచే, కేకాః=కేకారవము (నెమలి యఱపు)లను, స్వాగతీకృత్య =స్వాగతవచనములుగా జేసి, ప్రత్యుద్యాతః సన్= ఎదుర్కొ లొసగబడినవాడ వగుచు, భవాన్ =నీవు, కథమ్ అపి = ఏవిధముగనైనను, ఆశు =శీఘ్రముగ, గన్తుం=వెళ్ళుటకు, వ్యవస్యేత్ =ఉద్యమింతువుగాక.

భా. జలదా! నీ ప్రయాణప్రయాస మన్నిమిత్తమని యెరుగుదును. మత్ప్రీత్యర్థమనియు గుర్తించితిని. శీఘ్రగామి వగు నీ సంకల్ప మెంతయు ప్రశంస నీయము. అయినను నీకు కాలవిలంబనము తప్పదని ఊహించెద. మార్గమున అవరోధము లెక్కువ. కాని అవన్నియు వినోదపూర్వకములు. కన్నుల పండుగవు వినూత్నదృశ్యములు. విలక్షణసన్నివేశములు. అవి నిన్నెట్లు పోనీయును? నీ రాకకు హర్షసూచకముగ మోహజనకముగ నృత్య మొనర్చునవి కొన్ని. నీ

రాకచే ప్రయోజన మంది కృతజ్ఞత తెలుపునవి కొన్ని. నీకు స్వాగతము పలుకునవి మఱికొన్ని. నీ కన్నియు హర్షదాయకములు; ఆనందసంధాయకములు. నిజమే! ఆలస్యము అనర్థమునకు హేతువు. ఏకత్ర గాదు. పర్వతపర్వతమందున గిరిమల్లెపూలు. మధుర పరిమళ సంభరితము లవి. ఆ కుటజ కుసుమ సౌరభము లానక ఎవరు విడువగలరు? ఆ సుమసౌరభవిభవవిలసితములగు గిరిసానువుల విడిచి పొమ్మని నేనెట్లు నుడువగలను? ఆ యానంద మనుభవింపక నీవెట్లు పోగలవు? జలదా! కడకన్నుల మాణిక్యకాంతు లెగయ ఆ వనమయూరములు కనుగ్రుడ్ల ఆనందబాష్పము లుబుక ఎట్లు రాకకై వేచియున్నవో గమనించితివా! ఎదురుకోలున స్వీయవాక్కుల నీకు స్వాగతము పలుకుచున్నవి. నీ సన్మానమున కవి వేగిరపడుచున్నవి. నీ రాక వాటి కత్యంతమోదదాయకము. నీ యాగమనమున వాటి సంతోషమున కవధు లెక్కడివి? అటు చూడు. వేయి కన్నుల పురులు విప్పి యొడలు మరచి ముగ్ధమోహనముగ మనోరంజకమగు కదంబనృత్య మొనర్చుచున్నవి. అమృతము చిలుకుచున్నవి. మీ అన్యోన్యమైత్రి కది ప్రతీక. అవి నిన్నెట్లు విడువగలవు? మిత్రమా! వాటినెట్లు మరపింతువో ఏమో! ఎట్టెట్టులనో శీఘ్రగమనమున ముందుకు సాగిపొమ్ము. అదియే నా వేడుకోలు.

వర్షఋతువున మత్తు మత్తుగా నాట్యమాడు మయూరముల నేత్రకోణములనుండి జలకణములు జాఱుననియు, మయూరిణు లా జలబిందువులు గ్రహించి గర్భము దాల్చుననియు జనశ్రుతి. నెమలి యఱుపును కేకారవ మందురు. ఈ శ్లోకమున కేకారవమం దారోపితమగు స్వాగతవచనము ప్రస్తుతప్రత్యుద్గమనోపయోగ మగుట పరిణామాలంకారము. ఆరోప్యమాణము ప్రకృతోపయోగియైన పరిణామమని అలంకారసర్వస్వము.

అవ. దశార్ణదేశ వర్ణన -

శ్లో. పాణ్డుచ్ఛాయోపవనవృతయః కేతకైస్సూచిభిన్నై
ర్నీడారమ్భైర్గృహబలిభుజా మాకులగ్రామచైత్యాః,
త్వయ్యాసన్నే పరిణతఫలశ్యామజమ్బూవనాన్తాః
సమ్పత్స్యన్తే కతిపయదినస్థాయిహంసా దశార్ణాః. 24

అ. హే మేఘ =ఓ జలదా! త్వయి= నీవు, ఆసన్నే సతి = సన్నిహితుడవు కాగా, దశార్ణాః= దశార్ణము లను జనపదములు (గ్రామములు), సూచి-భిన్నైః=ముకుళ (మొగ్గ) అగ్రభాగముల ఇంచుక వికసించిన, కేతకైః = మొగలిపూవులచే, పాణ్డు-చ్ఛాయా-ఉపవన-వృతయః =పాండువర్ణమగు ఉద్యానవన

ఆవరణము (కంచెలు)లు గలవియు, గృహ-బలి-భుజాం =గృహబలులు భుజించు కాకాదిపక్షులయొక్క, నీడ- ఆరమ్భైః= గూళ్ళ నిర్మాణ ఆరంభముచేత, ఆకుల - గ్రామ- చైత్యాః = వ్యాప్తములగు గ్రామమందిరములు, మార్గమందలి వృక్షములు గలవియు, పరిణత- ఫల-శ్యామ-జమ్బూవన-అంతాః=పండిన ఫలములచే నీలవర్ణ మగు నేరేడు వనములచే రమ్యమైనవియు, కతిపయ-దినస్థాయి-హంసాః=కొలది దినములు మాత్ర ముండు హంసలు గలవియు, సంపత్స్యన్తే =అగుచున్నవి.

భా. జలదా! నీ వించుక ముందుకేగ దశార్ణజనపదములు నీ కంటబడును. వాటి కొక విశిష్టమగు చరిత్ర గలదు. సకలార్థసంపన్నము లవి. సర్వసౌఖ్యావహములు. సకలకళాశోభితములు, సర్వశాస్త్రసంగతములు, సుప్రసిద్ధములు, భోగభాగ్యవిలసితములు. నీ రాక నవి మఱింత శోభాయమానము లగును. ఎన్నియో ఆరామము లున్నవి. అచటి ఉపవనములు అరవిచ్చిన కోరకముల, సుమధుర సౌరభములు చిమ్ము మొగలి వృక్షముల, యావరణము (కంచె)లతో కలకలలాడుచుండును. పాండువర్ణశోభితము లవి. మనోరంజకములు. ఇక చైత్యము లందువా! శకుంతసంతానసంకీర్ణములు. ఏల నందువా? నీ రాక వాటి కొక హెచ్చరిక. వర్షోదయమున కులాయములు లేక అవెట్లు జీవించగలవు? గృహస్థు లిడు అన్నాదికము భుజించి మనగలుగు కాకాదిగృహవిహంగము లన్నియు కులాయ (గూళ్ళు) నిర్మాణసంరంభమున నిమగ్నము లగుట పురమందిరము లేమి, దేవాయతనము లేమి బౌద్ధారామము లేమి, మార్గకూటములు, వృక్షపంక్తు లేమి అవన్నియు కిలకిలారావముల కలకూజితముల కలకలలాడును. కన్నులపండువుగా నుండును. మిత్రమా! నీ రాకను పండిన పండ్లతో నిండి నీలవర్ణమున ప్రకాశించు జంబూవనము లెంత మనోరంజకములు ! ఎంత హృదయాకర్షకములు! అవి పథికమనము లాకర్షింపక విడిచిపుచ్చునా! ఇక హంసల సంగతి చెప్పవలయునా? ఎన్నాళ్ళు నిలువగల విచట? నీరాక తడవుగా నవి స్వస్థానమును జేర సన్నద్ధమగును. మానసము తరలిపో సిద్ధమగును. జలదా! నీ ఉదయమున అంతయు సంరంభమే గదా! దశార్ణములందలి ముచ్చట లవి. దశదుర్గము లుండుటచే దశార్ణము లందురు. 'ఆధునిక ఛత్తీస్‌గఢ్‌ను దశార్ణ మందురు. దీనికిని దుర్గసామ్య మగపడుచున్నది. ఇదే ప్రదేశమున దశార్ణ అను నది ప్రవహించుచున్నది. ప్రాచీనకాలమున సాధుసత్పురుషసమాధులు వీథుల కూడలియందున లేక మార్గసమీపమున నిర్మింపబడెడివి. అట వటాదివృక్షములును నాటబడెడివి. అట్లగుట ప్రజలుత్తేజితు లగుదురని వారి భావన. వాటినే చైత్యము లందురు. చైత్య మన బౌద్ధారామము. మందిరము. ఇందు మేఘుని ఉత్తమగుణముచే దశార్ణమునకు శోభారూపమగు గుణప్రాప్తికథనమున ఉల్లాసాలంకారము.

అవ. విదిశానగరీవర్ణన -

శ్లో. తేషాం దిక్షు ప్రథితవిదిశాలక్షణాం రాజధానీం
గత్వా సద్యః ఫలమవికలం కాముకత్వస్య లబ్ధా,
తీరోపాన్తస్తనితసుభగం పాస్యసి స్వాదు యత్త
త్సభ్రూభఙ్గం ముఖమివ పయో వేత్రవత్యాశ్చలోర్మి. 25

అ. హే మేఘ= ఓ జలదా! , దిక్షు =దిశలందు, ప్రథిత-విదిశా- లక్షణామ్ =ప్రసిద్ధమగు విదిశానగర మను పేరుగల, తేషామ్=దశార్ణజనపదముల యొక్క, రాజధానీమ్= ముఖ్యపట్టణమును, గత్వా =చేరి, సద్యః=వెంటనే, కాముకత్వస్య =రసికత్వముయొక్క, అవికలమ్=సంపూర్ణమగు, ఫలమ్= ప్రయోజనము, లబ్ధా =పొందబడును (ప్రాప్తించును), యత్= ఎందుచేనన, తత్ =ఆ, స్వాదు =రుచ్యము (మధురము), చల-ఊర్మి =కదలాడెడి కెరటములుస గల, వేత్రవత్యాః =వేత్రవతీనదియొక్క, పయః=జలమును, స-భ్రూ-భఙ్గమ్ =కనుబొమముడిపాటుతోడి, ముఖమ్ ఇవ =మోమును వలె, తీర-ఉపాన్త-స్తనితసుభగం .యథా తథా = తీరప్రాంతగర్జనతో సోల్లాసముగ, పాస్యసి =ఆస్వాదించగలవు.

భా. జలదా! విదిశానగరము జగత్ప్రసిద్ధము. దశార్ణదేశపు రాజధాని యది. రాజు లుండు తావు. ప్రభుత నెఱపు ప్రధానకార్యాలయముల కేంద్రము. తెలియును గదా! సిరిసంపదలకు, భోగభాగ్యములకు నెలవు. సమస్తకళలకు సంగమస్థల మది. నీ కది మార్గమధ్యమున గలదు. అట చేరుటయే తడవు. ఎనలేని సంతోష మందగలవు. విలాసఫల మొందగలవు. కాముకత్వఫల మనతి కాలమున సిద్ధించును. ఎట్లందువా? అట వేత్రవతి ప్రవహించుచున్నది. నీ రాకకై చిరకాలముగ వేచియున్నది. దాని జల మత్యంతమధురమైనది. అధర మధురరసతుల్య మది. అదరిన పెదవులవలె అది చలోర్మి. నవయౌవన మదాలస యగు రమణీలలామ భృకుటీముఖసదృశ మది. మిత్రమా! తీరో పాంతమున నీ వించుక ఉఱిమితివా? ఆ వైభవ మేమి చెప్పను! ఆ నీ ధ్వని రతి సమయమున ఉదయ మొందు లలిత కమనీయ మంజుల మనోజ్ఞ మణితమును తలపించును. నీ వా తరంగిణి మధురజలమును ఒయ్యారమున కులుకు సుందరీవదనము నదిమి పట్టి దశనపీడచే భృకుటీకృతమగు మోమునందలి అధరమధువును గ్రోలునట్లు ఆస్వాదించి అనుభవించగలవు. కామినుల అధరసుధారస - ఆస్వాదనము సురతసుఖమును అధిగమించు నందురు. మిత్రమా! నీ కది పూర్ణఫలముగదా! మధ్యప్రదేశమందలి ఆధునిక (భిలాసా) నగరమునే దశార్ణదేశపు రాజధాని విదిశానగర మందురు. వింధ్యయం దుద్భవించిన

ఆధునిక (బేతవా) నదినే వేత్రవతి యనుచున్నారు. అది మాళవదేశమున బ్రవహించుచు చివరకు (కాలపి) దిగువున, యమునలో గలియుచున్నది. ఇందు వేత్రవతీ మేఘములయందు లింగసామ్యమున నాయికానాయకఆరోపణమగుట సమాసోక్తి. 'సభ్రూభఙ్గం ముఖమివ' అనుచోట ఉత్ప్రేక్ష. రెండింటికి అంగాంగి భావమున సంకరాలంకారము.

అవ. యక్షుడు మేఘుని నీచైర్గిరిని విశ్రమించ అనురోధించుట -

శ్లో. నీచైరాఖ్యం గిరిమధివసేస్తత్ర విశ్రామహేతో
స్త్వత్సమ్పర్కాత్పులకిత మివ ప్రౌఢపుష్పైః కదమ్బైః,
యః పణ్యస్త్రీరతిపరిమళోద్గారిభిర్నాగరాణా
ముద్దామాని ప్రథయతి శిలావేశ్మభిర్యౌవనాని. 26

అ. హే మేఘ=ఓ జలదా!, తత్ర=విదిశాసమీపమున, విశ్రామహేతోః =విశ్రాంతి నిమిత్తము, ప్రౌఢ-పుష్పైః=చక్కగా విరిసిన పుష్పములు గల, కదమ్బైః=కడిమిచెట్లతో, త్వత్-సమ్పర్కాత్=నీ సాంగత్యమున, పులకితమ్ ఇవ స్థితమ్=గగుర్పొటందినదివలె నున్న, నీచైః-ఆఖ్యం=నీచైరాఖ్య (నిమ్న)మను, గిరిమ్=కొండను, అధివసేః=విశ్రమింపుము; యః= ఏ నీచైర్గిరి, పణ్య-స్త్రీ-రతి-పరిమళ - ఉద్గారిభిః=వారవనితల రతిక్రియల పరిభుక్తములగు సౌరభములను వెలువరించు, శిలా-వేశ్మభిః=కందరములచే, నాగరాణాం=పౌరులయొక్క, ఉద్దామాని=ఉత్కటములగు, యౌవనాని =యౌవనములను, ప్రథయతి=ప్రకటించుచున్నదో.

భా. మిత్రమా! నీకు అలసట రాకమానదు. ప్రయాణమా! దీర్ఘము. ఎకాయెకిని పోవు టెంతకష్టము! మార్గమా! నిమ్నోన్నతము. కొండలు గుట్టలు నదులు నదములు అన్నియు ఆటంకములే. ఆకసమున బోవు నీ కవి అంత అడ్డురాని మాట నిజమే. అయినను నీ యాత్ర సంతోషదాయకమైనను అంత సుగమమైనది కాదు. ఆరోహణము, అవరోహణము తప్పదు గదా! మార్గమధ్యమున ఎన్ని వినోదములున్నను అలసట తప్పునా? విశ్రాంతి అవసరము. విదిశాసమీపమున నీచైర్గిరి నీకై వేచియున్నది. నిన్నాహ్వానించుచున్నది. అందించుక విశ్రమించి అటనున్న ముచ్చట వీక్షింపుము. కడిమిపూలు దండిగా విచ్చి కన్నులకు వింత విందులు గూర్చుచున్నవి. అందములు విరజిమ్ముచున్నవి. ఎంత హృదయరంజకము లవి? ఎంత మనోహరములు! నేత్రోత్సవములు! పూలపై పూవులు. పుష్పగుచ్ఛములు. జలదా! నీ సంపర్కమున నీపకుసుమములనుండి ఆనందపరవశత్వమున ఆ కొండలు పులకాంకితమగును. ఆనందసాగరమున తేలియాడును. అందెన్ని గుహలు! శూన్యగృహములు కావవి. నగర సామీప్యమగుట నాగరికుల కవి అందుబాటున నున్నవి. వారు భోగలాలసులు.

వనితాసక్తులు. వారకాంతల గూడి వారచట రతిలీలల మునిగి తేలుదురు. భోగముల రూపెరింగినవార లగుట రూపాజీవికలగూడి సరససల్లాపముల చొక్కుచు సోలుచు ఆనందడోలికల నూగెదరు. నవయౌవనులు వారు. ఉత్కట వయస్కులు. వా రుపభోగించిన మాదకద్రవ్యముల మధురపరిమళములను ఆ శిలావేశ్మలు వెడలగ్రక్కుచున్నవి. ఎల్లెడల సుగంధద్రవ్యముల కమ్మని వాసనలు గుబాళించుచున్నవి. అవి వారి యుత్కటయౌవనమును, విలాసవైఖరులను చాటుచున్నవి. మిత్రమా! ఆ నీచైరాఖ్యము అంత ఉన్నతముగాక అధిరోహించుట కనువైనది. అందలి సమృద్ధసుమమంజరులు కుసుమవికాసవిలసనములు మత్తు గలిగించు సుమధురసౌరభములు నయనానందకరములు. ఘ్రాణతర్పణములు. విశ్రాంతిదాయకములు. మానసోల్లాస హేతువులు.

విదిశానగర రూపాజీవికలు (వారకాంతలు) విశృంఖలవిహారార్థము నీచైర్గిరి కందరముల కేగి విలాసవర్ధకములగు మాదక (మత్తుగలిగించు) సుగంధద్రవ్యముల నుపయోగించువార లగుట తద్గృహలు సుగంధద్రవ్యసువాసితములగుచు మధుర కమనీయపరిమళములను వెలువరించుచున్నవని భావము. ఇం దుద్గారశబ్దము గౌణార్థకము. ముఖ్యార్థము గాదు. అలంకారము ఉత్ప్రేక్ష.

అవ. యక్షుడు మేఘుని విశ్రాంత్యనంతరము ముందుకు సాగుమని అర్థించుట -

శ్లో. విశ్రాంతః సన్ వ్రజ వననదీతీరజాతాని సిఞ్చ
న్నుద్యానానాం నవజలకణై ర్యూథికాజాలకాని,
గండస్వేదాపనయనరుజాక్లాంతకర్ణోత్పలానాం
ఛాయాదానాత్ క్షణపరిచితః పుష్పలావీముఖానామ్. 27

అ. హే మేఘ!=ఓ జలదా!, విశ్రాంతస్సన్=విశ్రమించినవాడవై, వన- నదీ-తీర-జాతాని=అడవుల నదీతీరముల ఉద్భవించిన, ఉద్యానానామ్= ఉపవనములయొక్క, యూథికా-జాలకాని=గిరిమల్లిమొగ్గలను, నవ-జల- కణైః=నూతనజలకణములతో, సిఞ్చన్=తడుపుచు, గండ-స్వేద- అపనయన-రుజా-క్లాన్త-కర్ణ-ఉత్పలానామ్=కపోల (చెక్కిళ్ల) స్వేదబిందువులను తుడుచుటచే నైన పీడనచే వాడిన కర్ణములందలి కలువలుగల, పుష్ప-లావీ-ముఖానామ్=పూలు గోయు ముద్దు గుమ్మల మోములకు, ఛాయా-దానాత్=నీడనిచ్చుటవలన, క్షణ-పరిచితః=క్షణకాలము (కొద్దిసేపు) పరిచితుడవై, వ్రజ=వెళ్ళుము.

భా. జలదా! మరొక్కమాట. ముందు విశ్రాంతి. ప్రయాణప్రయాస తొలగింపు. ఆ మీదట నీ తదుపరియాత్ర. నీవు పయనించు మార్గమధ్యమున ఎన్నియో ఉపవనము లున్నవి. పెంచి పోషించినవి కావు, ప్రకృతిసిద్ధములు. వాటంతట ఆవిర్భవించినవి. కాననముల, నదీతీరముల, కొండలోయల,

చలువనేలల తమకు తాముగా పుట్టి పెరిగి నవకోరకముల నిండారి కొండమల్లె లించుక మధురసౌరభము లీనుచున్నవి. నీవు తొలకరి జలకణములు చిలకరింప అవి విచ్చి మధురసుగంధములను వనాంతములకు గొనిపోగలవు. మఱియు తన్నదీజలములు మధుగంధరసప్లావితము లగును. మిత్రమా! అ సుమసౌరభములకు గిరికాననములే గాదు. నదీనదములును శిలలునుగూడ ప్రభావితము లగును. అందుకు కారకుడవు నీవు. ఎంతటి సౌభాగ్యమది! నీవు ధన్యుడవు. జలదా! ఆ యుపవనముల పుష్పలావికలు పుష్పాపచయ మొనరింతురు. పల్లెపడుచులు వారు. వారు ముద్దరాండ్రు. కృతకభూషణము లెఱుగరు. వారు ప్రకృతిపూజారిణులు. ప్రకృతి ప్రసాదించిన నవకిసలయ కోరకములు విరిసిన సుమమంజరులు వారికి మదిమెచ్చిన యాభరణములు. ఒకరికి నీలోత్పలము లాభరణములైతే మఱియొకరికి తమ్మిపూవులు చెవికమ్మలు ; ఇంకొకరికి కిసలయకోరకములు. వారి యభిరుచు లట్టివి. ఇంకను వేసవితాప మంతరించలేదు. పాపము! వారి వదనభాగముల స్వేదబిందువు లంకురించుచునే యున్నవి. చెక్కిళ్లు చెమటలు కారుచున్నవి. తన్మార్జనమునకైన యొత్తిడులకు కర్ణోత్పలములు వాడుచున్నవి. ఆ ముద్దుగుమ్మల వదనకాంతులు తఱుగుచున్నవి. క్షణకాల మాగి ఛాయ (నీడ) నింపి ఆతపమును పోద్రోలి ఆ వనితలకు విశ్వాసపాత్రుడవు కమ్ము. పరిచయభాగ్యమంది వారి ప్రేమాదరములు చూరగొనుము. ధన్యత నొంది, జాగుచేయక అటనుండి తరలిపొమ్ము. ఇందు కాంతిదానము ధ్వనించుచున్నది. కాముకదర్శనమున కామినుల ముఖము వికసించును. ఇందు మేఘునియందు కాముకత్వస్ఫూర్తివలన సమాసోక్తి అలంకారము.

అవ. యక్షుడు మేఘుని ఉజ్జయినిని దర్శించుమని అర్థించుట-

శ్లో. వక్రః పన్థా యదపి భవతః ప్రస్థిత స్యోత్తరాశాం
సౌధోత్సఙ్గప్రణయవిముఖో మా స్మ భూరుజ్జయిన్యాః,
విద్యుద్దామస్ఫురితచకితై ర్యత్ర పౌరాఙ్గనానాం
లోలాపాఙ్గై ర్యది న రమసే లోచనై ర్వఞ్చితః స్యాః. 28

అ. హే మేఘ=ఓ యంబుదా! ఉత్తర-ఆశాం=ఉత్తరదిశ నుద్దేశించి, ప్రస్థితస్య=బయలుదేరిన, భవతః=నీయొక్క, పన్థాః=మార్గము, వక్రః యదపి=ఇంచుక చుట్టైనను, ఉజ్జయిన్యాః=ఉజ్జయినియొక్క, సౌధ-ఉత్సఙ్గ-ప్రణయ-విముఖః=సుధామయమగు రమ్యహర్మ్యముల ఉపరిభాగముల పరిచయపరాఙ్ముఖుడవు, మా స్మ భూః=కాబోకుము; యత్ర=ఏ విశాలానగరమున, విద్యుద్దామ-స్ఫురిత-చకితైః=మెఱుపుతీగల మిఱుమిట్లు భీతిజెందినవి యగు, పౌర-అఙ్గనానామ్=నగరవనితల యొక్క,

లోచనైః=చూపులతో, న రమసే యది=రమించనియెడల, వఞ్చితః=వంచితుడవు, స్యాః=అగుదువు.

భా. మిత్రమా! నీ కొక హితవు. తియ్యని పలుకు. శ్రవణముల కది పీయూషము. ముందించుక శ్రమయైనను అంతమున అది అత్యంతముదావహము. ఉత్తరమునకు పయనమైన నీ కా మార్గము ఇంచుక వక్రమే యగును. కొంచెము దూర మైనను కాదనకుము. ద్రుతగమనుడ వగు నీ కది యొక శ్రమగాదు. వచ్చిన యవకాశమును జారవిడువకుము. ఉజ్జయిని చూడక ముందుకు బోవు టేమంత యుక్తము గాదు. అది విద్యావినోదములకు ఉనికిపట్టు. లలితకళల కది ఆవాసము. నృత్యనాట్యములకు, రంగస్థలము. ఆ విశాలమగు వీథులు, వినోదదాయకములగు ఆరామములు, గుళ్లు గోపురములు, చైత్యప్రాకారములు, సుధా(గచ్చు)మయములగు రమ్యహర్మ్య (ప్రాసాద) ములు, ఆ అట్టాలికలు, వాటి అందచందములు, అందలి భాగ్యభోగ్యములు, అందు వసించు ఆ నాగరికసుందరాంగనల రూపురేఖలు, వారి హావభావవిలాసవైఖరులు అత్యంతదర్శనీయములు. కన్నులకు కమ్మని విందులవి. చూడక ఎట్లు పోగలవు? ఆ యున్నతప్రాసాద అట్టాలికావైభవప్రాబల్యమును చూడ జాఱవిడువకుము. దూరమని పెడమోము పెట్టక కన్ను లున్నందుకు కఱవుదీర వీక్షించి నేత్రసాఫల్య మొంది ముందుకు సాగిపొమ్ము. జలదా! ఆ పురాంగనల విలాసభంగిమలు ఆ ముద్దుగుమ్మల ముద్దు చైదములు ఏమని చెప్పను? ఎట్లని వర్ణించుట? అందున నీ యుఱుములకు, మెఱుపులకు భీతచిత్తలగు ఆ రమణీలలామల చకితచపలకటాక్షవీక్షణముల సోయగము లిట్టివని యెవరు వర్ణించగలరు? అసలు నాగరికయువతులు సహజభీతచిత్తలు. చంచలాక్షులు వారు. ఆపైన మేఘగర్జనలకు మెఱుపుమిఱుమిట్లకు వారి చైదము లెట్లుండును? ఇక వారి చూపులతీరులు తీపులు ఎట్లుండును? వాటికి విలువ లెక్కడ? పోలిక లెక్కడ? మిత్రమా! నీ వట జేరి ఒపురూపసౌందర్యశోభితలు, అభినవమదలీలాలాలసలు నగు ఆ పూబోడుల ముగ్ధమోహనవైఖరులను సౌందర్యమాధుర్యములను క్రీగంటిచూపుల తీపులను కనులార వీక్షించి కన్నులున్నందుకు ఫలము గనుము. జన్మసాఫల్య మందుకొనుము. అట్లు కాదేని కన్నులే కాదు జన్మయే వ్యర్థమగును.

నిర్వింధ్య వింధ్యాద్రిని బుట్టి ఉత్తరముగ బ్రవహించుచున్నది. నిర్వింధ్యకు తూర్పున ఇంచుకంతదూరమున శిప్రానదియొద్దున అవంతిదేశరాజధాని ఉజ్జయిని యున్నది. అయోధ్య, కాశీ మున్నగు సుప్రసిద్ధనగరములలో నిది యొకటి. మేఘుడు పయనించు ఉత్తరాపథము నిర్వింధ్యకు పశ్చిమమున ఉన్న ఉజ్జయిని జూడగోటిన మేఘుడు తూర్పునకు బోవలయు గాన మార్గము వక్రమగుచున్నది. వంచితుడన - ఉజ్జయినీనగర మగువల ముగ్ధమోహనరూపలావణ్యముల, చంచలకటాక్షవీక్షణముల

మాధుర్య మనుభవించని మేఘుని జీవితము వ్యర్థమని భావము. 'సుభాషితేన గీతేన యువతీనాం చ లీలయా, యస్య న ద్రవతే చిత్తం స వై ముక్తోథవా పశుః'. ఇందు పురాంగనల కటాక్షరసానుభవము లేక మేఘుని జన్మ శోభించదనుట వినోక్త్యలంకారధ్వని.

అవ. యక్షుడు మేఘుని నిర్వింధ్యాజలము నాస్వాదింప అనురోధించుట -

శ్లో. వీచిక్షోభస్తనితవిహగశ్రేణికాంచీగుణాయాః
సంసర్పంత్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః,
నిర్వింధ్యాయాః పథి భవ రసాభ్యంతరః సన్నిపత్య
స్త్రీణామాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు. 29

అ. హే మేఘ=ఓ మేఘుడా! పథి=ఉజ్జయినీమార్గమందు, వీచి- క్షోభ-స్తనిత-విహగ-శ్రేణి-కాఞ్చీగుణాయాః= తరంగచలనమున కలధ్వను లొనరించు హసపంక్తియే కటిసూత్రముగా కలదియు, స్ఖలిత-సుభగం యథా తథా=ఉపల (రాళ్ళ) స్ఖలనము (పక్షాంతరమున మదస్ఖలనము)న మనోజ్ఞముగా, సంసర్పన్త్యాః=ప్రవహించుచున్న (నడచుచున్న)దియు, దర్శిత-ఆవర్త-నాభేః=ప్రకటీకృత జలభ్రమణము (సుడి) (నాభి) కలదియు నగు, నిర్విన్ధ్యాయాః=నిర్విన్ధ్యానదియొక్క, సన్నిపత్య=సమీపమునుజేరి, పథి=మార్గమున, రస-అభ్యన్తరః= జలము నానినవాడవు (శృంగారరసాంతరంగుడవు), భవ=అగుము. స్త్రీణామ్ =ప్రమదలకు, ప్రియేషు =వల్లభులయందు, విభ్రమః=విలాసము, ఆద్యమ్=మొదటిదగు, ప్రణయ-వచనమ్ హి=ప్రణయప్రకటన గదా!.

భా. జలదా! మార్గమధ్యమున నిర్వింధ్య అనుకూలనాయికవలె నీ రాకకై ప్రణయతాపమున వేచి యున్నది. స్వర్ణకటిసూత్రము ధరించి కాంతివెల్లువలు వెలార్చుచు మధుసేవనమున మత్తు గలిగి అడుగులు తడబడ నొయ్యారముగ నడయాడుచు ప్రియదర్శనప్రణయభావమున అనావరణముగ సాగసు పొక్కిలి తేటపడగ హావభావవిలసనమున దోగు మదలాలస యగు మగువవలె రస (జల) తరంగితహృదయమై నిన్నలరింప నిరీక్షించుచున్నది. చంచలతరంగముల తాకిడికి ముఖరిత (ధ్వనిత) మగు కలహంసపంక్తియే ఈ నది ధరించిన మనోజ్ఞ మంజులకిణకిణధ్వనుల కాంచీదామము. స్వర్ణకటిసూత్రాభరణము. చిరుగంటల బంగారుమొలనూలు. మఱియు నిమ్నోన్నతములగు ఉపలముల తొణుకుచు తొట్రుచు ముద్దులొలుకు ఉద్వేగమున బ్రవహించు ప్రవాహమున పొటమరించు ఆవర్త (జలభ్రమణ) రూపమగు నాభిని ప్రణయసూచకమగు లీల (వయ్యారము)గా ప్రకటించుచున్నది. మిత్రమా! ధన్యుడవు! అప్రార్థితముగ అనుభవించు టెట్లని

సంకోచమా! వలదు. సందేహము రూపుమాపి సన్నిహితుడవు గమ్ము. ఏల యందువా! మగువలకు ప్రియులయెడ ప్రణయప్రకటన విభ్రమమే గదా! హావభావములతోడి ఒయ్యారమే గదా ప్రథమప్రీతివాచకము! ప్రేమ ప్రకటించు ప్రార్థనావాక్యము! వాగ్రూపమున గాక ఒయ్యారమున హావభావవిలాసమున వనితలు వల్లభులయెడ అనురాగము ప్రకటింతురు. ఇందు నిర్వింధ్యయందు మదవతియగు నాయికాత్వ ఆరోపణ జరిగినది. సమదయగు నాయిక నాయకునియందు కామప్రేరకమగు నాభిప్రదర్శనాది లలితమనోజ్ఞ శృంగారచేష్టను నెరపుచున్నది. ఎట్లన-

స్నిగ్ధం దృష్టిపథం విభూషితతనుః కర్ణస్య కణ్డూయనం
నాభేర్దర్శన ముత్పథం చ గమనం బాలస్య చాలిఙ్గనమ్,
కేశానాం చ ముహుర్ముహుర్వివరణం వార్తా చ సఖ్యా సహ
కుర్యుః ప్రీతివశాత్ స్త్రియః సమదనా దృష్ట్వా వరం వాఞ్ఛితమ్.

కనుక జలదా! రసతరంగిత హృదయుడగు కాముకుని వలె రసాభ్యంతరుడ (జలాభ్యంతరుడ)వై నిస్సంకోచముగ రమించుము-

ఆకారైరిఙ్గితైర్గత్యా చేష్టయా భాషణేన చ,
నేత్రవక్త్రవికారైశ్చ లక్ష్యతేఽ న్తర్గతం మనః.

- అని.

ఇందు విహగశ్రేణియందు కాంచీగుణము, ఆవర్తమందు నాభి, నిర్వింధ్యయందు నాయికాత్వము ఆరోపితములు. ఒకటి, రెండు శాబ్దికములు, మూడవది అర్థసంబంధమైనది. అలంకారము రూపకము. రసశబ్దమున శ్లేష. చతుర్థచరణమున పూర్వవాక్యసమర్థనచే అర్థాంతరన్యాసము. అంగాంగిభావమున సంకరము.

అవ. యక్షుడు మేఘుని సింధునదీకార్శ్యతను బాపుమని ప్రార్థించుట -

శ్లో. వేణీభూతప్రతనుసలిలా సా త్వతీతస్య సిన్ధుః
పాణ్డుచ్ఛాయాతటరుహతరుభ్రంశిభిర్జీర్ణపర్ణైః,
సౌభాగ్యం తే సుభగ విరహావస్థయా వ్యఞ్జయన్తీ
కార్శ్యం యేన త్యజతి విధినా స త్వయైవోపపాద్యః. 30

అ. హే మేఘ=ఓ జలదా! వేణీభూత-ప్రతను-సలిలా=జడను బోలిన అల్పప్రవాహము కలదియు, తట-రుహ-తరు-భ్రంశిభిః=తీరమందలి తరువుల నుండి జారిన (రాలిన) పండుటాకులచే, పాణ్డుచ్ఛాయా=పాండు (పాలిపోయిన)

వర్ణము గలదియు, అత ఏవ=కనుకనే, హే సుభగ= ధన్యుడవగు ఓ జలదా! విరహ-అవస్థయా=వియోగావస్థచేత, అతీతస్య= దేశాంతరగతుడ వగు, తే=నీయొక్క, సౌభాగ్యం=సుభగత్వ (అదృష్ట) మును, వ్యఞ్జయన్తీ=ప్రకటించుచున్న, సా=ఆ, సిన్ధుః=ఆ నిర్వింధ్య, యేన=ఏ, విధినా=ఉపాయ(కార్య)ముచే, కార్శ్యమ్= కృశత్వము (కృశించుట)ను, త్యజతి=విడుచునో, సః= ఆ ఉపాయము, త్వయా ఏవ=నీచేతనే, ఉపపాద్యః= నిర్వహింపబడవలసియున్నది.

భా. జలదా! నీ సమక్షమున ప్రత్యక్షమగు నిర్వింధ్య యవస్థను పరికించుము. ఆమె స్థితి యెటులున్నదో! ఒకరు చెప్పనేల! ప్రత్యక్షవిషయమునకు సాక్షు లెందుకు? నీవు ప్రోషితుడవు. దేశాంతరగతుడవు. ఆమె ప్రోషితభర్తృక. సతి. వేణీభూతప్రతనుసలిల.

"ఆర్తాఽఽర్తే ముదితే హృష్టా ప్రోషితే మలినా కృశా,
మృతే మ్రియేత యా పత్యా సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా."

ఆమె మలినకృశ. వేణివలె సన్నగా రేఖామాత్రముగా నిలిచియున్నది. సలిల మెక్కడిది? రస మెక్కడ? జీవ మేది? సారమెచ్చట! తీరతరువుల జీర్ణపర్ణములపై పాటున పాండువర్ణమై పాలిపోయినది. చెన్ను తఱిగినది. వెలవెలబోవుచున్నది. అయినను కాంతిరేఖ రేఖామాత్రముగ ఆమెనంటి విడువకున్నది. ఆమె దైన్యావస్థ యది. మిత్రమా! నీవు ధన్యుడవు. సుభగుడవు. ఆమె అన్యచింతన లేక నిన్నే దైవముగ నెంచి విరహభారమున క్రుంగి కృశించి తన పాతివ్రత్యమును చాటుచున్నది. నీ సౌభాగ్యమును ప్రకటించుచున్నది. నీ యదృష్టమును ఎత్తి చూపుచున్నది. జలదా! ఏది ఉపాయమో యోచింపుము. కర్తవ్య మాలోచించుము. ఏదోవిధమున ఆమె కృశత్వ మంతరించవలెను. ఆమె ప్రాతివత్యఫల మందవలయును. నిండారిన సంతోషమున ఆమె హృదయ ముప్పొంగవలయును. నిర్వహణ విధి నిర్వహించ నీవే యర్హుడవు. నీవలననే సాధ్య మది. గమనించదగిన విషయము. 'సా త్వతీతస్య' అనుచోట 'తా మతీతస్య' అను పాఠాంతరమున్నది. ఈ విషయమును మల్లినాథపండితులును ఉదాహరించియున్నారు. మార్గమున సింధునది యనునది లేదనియు అది కాశ్మీరునందలి ఒకానొక నదము మాత్రమేగాని నది కాదనియు అభిప్రాయపడిరి. తదనుసారము సింధు అన నది యను అర్థము ననుసరించి-సా సిన్ధుః అని నిర్వింధ్యానది యనియు, అతీతస్య అనగా చిరకాలమునకు విచ్చేసిన ప్రోషితుడనియు విశదపరచిరి. ఇతరులు కొందరు-తామతీతస్య అను పాఠమును గ్రహించి-తామతీతస్య' అన ఆ నిర్వింధ్యానదిని అధిగమించిన నీకు 'సింధు' అనగా కాళీసిన్ధునది ప్రత్యక్ష మగునను అర్థమును గ్రహించిరి. దేవగిరిని

పుట్టిన కాళీసింధునది నేడును మాళవదేశమున బ్రవహించుచు 'చంబల్' నదియందు గలియుచున్నదనియు వారు దానికి ఉపపత్తిని జూపుచున్నారు. అం దనౌచిత్యము గనిపించదు. పూర్వశ్లోకమున అలలు చెలరేగుచున్నవనియు, హంసలు బారులుదీరి విహరించుచున్న వనియు వివరించి నిర్వింధ్యను సర్వసమగ్రముగు విభ్రమవిలాసములతోడి ప్రమత్తనాయికగా ప్రదర్శించి, రసాభ్యంతరుడవు గమ్మని అనురోధించి, ఆమెను 'నిర్వింధ్యను' వెంటనే 'వేణీభూతప్రతనుసలిలా' అనియు, 'పాండువర్ణా' అనియు 'విరహపీడితా' అనియు ఆమె కార్శ్యమును తొలగింప నీవ సమర్థుడవనియు నుడువుటయం దంతగా సామంజస్య మగపడదు. 'తామతీతస్య' అను పాఠమే యుక్తమని తోచుచున్నది. 'వేణీభూత' అనుచోట కేశపాశమని ధ్వనించుచున్నది. విధి యన ఒకచో వృష్టి, అన్యత్ర సంభోగము. ఇందు లింగసామ్యమున నదియందు నాయికాత్వము, మేఘునియందు నాయకత్వము ఆరోపితమగుట సమాసోక్తి.

అవ. ఉజ్జయినీవైభవవర్ణన-

శ్లో. ప్రాప్యావన్తీ నుదయనకథాకోవిదగ్రామవృద్ధాన్
పూర్వోద్దిష్టా మనుసర పురీం శ్రీవిశాలాం విశాలామ్,
స్వల్పీభూతే సుచరితఫలే స్వర్గిణాం గాం గతానాం
శేషైః పుణ్యైర్హృతమివ దివః కాన్తిమత్ఖణ్డ మేకమ్. 30

అ. మిత్రమా! ఉదయన-కథా-కోవిద-గ్రామ-వృద్ధాన్=వత్సరాజుయొక్క కథాతత్త్వజ్ఞులగు గ్రామవృద్ధులుగల, అవన్తీన్ =అవన్తీనామకజనపద (గ్రామ)ము లను, ప్రాప్య=చేరి, పూర్వ-ఉద్దిష్టాన్=ఇంతకుముందు ప్రస్తావించబడినదియు, శ్రీవిశాలామ్=లక్ష్మీసంపన్నమైనదియు నగు, విశాలామ్ =ఉజ్జయిని యను, పురీమ్=నగరమును, అనుసర=అనుగమించుము. ఆ నగర మెట్లున్నదన, సు-చరిత-ఫలే=సత్ప్రవర్తన (పుణ్య) ఫలము, స్వల్పీభూతే సతి=అల్పమై నదికాగా, గామ్=భువిని, గతానామ్=చేరిన, స్వర్గిణామ్=స్వర్గవాసులయొక్క, శేషైః=భుక్తశేషములగు, పుణ్యైః=పుణ్యములచేత, హృతమ్=కొనిరాబడినదియు, కాన్తిమత్=తేజోవంతమైనదియు, ఏకమ్=ముఖ్యమైనదియు నగు, దివః=ర్గలోకము యొక్క, ఖణ్డమ్-ఇవ=తునకవలె నున్నది.

భా. మిత్రమా! నిర్వింధ్య నధిగమించి నీ వించుక ముందుకు బోవ అవంతీజనపదము లెదురగును. ఆ గ్రామసీమలం దచ్చటచ్చట ముచ్చటగు గోష్ఠులు జరుగుచుండును. శాస్త్రచర్చలు గావు. కథాకథనము లవి. వత్సరాజు ఉదయనుని ఉదంతములు. వాసవదత్తను గురించిన కథలు. ఆసక్తిదాయకములగు

వారి ముద్దుచెైదములు. వారు నెరపిన రసవత్తరములగు కార్యకలాపములు. గ్రామపెద్దలగు వృద్ధుల కవి కరతలామలకములు. ఆ యద్భుతకథల నిజతత్త్వము ఆమూలాగ్రము వారి కవగతము. ఆ కథల యథార్థమెఱిగిన కథకులు వారు. కథాకథనకుశలురుగూడ. ఆగంతుకులగు పెద్దలకు పిన్నలకు 'ఇది యిచ్చట, అది అచ్చట' యని ఏది ఎచ్చట ఏ విధముగ జరిగినదో ముచ్చటగా ముచ్చటింతురు. వినోదదాయకములగు ఆ పలుకులు వినుచు అనాయాసముగ నీవు అవంతిని జేరగలవు. అది ఆ దేశపు రాజధాని. మహావైభవోపేతమగు నగరము. అనర్ఘరత్నరాసులకు నెలవు. అత్యంతరమణీయ మగు పురము. విశాలమగు వీథులు, రమ్యములగు హర్మ్యములు, సమస్త వస్తుసముదాయ సుసంపన్నములగు విపణులు, ఫలపుష్పసంభరితములగు ఉపవనములు. విశ్రాంతి విహారములు. ఆరామములు. ఆహారఆరోగ్యవిహారముల కనువగు సుదీర్ఘసువ్యవస్థలు. అదీ ఆ నగరశోభ. జలదా! అచ్చటి ముచ్చట లించుక ముందుగనే సూచించితిని గదా! ఇక పురజను లందువా! వినోదప్రియులు, విద్యావినయసంపన్నులు, వదాన్యులు, ధార్మికులు, సరససల్లాపనిపుణులు. సద్గోష్ఠులు, సారస్వతచర్చలు, నృత్యనాట్యనాటకప్రదర్శనలు, సంగీతసాహిత్యసమావేశములు, లలితకళావిభవములు అన్నియు గల వచ్చట. సకలవిద్యలకు విభవములకు సంపదలకు నిలయ మది. ఆ నగరవైభవము ఎవరు వర్ణించగలరు? అది సారమగు స్వర్గశకలమా యనునట్లున్నది. స్వర్గసౌఖ్య మాశించి, పుణ్యము లాచరించి, స్వర్గభోగము లనుభవించి, శేషభోగము లనుభవింప పృథివికి దిగివచ్చు పుణ్యపురుషులు సారమగు స్వర్గఖండమును పుణికితెచ్చిరా అనున ట్లీ యవంతి సకలభూలోకనగరసౌభాగ్యసారవంతము.

ఉదయనుడు వత్సదేశపు రాజు. అతని రాజధాని కౌశాంబి. ప్రయాగ కది ముప్పది మైళ్ళు. ఆ ప్రదేశము నిపుడు 'కోసల్' యందురు. ఆయన భార్య వాసవదత్త. ఆమె ఉజ్జయినిరాజగు ప్రద్యోతుని పుత్రిక. ప్రద్యోతు డుదయనుని బంధించి తెచ్చి తన పుత్రిక వాసవదత్తకు వీణనేర్ప నియమించెను. కాలక్రమమున వాసవదత్త ఉదయనునిపై అనురాగ ముదయింప ప్రణయభావమున ముగ్ధురా లగుచు సమయము చిక్క అతనితో లేచిపోయినది. మాళవదేశపూర్వభాగమును అవంతీదేశ మందురు. దాని రాజధాని ఉజ్జయిని. అవంతి అవంతిక అనియు పిలువబడును.

'అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ హ్యవంతికా,
పురీ ద్వారవతీ చైవ సప్తైతా మోక్షదాయికాః.'

అని ప్రసిద్ధి. ఇందు ప్రకృత విశాలానగరమందు అప్రకృతమగు స్వర్గఖండము (దివః ఖణ్డమివ) అని సంభావించుటచే ఉత్ప్రేక్ష. 'శ్రీవిశాలాం విశాలామ్' అనుచోట యమకము. ఉభయసంసృష్టి యిది.

అవ. శిప్రానదీవాయువర్ణన-

శ్లో. దీర్ఘీకుర్వన్ పటు మదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః,
యత్ర స్త్రీణాం హరతి సురతగ్లాని మఙ్గానుకూలః
శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః. 32

అ. యత్ర=ఏ ఉజ్జయినియందు, ప్రత్యూషేషు= ప్రభాతసమయములందు, పటు =స్ఫుటమైనదియు, మద-కలమ్ =మత్తున అవ్యక్తమధురమైనదియు నగు, సారసానామ్=హంసలయొక్క, కూజితమ్=రుతమును, దీర్ఘీకుర్వన్=విస్తరింపజేయునదియు, స్ఫుటిత-కమల-ఆమోద- మైత్రీ-కషాయః=వికసిత పద్మసౌరభ సంపర్కమున గుబాళించునదియు, అఙ్గ- అనుకూలః=సుఖస్పర్శచే గాత్రా (దేహా) నుకూలమైనదియు నగు, శిప్రా-వాతః=శిప్రానదీ సమీరము (వాయువు), ప్రార్థనా-చాటుకారః=పునస్సురతమునకు ప్రియవచనములు పలుకు, ప్రియతమః ఇవ=వల్లభునివలె, స్త్రీణామ్=అంగనలయొక్క, సురత-గ్లానిమ్=రతిఖేదమును, హరతి=పోగొట్టుచున్నదో.

భా. మిత్రమా! కన్నులున్నందుకు ఫలమందవలెను. చల్లని సలిలములు కమ్మని కలహంస కలకూజితముల నొప్పు శిప్రానదీవైభవ మేమని వర్ణింతును! ఆ నదీతీరమున ఉన్నది ఉజ్జయిని. ఏ మహనీయు డెప్పుడు పునాదివేసెనో తెలియదు. కాని దానిశోభ మూడుపూవులు ఆరుకాయలుగా నున్నది. అది భోగభాగ్యములతో విరాజిల్లుచున్నది. ధార్మికులైనను ఆ నగరవాసులు భోగలాలసులు. సుఖాసక్తులు. అత్యంతసామీప్యమున గలగల ప్రవహించు శిప్రానది! అందలి శీతలసలిలములు! అందు అవ్యక్తమధురముగ మైకమున కలవర మొనరించు కలహంసపంక్తులు! స్ఫుటవికసిత పద్మసౌరభములు! ప్రభాతమున అందుండి ఎగసి ఒయ్యారముగ పయనించు మందసమీరములు! యౌవనమదాతిరేకమున పౌరు లొనరించు విలాసవిలసనములు! విలక్షణరతిప్రక్రియలు! ఎన్నని వివరించను? అవన్నియు రమణీయదృశ్యములు. కమనీయకార్యకలాపములు. కల్హారసౌరభములు, ఘ్రాణ తర్పణములు. కలహంసరుతములు కర్ణపేయములు. మిత్రమా! అవంతీనగరమున మదలాలసులగు యువతీయువకులు రతిపరిశ్రాంతులైనను, అలసి సొలసినను, రతుల మరగిన ఆ యువకులు అహర్ముఖమున అనునయపూర్వకమగు ప్రియవచనముల గంధమర్దనముల గాత్రస్పర్శల పునస్సురతమునకు ప్రియ సతుల బ్రేరేచెదరు. అర్థింతురు. ప్రథమసురతఖేద మపనయించిన గదా పునస్సురతము! అట్టియెడ ఆ శీతలశిప్రాగంధసమీరము ప్రియవల్లభునివలె ఆ యంగనల శ్రమ నపనయించును. ఎట్లన కలహంసల కలరుతమును దీర్ఘీకృతమొనర్ప

ఆ కమనీయధ్వని వాయుముఖమున పయనించి ఆ యంగనల వీనులకు హాయి నింపుచు కమ్మని విందు లందించుచున్నది. వికసిత కల్హార మధురగంధములు, పద్మపరాగ పరిమళములు సమీరసహాయమున పయనించి ఆ మదవతీఘ్రాణములకు తర్పణము లగుచున్నవి. ఇక ఆ శీతలగంధసమీరము ఆ రమణీలలామల రమణీయాంగముల సోకి సుఖస్పర్శల శ్రమాపనోద మొనర్చుచున్నది. అంత ఆ యువతీలలామలు విస్మృతరతిఖేదలై ప్రియవల్లభ వశంవద లగుదురు. 'ప్రార్థనాచాటుకారః,' అనుచోట 'ఖణ్డితనాయకానునీతా' అను వ్యాఖ్యానమున సురతగ్లానిహరణము సంభవము గాదు. ప్రథమసురత మున్ననే గదా తదపనయనము! కాన అది అనాలోచితము. "భర్త అన్యకాంతాసంగమున వికృతుడు కాగా ఈర్ష్యచే రోషకషాయితనేత్ర యగు స్త్రీ ఖండిత యనబడును.

"నీత్వాఽన్యత్ర నిశాం ప్రాతరాగతే ప్రాణవల్లభే,
అన్యాసంభోగచిహ్నైస్తు కుపితా ఖండితా మతా".

ఇందు సారసమదకలకూజితము, స్ఫుటితకమలామోదము, అంగానుకూలస్పర్శత్వము ఒకదెస, అనునయాత్మక మృదుభాషణము, విమర్దగంధత్వము గాఢాలింగనదత్త గాత్ర సంవాహనము మఱియొకదెస. ఇట్లు శిప్రావాయుప్రియవల్లభులకు సర్వసమత్వ మేర్పడుట పూర్ణోపమాలంకారము.

అవ. విశాలానగరవిపణుల రత్నాధిక్యతాదివర్ణన -

శ్లో. హారాం స్తారాం స్తరళగుటికాన్ కోటిశః శఙ్ఖశుక్తీః
ఘాసశ్యామాన్మరకతమణీ నున్మయూఖప్రరోహాన్,
దృష్ట్వా యస్యాం విపణిరచితాన్ విద్రుమాణాం చ భఙ్గాన్
సంలక్ష్యన్తే సలిలనిధయ స్తోయమాత్రావశేషాః. 33

అ. యస్యామ్ = ఏ ఉజ్జయినియందు, కోటిశః = కోట్లకొలది, విపణి-రచితాన్ =పణ్యవీథుల (షాపులయందు) ప్రదర్శింపబడినవియు, తారాన్ = మెరుగుపెట్టబడినవియు, తరళ-గుటికాన్ =మెరయుచున్న మధ్యమణులు గలవియు నగు, హారాన్=మౌక్తికరత్నహారములను, తథా=అదేవిధముగ అసంఖ్యాకముగ ప్రదర్శింపబడిన, శఙ్ఖశుక్తీః=శంఖములు ముత్తెపుచిప్పలను, ఘాసశ్యామాన్ =బాలతృణము (లేతగరికపోచ) వలె శ్యామవర్ణములును, ఉన్మయూఖ-ప్రరోహాన్ =మీదికెగయు కిరణకాంతులుగల, మరకత-మణీన్=గరుడపచ్చలను, తథా=అటులనే, విద్రుమాణామ్=ప్రవాళ (పగడము) ఖండములను, దృష్ట్వా=చూచి, సలిల-నిధయః=జలనిధులు, తోయమాత్ర-అవశేషాః=జలము మాత్రమే మిగిలినవిగా, సంలక్ష్యన్తే=అగపడుచున్నవి.

భా. మిత్రమా! నీ వొకపరి ఉజ్జయినీనగర పణ్య (బజారు) వీథులను తిలకించుము. అది యొక నేత్రోత్సవము. నయనానందకర మది. ఆ పట్టణవైభవము నీ కవగతమగును. విలాసవైభవ మున్నచోటనే మణులు, మాణిక్యములును, ధనముండు తావుననే మహార్ఘరత్నహారములు, ముత్తెపు సరములు, మణిభూషణములును. కోటికి పడగ లెత్తిన రత్నాల బేహారులు, అనర్ఘమణిహారవిక్రేతలగు వణిక్ప్రముఖులు ఆ నగరమున ఎందరైనను గలరు. వెల యెంతైనను వెనుకాడని విలాసప్రముఖులు ధనికప్రభువులు ఎందరో గల రచ్చట. విరామ మెరుగని క్రయవిక్రయములు. జలదా! నీ వొకపరి అటు వోయి ఆ విపణివీథుల వీక్షింపుము. ఎచట జూచినను రత్నాలరాసులు. వింతైన రత్న పేటికలు. ముత్యాలహారములు. నవమౌక్తికములు. ఉజ్జ్వలకాంతులు వెదజల్లు వివిధమణిభూషణములు. స్వర్ణహారములు. హారమధ్యగతతరళమణిప్రభావీచికలు. ప్రభాతారుణ తరళకాంతి సదృశములగు ప్రవాళఖండములు. ధవళకాంతుల ముచ్చటలు వెలార్చు శంఖములు, ముత్తెపుచిప్పలు. ఊర్ధ్వముగ కాంతికిరణములు ప్రసరింప బాలతృణము పగిది శ్యామవర్ణమున దీపించు మరకతములు (పచ్చలు) క్రమము తప్పక ముచ్చటగ ప్రసారితములు. వరుస వరుసను ప్రస్తరింపబడినవి. ముద్దుగా తీర్చబడి అవి అందమును, ఆనందమును చిలుకుచున్నవి. ఒకటి పదులు గావు. వందలు వేలు గావు. లక్ష లంతకంటెను గావు. కోట్లు! అసంఖ్యాకము లవి. అవన్నియు కృతకము లందువా! కాదు. అవన్నియు పరిశుద్ధములు. సానబట్టిన రత్నము లవి. పదారు వన్నెల స్వర్ణభూషణములు. విశుద్ధమౌక్తికహారములు. అకృత్రిమములు. నిర్దుష్టము లగు రత్నభూషణములు. తరళకాంతుల ముత్తెములు. అరుణకాంతుల పగడపు తునకలు. మిత్రమా! నేత్రోత్సవముగాదా! అది కన్నులపండుగ. సప్తసముద్రము లందురు. అవి రత్నముల కాకరములని ప్రసిద్ధి. ఎన్ని రత్నము లుండును. అవన్నియు నిట ఏకత్రిత మైనవా! అని యనిపించును. కాదేని ఆ జలనిధులు తోయమాత్రావశేషము లెట్లగును? జలదా! ఆ నగరమహత్త్వ మట్టిది. వైభవ మట్టిది. రత్నసంపదచే ఆ పురి రత్నాకరు నధిగమించినదని భావము. విపణుల అమూల్యవస్తుసమృద్ధి అభివర్ణితమగుట ఉదాత్తాలంకారము.

అవ. ఉజ్జయినికి సంబంధించిన కొన్ని జనశ్రుతుల కథనము -

శ్లో. ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోఽత్ర జహ్రే
హైమం తాలద్రుమవన మభూదత్ర తస్యైవ రాజ్ఞః,
అత్రోద్భ్రాన్తః కిల నళగిరిః స్తమ్భముత్పాట్య దర్పా
దిత్యాగన్తూన్ రమయతి జనో యత్ర బన్ధూనభిజ్ఞః. 34

అ. అత్ర = ఇచ్చట, వత్సరాజః =వత్సదేశాధిపతి ఉదయనుడు, ప్రద్యోతస్య =ఉజ్జయిని రాజు ప్రద్యోతునియొక్క, ప్రియ- దుహితరమ్=గారబుపట్టి వాసవదత్తను, జహ్రే =తోడ్కొని పోయెను. అత్ర=ఈ తావున, తస్య ఏవ రాజ్ఞః= ఆ రాజుయొక్క, హైమమ్=హేమవర్ణమగు, తాలవనమ్=తాటితోపు, అభూత్=ఉండెడిది. అత్ర=ఇచ్చోటనే, నళగిరిః=నళగిరి యను పట్టపుటేనుగు, స్తమ్భమ్=కట్టుకొయ్యను, దర్పాత్=మదముచే, ఉత్పాట్య =ఊడబెఱికి, ఉద్భ్రాన్తః కిల= ఉచ్ఛృంఖలముగా విహరించెను గదా! ఇతి=అని, (ఇట్టి కథలతో) అభిజ్ఞః=బాగుగా తెలిసిన, జనః=జనుదు (వృద్ధులు), ఆగన్తూన్=అన్యప్రదేశములనుండి వచ్చిన, బన్ధూన్=ఆప్తులను, యత్ర=ఏ నగరమున, రమయతి =వినోదింపజేయునో.

భా. మిత్రమా! విలాసవినోదములకు కేంద్ర మా విశాలానగరము. అది యాత్రాకేంద్రము. చారిత్రకసంఘటనలు అద్భుతకథాసందర్భములు సన్నివేశములతో ఆ నగరము అలరారుచున్నది. దేశదేశములనుండి అన్యప్రదేశములనుండి ఎచ్చటెచ్చటనుండియో ఉజ్జయిని చూడవత్తురు. అం దపరిచితు లుండవచ్చు. ఆప్తు లుండవచ్చు. బందుగు లుండవచ్చు. ఎప్పుడెచ్చట ఏమి జరిగినదో వారి కేమి యెరుక? కథాభిజ్ఞులు స్థలపరిచితులు నగు ఆ నగరవృద్ధులు ఆ యాగంతుకులకు ఆప్తులకు యాత్రికులకు "వత్సదేశాధిపతి ఉదయనుడు ఉజ్జయినీరాజన్యుడు ప్రద్యోతుని ప్రియదుహిత వాసవదత్తను ప్రణయభావమున అపహరించిన దిచ్చటనే. అవంతీదేశాధిపతి బంగారుతాటితోపు ఈ తావుననే యుండెడిది. ప్రద్యోతుని పట్టపుటేనుగు 'నళగిరి' మదోత్కటమున ఆలానమూడబెరికి (ఆలాన మన గజమును బంధించు స్తంభము) నిరాటంకముగ విజృంభించి భ్రమించిన దీయెడలనే" యని ఆ యా విషయముల నెన్నిటినో వివరించుచు వినోదింపజేయును. కథాసరిత్సాగరమున- ప్రద్యోతుని తీవ్ర తపస్సునకు తుష్టినొందిన భవాని చండ మహాసేన యను (అపరాజిత) ఖడ్గమును ప్రసాదించి అంగారకదైత్యుని దుహిత, త్రైలోక్యసుందరి అంగారికతో నీకు కళ్యాణ మగునని వర మొసంగినది. మరియు ఐరావతమున కెనయగు నళగిరి యను గజమును గూడ అనుగ్రహించినది. కాలక్రమమున అంగారిక తన గర్భజనితపుత్రోత్సవమున కాహ్వానితుడగు వాసవుడు (ఇంద్రుడు) నీ ద్వితీయసంతానము పుత్రిక యగునని దీవించ వాసవానుగ్రహమున ఉదయమందిన దగుట తన పుత్రికకు వాసవదత్త యని నామకరణ మొనరించెను. ఇందు గడచిన వృత్తాంతమును ప్రత్యక్షీకరించుటచే భావికాలంకారము.

అవ. ఉజ్జయినియందలి అశ్వగజ యోధాదుల వర్ణన-

శ్లో. పత్రశ్యామా దినకరహయస్పర్ధినో యత్ర వాహాః
శైలోదగ్రా స్త్వమివ కరిణో వృష్టిమన్తః ప్రభేదాత్,
యోధాగ్రణ్యః ప్రతిదశముఖం సంయుగే తస్థివాంసః
ప్రత్యాదిష్టాభరణరుచయ శ్చంద్రహాసవ్రణాంకైః. 35

అ. హే మేఘ=ఓ జలదా! యత్ర=ఏ ఉజ్జయినియందు, వాహాః= హయములు, పత్రశ్యామాః=పలాశ(పచ్చని) వర్ణము గలవియై, దినకర- హయ-స్పర్ధినః=రయమున సూర్యాశ్వములతో పోటీపడుచున్నవో, తథా= అటులనే, శైల-ఉదగ్రాః=పర్వతో న్నతములగు, కరిణః=ఏనుగులు, ప్రభేదాత్=మదస్రావమున, త్వమ్ ఇవ=నీవలె, వృష్టిమన్తః= (మదమును)వర్షించు నవియో, యోధ-అగ్రణ్యః=భటశ్రేష్ఠులు, సంయుగే =సమరమున, ప్రతిదశముఖం=రావణుని కభిముఖముగా, తస్థివాంసః =నిలచినవారై, చంద్రహాస-వ్రణ-అఙ్కైః=రావణఖడ్గమగు చంద్రహాసపు ప్రహారము (వ్రేటు)ల చిహ్నములచే, ప్రత్యాదిష్ట-ఆభరణ-రుచయః= నిరాకృతభూషణ దీప్తులు గలవారో, (ఉజ్జయినియం దట్టి అశ్వములు, మదగజములు భటశ్రేష్ఠులు కలరని భావము.)

భా. జలదా! విశేష మేమన ఆ నగరమం దన్నియు శ్రేష్ఠములే. ప్రాముఖ్యము కలవియే. అశ్వములు శ్రేష్ఠములు. గజము లంతకంటెను శ్రేష్ఠములు. ఇక భటులమాట చెప్పనేల? భాస్కరాశ్వములమాట నీ కెరుకయే గదా! 'ప్రతిదిన మపారస్య నభసః'. ఏకచక్రరథము, పట్టులేని కళ్ళెము, కాళ్ళులేని సారథి. అన్నియు లోపములే అయినను అవి అనుదినము అంతులేని ఆకాశమును అధిగమించుచునే యున్నవి. వాటితో స్పర్ధ వీటికి. రంగులో రయములో వాటిని మించవలెనని యొకటే తహ తహ. ఆ నగరమున అశ్వముల గమన మది. ఇక గజములందువా! నీకు సాటి. గిరిసన్నిభము లవి. అవి కదలి పోవ గిరులకు గిరులే కదలుచున్న ట్లగుపించును. నీవు జలమును వర్షింప అవి మదమును వర్షించును. వాటి కుంభస్థలములు నిరంతరమదస్రావకములు. జలదా! ఆ మత్తేభములు సర్వవిధముల నీకు ఈడైనవి. నీకు జలవృష్టి - వాటికి మదవృష్టి. ఎంత సామ్యము! ఆ నగరమందలి గజరాజముల సంగతది. ఇక యోధు లందువా, మిత్రమా! దశకంఠుని సంగతి నీ వెరుగుదువు కదా. కైలాసమును పట్టి కుదిపిన దిట్ట. భవుని మెప్పించిన జగదేకవీరు డతడు. అప్రతిహతవీరుడు, ధర్మనిరతుడు నగు దశరథరాము నెదిరించిన లంకాధిపతి రావణుని కెదురు నిలచిన వీరులు ఉజ్జయిని యోధులు. అంతే కాదు. దశకంఠుని

నిశితచంద్రహాస కరవాలప్రహారవ్రణకిణాంకితములగు వారి యంగములకు వేరు భూషణములతో నేమి పని? శస్త్రప్రహారములే కదా వీరుల కాభరణములు. ఉజ్జయిని యోధులు దశకంఠునితో యుద్ధమొనర్చుట సంభవమని భావించి కొందఱీ శ్లోకమును ఉత్తరమేఘమున అలకానగరవర్ణనసందర్భమున పొందుపరచిరి. అవంతీపురము పురాణప్రసిద్ధి కలదగుట త్రేతాయుగమున ఈ నగరయోధులు లంకాధిపతి నెదిర్చిరనుటలో అసంగతమేమియు నుండనక్కరలేదు. ఇందు ఉపమాభావికాలంకారములు. (పూర్వశ్లోకములు మూడును ప్రక్షిప్తములు. అయినను శ్రీమల్లినాథులు వ్యాఖ్యానించిరి.)

అవ. ఉజ్జయినీనగర ప్రాసాదవైభవ వర్ణన -

శ్లో. జాలోద్గీర్ణైరుపచితవపుః కేశసంస్కారధూపై
ర్బన్ధుప్రీత్యా భవనశిఖిభిర్దత్తనృత్యోపహారః,
హర్మ్యేష్వస్యాః కుసుమసురభిష్వధ్వఖేదం నయేథాః
పశ్యన్ లక్ష్మీం లలితవనితాపాదరాగాఙ్కితేషు. 36

అ. హే మేఘ!= ఓ జలదా! జాల-ఉద్గీర్ణైః=గవాక్షవివరముల నుండి బయల్వెడలిన, కేశ-సంస్కార-ధూపైః=కేశ అలంకరణార్థ ముపయోగించు సుగంధ ద్రవ్యధూపములచే, ఉపచిత-వపుః=పుష్టినొందిన దేహము కలవాడవై, బన్ధు-ప్రీత్యా=అప్పుడ వను ఆప్యాయముతో, భవన-శిఖిభిః=గృహమయూరములచే, దత్త-నృత్య-ఉపహారః=ఈయబడిన నృత్య మను కానుక గలవాడవై, కుసుమ-సురభిషు=పుష్పసుగంధితములు, లలిత- వనితా-పాద-రాగ-అఙ్కితేషు=సుందరాంగనల చరణలాక్షారసరంజితములు నగు, హర్మ్యేషు=ఉన్నతప్రాసాదములందు, అస్యాః=ఈ నగరముయొక్క, లక్ష్మీమ్=శోభను, పశ్యన్=దర్శించుచు, అధ్వ- ఖేదం=మార్గాయాసమును, నయేథాః=పోగొట్టుకొనుము.

భా. జలదా! ఆ పురమును వీక్షించు నీకు ఎన్నియో ప్రయోజనములు. పుష్టి తుష్టి ఆరోగ్య ఆనంద వినోద ఉపాయనములు. ఆమీదట అధ్వఖేదాపనయనము. ఇన్ని ప్రయోజనము లట నున్నవి. అది విశాలానగరముగదా! విశాల మైన వీథులు. మహోన్నత ప్రాసాదములు. రమ్యమైన హర్మ్యములు. అవన్నియు ధనికభవనములు. ఆ భవనములయం దపూర్వవిలాసవస్తుసంచయము. ఆ నగరవాసు లత్యంత భోగలాలసులు, వినోదాసక్తులు. అచటి వనితలు అతిలోకరూపలావణ్యవిలసితలు. కుసుమసుకుమారిణులు. విభవసంపన్నలు. మిత్రమా! ఆ భవనగవాక్షవివరముల వెలువడు ధూపముల నేమని భావింతువు? ఆ ప్రాసాదములయం దంగనలు అభ్యంగన మాచరించి, జలకమాడి కురుల తడి యారుట కుపయోగించు

అగరుధూపములు. మధుగంధసువాసితము లవి. హాయిగా నీ కవి స్వాగత మీయగలవు. రమ్మని ఆప్యాయముగ పిలువగలవు. ఎంత యానందము! ఎంత పుష్టి! ఎంత తుష్టి! అన్యోన్యాశ్రయమున నీ బలము పెరుగగలదు.

జలదా! మఱియొక విశేష మేమన, రాక రాక వచ్చితివి. ఆప్తుడవు. ఆనందసంధాయకుడవు. ఆదరించక అవి నిన్నెట్లు విడువగలవు? మీ స్నేహము మఱువరానిది. అన్యోన్యము విడువనొల్లని ఆప్తబంధువులు మీరు. మయూర అంబుదములకు అన్యోన్యమైత్రి యని గదా యందురు! ఆ మయూరములు నిన్నెట్లాదరించగలవు? స్వాగతము పలుకగలవు? లయబద్ధముగ లలితమనోజ్ఞముగ మంజులనృత్యము లభ్యసించినవి. నటన నేర్చినవి. ప్రీతిపూర్వకముగ నీ కవి సుస్వాగతము పలికి నయనానందకరముగ లలితభంగిమల నృత్య మొనర్చగలవు. మిత్రమా! అంతకంటె నీకు కావలసిన దేమున్నది? నీ కది యొక అపురూపమగు కానుక. మిత్రునియెడ ఆప్తబంధువునెడ ప్రేమాదరసూచకమగు నృత్యోపహారమది. ప్రేమాదరములకు మించిన కానుక కలదా? మిత్రమా! ఆ నగరవనిత లందువా! వారు కళాప్రియులు. ఆనందోపాసకులు. అతిలోకసౌందర్యవతులు. కుసుమకోమలులు. హావభావవిలసితలు. అలంకారప్రియులు. వారు రసపిపాసువు లను మాట చెప్పకయే చెప్పుచున్నది. అట ఆ రమ్యహర్మ్యముల ఆ లలితమనోహ రపాదముద్రలు చూడు. నీకే అవగతమగును. తమ్మిరేకులవలె ఆనందదీపికలవలె ముచ్చట గొలుపుచున్నవి. ముద్దులు మూటగట్టుచున్నవి. చరణములకు వారద్దిన లాక్షారసముద్ర లవి. మిత్రమా! ఆ భవనముల శోభావైభవము లెంత మనోజ్ఞములో గమనించితివా! కన్నుల కది యొక కమనీయమగు విందు! నేత్రోత్సవమది! గవాక్షరంధ్రముల వెలువడు సుగంధధూపములు, బంధుప్రణయములు, మయూ రనృత్యములు, కుసుమసౌరభములు, లాక్షారసపాదముద్రలు, అన్నిటిని మించిన ఆ యంగనల లలిత మనోహర విభ్రమ విలాస సమంచిత మధుర ప్రక్రియలు! ఇక మార్గఖేద మెక్కడిది? విశ్రాంతి దేనికి? కొన్ని ప్రతులందు 'అధ్వఖేదం నయేథాః' అని గాక 'అధ్వభిన్నాంతరాత్మా' అని యున్నది. 'నయేథాః' అను క్రియాలోపమున ఈ శ్లోకసంబంధము ముందుశ్లోకమందలి 'భర్తుః' అనుదానితో జోడింపబడుచున్నది. ఇందు ఉదాత్తాలంకారము.

అవ. అవంతియందలి మహాకాళమందిరవర్ణన -

శ్లో. భర్తుః కణ్ఠచ్ఛవిరితి గణైః సాదరం వీక్ష్యమాణః
పుణ్యం యాయాస్త్రిభువనగురోర్ధామ చణ్డీశ్వరస్య,
ధూతోద్యానం కువలయరజోగన్ధిభిర్గన్ధవత్యా
స్తోయక్రీడానిరతయువతిస్నానతిక్తైర్మరుద్భిః. 37

అ. హే మేఘ = ఓ జలదా! భర్తుః=గరళకంఠునియొక్క, కణ్ఠ-చ్ఛవిః=కంఠమందలి కాంతివంటి కాంతిగలవాడవగుట, గణైః=ప్రమథగణములచేత, సాదరం యథా తథా=ఆదరపూర్వకముగా, వీక్ష్యమాణః సన్=చూడబడినవాడ వగుచు, కువలయ-రజో-గన్ధిభిః=పద్మపరాగపరిమళములు గలవియు, తోయ-క్రీడా-నిరత-యువతి-స్నాన- తిక్తైః=జలక్రీడానిరతలగు ప్రమదల స్నానసంబంధ సుగంధ ద్రవ్యసౌరభములు గలవియు నగు, గన్ధవత్యాః=గంధవతీనదియొక్క, మరుద్భిః=వాయువులచే, ధూత-ఉద్యానమ్=కంపిత ఉద్యానవనము గలదియు, పుణ్యమ్=పవిత్రమైనదియు నగు, త్రిభువనగురోః=త్రిభువనప్రభు వగు, చణ్డీశ్వరస్య =పార్వతీపతియొక్క, ధామ= స్థానము (మందిరము) నుద్దేశించి, యాయాః =వెళ్ళుము.

భా. మిత్రమా! వాటి కేమి గాని ఆ నగరమున ముఖ్యముగా చూడదగినది మహాకాళమందిరము. త్రిలోకాధిపతి పరమశివుని స్థాన మది. పునీతము, పుణ్యప్రదము నగు పార్వతీపతి ఆలయము. అది తీర్థములకు తీర్థము. తీర్థరాజము. ప్రభువును సేవించుచు ప్రమథగణము లచటనే వేచియుండును. నీలవర్ణశోభితుడవగు నిన్ను జూచి స్వామికంఠసాదృశ్యమును తలచి సాదరముగ నిన్ను వీక్షింతురు. సోత్సాహముగ నీకు స్వాగత మీయగలరు. సాదృశ్యసందర్శన మెపుడును హృదయస్పందనమునకు హేతువగునుకదా! జలదా! ఆ క్షేత్రము ముక్తిదాయకమే గాక వినోదస్థానము గూడ. గలగలమను కలరవమున బ్రవహించు గంధవతి అచట గలదు. తన్నదీతోయములు పద్మపరాగ సుగంధితములు. కనుకనే గంధవతి యను సార్థకనామమున ప్రసిద్ధి వడసినది. మందిర ప్రాంతమున తన్నదీతీరముల నీలకంఠునికి ప్రీతిదాయకము లగు నందివర్ధనాది ఉపవనముల పూలమంజరులు వాయుచలనమున అలలవలె నూగులాడుచు సయ్యాటలు సలుపుచు చూపరులకు కనువిందులు చేయుచున్నవి. మిత్రమా! మఱియొక విశేష మేమన - మదవతులగు తన్నగరవనితలు మైనిండ సుగంధ మలదుకొని తన్నదీజలముల జలకమాడెదరు. ఆ మధురసౌరభములకు తన్న దీజలములు మఱింత సువాసితములగును. గంధవతీ సుగంధవిలసితములు పద్మపరాగసురభిళములు తన్నగరాంగనల స్నానగంధతిక్తములు నగు జలకణములు గ్రహించి వీచు వాయుప్రకంపనలకు కదలియాడు తన్మందిరోపవనములు హృదయమునకు హాయి నింపును. నయనములకు విందులు సమకూర్చును. జలదా! అత్యంతదర్శనీయము లా క్షేత్రమందిరములు. అవశ్య మవగంతవ్యము. ఆకాశమున (స్వర్గమున) తారకలింగము, పాతాళమున హాటకేశ్వరలింగము, మర్త్యలోకమున మహాకాళలింగము ముక్తిదాయకములని ప్రసిద్ధి. ఒకప్పుడు దేవదానవులు అమృతార్థము క్షీరజలధిని ద్రచ్చిరి. అందు ప్రథమమున హాలాహల

ముద్భవించినది. అంతట భయభ్రాంతులై ఉభయులు శంకరు నారాధింప అమ్మహాదేవు డా గరళమును గళమున నిగ్రహించె నందురు. తదాదిగ శంకరుడు గరళకంఠు డాయెనని పురాణకథనము. ఇందు మేఘుని ఉపమేయత్వకథనముచే ప్రతీపము. మేఘమహత్త్వవర్ణనచే ఉదాత్తము అలంకారములు.

అవ.శివార్చనసమయమున పటహత్వ మూనుమని యక్షుడు మేఘునర్థించుట -

శ్లో. అప్యన్యస్మిన్ జలధర మహాకాళ మాసాద్య కాలే
స్థాతవ్యం తే నయనవిషయం యావదత్యేతి భానుః,
కుర్వన్ సన్ధ్యాబలిపటహతాం శూలినః శ్లాఘనీయా
మామన్ద్రాణాం ఫలమవికలం లప్స్యసే గర్జితానామ్. 38

అ. హే జలద=ఓ మేఘుడా!, మహాకాళమ్=మహాకాళ మను ఈశ్వరస్థానమును, అన్యస్మిన్ =సంధ్యాతిరక్తమగు, కాలే=సమయమందు, ఆసాద్య అపి= చేరినను, తత్ర= ఆ స్థానమున, తావత్= అంతవఱకు, తే = నీకు, స్థాతవ్యం=ఉండదగును, యావత్=ఎంతలో, భానుః=భాస్కరుడు, నయన- విషయమ్=దృష్టిపథమును, అత్యేతి=అధిగమించునో. శ్లాఘనీయామ్=స్తవనీయమగు, శూలినః=ఈశ్వరునియొక్క, సన్ధ్యా- బలి-పటహతాం=సందెకాలపు పూజయందు నగారా వాద్యత్వ (పటహత్వ)మును, కుర్వన్=చేయువాడవై, ఆమన్ద్రాణాం=ఈషద్గంభీరములగు, గర్జితానామ్=ఉరుములయొక్క, అవికలమ్=అఖండమగు, ఫలమ్=ఫలమును, లప్స్యసే =పొందగలవు.

భా. జలదా! మహాకాళమందిరమున కెపుడు చేరెదవో తెలియదు. అచ్చటికి నీ వెప్పుడైన చేరవచ్చు. కాని సందెకాలపు పూజకు ముందుగా నీ వట కేగిన తొందఱపడి ముందుకు సాగిపోకుము. ఇంచుక వేచియుండి విశ్రాంతి నొందుము. ఇంతలో ఇను డస్తమించ సందె (సంధ్యాకాలము) యరుదెంచును. ఈశ్వరమందిరమున పూజాసమయ మది. ఆ పవిత్రఈశ్వర పూజాసమయమున నీకును ఇంచుక భాగము (కర్తవ్యము) కలదు. జలదా! ఆ సంధ్యాశుభసమయమున ఆ చండీశ్వరాలయమున మంగళవాద్యములు నినదితము లగును. మృదంగనిస్వనములు వీణానాదములు కర్ణపేయము లగును. నీవును అం దించుక పాల్గొని ధన్యుడవు గమ్ము. జీవితసాఫల్యము నందుము. భక్తిపురస్సరముగా పురజనులు శంకరు నారాధింతురు. ఆ శుభసమయమున నీవును అందు పాల్గొని మంద్రస్వరమున గర్జించినచో నది పటహ (డోలు) రూపమున ఒప్పిదముగ సమగ్రపూజావిధానమునకు తోడ్పడగలదు. నీ

మంజులమనోజ్ఞగర్జన (ఉరుము)లకు సార్థకత చేకూరును. అఖండపుణ్యఫల మందుకొనగలవు. జన్మకు సాఫల్యము సిద్ధించును. ఉజ్జయినియందు మహాకాళమందిరమున గల శివలింగము ద్వాదశజ్యోతిర్లింగములలో నొకటిగా భావించబడుచున్నది. "సౌరాష్ట్రే సోమనాథం చ శ్రీశైలే మల్లికార్జునమ్, ఉజ్జయిన్యాం మహాకాళమోఙ్కారే పరమేశ్వరమ్, కేదారం హిమవత్పృష్ఠే డాకిన్యాం భీమశఙ్కరమ్, వారాణస్యాం చ విశ్వేశం త్ర్యమ్బకం గౌతమీతటే, వైద్యనాథం చితాభూమౌ (పరలీ ఇతి ప్రసిద్ధపురే) నాగేశం దారుకావనే, సేతుబన్ధే చ రామేశం ఘృష్ణేశం చ శివాలయే, ఏతేషాం దర్శనా దేవ పాతకం నైవ తిష్ఠతి" ఇతి శివపురాణే. శంకరుడు అల్పసంతోషి, అనల్పఫలదాయి, నిత్యప్రసన్నుడు. ఇం దుత్తరార్ధస్థితవాక్యార్థము పూర్వార్ధస్థితస్థితికి హేతు వగుట కావ్యలింగ మలంకారము.

అవ. మహాకాళమందిరమున గణికానృత్యవర్ణన--

శ్లో. పాదన్యాసక్వణితరశనా స్తత్ర లీలావధూతైః
రత్నచ్ఛాయాఖచితవలిభి శ్చామరైః క్లాన్తహస్తాః,
వేశ్యాస్త్వత్తో నఖపదసుఖాన్ ప్రాప్య వర్షాగ్రబిన్దూ
నామోక్ష్యన్తే త్వయి మధుకరశ్రేణిదీర్ఘాన్ కటాక్షాన్. 39

అ. హే మేఘ =ఓ జలదా!, తత్ర = సంధ్యాసమయపూజావిధియందు, పాద-న్యాస-క్వణిత-రశనాః= పాదవిన్యాసముల అవ్యక్తమధురముగా ధ్వనించు కటిసూత్రములు కలవారును, లీలా-అవధూతైః=ఒయ్యారముగా వీచబడినవియు, రత్నచ్ఛాయా-ఖచిత-వలిభిః=కంకణమణిదీప్తుల బ్రకాశించు దండములుకలవియు నగు, చామరైః= వింజామరలచేత, క్లాన్త-హస్తాః= శిథిలమైన హస్తములు గల వారును అగు, వేశ్యాః= గణికలు, త్వత్తః= నీనుండి, నఖ-పద- సుఖాన్=నఖ క్షతసుఖకరములగు, వర్ష-అగ్ర-బిన్దూన్= తొలకరిచినుకులను, ప్రాప్య= పొంది, త్వయి= నీపై, మధుకరశ్రేణిదీర్ఘాన్= భ్రమరపంక్తి సుదీర్ఘములగు, కటాక్షాన్= కడగంటిచూపులను, ఆమోక్ష్యన్తే= ప్రసరింపజేతురు.

భా. జలదా! మఱొక విషయము! అది నేత్రపర్వమే గాక ప్రయోజనప్రదము గూడ. మహాకాళమందిరమున సాయంపూజాసందర్భమున జరుపబడు నృత్యప్రదర్శన మది. అత్యంతహృదయంగమ మది. ఆ విశాలా నగరమున పుత్తడిబొమ్మలబోలు రూపాజీవికలు గలరు. లలితసుకుమారిణులు. నాట్యవిద్యాకుశలురు. నృత్యశాస్త్రనిష్ణాతలు. నృత్యమున వారు రంభాదులనైన నోడింప సమర్థులు. శాస్త్రోక్తము, లయబద్ధము నగు ఆ సుందరాంగనల

పాదవిన్యాసములం దడుగడుగున ఇట్టి దట్టిదని నుడువరాని అపూర్వరమణీయ విలాసవిభ్రమము తొణికిసలాడుచుండును. ఆనందరసధునులు పొంగులు వారుచుండును. ఆ పాదవిక్షేపములకు అంగవిన్యాసములకు వారు ధరించిన స్వర్ణకటిసూత్రముల (కటి సూత్రమన నడుమున ధరించు స్వర్ణాభరణము) చిరుమువ్వలు మధురమంజుల మనోజ్ఞధ్వను లీనుచుండును. కరకంకణరత్నదీప్తులు రత్నఖచితచామరదండకాంతులతో మేలమాడ ఆ యంగనలు ఒయ్యార మొలుక, విలాస ముట్టిపడ ఈశ్వరసాన్నిధ్యమున నృత్య మొనరించుచు వింజామరలు వీచుచుందురు. లలితకుసుమసుకుమార లగుట ఆ ముద్దుగుమ్మ లలసి సొలసెదరు. వారి కరచరణములు శక్తిహీనము లగుట స్రస్తము లగును. శిథిలమై అస్తవ్యస్తము లగును. రూపాజీవికలు గణికలు. నఖక్షతాదులు వారి సొమ్ము. కామక్రీడలు వారి నిత్యకృత్యములు. జలదా! ప్రథమవర్షోదబిందువుల ఆ ముద్దరాండ్ర గాయములకు చలువగూర్చి సేదదీర్చి వారికి ప్రేమపాత్రుడవు గమ్ము. అంత నా వారకాంతలు కృతజ్ఞతాసూచకముగ భ్రమరపంక్తిసుదీర్ఘములగు తమ కడగంటి చూపులు కానుకలుగా జేసి ప్రణయభావమున వీక్షించి నిన్ను గౌరవింతురు. కామినీ కమనీయకటాక్షవీక్షణములయం దెంత మాధుర్య మిమిడియున్నది? మిత్రమా! నీవు ధన్యుడవు. నేత్రోత్సవమగు నృత్యసందర్శనము, కామినీకటాక్షవీక్షణ మాధుర్య లాభము నీకు సద్యఃఫలములు.

రమణీస్తననితంబాదులందు ప్రియదత్తనఖక్షతములు కామశాస్త్రసూచితములు. కడగంటిచూపును కటాక్ష మందురు. 'ఇందు మధుకరశ్రేణిదీర్ఘాన్' అను సమస్తపద మందు లుప్తోపమాలంకారము.

అవ. తాండవనృత్యముచే భీతినొందిన భవానికి సాయపడ యక్షుడు మేఘు నర్థించుట.

శ్లో. పశ్చాదుచ్చై ర్భుజతరువనం మణ్డలే నాభిలీనః
సాన్ధ్యం తేజః ప్రతినవజపాపుష్పరక్తం దధానః,
నృత్యారమ్భే హర పశుపతే రార్ద్రనాగాజినేచ్ఛాం
శాన్తోద్వేగస్తిమితనయనం దృష్టభక్తిర్భవాన్యా. 40

అ. హే మేఘ = ఓ జలదా!, పశ్చాత్ =పూజానంతరము, పశుపతేః =గణాధిపతి శివునియొక్క, నృత్య-ఆరమ్భే=తాండవనృత్య ప్రారంభమున, ప్రతి-నవ-జపాపుష్ప-రక్తమ్=వికసిత జపాపుష్పారుణవర్ణమగు, సాంధ్యమ్= సంధ్యా కాలపు, రాగం=శోభ (రక్తిమ) ను, దధానః=ధరించినవాడవై, ఉచ్చైః=ఉన్నతమగు, భుజతరు-వనమ్= భుజము లను తరువు (వృక్షము)లయొక్క, వనమును, మణ్డలేన =మండలాకారమున, అభిలీనః సన్=పరివ్యాప్తుడ వగుచు, భవాన్యా =

కాత్యాయనిచే, శాన్త-ఉద్వేగ-స్తిమిత-నయనం (యథా తథా)=శాంతించిన భీతిచే స్తిమితనయనములు కలుగునట్లుగా, దృష్ట-భక్తిః-సన్ = చూపబడిన భక్తికలవాడవై, పశుపతేః=ఈశ్వరునియొక్క, ఆర్ద్ర-నాగ-అజిన- ఇచ్ఛామ్=రక్తసిక్తగజచర్మము ధరించు కోటికను, హర=హరించుము.

భా. జలధరా! నీ కవశ్యకర్తవ్య మొకటి గలదు. దానివలన శుభము లొనగూడును. భవానీకరుణాకటాక్షవీక్షణముల కది హేతువగును. ఆమె కత్యంతముదావహ మిది. ఆనందవర్ధకము. ఆమె భయకంపిత. సాయం సంధ్యాపూజానంతరము మహాదేవు డుద్దండతాండవనృత్య మొనరించుట పరిపాటి. భూనభోంతరములు దద్దరిల్లు ఆ ప్రచండతాండవమున మహాదేవు డార్ద్రగజచర్మమున భుజాంతరము లాచ్ఛాదించును. అది మఱింతభయానకము. జుగుప్సాకరము. భీతి నొందించు తాండవ మది. ఆపైని గజచర్మము. అదియు రక్తసిక్తము. ఆ దృశ్య మెట్లుండును? అత్యంతభయానకము. లలితసుకుమారిణి యగు పార్వతి ఆ దృశ్య మెట్లు చూడగలదు? చూచి యెట్లు భరించగలదు? మిత్రమా! ఆమె భీతి మాపి ప్రీతి నెఱపుము. ఆ జగన్మాత యనుగ్రహము చూరగొనుము. ఎట్లందువా? ఈశ్వరు డున్నతభుజస్కన్ధుడు. కోమలవిటపసదృశము లాయన భుజములు. జలదా! సాయంసంభవము, జపాకుసుమారుణసదృశము నగు సంధ్యారుణవర్ణము నీపై సోక కెంపూదిన అరుణవస్త్రమువలె శోభిల్లెదవు. మండలాకారమున రక్తిమను చిందించు కుంకుమాంకితవస్త్రరూపమున శంకరుని భుజస్కంధము నాచ్ఛాదింపుము. రక్తసిక్తారుణగజచర్మాసక్తిని మరలింపుము. అంత మహేశ్వరి విగతభీతిచిత్తయై నీ భక్తికి మెచ్చి ప్రసన్న యగును. దయార్ద్రహృదయయై వాత్సల్యమున ఈప్సితార్థము లొసంగును. ఆ తల్లి ప్రసన్నవీక్షణములకంటె కావలసిన దేమున్నది? అంతకు మించిన దేమి కలదు? పశుః అన ప్రమథాదిగణము. దానికి ప్రభువు గాన పశుపతి యందురు. 'నృత్తారంభే'. యను పాఠభేద మున్నది. తాండవమున భయానకభావము ప్రదర్శితము గాన ఆ పాఠము సరికాదు. ధశరూపకమున- 'భావాశ్రయం తు నృత్యం స్యాన్నృత్తం తాలలయాశ్రితమ్'. కాన నృత్యారమ్భే యనుపాఠమే సరియైనది. శంకరుడు బహుభుజు డనియు తాండవమున అవి ఊర్ధ్వప్రసారితము లనియు ప్రతీతి. గజాసురునికి భీతిల్లి ఋషులు, దేవతలు వారణాశియందు దాగిరనియు, అంత మహేశ్వరుడు గజాసురుని సంహరించి రక్తసిక్తమగు అతని చర్మము నాచ్ఛాదించుకొని తాండవ మొనర్చెనని ప్రతీతి. భుజతరు వనుచోట రూపకము. ప్రతినవజపాపుష్పరక్తం అను తావున లుప్తోపమ. మేఘము సంధ్యారాగము ధరించిన దనుచోట అసంభవద్వస్తుసంబంధమగు నిదర్శనము అలంకారములు. ఈ మూడును పరస్పర నిరపేక్షము లగుట సంసృష్టి.

అవ. నిశీథమున అభిసారికలకు విద్యుత్ప్రహాయమున మార్గదర్శకుడవు కమ్మని యక్షుడు మేఘు నర్థించుట -

శ్లో. గచ్ఛన్తీనాం రమణవసతిం యోషితాం తత్ర నక్తం
రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యై స్తమోభిః,
సౌదామిన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీం
తోయోత్సర్గస్తనితముఖరో మా స్మ భూర్విక్లబాస్తాః. 41

అ. హే మేఘ =ఓ జలదా!, తత్ర=ఆ నగరమున, నక్తమ్=నిశాసమయమున, రమణ-వసతిమ్=వల్లభనిలయములగూర్చి, గచ్ఛన్తీనామ్=వెళ్ళుచున్న, యోషితామ్=అంగనలకు, సూచి- భేద్యైః=సూచీభేద్యము (సాంద్రము)లగు, తమోభిః=అంధకారములచే, రుద్ధ-ఆలోకే=అవరోధితప్రకాశము(చూపు)గల, నరపతి-పథే =రాజమార్గమున, కనక-నికష-స్నిగ్ధయా =నికషోపలగతస్వర్ణరేఖ (గీటురాయి మీది బంగారు గీత) వంటి కాంతిగల (మెఱయు), సౌదామిన్యా =మెరుపుచే, ఉర్వీం =భూమిని (మార్గమును), దర్శయ=చూపుము. తోయ-ఉత్సర్గ- స్తనిత-ముఖరః =వృష్టిగర్జనలచే శబ్దాయమానుడవు, మా స్మ భూః =కాబోకుము సుమీ! కుతః=ఏలనందువా?, తాః=ఆ యువతులు, విక్లబాః=భీరువులు.

భా. మిత్రమా! ఉజ్జయిని, మహైశ్వర్యమున నేమి, భోగభాగ్యముల నేమి, కావ్యకళావైదగ్ధ్యమున నేమి, సంగీతసాహిత్యశిల్పకళాచాతుర్యముల నేమి, రాజనీతినైపుణ్యమున నేమి, విశ్వవిఖ్యాతినొంది వినుతి కెక్కిన మహానగరము. అందలి పౌరులు భోగాసక్తులు. లలితకళాప్రియులు. భోగలాలసత వారిని వెన్నంటి తరుముచుండును. భోగముల కలవడిన నాగరికులు. పెక్కుమాట లేల? వారు భోగైకజీవులు. భోగమే వారి ధ్యేయము. విలాసజీవితముల కలవడిన అంగన లచట నిశాసమయమున గుప్తమార్గముల ప్రియుల జేర సంకేతముల కేగెదరు. ప్రణయభావమున రమణవసతుల కరుగు ఆ యభిసారికలకు విద్యుత్ప్రభాప్రకాశమున ఇంచుక దారి చూపి సాయపడుము. ఆ యంగనలు మదవిహ్వాలలు. పాటమరించిన నవయౌవనము. అదిమి పట్టుట అంత సులభము కాదు. నిశీథసమయము. సూదిమొన యైన చొరరాని కారుచీకటులు. మార్గమా కాంతిహీనము. ఆ నిబిడాంధకారబంధుర నిశాసమయమున భీతచిత్తలై తక్కుచు తారుచు రాజవీథుల సాగిపోదురు. జలదా! నికషోపలకనకరేఖాసదృశమగు నీ విద్యుత్ప్రహాయమున ఆ లలనల కించుక సాయపడుము. కలకాలము నీ మేలు మరువరు వారు. మరొక్కమాట! మఱువకుము సుమీ! వృష్టిసంరంభమున వారిని బెదరించకుము. గర్జించి (ఉఱిమి) వారి ధైర్యము చెదరగొట్టకుము. వారు భీరువులు. నీ యురుములకు బెదరుదురు. వారు

అభిసారికలు. ఆగుచు దాగుచు రమణవసతులకు పయనింతురు. సంకేతములకు చేరుదురు. 'కాన్తాభిసరణోద్యుక్తా స్మరార్తా సాఽభిసారికా.' మదోత్కటమున కామపీడితయై ప్రియసంకేతమును జేరు మగువ అభిసారిక యనబడును. ఇందు 'కనకనికషస్నిగ్ధయా' అనుచోట లుప్తోపమ. 'శబ్దాయమానుడవు గాకుము' అను నిషేధమునకు 'విక్లబాస్తాః' అనునది హేతువగుట వాక్యార్థహేతుకకావ్యలింగము. ఉభయాలంకారసంసృష్టి.

అవ. తద్రాత్రి ఉజ్జయినియం దాగి ఉదయమున పయన మగుమని యక్షుడు మేఘు నర్థించుట -

శ్లో. తాం కస్యాంచిద్భవనవలభౌ సుప్తపారావతాయాం
నీత్వా రాత్రిం చిరవిలసనాత్ భిన్నవిద్యుత్కళత్రః,
సూర్యే దృష్టే పునరపి భవా న్వాహయే దధ్వశేషం
మన్దాయన్తే న ఖలు సుహృదా మభ్యుపేతార్థకృత్యాః. 42

అ. చిరవిలాసనాత్ =దీర్ఘకాలస్ఫురణము (మెఱయుట) వలన, భిన్న విద్యుత్కళత్రః=అలసిన సౌదామినియే (మెరుపు) భార్యగా గల, భవాన్=నీవు, సుప్తపారావతాయామ్=నిద్రించిన కపోతములు గల, కస్యాంచిత్=ఏదో యొక, భవనవలభౌ=భవనఉపరిభాగమున, తాం=ఆ, రాత్రిం=రేయిని, నీత్వా= గడిపి, సూర్యే =భాస్కరుడు, దృష్టే సతి=ఉదయించినవాడు కాగా, పునః అపి=తిరిగియు, అధ్వశేషమ్=మార్గావశేషమును, వాహయేత్=నిర్వహింతువుగాక. సుహృదామ్=మిత్రులయొక్క, అభ్యుపేత-అర్థకృత్యాః=సఫలమగువరకు పనిచేతుమని అంగీకరించినవారు న మన్దాయన్తే ఖలు=విలంబము చేయరు గదా!

భా. జలదా! విశాలమైనది విశాలానగరము. సుదీర్ఘములగు మార్గములు. నిబిడాంధకారమున అభిసారికల రాకపోకలు. మార్గము చూప మీ రెంతకాలమని వేచియుందురు? అందున నీ ప్రేయసి సౌదామిని (విద్యుత్తు) మెరిసి మెరిసి అలసియుండును. విడదీయరాని అనుబంధమున ఆమెయు నిన్నంటి పయనించినది కదా! నీవును అలసియుందువు. అందుచే ఆ రాత్రి పయన మాపి ఇంచుక విశ్రమించుము. ఉన్నతప్రాసాదముల ఉపరితలము (పైభాగమున)న ఎందైన విడియవచ్చును. ఇది అది యననేల? నీ కన్నియు నిరాటంకములే గదా! సుప్తపారావతము లగుట రాదలేమి ఆ భవనోపరిభాగముల నిద్రాభంగమునకు తావుండదు. మిత్రమా! సతీసమేతముగా అందు విశ్రాంతి గొని ప్రభాతమున కమలబాంధవు డుదయ మొంద అలసత్వ మూనక శీఘ్రగమనమున తరలిపొమ్ము. మార్గశేషము నధిగమించుము. నీ వెరుగని ధర్మము లేదు. మిత్రకార్యనిర్వహణమున ఉత్తములు విలమ్బన

కోర్వజాలరు. అలసట బూనరు. జాగు చేయ రనునది నీకు తెలియనిది కాదు గదా! మెరుపు మేఘుని సతి యనుట కవిసమయము, సంప్రదాయము. ఇందు సౌదామినియందు కళత్రారోపణ, మేఘునియందు పతిత్వారోపకమగుట రూపకము. చతుర్థచరణమున సామాన్యముచే విశేషార్థసమర్థనమున అర్థాంతరన్యాసము. ఉభయమునకు అంగాంగిభావ మగుట సంకరాలంకారము.

అవ. భానుమార్గము నవరోధించకు మని యక్షుడు మేఘు నర్థించుట-

శ్లో. తస్మిన్ కాలే నయనసలిలం యోషితాం ఖణ్డితానాం
శాన్తిం నేయం ప్రణయిభిరతో వర్త్మ భానోస్త్యజాశు,
ప్రాలేయాస్రం కమలవదనాత్ సోఽపి హర్తుం నలిన్యాః
ప్రత్యావృత్తస్త్వయి కరరుధి స్యాదనల్పాభ్యసూయః. 43

అ. హే మేఘ! =ఓ జలదా!, తస్మిన్ కాలే=ఆ ప్రభాతసమయమున, ప్రణయిభిః =వల్లభులచే, ఖండితానామ్ =కుపితలగు (నాయికావిశేషము), యోషితామ్ =అంగన (నాయిక)ల యొక్క, నయన-సలిలమ్ =నేత్రజలమును, (కన్నీరు) శాన్తిమ్ =శమనమును, నేయమ్=పొందింపవలయును. అతః=కనుక, భానోః=సూర్యునియొక్క, వర్త్మ=మార్గమును, ఆశు=శీఘ్రముగా, త్యజ=విడువుము. అన్యథా=కాదేని, నలిన్యాః=పద్మినియొక్క, కమల-వదనాత్=పద్మవదనమునుండి, ప్రాలేయ-అస్రం=మంచుకన్నీటిని, హర్తుమ్=తొలగించుటకు, ప్రత్యాగతః=తిరిగివచ్చిన, సః అపి=ఆ భానుడును, త్వయి=నీవు, కర-రుధి=కిరణ (హస్త)అవరోధుడవు కాగా, అనల్ప- అభ్యసూయః=అధికమగు అసహనము కలవాడు, స్యాత్=అగును.

భా. జలదా! మఱియొక విషయము. ముఖ్యముగా గమనించతగినది. నీవు పయనమగు ప్రభాతసమయమున భానుమార్గమును నిరోధించకుము. సూర్యకిరణముల కడ్డురాకు. అడ్డువచ్చిన అది రోషద్వేషములకు హేతువగును. దోషము తమదైనను కాముకులకు రోషమెక్కువ. వారు ఈర్ష్యాళువులు. విద్వేషపరులు. ఆటంకము నోర్వజాలరు. ప్రియసతుల కన్ను గప్పి తద్రాత్రి అన్యత్ర గడిపి (మఱియొక ముద్దరాలితో ముద్దులాడి) ప్రభాత మగుసరికి మగిడి వచ్చి ఏమియు నెఱుగని అమాయకులవలె ప్రణయకుపిత యగు ప్రియసతిని కల్లబొల్లిమాటల కొనగోట కన్నీరుతుడిచి యోదార్పజూతురు. కాంతులే కావచ్చు. ఈ లోకమున నయవంచకులు లేకపోలేదు. ఏదేని నెపమూని ఇల్లు విడిచి అన్యకాంతల గూడి ప్రణయలీలలు నెరపి మేనిగుఱుతులు మఱచి ప్రభాత మగుసరికి మగిడి వచ్చి నిరపరాధులవలె సతుల నోదార్చు సమయ మది. పద్మిని సూర్యసతి యనునది లోకవిదితము. కనుకనే సూర్యుని పద్మబాంధవు డందురు. అతడు

లేనిది ఆమెకు శోభ యెక్కడిది? సూర్యకిరణముల గిలిగింత లామె ముఖవికాస మునకు హేతువు. ఆమె అతని యెడబాటు కోర్వజాలదు. ఆమె ప్రణయిని. అయినను ఆయన దేశాంతరగతుడు. ఎందెందు తిరిగెనో ఎందరెందఱు పద్మినుల గూడెనో ఎవరి కెఱుక! అన్యదినమున మఱలివచ్చి మంచిమాటల ఆమె (ప్రియసతి పద్మిని) కమలవదనమున మంచుకన్నీరు తుడిచి వికసింప నోదార్చు సమయ మది. అట్టి లోకబాంధవుని కిరణము (కరము)ల కడ్డుపడు టేమంత న్యాయమూ గాదు. క్షేమమూ కాదు. మిత్రమా! అడ్డుతగులుట అంతులేని విద్వేషమునకు, వినాశమునకు హేతువగును. సూర్యకిరణముల నెవ రడ్డగలరు? భానుతేజ మెవ రోర్వగలరు? కాన ఇంచుక ఓసరిల్లి ముందుకు సాగిపొమ్ము. క్షేమదాయక మది. ప్రేమికుల కడ్డుతగులుట ముప్పునకు చోటు. అందున భానుతేజమున కంతరాయము సర్వమంగళనష్టదాయకము సుమీ! "నీత్వాన్యత్ర నిశాం ప్రాతరాగతే ప్రాణవల్లభే, అన్యాసంభోగచిహ్నైస్తు కుపితా ఖండితా మతా" - రాత్రి అన్యకాంతలగూడి అరుణోదయమున ప్రాణవల్లభు డింటికి తిరిగి రాగా అన్యాసంభోగచిహ్నముల జూచి కుపితయగు మానిని ఖండితనాయిక యనబడును. ఇందు భానుమార్గమును విడువు మనుదానికి ఉత్తరార్థము హేతువగుట వాక్యార్థహేతుక కావ్యలింగము. లింగసామ్యమున నళినీభాస్కరులయందు నాయికానాయక వ్యవహార ఆరోపణమున సమాసోక్తి. కరరుధి యనుచోట కరశబ్దమున శ్లేషరాగా అంగాంగిభావమున సంకరాలంకారము.

అవ. *గంభీరానదిని మేఘుడు ప్రవేశించిన తీరు-*

శ్లో. గమ్భీరాయాః పయసి సరితశ్చేతసీవ ప్రసన్నే
ఛాయాత్మాపి ప్రకృతిసుభగో లప్స్యతే తే ప్రవేశమ్,
తస్మాదస్యాః కుముదవిశదా న్యర్హసి త్వం న ధైర్యా
న్మోఘీకర్తుం చటులశఫరోద్వర్తనప్రేక్షితాని. 44

అ. గమ్భీరాయాః=గంభీర యను, సరితః=నదియొక్క, ప్రసన్నే=నిర్మల మగు, పయసి=జలమందు, ప్రసన్నే చేతసి ఇవ=నిర్మలమగు మనస్సునందువలె, ప్రకృతి-సుభగః=సహజసుందరమగు, తే=నీయొక్క, ఛాయాత్మా అపి=ఛాయాశరీ రమైనను, ప్రవేశమ్=ప్రవేశమును, లప్స్యతే=పొందగలదు. తస్మాత్=అందువలన, అస్యాః=గంభీరానదియొక్క, కుముద-విశదాని =తెల్లకలువలవలె శ్వేతవర్ణమగు, చటుల-శఫర-ఉద్వర్తన-ప్రేక్షితాని=చపలమీనముల భ్రాంతి మిట్టిపడుచూపులను, ధైర్యాత్ =ధూర్తత్వమున, మోఘీకర్తుం=వ్యర్థపుచ్చుటకు, న అర్హసి=తగవు.

భా. జలదా! ఈ మహాకాళసామీప్యమున గంభీరానది నీకు ప్రత్యక్షమగును.

గంధవతివలెనే మాళవదేశమున ప్రవహించు ఉపనదులలో నిది యొకటి. కాలుష్య మెఱుగని సతీచిత్తమువలె తన్నదీజలము లత్యంతనిర్మలములు. అనుభవయోగ్య ములు. నీవా! సహజసుందరుడవు. ఆమెయా! నీయం దత్యంతానురక్త. ప్రణయిని. అభిమానవతి. ఆమెయే ఆ విషయమును చాటుచున్నది. ఆమె ప్రేమ అపారము, అగాధము. ఆమె చంచలవీక్షణములే అందుకు ప్రబలతార్కాణము. జలదా! నీ కిష్టమున్నను లేకున్నను నీ ఛాయ ఆ ప్రసన్నజలముల ప్రవేశ మూనక మానదు. నీ నీడ ఆ తేటనీటిని ఆనక మానదు. అంతమాత్రముననే ఆమె గాత్రము అనురాగమున పులకితమగును. ఆమెచూపులు చపలత నందును. కుముదవిశదములగు ఆ తరళమీనవీక్షణములు ప్రణయభావమున స్తిమితము దప్పి నిన్నంట మింటికి మిట్టిపడును. ఆ వలపుచూపులను వ్యర్థపుచ్చి కించపఱచకుము. ధూర్తత్వము తగదు. ఉపేక్ష వలదు. ప్రణయభంగ ముచితము గాదు. ఆమె యభిమానిని యగుట ఆదరణ లేని భంగపాటుకు క్రుంగిపోవును. మాన్యులకు మానవతుల యభిమానరక్షణ భావ్యమగును. అనురక్త నుపేక్షించుట న్యాయమగునా? నదీమేఘముల సంభోగశృంగారమందు శఫరోద్వర్తనవీక్షణములను ప్రేయసీకటాక్షవీక్షణములతో నుపమించు (పోల్చు) టెంతయు స్వాభావికము, సమంజసము, రసస్ఫోరకము నై యున్నది. శఫరమన మిలమిల మెరయు రజతవర్ణమగు మత్స్యము. ఉద్వర్తన మన ఈదుచు ఇటు అటు దొర్లుచు మీది కెగయుట. ఈ లక్షణము చూపులకును గలదు. ఇందు పయస్సు-చేతస్సులకును కుముద-వీక్షణములకును శాబ్దికసాదృశ్యము, గంభీరానదికి నాయికతో అర్థసామ్యము గాన ఉపమ (కుముదవిశదాని) అనుచోట లుప్తోపమ. ఉద్వర్తనములయందు చూపుల నారోపించుట రూపకము. అంగాంగిభావమున సంకరాలంకారము.

అవ. వివృతజఘన యగు నాయికారూపమున గంభీరానది వర్ణన-

శ్లో. తస్యాః కించిత్కరధృత మివ ప్రాప్తవానీరశాఖం
హృత్వా నీలం సలిలవసనం ముక్తరోధోనితమ్బమ్,
ప్రస్థానం తే కథమపి సఖే లమ్బమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః. 45

అ. హే సఖే =ఓ మిత్రమా! ప్రాప్త-వానీర-శాఖమ్ =సక్తమగు (అంటిన) వేతస (ప్రబ్బలి) లేక పేము లేక రెల్లు శాఖలు గలదియు, (కనుకనే) కించిత్= కొంచెము, కర-ధృతమ్-ఇవ= హస్తమున పట్టబడినదివలె నున్నదియు, ముక్త-రోధో-నితమ్బమ్=విడువబడిన తీరమను పిరుదులు కలదియు నగు, తస్యాః=ఆ గమ్భీరానదియొక్క, నీలమ్=నీలవర్ణమగు, సలిల-వసనమ్=జలరూప వస్త్రమును,

హృత్వా=హరించి (తొలగించి), లమ్బమానస్య=వ్రేలు (వాలు) చున్న, తే=నీయొక్క, ప్రస్థానమ్=ప్రయాణము, కథం అపి=ఎటులనో (అతికష్టమున), భావి=సాగును. జ్ఞాత-ఆస్వాదః=రసానుభూతి కల, కః=ఎవడు, వివృత-జఘనామ్=నగ్నజఘనము గల మగువను, విహాతుమ్=విడుచుటకు, సమర్థః=శక్తిసంపన్నుడు, భవేత్=కాగలడు.

భా. జలదా! కరావలంబితనీలాంబరము (వస్త్రము) వలె శ్యామవర్ణమగు ఆ గంభీరానదీనీరము వేతసశాఖాసక్తమై (ప్రబ్బలిశాఖల నంటి) యగపడుచున్నది. వలువను జారవిడిచిన నితంబము (పిరుదు) వలె నీరములు దిగవిడిచిన తీరము లగపడుచున్నవి. ఇప్పు డామె కరధృతవసన. అనాచ్ఛాదితనితమ్బ. నీలనీర వసనధారిణి. ఆమె ప్రణయిని. నీలాంబరధారణము ప్రణయతాపోపశమనకర మని యందురు కదా! ఆ శ్యామవర్ణమగు సలిలవసన మపనయించి (తొలగించి) అందు వ్రాలిన నీ గమన (యాత్ర) విషయము సంశయాస్పదము. కష్టసాధ్యము. తన్నదీనామము గంభీర. సార్థకనామము. ఆమె ప్రేమ అంతకంటెను గంభీరము. తొణుకు బెణుకు లెరుగని ప్రణయ మది. ప్రణయగంభీర యగు ఆమె నెట్లు విడువగలవు? నీ గమన మెట్లు సాగగలదు? వివృతజఘన యగు కాంత నెవడు విడువగలడు? విగతాంబరనితంబ యగు అంగనను రసజ్ఞు డెట్లు విడుచును? నగ్నజఘన యగు యువతిని విడిచి పోగల శక్తి ఎవని కున్నది?- ఇట కవి గంభీరానదిని నాయికారూపమున చిత్రించెను. నవవధువు కామి యగు కాంతుడు కటివస్త్ర మపహరింప సిగ్గుచే వస్త్రమును హస్తమున నదిమిపట్టినట్లు గమ్భీరానదియు వేతసశాఖారూపమగు హస్తముల జలరూపవసనమును బిగబట్టినది. ప్రాయికముగా కాముకునికి కామిని కటివస్త్రము తొలగించుటయం దెంతయో యానంద మొనగూడుచున్నది. కాని గీతగోవిందకావ్యమున నాయికచేతనే నాయకుని వస్త్ర మపనీతమైనది. 'కేలికలాకుతుకేన చ కాచిదముం యమునాజలకూలే, మంజులవంజులకూలగతం విచకర్ష కరేణ దుకూలే' ఇతి. జఘన మన కటిప్రదేశమునకు పూర్వభాగము. పశ్చాద్భాగము నితంబ మనబడును. ఇందు 'కరధృతం ఇవ' అనుచోట ఉత్ప్రేక్ష. రోధమందు నితంబము, సలిలమందు వస్త్రము ఆరోపితమగుట శాబ్దికరూపకము. గంభీరానదియందు నాయికారోపణముచే ఏకదేశవివర్తిరూపకము. చతుర్థచరణమున అర్థాంతరన్యాసము. వీటికి అంగాంగిభావమగుట సంకరాలంకారము.

అవ. మేఘుని దేవగిరి యాత్రావర్ణన-

శ్లో. త్వన్నిష్యన్దోచ్ఛ్వసితవసుధాగన్ధసంపర్కరమ్యః
స్రోతోరన్ధ్రధ్వనితసుభగం దన్తిభిః పీయమానః,
నీచైర్వాస్యత్యుపజిగమిషోర్దేవపూర్వం గిరిం తే
శీతో వాతః పరిణమయితా కాననోదుమ్బరాణామ్. 46

అ. త్వన్నిష్యన్ద - ఉచ్ఛ్వసిత-వసుధా-గన్ధ-సమ్పర్క-రమ్యః=నీవు వర్షింప ఉబికిన పృథివీగంధసంపర్కమున మనోహరమైనదియు, స్రోతోరన్ధ్ర- ధ్వనిత-సుభగమ్ (యథా తథా)=నాసికాగ్రరంధ్రముల జనించు శబ్దముచే సుభగమగునట్లుగా, దన్తిభిః =ఏనుగులచే, పీయమానః=ఆఘ్రాణించబడినదియు, శీతః=చల్లనైనదియు నగు, వాతః=వాయువు, దేవపూర్వమ్=దేవశబ్దము పూర్వమందు గల, గిరిమ్=అద్రిని (దేవగిరిని), ఉపజిగమిషోః=సమీపించగోరు, తే=నీకు, నీచైః=నెమ్మదిగా, వాస్యతి=వీచును.

భా. జలదా! దేవగిరికి నీవు పయనించునపుడు ఇంచుక వర్షించితివా పుడమిరూపమే మారిపోవును. నీ సంపర్కమున కామె పులకించి ఆనందమున పొంగి పోవును. ఉబ్బి తబ్బిబ్బగును. క్రొంగొత్తరుచులు సంతరించుకొని సంతోషమున మురిసిపోవును. భవ్యరూపమున మధురసౌరభము లుదయమందును. పృథివీగంధ మెంత మధురము! సహజసౌరభ మది. అసలు ఆమె రూపమే యది. 'పృథివీ గంధవతీ' యని. ఆమె లక్షణమే యది. అదియే ఆమె స్వభావము. అది సార్థకనామము. ఆ గంధసంపర్కమున అచటి వాతావరణ మంతయు మధుపూరిత మగును. అచటి వాయువు సురభిళమగును. ఆ మధురకమనీయగంధమునకు మత్తేభములు మోరలెత్తి తత్తరమున ఎగబడి రమ్యధ్వను లెగయ నాసికారంధ్రముల పూరించి ఆ మధురపరిమళము లాఘ్రాణించును. మిత్రమా! ఆ శబ్ద మెంత సుభగము! ఎంత మనోజ్ఞము! మధురమగు భాండస్వర మది. వేణునాదము. ఎంత హృదయానందకరము! మఱియు నట ఉదుంబరవన మున్నది. అత్తిచెట్లు, పుష్కలమగు పంట. నీవు వర్షింప అవి పండబారును. నీ చల్లగాలి కవి పక్వమగును. అదియు నొక ప్రయోజనమే గదా! శీతలసమీరము- చల్లగాలి! ఎంత మనోరంజకము! ఉల్లాసకరము! జలదా! సురభిత సుభణిత సుమనోహర శీతలసమీరము నిన్నలరించుటయేగాక సన్నగా వీచి నీ యలసట పోద్రోలి వాలుగా నీ యాత్ర కనుకూలించును. ఇట స్రోతశ్శబ్ద మింద్రియార్థకమైనను లక్షణయా ఇంద్రియవిశేషమగు నాసికార్థమున ప్రయోగించబడినది. దేవపూర్వం గిరిమ్ అనుచోట అవాచ్యవచనదోషమని ఆలంకారికుల యభిప్రాయము. 'దేవః దేవశబ్దః పూర్వే యస్య సః తం ఇతి' దేవపూర్వత్వము గిరిశబ్దమునకే గాని సంగియగు దేవగిరికి కాదని వారి యభిప్రాయము. దేవశబ్దవిశేషితగిరిశబ్దమువలన లక్షణయా దేవగిరి యని పేర్కొనవచ్చును. ఇట్టి ప్రయోగము లితరత్రను గలవు. 'హిరణ్యపూర్వం కశిపుం ప్రచక్షతే' (శిశుపాలవధ సర్గ 1-42) 'దశపూర్వరథం యమాఖ్యయా' (రఘువంశః సర్గ 8-29) ఇత్యాది. దేవగిరి చంబల్‌కు దక్షిణమున మాళవ దేశమునకు కేంద్రస్థానమున గలదు. దీనిమీదనే సుప్రసిద్ధమగు కార్తికేయుని మందిరము

ప్రతిష్ఠితమై యున్నది. అలంకారము స్వభావోక్తి.

అవ. దేవగిరి నధిష్ఠించియున్న కార్తికేయుని వర్ణన.

శ్లో. తత్ర స్కన్దం నియతవసతిం పుష్పమేఘీకృతాత్మా
పుష్పాసారైః స్నపయతు భవాన్ వ్యోమగఙ్గాజలార్ద్రైః,
రక్షాహేతో ర్నవశశిభృతా వాసవీనాం చమూనా
మత్యాదిత్యం హుతవహముఖే సంభృతం తద్ధి తేజః. 47

అ. తత్ర=దేవగిరియందు, నియత-వసతిమ్=స్థిరనివాసముగల, స్కన్దమ్=కుమారస్వామిని, పుష్పమేఘీ-కృత-ఆత్మా=పూలు వర్షించు మేఘరూపుడవై, వ్యోమ-గఙ్గా-జల-ఆర్ద్రైః=ఆకాశగంగోదకముల ఆర్ద్రములగు (చెమ్మగిలు), పుష్ప-ఆసారైః=పూల జల్లులచే, భవాన్ ఏవ=నీవే (స్వయముగనే), స్నపయతు=అభిషేకింతువుగాక, తత్=ఆ దైవము (కార్తికేయుడు), వాసవీనామ్=వాసవ (ఇంద్ర) సంబంధమగు, చమూనామ్=సేనలయొక్క, రక్షా-హేతోః=సంరక్షణార్థము, నవ-శశి-భృతా=బాల చంద్రధరుడగు ఈశ్వరునిచేత, హుత-వహ-ముఖే=హోమమును వహించు అగ్నిముఖమున, సంభృతమ్=ఉంచబడిన, అత్యాదిత్యమ్=భాస్కరతేజము నధిగమించిన, తేజః హి=తేజము (జ్యోతి) గదా!

భా. జలదా! నీవు కామరూపుడవు. ఇచ్ఛాధీనము నీ రూపము. నీ వే రూపమునైనా ధరించగలవు. శ్యామరూపుడవై అనుకూలవర్షమున పుడమిని సస్యశ్యామలము జేసి బంగారుపంటలు పండించ హేతుభూతుడవు కాగలవు. నీలరూపమున విజృంభించి గర్జనలతో వర్షధారల నదీనదముల పొంగించి ఏకము చేయగలవు. శిలావర్షమున సర్వసస్యములను ఫలవృక్షములను పాడుచేయగలవు. శ్వేత (విశద) రూపము ధరించి వర్షమును బిగబట్టి కరువుకాటకములు సృష్టించగలవు. నీ చల్లనిచూపు సృష్టికి, పుష్టికి హేతువు. నీ యాగ్రహము విధ్వంసమునకు, ప్రళయమునకు కారకమగును. జలదా! ఇపు డా దేవగిరిని కార్తికేయమందిరమున కార్తికేయు డధివసించియున్నాడు. పార్వతీనందనుడు, కుమారస్వామి కది స్థిరనివాసము. దేవసేనాని యతడు. లోకకంటకుడు తారకుని కెదురుగా సురసైన్యముల నడిపి విజయమందిన ధీరుడు. తారకాసురభంజనుడు. జనరంజకుడు. భక్తవందితుడు. జలదా! దేవగిరిని కార్తికేయుని గుడికి పోయి పూలవర్షమున అభిషేకించి ఆ స్వామి నర్చించుము. వ్యోమగంగాజలార్ద్రములగు పూలచే భక్తివినమ్రుడవై అర్చించిన అది ఇహపరముక్తిదాయక మగును. కార్తికేయు డన ఎవ రనుకొంటివి? ఈశ్వరతేజ మది. చంద్రశేఖరుని అంశ. అత్యాదిత్య మది. సూర్యతేజము నధిగమించిన అనంతదివ్యతేజఃపుంజము. అమేయశక్తిసంపన్నుడు,

ప్రేమాదరము లెందుకుండవు? కనుకనే కువలయదళమున కర్ణమగు కర్ణముల స్వయంగళితములగు నెమలికన్నులు ధరించి ముఱియుచున్నది. పుత్రవాత్స ల్యమును చాటుచున్నది. ఆమె కిప్పుడు మయూరబర్హము కర్ణాభరణమైనది. ప్రేమపాత్రుల వస్తు వేదియైనను ప్రీతిదాయకమే గదా? ప్రియసుతుని వాహనము మయూరము. నెమలిక న్నెంత అందమైనది? విలక్షణమైన వర్ణము! అదియొక రమ్యమగు వర్ణసంకలనము. అందముల మేలుకలయిక. కాంతిరేఖల సమన్వయము. ఇందీవరముల వెలుగులు, ఇంద్రనీలముల జిలుగులు అం దిమిడియున్నవి. పార్వతీతనయుని మయూరపింఛవైభవ మట్టిది! అయినను ఆమె దానిని త్రుంచదు. స్వయంగళితబర్హమే ఆమె కత్యంతసమాదరణీయము. ఆమె పుత్రప్రేమ, ఆదరణ లట్టివి! జలదా! పుష్పాభిషేచనమున కార్తికేయు నర్చించి మీదట ఆ మయూరమును నర్తింపజేయుము. ఆ నృత్య మెంత మనోజ్ఞము! ఎంతో హృదయంగమము. అది యొక లయాన్విత అపూర్వ విభ్రమ విలసితము. ఒయ్యారముల చిలకరింపు. సోయగముల కలయిక. అత్యంతకమనీయ మనోజ్ఞదృశ్య మది. జలదా! చంద్రశేఖరుని శిరోభూషణమగు బాలచంద్రుని తెలివెన్నెల నునుమెఱుగులు సోక మించిన ముత్తెపుసొరులు నింపు ఆ నెమలి కడకన్నుల చూపు లెంత రమ్యములు! జలదా! మయూరములకు నీ వాత్మబంధుడవు. నీ రాక వాటికి ఆనందోత్సవము. సదా నీ కవి స్వాగతము పలుకుచుండును. పర్వతగుహల ప్రతిధ్వనించు (మారుమ్రోగు) నీ యుఱుములు వాటికి మురజధ్వనులు. మృదంగవాద్యములు. ఉఱుముమెఱుముల పసందెఱుగు ఆ మయూర మంజులమనోజ్ఞ లలితనృత్యభంగిమలు నయనపర్వముగ తిలకించి ధన్యుడవు కమ్ము. నృత్యమున గాని అర్చన పూర్ణరూపము ధరించ దనునది నీకు విదితమేకదా! ఇం దుపమాతద్గుణముల సంసృష్టి.

అవ. చర్మణ్వతీనదిని సన్మానింపుమని యక్షుడు మేఘు నర్థించుట -

శ్లో. ఆరాధ్యైనం శరవణభవం దేవముల్లఙ్ఘితాధ్వా
సిద్ధద్వన్ద్వై ర్జలకణభయా ద్వీణిభిర్ముక్తమార్గః,
వ్యాలమ్బేథాః సురభితనయాలమ్భజాం మానయిష్యన్
స్రోతోమూర్త్యా భువి పరిణతాం రన్తిదేవస్య కీర్తిమ్. 49

అ. ఏనమ్=పూర్వోక్తుడగు, శర-వణ-భవమ్=బాణతృణ (రెల్లు గడ్డి)వనమం దావిర్భవించిన, దేవమ్=కుమారస్వామిని, ఆరాధ్య =సేవించి, వీణిభిః=వీణాపా ణులగు, సిద్ధ-ద్వన్ద్వైః=సిద్ధదంపతులచేత, జల-కణ-భయాత్=జలబిందు సేకత్వ (తడియ) భయమువలన (వర్షబిందుసేకము వీణాక్వణన (ధ్వని) ప్రతి బంధకము. ముక్త- మార్గః సన్=విడువబడిన మార్గము కలవాడ

[వెలి]గుచు, ఉల్లఙ్ఘిత-అధ్వా=అధిగమించిన మార్గము కలవాడవై, సురభి-తనయా-[ఆ]లమ్భ-జాం=కామధేను సంతతియగు గోవులను యాగమున హననమొనర్ప [ఉ]ద్భవించినదియు, భువి=భూలోకమున, స్రోతో- మూర్త్యా=(చర్మణ్వతీనదీ) [ప్ర]వాహరూపమున, పరిణతామ్=రూపొందినదియు నగు, రన్తిదేవస్య=దశపురాధిప [తి]యగు రంతిదేవుని, కీర్తిమ్=కీర్తిని(చర్మణ్వతీనదిని), మానయిష్యన్=గౌరవించుచు, [వ్]యాలమ్బేథాః=అవనతుడ వగుము.

భా. జలదా! స్కందు డన ఎవ రనుకొంటివి? ఈశ్వరతనయుడు. [ప]ార్వతీనందనుడు. ఆ షడాననుని అర్చించుము. అమరసేనానియై తారకాసుర [భ]ంజనమున సురలకు జయము గూర్చిన ఘను డతడు. అసురపీడితులగు అమరుల [ఖ]ేదములు బాపి శుభమొనరించిన ఘటికుడు. దయామయుడు. ఆ కార్తికేయుని [భ]జించి ఈప్సితార్థములు చూరగొని ధన్యుడవు గమ్ము. అతని కృపకు పాత్రుడ [వ]గుము. అనంతర మటనుండి శీఘ్రగతిని తరలిపొమ్ము. జాగు చేయకుము. [క]ొలయన స్వామి సన్నిధిని గానమొనర్ప వీణలు చేతబట్టి సిద్ధమిథునము [ల]ట కేతెంతురు. కార్తికేయుని విజయగీతములు విపంచీ (వీణ) స్వరముల [మ]ేళవించి యెలుగెత్తి మధురముగ పాడి పార్వతీతనయుని యనుగ్రహమునకు పాత్రు లగుదురు. మనోజ్ఞముగ వీణలు మీటి మీటి కమనీయమగు స్వరములు కూర్చి కూర్చి కార్తికేయుని విజయగీతములు హృదయ ముప్పొంగ పాడి పాడి ధన్యు లయ్యెదరు. వారి కది అధిగమించరాని నిత్యకర్తవ్యము. జలదా! నీవు చినికిన తమ వీణలు పలుకవని వారికి భయము. జలకణసేకము వీణానాదప్రతిబంధకము సుమీ! చెమ్మగిల్లిన వీణాతంత్రులు ఎట్లు పలుకును? అవి పలుకవు. అందుచే నీవట జాగుచేయక ముందుకు సాగి పొమ్ము. అంత నీ యెదుట ప్రత్యక్షమగునది రంతిదేవుని కీర్తి. ప్రతిష్ఠ. ప్రవాహరూపమున పరిణమించినది. అదియే చర్మణ్వతీనది యని ప్రసిద్ధి కెక్కినది. దశపురాధిపు డొనరించిన గవాలంభయజ్ఞములు ఒకటి రెండులు గావు. పదులు వందలు గావు. సహస్రములు! అందు హతమగు సురభిసంతతి చర్మరాశిని బుట్టి స్రవించిన రక్తస్రవంతి యది. చర్మణ్వతీనది. స్రోతోరూపమున బ్రవహించు దశపురాధిపతి కీర్తి. ఆదరమున ఇంచుక అవనతుడవై నమ్రభావమున ముందుకు సాగిపొమ్ము. ఒకప్పుడు దశపురాధిపతి రంతిదేవుడు గవాలంభ యజ్ఞములు చేసి ఒకచో జేర్చిన రక్తనిష్యందమగు చర్మరాశి నుద్భవించిన దగుట చర్మణ్వతీనది యని ప్రసిద్ధినందిన దని ప్రతీతి. 'హిందువులకు గోవును మించిన పవిత్ర జంతువు మఱియొకటి కానరాదు. కామధేనువు సంతతి యగు గోవు సదా పూజనీయమని మహర్షుల మాట. అది వేదవాక్కు. గోహననము (హత్య) మహాపాతకమని గదా యందురు. అట్టియెడ యాగమను పేరున మూగజీవులగు సహస్రాధికగోవుల

హతమార్చి రక్తపుటేఱులు ప్రవహింపజేయ అది కీర్తిస్రోతము ప్రతిష్ఠాధాయకము లెట్లగునో తెలియరాకున్నది. బహుశః అది ఆనాటి ఆలోచనావిధానము గావచ్చును. లేక భావనాపరంపర యైన గావచ్చు. ఋతువు ఋతువున ఉత్పన్నమగు సస్యము సురభితనయ లనియు అనగా పృథివియొక్క కృషిసంస్కృతియే గోమేధయాగమనియు కొందఱి భావన. అదియే సమంజసము గావచ్చును. రంతిదేవుడు భరతునికి అఱువదవతరము చంద్రవంశపు రాజని యందురు. ఈ శ్లోకమున కీర్తిచర్మణ్వతీనదులకు భేదమున్నను అభేదాధ్యవసాయము గాన అతిశయోక్త్యలంకారము.

అవ. చర్మణ్వతీనదియం దవనతుడగు మేఘుని రూపవర్ణన-

శ్లో. త్వయ్యాదాతుం జలమవనతే శార్‌ఙ్గిణో వర్ణచౌరే
తస్యాః సిన్ధోః పృథు మపి తనుం దూరభావాత్ప్రవాహమ్,
ప్రేక్షిష్యన్తే గగనగతయో నూన మావర్జ్య దృష్టీ
రేకం ముక్తాగుణమివ భువః స్థూలమధ్యేన్ద్రనీలమ్. 50

అ. శార్‌ఙ్గిణః=కృష్ణునియొక్క, వర్ణ-చౌరే =కాంతి (రంగు) చోరుడవగు, త్వయి =నీవు, జలమ్ =నీరమును, ఆదాతుమ్=గ్రహించుటకు, అవనతే సతి=వంగినవాడవు కాగా, గగన-గతయః =ఆకాశగాములగు గంధర్వాదులు, పృథుమ్ అపి =స్థూలమైనదైనను, దూర-భావాత్=దూరమగుటవలన, తనుమ్=సూక్ష్మమగు (అట్లగుపించు), తస్యాః=ఆ, సిన్ధోః=చర్మణ్వతీనదియొక్క, ప్రవాహమ్ =స్రోతస్సును, నూనమ్ =నిశ్చయముగా, దృష్టీః =చూపులను, ఆవర్జ్య=వంచి, ఏకమ్=ఒకేపేటది, స్థూల-మధ్య-ఇంద్రనీలమ్=స్థూలము మధ్య మణిభూతము సౌ.. ఇంద్రనీలముగల, భువః=పృథివియొక్క, ముక్తా-గుణమ్ ఇవ=ముత్తెపుసరమువలె, ప్రేక్షిష్యన్తే=చూడగలరు.

భా. జలదా! నీ వెంతయు ధన్యుడవు. నీవలన ఎన్ని ప్రయోజనములు! ఒకటి పుడమిపడతికి అపురూపరూపసిద్ధి. ఖేచరుల చూపులకు కమ్మని విందులు. నీకును విలక్షణరమణీయశోభ. ఎట్లందువా? నీవు వర్ణచోరుడవు. శృంగధనుర్ధారియగు కృష్ణభగవానుని శ్యామవర్ణమును గుంజుకొని పుష్టినందితివి. తత్తుల్యవర్ణుడవు. శ్యామవర్ణుడవగు నీవు అంబుపానమునకు అవనతుడవై ఆ నదిని వ్రాల, అప్రయత్నముగ, గగనచరులగు సిద్ధసాధ్యుల చూపులన్నియు ఆ రమణీయదృశ్యమును చూడ పరుగులిడును. జలదా! అదియొక అపూర్వసౌందర్యవిలసనము. సిద్ధగంధర్వాదులు నింగినుండి ఆ పృథివీసతి యపురూపసౌందర్యసౌభాగ్యగరిమను, రూపలావణ్యమును, తన్నదీప్రవాహ రమణీయశోభను, భవద్రూపవిశేషవైభవమును

అబ్బురపాటుతో నిర్నిమేషముగ వీక్షింప నుత్సహింతురు. స్వచ్ఛమగు తన్నదీతరళ ధవళధార విపులమైనదైనను దూరమగుట గగనచరుల కది అల్పముగ ప్రత్యక్షమగును. అది భూసతి కంఠమందలి తరలతారలబోలు ఆణిముత్తెపుసరము భాంతి గోచరించును. ఇక నీలవర్ణుడవగు నీవు ఆ హారమధ్యగత (నడుమ పొదిగిన) నీలమణి (ఇంద్రనీలము) భాంతి వింత సొబగుల బ్రకాశింతువు. పుడమిపడతి! ఆమె కంఠమున శరత్పూర్ణిమా శీతలచంద్రికావీచికల విరజిమ్మ ఆణిముత్తెపుసరము! అందు మధ్యగతమణిరూపమున నీలరుచుల జిగిబిగులు వెలార్చుచు చూపులకు వింతవిందులు సమకూర్చు భవద్రూపవైచిత్ర్యశ్రీము! మిత్రమా! ఆ దృశ్య మెంత మనోజ్ఞము, ఎంత హృదయంగమము! ఎంత ఆహ్లాదకరము! పుడమి- నది- అంబుదము తత్సమాహార సంజనితవిలక్షణ రమణీయకమనీయదృశ్య మది. ఖేచరు లైన నేమి? చూపులు కిందికి నిగిడ్చి కన్నులింతింతలు జేసి రెప్పవాల్చక చూడ కెట్లూరకుందురు? ఈ శ్లోకభావ మితరత్ర గూడ లభ్యమగుచున్నది. 'ఏషా ప్రసన్నస్తిమితప్రవాహా సరిద్విదూరాంతర భావతన్వీ, మందాకినీ భాతి నభోపకణ్ఠే ముక్తావలీ కణ్ఠగతేవ భూమేః' ఇతి. ఇందు వర్ణచౌర్య మగపడుచున్నది. అది, అసంభవము. కృష్ణవర్ణముతో తుల్యవర్ణమును ప్రతిపాదించుటచే నిదర్శనము. నీలమేఘముతో గూడిన చర్మణ్వతీప్రవాహమందు భూసతికంఠమందలి మధ్యమణిసంగత ముక్తాహారముగా సంభావించుట ఉత్ప్రేక్ష, అంగాంగిభావమున సంకరాలంకారము.

అవ. దశపురాంగనల భ్రూవిలాసవైఖరీవర్ణన-

శ్లో. తాముత్తీర్య వ్రజ పరిచితభ్రూలతావిభ్రమాణాం
పక్ష్మోత్క్షేపాదుపరివిలసత్కృష్ణశారప్రభాణామ్,
కున్దక్షేపానుగమధుకరశ్రీముషామాత్మబిమ్బం
పాత్రీకుర్వన్ దశపురవధూనేత్రకౌతూహలానామ్. 51

అ. తామ్=ఆ చర్మణ్వతీనదిని, ఉత్తీర్య=దాటి, పరిచిత-భ్రూ-లతా-విభ్రమాణామ్=సుపరిచితములగు సోగకనుబొమల విలాసములు గలవియు, పక్ష్మ-ఉత్క్షేపాత్=కనురెప్పలు పైకెత్తుటవలన, ఉపరి-విలసత్-కృష్ణ-శార-ప్రభాణామ్=మీదికి శోభాయమానముగ ప్రసరించు నీలాధికశబల (నీలరక్తశ్వేతవర్ణముల సంకలనము) వర్ణము గలవియు, కున్ద- క్షేప-అనుగ-మధుకర-శ్రీ-ముషామ్=మల్లెల ఊగులాట ననుసరించి చరించు భ్రమరముల రామణీయక మపహరించునవియు నగు, దశపుర-వధూ-నేత్ర- కౌతూహలానామ్=రంతిదేవుని దశపురవనితల నేత్రాభిలాషలకు, ఆత్మ-బిమ్బమ్=భవద్రూపమును, పాత్రీకుర్వన్=విషయీభూత మొనర్చినవాడ వగుచు, వ్రజ=పయనించుము.

భా. మిత్రమా! చర్మణ్వతీనదిని దాటి దశపురమును సమీపించుము. రంతిదేవుని రాజధాని యది. తన్నగరవనితలు అసామాన్యలు. రూపలావణ్యాశోభితలు. మెరుపుశలాకలు వారు. నీ రమణీయాకారము వీక్షింప నిరీక్షింతురు. నీ రూపు చూడ వారెంతగానో ఉవ్విళ్లూరెదరు. భవద్రూపురేఖల జూడ ముచ్చటపడెదరు. వారు రూపయౌవనలాలసలు. వారి కనుబొమలు తీర్చిదిద్దిన ఇక్షుశరాసనములు. నునుసోగలై మార్దవమున వల్లరీమతల్లుల నధిగమించినవి. సుడిముడులు విరుపుమెలుపులు ఒడుపు ఒయ్యారములు వాటికి సుపరిచితములే గాక వెన్నతోబెట్టిన విద్యలు. ఆ కనుబొమల ఆ వీక్షణముల విభ్రమవిలాసములు తొణికిసలాడుచున్నవి. ఇక నిన్ను వీక్షింప ఉన్నమితనయన లగుట ఆ మధురకమనీయవీక్షణముల వర్ణశబలతలు మీది కెగసి చిత్రవర్ణసుశోభితము లగును. నలుపుతెలుపుల సయ్యాట లవి. అవి అందముల చిందులాటలు. ఏలయందువా! ఆ చూపుల విన్నాణములు వింతలు విశేషములు అట్టివి. అవి ఎంత ముచ్చటైనవి? గాలి తాకిడికి అటు ఇటు కదలియాడు మల్లెలనంటి ముద్దుముచ్చటలాటు తుమ్మెదల సౌరులు నింపుకొనుచున్నవి. ఇట నగరవనితల తెల్లని కనుగ్రుడ్లు కుంద (మల్లె)కుసుమములను, అందలి నల్లని కంటిపాపలు భ్రమరము (తుమ్మద)లను పోలియున్నవట! చపలములగు ఆ చూపులు మల్లెల నంటిన తుమ్మెదలట! 'ఏమి సాదృశ్యము! ఇది కాళిదాసుని హృదయమందలి కమ్మని యూహ. అతని హృదయమం దుదయమొందిన మధురభావన. అంతేకాదు. అమరకవి మధురహృదయజలధి నవతరించిన అమృతగుళిక. అది పాలకడలి తరగల లేచిన మీగడతరక. వెన్నముద్ద. 'జలదా! సాభిలాషలగు ఆ దశపురాంగనల చపలవీక్షణములకు సోగకన్నులకు సుందరమగు నీ రూపమును అంకితమొనర్చుము. ఆ చూపుల తీపులకు హారతి పట్టుము. వారి వీక్షణోత్సుకతను దీర్చి తరలిపొమ్ము. ఇందు వస్తుసంబంధమగు శోభాచౌర్యము అసంభవము గాన శోభకు సాటియగు శోభ యను సాదృశ్యమున నిదర్శనాలంకారము. మల్లెపూవు తెలుపు. తుమ్మెద నలుపు. వధూనేత్రములు తెలుపు. కనీనికలు నలుపు. ఇట్లు కున్దపుష్పస్థితభ్రమరములందు వధూనేత్రసాదృశ్యమున ఉపమాలంకారము.

అవ. బ్రహ్మావర్తకురుక్షేత్రముల వర్ణన-

శ్లో. బ్రహ్మావర్తం జనపదమథ చ్ఛాయయా గాహమానః
క్షేత్రం క్షత్రప్రధనపిశునం కౌరవం తద్భజేథాః,
రాజన్యానాం శితశరశతైర్యత్ర గాణ్డీవధన్వా
ధారాపాతైస్త్వ మివ కమలాన్యభ్యవర్షన్ముఖాని. 52

అ. ఓ జలదా! అథ=అనంతరము, బ్రహ్మావర్తమ్=బ్రహ్మావర్తమను పేరు గల, జన

పదమ్=దేశమును, ఛాయయా=ఛాయామాత్రము (నీడ)చే, గాహమానః=ప్రవేశించి నవాడవై, క్షత్ర-ప్రధన-పిశునమ్=క్షాత్రయుద్ధసూచకమగు, తత్=ఆ సుప్రసిద్ధమగు, కౌరవమ్=కురువంశసంబంధమగు, క్షేత్రమ్=కురుక్షేత్రమును, భజేథాః=సేవిం పుము. యత్ర=ఎచ్చట, గాండీవ - ధన్వా=గాండీవ ధనుర్ధారియగు అర్జునుడు, శిత-శర-శతైః=తీక్ష్ణశర (బాణ) శతములచేత, రాజన్యానామ్=రాజులయొక్క, ముఖాని=వదనములను, ధారా-పాతైః=ధారావర్షపాతములచే, కమలాని=పద్మము లను, త్వమ్ ఇవ=నీవలె, అభ్యవర్షత్=ముంచెత్తెనో.

భా. మిత్రమా! దశపురము వీడిన నీకు బ్రహ్మావర్త మెదురగును. సరస్వతి, దృషద్వతి యను దేవనదుల నడుమ దైవనిర్మితమగు పుణ్యభూమి యది. అట్టి పవిత్రక్షేత్రము నుల్లంఘించుట పాడిగాదు. 'పీఠక్షేత్రాశ్రమాదీని పరివృత్యాన్యతో వ్రజేత్' అని గదా యందురు. కనుక పుణ్యక్షేత్రములయెడ అనాదరణ మెంత మాత్రము తగదు. భక్తిభావమున వినమ్రుడవై ప్రదక్షిణ మాచరింపుము. జలదా! ఛాయామాత్రమున ఛత్రము పట్టినట్లు అనాతపమండలమున ప్రదక్షిణ మొనరించి ప్రసిద్ధకురుక్షేత్రమును దర్శింపుము. మానవపరిణామవికాసములు తెలుపు మహాభారతము నీ వెఱుగనిది కాదు. భారతయుద్ధము నీకు తెలియనిది కాదు. కురురాజుల పోరు నీకు తెలియకుండునా! నేటికిని ఆ యుద్ధచ్ఛాయలు వీడలేదు. పాతస్మృతులు చెరగలేదు. నాటి శిథిలములు నేటికిని హృదయమును కలచి కెలకుచునే యున్నవి. ఏమైనను అది కురువీరుల కర్మభూమి. కదనభూమి. ధర్మక్షేత్ర మది. ఆ కురుక్షేత్రమున ఆ ధర్మయుద్ధమహాగ్నికుండమున ఎందరెందరో మహనీయులు పూజనీయులు ధర్మశీలురు నిహతులైరి. తమ అమూల్యపవిత్రరక్తమును ఆజ్యముగా ధారవోసి అసువు లర్పించిరి. ఊహకందని త్యాగ మది. అపరాధులతో బాటు నిరపరాధులు గూడ నిహతులైరి. ఆ భయంకరాయోధనము, ఆ శౌర్యపరాక్రమములు, ధర్మనిరతి, త్యాగశీలము, ఆ క్షేత్రదర్శనమాత్రమున చక్కగా విదితమగును. అవన్నియు స్మృతిపథమున నిలచి నేటికిని మెదలుచు కలచుచునే యున్నవి. జలదా! నిరంతరధారాసంపాతవర్షమున నీవు కమలవనమును కలచి శిథిల మొనర్చునట్లు ఆ ఘోరాహవమున అర్జునుడు గాండీవము చేతబట్టి అరిభయంకరుడై వందలు వేలుగా వాడి తూపులు బరపి అరివీరుల శిరములు ఖండించెను. ధారాపాతముగ నిశితశరపరంపరల శత్రుకంఠములు తునుమాడెను. కయ్యమున కవ్వడి కెదురుగా నిలబడగల ధీరుడెవడు? నిలిచి మనగలిగిన వారెవరు? (యత్తదోర్నిత్యసంబంధమైనను ప్రసిద్ధార్థే ప్రయుక్తత్వాత్ యచ్ఛబ్దోపాదానం నాపేక్షతే' ఇతి వామనః) పానిపట్ సమీపమున థానేశ్వర్‌కు దక్షిణపూర్వభాగమును కురుక్షేత్ర మందురు. మహాభారతయుద్ధము జరిగిన చోటిది. 'స సర్వం క్షత్ర

ముత్పాద్య స్వవీర్యేణానలద్యుతిః, సమన్తపఞ్చకే పఞ్చ చకార రౌధిరాన్ హ్రదాన్' (మహా-భా.-ఆది-పర్వ. అధ్యా. 2-శ్లో.4) ఇందు అర్జునుని బాణవృష్టికి మేఘుని జలవృష్టితో పోలిక గాన ఉపమాలంకారము. మేఘుని ధారాపాతవర్షముచే అర్జునుని బాణముల ధారాసారము స్ఫురించుటవలన స్మృత్యలంకారము.

అవ. సరస్వతీనదీజలవర్ణన--

శ్లో. హిత్వా హాలా మభిమతరసాం రేవతీలోచనాఙ్కా
బన్ధుప్రీత్యా సమరవిముఖో లాఙ్గలీ యాః సిషేవే,
కృత్వా తాసా మభిగమమపాం సౌమ్య సారస్వతీనా
మన్తశ్శుద్ధ స్త్వమపి భవితా వర్ణమాత్రేణ కృష్ణః. 53

అ. హే సౌమ్య=సౌమ్యరూపుడవగు ఓ జలదా!, బన్ధు-ప్రీత్యా=బంధువులయం దనురాగముచేత, సమర-విముఖః=యుద్ధమం దనాసక్తుడగు, లాఙ్గలీ=హలధరు డగు బలరాముడు, అభిమత-రసామ్=ఇష్టమగు రుచి కలదియు, రేవతీ-లోచన-అంకామ్=రేవతీలోచన చిహ్నిత మగు, హాలామ్=మధువు (సుర)ను, హిత్వా=విస ర్జించి, యాః (ఆపః)=ఏ సరస్వతీజలములను, సిషేవే=ఆస్వాదించెనో, తాసామ్=ఆ, సారస్వతీనామ్=సరస్వతీనదిసంబంధములగు, అపామ్=ఉదకములయొక్క, అభిగమమ్=సేవించుటను, కృత్వా=చేసి, అన్తశ్శుద్ధః=అంతరంగమున శుద్ధికలవాడవు, త్వమ్ అపి=నీవును, భవితా=కాగలవు. వర్ణ-మాత్రేణ=బాహ్యవర్ణమున మాత్రమే, కృష్ణః=నల్లనివాడవు.

భా. మిత్రమా! నీవు సరళస్వభావుడవు. సౌమ్యరూపుడవు. కారుణ్యమూర్తివి. కౌరవపాండవయుద్ధము నీకు తెలియనిది కాదు కదా! ఉభయపక్షము లందున అతిరథమహారథులు కలరు. విరాటద్రుపదులు పురుజిత్కుంతిభోజులు సాత్యకిసౌభద్రద్రౌపదేయులు భీమార్జునయుధిష్ఠిరాదు లొకవంకను, భీష్మద్రోణ కృపాశ్వత్థామలు సైంధవశకునిదుర్యోధనదుశ్శాసనరాధేయు లింకొక వైపున యోధాగ్రేసరులైన రాజన్యులందఱు ఏదో యొక పక్షమున యుద్ధసన్నద్ధులైరి. తటస్థులనువారు అరుదు. అతిభయంకర మారణహోమ మది. జరగబోవునది మహాబీభత్సము. తలచినంతనే గుండె లవియును. శాంతిప్రియుడు బలరాముడు. దుర్యోధనుడు ప్రియశిష్యుడు. అర్జునుడు బావమరిది. గారాబు చెల్లెలి మగడు. ఒకవైపు శిష్యవర్గము! మఱియొక దెస దగ్గరి బంధువర్గము! ఇందు తా నెవరిపక్షము! పక్షపాత మెఱుగని ధీశాలి. నిర్భయు డనునది విదితమే. వీరుడైనను స్నేహ మడ్డువచ్చినది. ప్రణయము సమతూకమైనది. బీభత్సము జూడజాలడు. యుద్ధమనిన రోత జనించినది. యుద్ధవిముఖు డతడు. శాంతి యవసర

మతనికి. ఆపైని సుఖజీవనము. సుర, ప్రియసతి రేవతి సాన్నిధ్యము. సురాప్రియుడైనను ఏకాకియై సుర సేవింప డతడు. అందామెయు భాగస్వామిని కావలె. సురాపానమున కైపు దేరిన ఆమె మదిరేక్షణముల ఛాయసోకిన గాని ఆ మధువంతగా ప్రీతి గాదతనికి. ఇప్పుడతడు తన కత్యంతస్వాదిష్ఠము, విడువ నసాధ్యము నగు సురాపానమును గూడ వర్జించి తీర్థయాత్రాభిముఖు డాయెను. మిత్రమా! అతడింకను- 'ప్రమాదో ధీమతామపి' బుద్ధిమంతులకు గూడ ప్రమాదములు తప్పవను నట్లు తొందరపడి తానొనర్చిన సజ్జనహత్యా దోషనివారణార్థము సరస్వతీ జలపానమున అంతఃశ్శుద్ధి గలిగి పాపవిముక్తు డాయెను. 'ఒకప్పుడు నైమిశారణ్యమున సత్రయాగము జరుగుచుండెను. బలరాముడు యాగమును జూడబోయెను. అచటి ఋషు లతనికి హార్దికస్వాగత మిచ్చిరి. పురాణకథాకథనమున నిమగ్నులగు శ్రీసూతులవా రది గమనించనే లేదు. తన కది యవమానమని భావించి ఆవేశమున అహంకారమును విడువజాలక సూతులవారిని వధించెను. పశ్చాత్తప్తుడగు బలరామునికి పాపపరిహారార్థము ఏడాదిపాటు బ్రహ్మచర్యము సరస్వతీజలసేవనము ప్రాయశ్చిత్తముగా చెప్పబడినది. సరస్వతీనది హిమాలయమున బుట్టి కురుక్షేత్రము మీదుగా ప్రవహించెడిది. కాని నేడది లుప్తమైనది.' జలదా! నీవును తన్నదీపుణ్యజలము లాని ఆత్మశుద్ధికలవాడవు కమ్ము. ఆ నిర్మలపవిత్రోదకము లాస్వాదించిన అంతశ్శుద్ధియే సమకూరును. బాహ్యరూపము నల్లనైన నేమి? తెల్లనైన నేమి? కావలసినది ఆత్మశుద్ధి, అంతశ్శుద్ధియే గదా!

అవ. భాగీరథీవర్ణన-

శ్లో. తస్మాద్గచ్ఛే రనుకనఖలం శైలరాజావతీర్ణాం
జహ్నోః కన్యాం సగరతనయస్వర్గసోపానపంక్తిమ్,
గౌరీవక్త్రభ్రుకుటిరచనాం యా విహస్యేవ ఫేనైః
శమ్భోః కేశగ్రహణ మకరో దిన్దులగ్నోర్మిహస్తా. 54

అ. తస్మాత్=ఆ కురుక్షేత్రమునుండి, అను-కనఖలమ్=కనఖల తీర్థము ననుసరించి ప్రవహించునదియు, శైల-రాజ-అవతీర్ణామ్=పర్వతరాజు హిమవంతు నియం దావిర్భవించినదియు, సగర-తనయా-స్వర్గ-సోపాన-పంక్తిమ్=సగరపుత్రుల స్వర్గాధిరోహణమునకు సోపాన (మెట్లు) పంక్తి అయినదియు, జహ్నోః=జహ్నుమ హర్షియొక్క, కన్యామ్=తనయ యగు భగవతి భాగీరథిని, గచ్ఛేః=సమీపించుము, యా=ఏ గంగాభవాని, ఫేనైః=ఫేనము (నురుగు)లచేత, గౌరీ-వక్త్ర- భ్రుకుటీ-రచ నామ్=గౌరి మోమునందలి చిడి ముడి పాటున, విహస్య ఇవ=అపహసించినదివలె, ఇన్దు- లగ్న-ఊర్మి-హస్తా సతీ=బాలచంద్రునియందు లగ్నమైన అలలు హస్తము

లుగా కలదగుచు, శమ్భోః=ఈశ్వరునియొక్క, కేశ-గ్రహణమ్= కేశగ్రహణమును, అకరోత్=చేసెనో!

భా. మిత్రమా! కురుక్షేత్రమును దర్శించి సారస్వతజలములు సేవించి తీర్థరాజము కనఖలను సమీపించుము. అట పావనగంగాతరంగిణి నీకు ప్రత్యక్షమగును. భారతీయుల తపఃఫల మది. పుణ్యముల పంట భారత భాగ్యప్రదాయిని భాగీరథి. హిమవన్నగతనయ, జహ్నుకన్య. కనఖలనంటి ప్రవహించుచున్నది. సగరుని మునిమనుమడు భగీరథుని తపమునకు ప్రసన్నత నంది భువి కవతరించిన పుణ్యనదీమతల్లి. సగరతనయుల స్వర్గాధిరోహణ సోపానపంక్తి యది. ముక్తిమార్గమున కుపకరించు బంగారుమెట్లవరుస. దగ్గరదారి. నాడును నేడును మఱెప్పటికిని హైందవుల హార్దికప్రణతుల కాలవాల మగు పుణ్యస్రవంతి. ఆ దివ్యస్రవంతికి భక్తిభావమున అవనతుడవై ప్రణతు లర్పించుము. వినయభావముతో మోకరిల్లుము. ఎడతెగని హైందవమన్నన లందు కొనిన కాణాచి యామె. మిత్రమా! సవతిపోరు సహించరానిది. తనను కాదని తన ప్రియుని వాల్లభ్యము దోచిన సవతిని మానవతి యగు మగువ ఎట్లు సహించగలదు? తన ప్రియుని జటాజూటము నధిరోహించిన జహ్నుతనయను జూచి గౌరి మండిపడినది. మూతి బిగించినది. మోము చిట్లించినది. కనుబొమలు ముడివేసినది. అయిన నేమి? గంగ మాత్రము ఏమంత తక్కువ! ఆమె చంద్రశేఖరుని శిరమే అధిరోహించినది. అంత మాత్రమున ఆగలేదు. బాలచంద్రుని గూడిన భవజటాజూటమును తన ఊర్మి (కెరటము) హస్తముల నదిమిపట్టినది. ఫేనడిండీరపంక్తిచే గౌరి నపహసించినది. పరిహసించినది. ఆ గంగ మాహాత్మ్య మట్టిది! ఆధిక్యత యట్టిది- 'ఖలః కో నాత్ర ముక్తిం వై భజతే తత్ర మజ్జనాత్, అతః కనఖలం తీర్థం నామ్నా చక్రు ర్మునీశ్వరాః' ఇతి స్కాందపురాణే. కాని టీకాకారులు కనఖలమును పర్వతముగనే లిఖించిరి. కనఖలము, గంగాద్వారము, హరిద్వారము వీటన్నిటిని కొందఱు ఒకటిగనే భావించుచున్నారు.

అయోధ్యాధిపతి సగరచక్రవర్తి అశ్వమేధయాగ మొనర్ప తలంచెను. వృద్ధినొందు అతని ప్రతాపము జూచి యోర్వలేక ఇంద్రుడు సవనాశ్వ మపహరించి పాతాళమున కపిలముని యాశ్రమమున బంధించెను. దానిని వెదకు సగరతనయులు కపిలాశ్రమమున బంధింపబడియున్న సవనాశ్వమును జూచి తప మొనరించు ఆ మునియే అశ్వచోరు డని భావించి అత్యాచార మొనర్చిరి. తపోవిఘ్నము సహించనోర్వని ఆ మహర్షి తన బ్రహ్మతేజమున వారందఱిని భస్మీపటల మొనర్చెను. సగరుని మనుమడు అంశుమంతు డంత హతులైన అరువ దివేల పినతండ్రుల భస్మరాశిని కనుగొని వినయవినమ్రుడై ప్రార్థింప దయాళు డగు

కపిలముని గంగ దివినుండి భువి కవతరించిన సగరతనయులు ముక్తి నందెద రని వాక్రుచ్చెను. అంశుమంతు డసంపూర్ణమగు అశ్వమేధమును పూర్తిజేసెను. తదుపరి అతని పౌత్రుడు భగీరథు డుగ్రతపమున గంగను మెప్పించి భువికి దెచ్చెను. పితరులు తరించిరి. గంగావతరణసందర్భమున ఉద్ధృతముగ బ్రవహించి మార్గమున జహ్నుముని యాశ్రమమును ముంచివేసినది గంగ. అంత ఋషి క్రుద్ధుడై గంగను హరించెను. అంత భగీరథుని ప్రార్థనపై జహ్నుడు గంగను కర్ణరంధ్రమున వెడలద్రోసెను. తత్కారణముగ గంగకు జాహ్నవీ, జహ్నుకన్యా యను నామము లేర్పడినవని పురాణకథనము.

ఇందు వక్త్రిశబ్ద మనావశ్యకము, స్వారస్యరహితము నని కొందఱు 'వక్రభ్రుకుటిరచనాం' అను పాఠమును గ్రహించుచున్నారు. డిండీరము తెలుపు, హాసము తెలుపు అని కవిసంప్రదాయము. కాన ఫేనమందు హాసము నుత్ప్రేక్షించెను. ప్రౌఢనాయిక సవతిని సహించక తన ప్రియతమాత్వమును ప్రదర్శించుచు తన పతిశిరోభూషణముతోడి శిరోజములను పట్టి లాగునట్లు గంగ నాయకుడగు శివుని శిరోభూషణమగు చంద్రునితో సహితముగ జటాజూటమును తరంగరూపమగు హస్తముల నదిమిపట్టినది. ఇందు 'విహస్య' అను చోట ఉత్ప్రేక్ష, ఊర్మయ ఏవ హస్తాః' అనుచోట రూపకము. ఉభయసంసృష్టి.

*అవ. గంగయందు మేఘావతరణము, గంగాయమునాసంగమదృశ్యవర్ణన-*

శ్లో. తస్యాః పాతుం సురగజ ఇవ వ్యోమ్ని పశ్చార్ధలమ్బీ
త్వం చేదచ్ఛస్ఫటికవిశదం తర్కయేస్తిర్యగమ్భః,
సంసర్పంత్యా సపది భవతః స్రోతసి చ్ఛాయయాఽసౌ
స్యా దస్థానోపగతయమునాసంగమే వాభిరామా. 55

అ. హే మేఘ!=ఓ జలదా!, సుర-గజ ఇవ=దిగ్గజమువలె, వ్యోమ్ని=ఆకాశమున, పశ్చార్ధ -లమ్బీ సన్=పృష్ఠ (వెనుక) భాగముచే వ్రేలుచున్నవాడవై, తస్యాః=ఆ గంగానదియొక్క, అచ్ఛస్ఫటిక -విశదమ్ =స్వచ్ఛమగు స్ఫటికము వలె నిర్మలమైన, అమ్భః=ఉదకమును, తిర్యక్ యథా తథా=తలక్రిందుగా, పాతుమ్=త్రాగుటకు, తర్కయేః చేత్=తలంచిన (ఉద్యమించిన)చో, సపది=తత్క్షణము (వెంటనే), స్రోతసి=ప్రవాహమందు, సంసర్పంత్యా=ప్రసరించుచున్న, భవతః=నీయొక్క, ఛాయయా=ప్రతిబింబము(నీడ) చేత, అసౌ=ఈ గంగ, అస్థాన-ఉపగత-యమునా-సంగమా ఇవ=స్థలముగాని స్థలమందు సంప్రాపిత యమునా సంగమముకలది వలె, అభిరామా=మనోజ్ఞమైనది, స్యాత్=అగును.

భా. మిత్రమా! నీ వెట కేగినను దాని కొక ప్రత్యేకత, విశిష్టత యేర్పడుచు

న్నది. గంగాసందర్శనమునగూడ ఒక ప్రయోజన మున్నది. అది యేమందువా? అస్థానమున అనగా ప్రయాణేతరస్థానమున గంగాయమునా సంగమము. గంగాయమునాసంగమము ప్రయాగయందు గదా! ఇది ప్రయాగ కాదు. ప్రయాగ కాని స్థల మిది. నీవు గంగ నెచ్చట చేరినను అది గంగా యమునా సంగమమువలె భాసించును. అది యొక వింతగదా! రమణీయదృశ్యము గదా! జలదా! నీది కృష్ణవర్ణము. నల్లనివాడవు. యమునయు నీవలెనే నల్లనిది. నిను పోలియుండును. ఇక గంగయా! అచ్ఛస్ఫటికవిశదము. అత్యంతనిర్మలము. ఉజ్జ్వలము. నీవు పశ్చా (వెనుక) ద్భాగమును మీదికెత్తి పూర్వ (ముందు) భాగమును భువికి వంచి దిగ్గజమువలె ఆకసమున వ్రేలుచు జలోన్ముఖుడవై తిరశ్చీనముగ స్ఫటికవిశదమగు గంగాజల మాస్వాదించుట కుద్యమించ, ఆ విశదగంగాజలముల ప్రతిబింబిత మగు నీ ఛాయ గంగాయమునాసంగమమువలె అత్యంతమనోజ్ఞమై చూపరుల చూపు కది యొక కమ్మని విందగును. విలక్షణకమనీయదృశ్య మగును. అది యొక తెలుపునలుపుల పుణ్యసంక్రమణము. అత్యంతహృదయరంజకము. అట్టిది అస్థానగంగాయమునాసంగమము గాక మఱేమగును? అవును! ప్రయాగ గంగా యమునాసంగమపుణ్యస్థల మనునది విదితమే. ఎఱుగుదుము. భ్రాంతిజన్యమైనను ఇదియు భిన్నస్థలమం దుపగతమగు గంగాయమునాసంగమముభాతి అత్యంతరమణీయమైనది కాగలదు. 'ఐరావతః పుండరీకో వామనః కుముదోఽఞ్జనః, పుష్పదంతః సార్వభౌమః సుప్రతీకశ్చ దిగ్గజాః'- 'కరిణ్యోఽభ్రముః కపిలా పింగలానుపమా క్రమాత్, తామ్రపర్ణీ శుభ్రదంతీ చాంగనా చాఞ్జనావతీ' అని అమరము. భావ మేమన - శ్యామవర్ణమగు మేఘము ఆకసమున లంబమానమగుచు తలక్రిందుగా వంగి గంగాజల మాస్వాదించునపుడు దాని నీడ ప్రసరించుటచే గంగనీటితో యమునాజలము మేళవించినదివలె తెలుపునలుపుగా నగ పడును. అట్టితరి అట గంగాయమునాసంగమ మను భ్రాంతి జనించును. ప్రయాగయందలి గంగాయమునాసంగమమందుగూడ అగపడునది సితాసితజలప్రవాహదృశ్యమే గదా! ఇందు సురగజముతో మేఘసాదృశ్యమున శ్రౌతీ ఉపమ. అచ్ఛస్ఫటికవిశద మనుచోట లుప్తోపమ. 'అస్థానోపగతయమునాసంగమా ఇవ' యం దుత్ప్రేక్ష. ఇట్టి యలంకారములు పరస్పరనిరపేక్షితము లగుట సంసృష్టి.

అవ. హిమాద్రిశిఖరమున మేఘుని విశ్రాంతివర్ణన-

శ్లో. ఆసీనానాం సురభితశిలం నాభిగన్ధైర్మృగాణాం
తస్యా ఏవ ప్రభవ మచలం ప్రాప్య గౌరం తుషారైః,
వక్ష్య స్యధ్వశ్రమవినయనే తస్య శృఙ్గే నిషణ్ణః
శోభాం శుభ్రత్రినయనవృషోత్ఖాతపఙ్కోపమేయామ్. 56

అ. ఆసీనానామ్=ఉపవిష్టములగు, మృగాణామ్=కస్తూరీమృగములయొక్క, నాభి-గన్ధైః=నాభియందలి గంధములచే, సురభిత-శిలమ్=సుగంధిత శిలలు గల దియు, తుషారైః=హిమకణములచే, గౌరమ్=విశద (తెల్ల)మైనదియు, తస్యాః ఏవ=ఆ గంగాతరంగిణికే, ప్రభవమ్=జన్మస్థానమగు, అచలమ్=హిమాద్రిని, ప్రాప్య=చేరి, అధ్వ-శ్రమ-వినయనే=మార్గాయాసనివారకమగు, తస్య=ఆ గిరియొక్క, శృఙ్గే=శిఖరమున, నిషణ్ణః=ఆసీనుడవగు, త్వం=నీవు, శుభ్రత్రినయన-వృష-ఉత్ఖాత-పఙ్క-ఉపమేయామ్=ధవళమగు మహేశ్వరుని వృషభముచే నుత్పాటితమగు పంకముతో నుపమించ నర్హమగు, శోభామ్=శోభను, వక్ష్యసి=వహించగలవు.

భా. మిత్రమా! అప్పటికి చాలా దూరము పయనించి ఎంతయో అలసియుం దువు. నీ శ్రమ అంతయు మన్నిమిత్తమే గదా! అది నేనెట్లు చూడగలను? విశ్రాంతి అవసరము గదా! అదిగో! నీ మార్గమున విశ్వవిఖ్యాతి నందిన హిమాద్రి. పురాతన పురాణప్రసిద్ధి గన్న మహోన్నతమగు పర్వతరాజము. అపారమగు ఖనిజసంపదలకు, అమూల్యమగు రత్నరాసులకు, అమేయమగు గైరికాదిధాతువులకు, విలు వెఱుంగని పలుతెఱంగుల ఓషధులకు, నానావిధ ఫలవృక్షములకు, విభిన్నజంతుజాలములకు, విచిత్రపక్షిసంతతులకు, అంతుపంతులు లేని అంబుధారల గొనిపోవు నదీనదములకు, అగాధనీరనిధులగు మానసాదిసరోవరములకు ఆలవాల మది. నిలయము. స్థానము. హిమతుషారము లావరించినవి. హిమకణములు పేరుకొనినవి. అది కారణముగ విశదమగు ఆ గిరికి హిమాద్రి, రజతగిరి ఇత్యాది సార్థకనామము లేర్పడినవి. భూధరము లన్నిటికంటె మహోన్నతమగుట పర్వతరాజని ప్రఖ్యాతి నందినది. పుణ్యస్రవంతి గంగాతరంగిణి కది పుట్టినిల్లు. అందే ఆమె జనన మందినది. అంతేకాదు; అందలి పాషాణము లత్యంతసురభితములు. ఏలయన ఆ యద్రి నందందు సంచరించి అలసి సొలసి ఆ చట్టు బండల విశ్రమించు కస్తూరికా మృగమద (కస్తూరి) సువాసితము లవి. కస్తూరిమధురపరిమళసంభరితములు. మిత్రమా! అవిగో! ఆ యుత్తుంగహిమగిరిశిఖరములు వినువీథి నొఱయుచు ఎలుగెత్తి నీకు స్వాగతము పలుకుచున్నవి. శ్రమాపనోదకములగు ఆ శైలశిఖరముల నెందైనను సుగంధితమగు నొక గండుశిలపై ఇంచుక విశ్రమించుము. శ్రమ నపనయించుము. జలదా! మఱియొక విశేష మేమన గిరిశృంగ మధిష్ఠించిన నీకు ఒక విలక్షణరూపసంపద యొనగూడును. ఎట్లందువా! హిమశైలము మహేశ్వరుని శ్వేతవృషభము. వెల్లయెద్దు. అది సామాన్యమైనదా? మహోన్నతము. ఇక గిరిశృంగములు (శిఖరములు) శృంగములే కదా? అనగా శృంగసదృశములు. ఇక నీవో! ఆ కొమ్ముల నుత్పాటితమై (మీది కెగజిమ్మబడి) అం దమరియున్న పంకసదృశుడవై భాసిల్లగలవు. హిమశైలము శ్వేతవృషభము. గిరిశిఖరములు, వృషభశృంగములు. ఉత్పాటనమున నందికొమ్ముల నంటియున్న (అమరియున్న)

పంక (మట్టిపెళ్ళ) సదృశు (ఉపమితు) డవు నీవు. ఆ దృశ్య మెంత బాగున్నది? ఆ పోలిక ఎంత నిండైనది? మహానంది! దాని దీర్ఘశృంగములు! అం దంటియున్న ఉత్పాటితపంకము! ఎంత మనోరంజకదృశ్య మది. ఒక జాతి హరిణముయొక్క నాభియందు కస్తూరి ఉద్భూతమగును. కనుకనే కస్తూరికి మృగనాభి, నాభి యను నామము లేర్పడినవి. ఇందు హిమాద్రిని మహేశ్వరుని నందితోను, మేఘమును పంకముతోను ఉపమించుటం జేసి ఉపమాలంకారము.

అవ. మేఘునిద్వారా దవాగ్ని ఉపశమన వర్ణన-

శ్లో. తం చేద్వాయౌ సరతి సరళస్కన్ధసంఘట్టజన్మా
బాధేతోల్కాక్షపిత చమరీవాలభారో దవాగ్నిః,
అర్హస్యేనం శమయితు మలం వారిధారాసహస్రై
రాపన్నార్తిప్రశమనఫలాః సమ్పదో హ్యుత్తమానామ్. 57

అ. వాయౌ=వనవాయువు, సరతి సతి=ప్రసరించుచుండగా, సరళ-స్కన్ధ-సంఘట్టజన్మా=దేవదారు వృక్షముల యొఱపిడి నుద్భవించినదియు, ఉల్కా-క్షపిత-చమరీ-వాల-భారః=అగ్నికణముల నిర్గమగు చమరీవాలాగ్రకేశసముదాయము కలదియు నగు, దవాగ్నిః=దావానలము, తం=ఆ యద్రిని, బాధేత చేత్=పీడించినయెడల, ఏనం=ఈ దవాగ్నిని, వారి-ధారా-సహస్రైః=జలధారాపరంపరలచేత, అలమ్=అత్యంతము, శమయితుమ్ =నివారింపను, అర్హసి=అర్హుడవు. ఉత్తమానామ్=ఉత్తములయొక్క, సంపదః=ఐశ్వర్యములు, ఆపన్న-ఆర్తి-ప్రశమన-ఫలాః హి=ఆర్తుల ఆపన్నివారణమే ప్రయోజనముగా కలవి గదా!

భా. మిత్రమా! పరోపకారము ప్రథమకర్తవ్యముగా నెంచువాడవు. దీనజన పరిరక్షణమే నీ పరమావధి. ఔదార్యము నీ సొత్తు. సకలజీవులు నీ దయా దాక్షిణ్యములపై ఆధారపడియున్నవి. వాటి భవితవ్యము నీ యధీనము. నీ కృపకు పాత్రము లవి. నీవు వర్షింపవేని కృషీవలులకు కృషి యెక్కడిది? పశుపక్ష్యాదులకు అహారమెక్కడ? భూమి పచ్చగా నుండిన గదా ఆకలితీరుట. విశ్రాంతి లభించుట. సరస్సులు నిండవేని నదులు ప్రవహించవేని త్రాగుటకు నీరేది? జీవులకు జీవమెక్కడిది? ఇదంతయు నీ చలువపై యాధారపడి యున్నది. జలదా! వాయుపీడనమున తరుషండముల యొఱపిడికి దవాగ్ని జనించును. విస్ఫులింగములు పైకెగయును. ఆ యగ్నికణములు ఆ కొండపై హాయిగా సంచరించు చమరీమృగముల ముద్దుముచ్చటలు వెలార్చు వాలాగ్రకేశపుంజముల నంతలో దగ్ధ మొనర్చును. పాపము! వాటి కవి ప్రాణతుల్యములు. వాటియందంత మక్కువ వాటికి. వాటికే గాదు. దైవమునకు గూడ ప్రీతిదాయకములు. దైవసన్నిధిని వింజామర లవి. రాజులకు వీవనలు. అంబుదా! దవాగ్నికి వనములకు

వనములే దగ్ధమై భస్మీపటలమగును. అది ఆ యద్రినే దగ్ధమొనర్చగలదు. జీవుల మనుగడకే ముప్పు యేర్పడగలదు. అతిభయంకరాగ్ని యది. అంతంత మాత్రపు జల్లుల కది చల్లారునది కాదు. పచ్చని ఫలవృక్షములతో, పువ్వుల చిఱునవ్వులతో కలకలలాడు హిమాద్రి అంతలో మాడి మసియగును. అట్టితరి నీ నిరంతరవారి ధారలు కుంభవృష్టిగా బఱపి ఆ యగ్నిని చల్లార్చుము. అమూల్యములగు అందలి యోషధులను పదిలపఱచుము. ఆ గిరి సౌభాగ్యసంపదలను కాపాడుము. అది నీ ప్రథమకర్తవ్యమని భావించుము. మిత్రమా! సత్పురుషుల సాధనసంపత్తులు విపన్నుల విపన్నివారణమునకే గదా! దుఃఖోపశమనమునకే గదా! అంతకంటె వాటికి వేరు ఫలమున్నదా? ధర్మములలో నది పరమధర్మ మని గదా యందురు.

సవరపుమృగముకూడ హరిణజాతికి చెందిన దందురు. దీని కేశము లత్యంతమృదులములు, సుభగములు. అవి యనిన వాటి కెంతయో ప్రీతి. వీటినిగూర్చి మహాకవి వర్ణన- 'లజ్జా తిరశ్చాం యది చేతసి స్యాదసంశయం పర్వతరాజపుత్ర్యాః, తం కేశపాశం ప్రసమీక్ష్య కుర్యుర్వాలప్రియత్వం శిథిలం చమర్యః' అని కు. సం. 1-48. ఇం దలంకారము అర్థాంతరన్యాసము.

అవ. శరభముల ఉద్వేగముచేనైన ఫలవర్ణన-

శ్లో. యే సంరమ్భోత్పతనరభసాః స్వాఙ్గభఙ్గాయ తస్మిన్
ముక్తాధ్వానం సపది శరభా లఙ్ఘయేయుర్భవన్తమ్,
తాన్ కుర్వీథాస్తుములకరకావృష్టిపాతావకీర్ణాన్
కే వా న స్యుః పరిభవపదం నిష్ఫలారమ్భయత్నాః. 58

అ. తస్మిన్=ఆ యద్రిని, సంరంభ-ఉత్పతన-రభసాః=రోషముచే పైకెగయుటయం దాతురత గల, యే=ఏ, శరభాః=శరభమృగములు, ముక్త-అధ్వానమ్=త్యజించిన శరభోత్పతన మార్గముగల, భవన్తం=నిన్ను, స్వ-అఙ్గ-భఙ్గాయ=స్వీయ అంగభగ్నతకు, సపది=తత్క్షణము, లఙ్ఘయేయుః=దుముకును. తాన్=ఆ యష్టపాదజంతువులను, తుముల-కరకా-వృష్టి-పాత-అవకీర్ణాన్=తెరపిలేని వడగండ్ల వర్షపాతమున చెల్లాచెదు రగునవిగా, కుర్వీథాః=చేయుము. నిష్ఫల- ఆరమ్భ-యత్నాః=వ్యర్థ కార్యయత్నపరులు, కే వా=ఎవరైనను, పరిభవపదం=అపహాస్యము పాలు, న స్యుః=కారు?

భా. జలదా! ఆ యద్రిని శరభము లున్నవి. అష్టపాదజంతువు లవి. నీ సంచారసమయమున వాటి యునికిని నీవు గమనించియే యుందువు. ఎనిమిది పాదముల వింతజంతువులు. ఏనుగుబలము. సింహతేజము. రోషమెక్కువ. భయంకరములు. మృగరాజవిజేత లవి. వానికి గజరాజము లన నెంత?

అతిగా దుముకుటచేతనో ఏమో వాటిని భయంకరకురంగము లనియు అందురు. మిత్రమా! నీవు వాటిజోలికి పోకున్నను వాటి మార్గమున కడ్డు రాకున్నను, అగపడినదే తడవుగ రోషమున మీది కెగయును. పాపము! గజమను భ్రాంతిచే నీపై దుముకుట కాయత్తపడును. ఆవేశమునకు వేగ మెక్కువ. వివేకము తక్కువ. ఆకసమున బోవు నీవు వాటి కెట్లందగలవు? ఆ యాలోచనయే యుండదు. ఆ విషయము గమనించనే గమనించవు. రోషమునకు యోచ నెక్కడిది? ఆవేశమునకు వివేచన మెట్లుండును! తత్ఫలితము అంగభంగము. మిట్టిపడి మింటికెగసిన ఏమగును? కాళ్ళు విరుగును. అవయవములు పట్టుదప్పును. అవమాన మెదురగును. అల్పు డవజ్ఞ చేసిన ఎవ రూరకుందురు? జలదా! అదను విడువక దట్టమగు వడగండ్ల వానచే చావమోదుము. పొగ రడంచుము. చెల్లాచెదురుగ చెదరగొట్టుము. వ్యర్థకార్యములు చేపట్టువారు ఎట్టివారైనను అపహాస్యము నెదుర్కొనక తప్పదు. నిష్ఫలారమ్భయత్నకులు అవమానమునకు గుఱికా కెట్లుందురు? లోకవిదితవిషయ మది. అధిక్షేపించిన అల్పశత్రువునైనను ఉపేక్షించతగదని భావము. కరకశబ్దము స్త్రీపుంలిఙ్గముల రెండింట గలదు. ఇందు చతుర్థచరణముచే తృతీయచరణసమర్థనమగుట అర్థాంతరన్యాసము. భకారము ఆవృత్తియగుట అనుప్రాసము.

అవ. శివచరణన్యాసమునకు ప్రదక్షిణమొనర్ప యక్షుడు మేఘు నర్థించుట-

శ్లో. తత్ర వ్యక్తం దృషది చరణన్యాస మర్ధేన్దుమౌళేః
శశ్వత్సిద్ధై రుపచితబలిం భక్తినమ్రః పరీయాః,
యస్మిన్ దృష్టే కరణవిగమా దూర్ధ్వ ముద్ధూతపాపాః
కల్పిష్యన్తే స్థిరగణపదప్రాప్తయే శ్రద్దధానాః. 59

అ. హే మేఘ=ఓ జలదా! తత్ర=ఆ హిమాద్రియందు, దృషది=ఒక శిలయందు, వ్యక్తమ్=ప్రకటితమైనదియు, శశ్వత్=ఎల్లప్పుడు, సిద్ధైః=సిద్ధులచే, ఉపచిత-బలిం=నిర్వర్తించబడు పూజావిధానము గలదియు నగు, అర్ధ- ఇన్దు-మౌళేః=అర్ధచంద్రధారి యగు ఈశ్వరునియొక్క, చరణ-న్యాసమ్=పాదన్యాసమును, భక్తి-నమ్రః=భక్తివినమ్రుడవై, పరీయాః=ప్రదక్షిణ మొనర్పుము, యస్మిన్=ఏ పాద న్యాసము, దృష్టే సతి=చూడబడినది కాగా, ఉద్ధూత-పాపాః=పోగొట్టబడిన పాప ములుగల, శ్రద్దధానాః=శ్రద్ధాళువులగు భక్తులు, కరణ-విగమాత్ ఊర్ధ్వం=దేహత్యా గానంతరము, స్థిర-గణ-పద-ప్రాప్తయే=శాశ్వతమగు ప్రమథగణపదవీప్రాప్తికొఱకు, కల్పిష్యన్తే=అర్హు లగుచున్నారు.

భా. మిత్రమా! నీ కొక సదవకాశమే కాదు మహావకాశము లభింపనున్నది.

జాఱవిడుచు టంత వివేక మనిపించదు. మార్గమున నీ కెన్నియో పుణ్యతీర్థము లెదురగుచున్నవి. ఆపైని వింతలు వినోదములు. మఱియు రమ్యమగు కమనీయ దృశ్యములు. ఆ హిమవన్నగమున కొండొకతావున శిలాఫలకమందు పాదచిహ్న మగపడును. శంకరుని పాదముద్ర యది. స్వయంప్రకటితము. ముక్తిదాయకమగు మహాదేవుని పాదన్యాస మది. సిద్ధు లనక, యోగు లనక ఆస్తికు లందఱును ఆ శ్రీచరణద్వయన్యాసమును సదా శ్రద్ధాళువులై సేవింతురు, పూజింతురు. మిత్రమా! నీవును భక్తివినమ్రుడవై ఆ భవుని పాదముద్రకు ప్రదక్షిణ మాచరించి ప్రణతు లర్పించుము. భవుని పాదముద్రను హృదయపీఠమున భద్రపఱచి అరాధించుట కంటె పరమార్థ మేమున్నది? ఆస్తిక్యబుద్ధితో విశ్వాసమున శంకరుని పాదముద్రను చూచినంతనే పాపములు పటాపంచలై పోవును. సమస్తకల్బిషములు మటుమాయ మగును. అంతేకాదు; పుణ్యపరంపర లెదురగును. శుభము లొనగూడును. అంత విగతకల్మషులగు ఆ పుణ్యపురుషులు దేహాంతమున అనశ్వరము, శాశ్వతము, ఆనందప్రదము నగు ప్రమథగణముల స్థాన మలంకరించుటయే గాక శివసాన్నిధ్య మందెదరు. శ్రీ చంద్రమౌళీశ్వరుని కృపకు పాత్రు లగుదురు. మిత్రమా! నీవును ప్రదక్షిణపూర్వకముగ భక్తిభావమున ప్రణతు లర్పించుము. మహేశ్వరుని కృపకు పాత్రుడవు కమ్ము. కొందఱు చరణన్యాసమును హరిద్వారమందలి భవుని పాదమార్గముగా భావించుచున్నారు.

అవ. పరమేశ్వరుని గుణసంకీర్తనమున మంజులమురజధ్వని యొనర్పు యక్షుడు మేఘు నర్థించుట-

శ్లో. శబ్దాయన్తే మధుర మనిలైః కీచకాః పూర్యమాణాః
సంసక్తాభి స్త్రిపురవిజయో గీయతే కిన్నరీభిః,
నిర్హ్రాదస్తే మురజ ఇవ చేత్ కన్దరేషు ధ్వనిః స్యాత్
సంగీతార్థో నను పశుపతే స్తత్ర భావీ సమగ్రః. 60

అ. హే మేఘ=ఓ జలదా!, తత్ర=ఆ హిమాద్రిని, అనిలైః=అనిలము (వాయువు) లచే, పూర్యమాణాః=పూరింపబడిన, కీచకాః=రంధ్రములతోడి వేణువులు, మధురం యథా తథా=శ్రుతిసుఖ మగునట్లుగా, శబ్దాయన్తే=ధ్వనించుచున్నవి. సంసక్తాభిః=వేణునాదానురక్తలగు, కిన్నరీభిః =కిన్నరాంగనలచే, త్రిపుర-విజయః=త్రిపురముల విజయగీతము, గీయతే=ఆలపింపబడుచున్నది. కందరేషు=దరులయందు, తే=నీయొక్క, నిర్హ్రాదః=నాదము, మురజే=మృదంగమందలి, ధ్వనిః ఇవ=శబ్దమువలె, స్యాత్ చేత్= అయిన యెడల, పశుపతేః=ఈశ్వరునియొక్క, సంగీత-అర్థః=సంగీతసామగ్రి , సమగ్రః=సంపూర్ణము, భావీ నను=అగును కదా!

భా. జలదా! కిన్నరుల నీ వెఱిగియే యుందువు. అశ్వముఖులు వారు. దేవ యోనులు. ఆటపాటలు, వినోదప్రక్రియలు. వారి కులవిద్య యది. జంట జంటలుగా ఆడుచు, పాడుచు వినోదింతురు. వారు రసపిపాసకులు. హిమవన్నివాసులు వారు. ఆ హిమాద్రిని పండిన (ఎండిన) వేణురంధ్రములు వాయుపూరితము లగుచు మధురధ్వను లీనుచున్నవి. శ్రవణసుభగములగు వేణుగానము లవి. శ్రుతిసుఖద మగు ఆ వేణునాదము ననుసరించి కిన్నరాంగనలు భక్తిభావమున తన్మయత్వ మంది రసార్ద్రమగు మధురకంఠమున మహాదేవుని త్రిపురవిజయగీతికల నాలపింతురు. అంబుదా! వాటికి తోడు మురజ (మృదంగ)ధ్వని బోలి నాతిగమ్భీరమగు నీ మధురనాదము గిరికందరముల బ్రతిధ్వనించినదా! ఇక చెప్పెడి దేమున్నది! ఆ చరణన్యాసమున నిత్యసన్నిహితుడగు నటరాజు సన్నిధానమున సంగీతసామగ్రి సర్వసమగ్రమగును. వేణునాదము, గాత్రము, మృదంగము ఇంక కావలసిన దేము న్నది?- 'తౌర్యత్రికం తు సంగీతం' అని గదా యందురు. నృత్యగీతవాద్యసమ్మేళనమే గదా సంగీతము. 'నిర్హ్రాదో నాదః' అని అభిధానచింతామణి. త్రిపురవిజయమున మయనిర్మిత స్వర్ణమయ రజతమయ అయో(ఇనుము)మయమగు త్రిపురముల (మూడునగరముల) దుర్గ (కోట) శృంఖలములను దేవతల కోరికపై ఈశ్వరుడు ధ్వంసమొనర్చెనని పౌరాణికగాథ. ఇందు వేణునాదము, కిన్నరీగానము, మేఘుని హ్రాదముల సమాహారము శివచరణసాన్నిధ్యమున అగుట పర్యాయము. 'మురజ ఇవ' అనుచోట శ్రౌతీ ఉపమ, అంగాంగిభావమున సంకరాలంకారము.

అవ. క్రౌఞ్చరంధ్రద్వారమున ఉత్తరాభిముఖుడవు కమ్మని యక్షుడు మేఘ నర్థించుట-

శ్లో. ప్రాలేయాద్రే రుపతట మతిక్రమ్య తాంస్తా న్విశేషాన్
హంసద్వారం భృగుపతియశోవర్త్మ యత్క్రౌఞ్చరన్ధ్రమ్,
తేనోదీచీం దిశమనుసరే స్తిర్యగాయామశోభీ
శ్యామః పాదో బలినియమనాభ్యుద్యతస్యేవ విష్ణోః. 61

అ. ప్రాలేయ-అద్రేః=ఆ మంచుకొండయొక్క, ఉప-తటం =చఱియల వెంబడి, తాన్ తాన్=ఆ యా, విశేషాన్ =విశేషములను, అతిక్రమ్య=దర్శించుచు ముందుకు సాగి, భృగుపతి-యశో-వర్త్మ=పరశురాముని కీర్తిపథమును, హంస-ద్వారం=మరా ళమార్గము నగు, యత్=ఏ, క్రౌఞ్చ- రన్ధ్రం=క్రౌఞ్చపర్వత రంధ్రము, (మార్గము), వర్తతే=కలదో, తేన=ఆ మార్గమున, బలి-నియమన-అభి-ఉత్థితస్య=బలినణగద్రొ క్కుట కెత్తబడిన, విష్ణోః=విష్ణుభగవానునియొక్క, శ్యామః=శ్యామవర్ణమగు, పాదః ఇవ=పాదమువలె, తిర్యక్-ఆయామ- శోభీ సన్=సులభప్రవేశార్థము తిరశ్చీనముగా

(అడ్డముగా )సాగుటచే దీర్ఘమగుట శోభాయమానుడవై, ఉదీచీమ్=ఉత్తరపుదిక్కును, అనుసరేః=అనుసరింపుము.

భా. మిత్రమా! నీ యదృష్టము కొనియాడతగినది. సగరతనయా స్వర్గసోపాన పంక్తి జాహ్నవిని దర్శించినమీదట మృగనాభిసురభితశిలాఫలక మధిష్ఠించి విశ్రాంతి గొనిన పిమ్మట చంద్రమౌళీశ్వరుని పాదన్యాసమునకు ప్రదక్షిణపూర్వకముగ ప్రణతు లర్పించిన తదుపరి ఆ మంచుకొండ నింకను నీవు చూడవలసిన విశేషము లెన్నియో గలవు. ఆ యా కొండచరియల దరుల కందరములును గలవు. పవిత్రనదీనదములు, పుణ్యతీర్థములు, ప్రసన్నసలిలసరోవరము లున్నవి. అమూ ల్యములగు ఓషధీలతలు, విలక్షణకుసుమవల్లరులు, బహువిధమధురఫలవృక్షములు, అవ్యక్తమధురకలకూజితవిలక్షణ శకుంతసంతతులును అవశ్యద్రష్టవ్యములు. గైరికా దిధాతుసంపదలు వజ్రవైడూర్యాద్యనర్ఘరత్ననిచయములు చూడముచ్చటగును. హరిణచమరీగౌరశ్వాది సాధుజంతువులు సింహశరభశార్దూల కరికిటిఖడ్గభల్లూకాది క్రూరజంతుజాలములు భీతి గొల్పు సరీసృపాదులు మింటినంటి అచ్చెరువు కొలుపు గౌరీశిఖరాది శిఖరపరంపరలు అగాధమగు లోయలు అత్యంతదర్శనీయములు. మిత్రమా! అట విశేషము లెన్ని యున్నను అంతంతమాత్రముగ ఇంచుక వీక్షించి నిరాలస్యముగ ముందుకు సాగిపొమ్ము. క్రౌఞ్చరంధ్ర మెదురగును. పరశురాముని కీర్తిపతాక మది. జామదగ్నివిజయపథము. ఎట్లందువా? ఈశ్వరుని యొద్ద ధను ర్విద్యాశిక్షాసమయమున కార్తికేయునితో స్పర్ధ కలిగి ఒకే యొక వాడి యమ్మున క్రౌఞ్చపర్వతమును ఛేదించెను. ఎంతటి మహాకార్య మది? హిమాలయమున కది ద్వార మాయెను. మానసమున కది మార్గమాయెను. పర్వతమార్గ మది. మిత్రమా! మానసమునకు వలసబోవు హంసల కది సులభమార్గము. నీవును ఆ మార్గముననే పయనించి తిరశ్చీనముగ తిరిగి నిడివి గలిగి సులభగతిని శీఘ్రముగ ఉత్తరాభిముఖుడవై తరలిపొమ్ము. అట్టియెడ నీలవర్ణమగు నీవు అలనాడు బలి (దైత్య చక్రవర్తి) బంధనమున కుద్యమించిన శ్యామవర్ణుడగు మహావిష్ణువు పాదముపగిది భాసించగలవు. సకలజీవపోషకుడగు శ్రీమన్నారాయణుని చరణకమలముతో పోలిక! పావని గంగాస్రవంతికి మూలము, సకలశ్రేయములకు ఆలవాలము, నిఖిలప్రాణు లకు శిరోధార్యము నగు శ్రీపాదముతో సాటియగుట! ఎంత ధన్యుడవు? ఎంతటి అదృష్టము!

పరశురామకార్తికేయులు సహాధ్యాయులు. మహేశ్వరునియొద్ద విద్య నభ్యసిం చిరి. ధనుర్విద్యాశిక్షణసమయమున ఉభయులమధ్య స్పర్ధ యేర్పడ ఒకే యొక తీక్ష్ణబాణమున పరశురాముడు క్రౌంచపర్వతమును ఛేదించెను. విజయదుందుభి మ్రోగించెను. విశ్వమును క్రౌంచరంధ్ర సముజ్జృంభిత కీర్తిసాగరమున ముంచెత్తె నని పురాణకథనము. క్రౌఞ్చము మైనాకసంతానము. దైత్యచక్రవర్తి బలి. విరోచనుని

పుత్రుడు, ప్రహ్లాదుని పౌత్రుడు. వదాన్యుడు. సురల మేలు కోరి, దైత్యుని హితవాశించి, వదాన్యత పరీక్షించ శ్రీమహావిష్ణువు వామనరూపమున బలి నాశ్రయించి, మూడడుగులభూమి దాన మడిగెను. ఆచార్యుడు శుక్రుడు వలదని యెంత వారించినను వినక అసురచక్రవర్తి అందు కియ్యకొనెను. అంత నా వామనుడు రెండడుగుల భూమ్యాకాశము లాక్రమించి తృతీయ పద మెచ్చట యని ప్రశ్నింప వితరణశీలుడగు బలి వినయమున తలవంచెను. వంచిన తలపై పాద ముంచి వంచకుడగు వామనుడు బలిని నిగ్రహించి అకించనుని జేసి పాతాళమున కణగద్రొక్కెనని పురాణవచనము.

ప్రాలేయ మన మంచు. ఇందు యశోవర్త్మ యనుచోట రూపకము. విష్ణోః పద ఇవ అనుచోట శ్రౌతీ ఉపమ. రెండును పరస్పర నిరపేక్షము లగుట సంసృష్టి.

అవ. కైలాసపర్వత వర్ణన-

శ్లో. గత్వా చోర్ధ్వం దశముఖభుజోచ్ఛ్వాసితప్రస్థసన్ధేః
కైలాసస్య త్రిదశవనితాదర్పణస్యాతిథిః స్యాః,
శృఙ్గోచ్ఛ్రాయైః కుముదవిశదైర్యో వితత్య స్థితః ఖం
రాశీభూతః ప్రతిదినమివ త్ర్యమ్బకస్యాట్టహాసః. 62

అ. హే మేఘ = ఓ జలదా! ఊర్ధ్వం చ =ఉన్నతపథమున ముందుకు, గత్వా =వెళ్ళి, దశముఖ-భుజ-ఉచ్ఛ్వాసిత-ప్రస్థ-సన్ధేః = దశకంఠ బాహు విచలిత సానుసంధులు కలదియు, త్రిదశ-వనితా-దర్పణస్య =సురవనితలకు దర్పణ (అద్దము) ప్రాయమైనదియు నగు, కైలాసస్య=కైలాసపర్వతమునకు, అతిథిః=అతిథివి, స్యాః=అగుము; యః=ఏ కైలాసము, కుముద-విశదైః=తెల్లకలువలవలె వెల్లనైన, శృఙ్గ-ఉచ్ఛ్రాయైః=శిఖర ఔన్నత్యములచేత, ఖమ్=ఆకసమును, వితత్య=ఆచ్ఛాదించి, ప్రతిదినమ్=ప్రతిదినమును, రాశీభూతః=ఏకత్రితమైన, త్ర్యమ్బకస్య=త్రినేత్రుడగు మహేశ్వరుని యొక్క, అట్టహాసః ఇవ=అతిహాసము (నవ్వు)వలె, స్థితః=ఉన్నదో?.

భా. మిత్రమా! క్రౌంచబిలనిర్గమనానంతరమున మీది కెగసి ఉత్తరమునకు తరలిపోవ కైలాస మగపడును. శంకరుని నివాస మది, కైవల్యసంధాయకము. కైలాసమున కతిథివి కమ్ము. స్ఫటికవిశదము, అతినిర్మలము, ప్రశాంతము నగు ఆ యద్రి సురవనితలకు దర్పణము. వారికి దర్పణములతో నేమి పని? అంత స్వచ్ఛ విశద మా రజతగిరి. చారిత్రకప్రసిద్ధి నందిన కైలాసము నీకు తెలియకుండునా! ఇక దశకంఠుడు! లంకాధిపతి యతడు. అతని నెఱుగనివా రుందురా? మహా బల సంపన్నుడు, సకలశాస్త్రపారంగతుడు, శివపూజాధురంధరుడు. శివభక్తాగ్రేసరుడు. శతకోటిశివాలయముల నేకకాలమున అర్చించు ఘను డతడు. తనంత తానుగా

కుత్తుక ఉత్తరించి ఈశ్వరపాదసన్నిధి నుంచి రుధిరాభిషేకమున మహేశ్వరుని మెప్పించిన దిట్ట. నిరంతరశివసాన్నిధ్యము గోరి లంకను జేర్చ కైలాసమునే కదలించిన సాహసి యతడు. అందుల కియ్యకొనని మహాదేవు డా కైలాసము నదిమిపట్ట రావణు డం దణగి పరాభవముపా లాయెను. ఎట్టకేలకు శివుని స్తుతించి విముక్తి నందెను. కాని ఆ వీరుని భుజదర్పమునకు కదలి ఆ గిరిసానువుల సందులు శిథిలమైనవి. మిత్రమా! అంత చరిత్ర యున్న దా కైలాసమునకు. అంతే కాదు; ఆ కైలాసము మంచుతో నిండి తెల్లకలువలువలె తేటవెన్నెలవలె ధవళశంఖమువలె ఆణిముత్తెమువలె మల్లెపూవులువలె వెల్లనైన కొండకొనల మింటినంటి రోజురోజుకు పేరుకొనిన ముక్కంటి పెనునవ్వువలె చూపులకు హాయి నింపుచున్నది. విందులు సమకూర్చుచున్నది. అట్టి కైలాసమున కతిథి వగుటకంటె మహాభాగ్య మేమున్నది!

అవ. కైలాసమును జేరిన మేఘుని వర్ణన-

శ్లో. ఉత్పశ్యామి త్వయి తటగతే స్నిగ్ధభిన్నాఞ్జనాభే
సద్యః కృత్తద్విరదరదనచ్ఛేదగౌరస్య తస్య,
శోభామద్రేః స్తిమితనయనప్రేక్షణీయాం భవిత్రీ
మంసన్యస్తే సతి హలభృతో మేచకే వాససీవ. 63

అ. హే మేఘ=ఓ జలదా! స్నిగ్ధ-భిన్న-అఞ్జన-ఆభే=మృదులము, మర్దితము నగు అంజన (కాటుక) కాంతివంటి కాంతిగల, త్వయి=నీవు, తటగతే సతి=పర్వతసానువు నధిష్ఠించినవాడవు కాగా, సద్యః=అప్పుడే, కృత్త-ద్విరద-రదన-చ్ఛేద-గౌరస్య=ఖండితగజదంతశకలమువలె ధవళమగు, తస్య=ఆ, అద్రేః=కైలాసముయొక్క, శోభామ్=ద్యుతిని, మేచకే=నీలవర్ణమగు, వాససి=వస్త్రము, అంస-న్యస్తే సతి=భుజములపై నుంచ (కప్పు) బడినది కాగా, హలభృతః=బలరామునియొక్క, శోభామ్ ఇవ=శోభనువలె, స్తిమిత-నయన-ప్రేక్షణీయామ్=ఱెప్పపా టెఱుగని వీక్షణముల వీక్షించ నర్హమగునది, భవిత్రీమ్=కాగల దానినిగా, ఉత్పశ్యామి=ఊహింతును.

భా. జలదా! నీవేమో నల్లనివాడవు, ఆ గిరి తెల్లనిది. నీ రూపము అంజనాభము. మసృణము. నీలవర్ణము. చక్కగా మర్దించుటం జేసి చిక్కనైనదగు కాటుకతో సమానము. ఇక ఆ కైలాస మందువా! అప్పుడే భేదించుటం జేసి రూపుమాయని గజదంత శకలము వలె అత్యంతవిశదమైనది. మీ రూపము లివి. ఒకటి అంజన (కాటుక) నీలము, మఱియొకటి కైరవ (కలువ) ధవళము. నీలవర్ణశోభితుడవగు నీవు విశద (శ్వేత) వర్ణమగు ఆ శైలశిఖరము నధిష్ఠించిన ఆ ద్యుతి (శోభ) యెట్లుండునో కొంచె మూహించుము. నీలరజతముల మేలి కలయిక యది. తెలుపునలుపుల అన్యోన్యత. మిత్రమా! హలధరుడు

బలరాముని నీ వెలిగియే యుందువు. గౌరవర్ణు డతడు, శ్వేతరూపుడు. కాని సదా నీలవర్ణవసనధారుడు, కనుకనే అతనిని నీలాంబరు డందురు. నీలామ్బరము భుజమున వ్రేల బలభద్రు డె ట్లాకర్షణీయుడగునో తద్విధమున నిన్ను గూడిన ఆ తెల్లని కైలాసము అతిశయరూపసంపద నంది అత్యంతప్రేక్షణీయ మగును. అత్యంతశోభావిలసితములగు ఆ మీ రూపులు చూపరులకు కమ్మని కనువిందు లగును. జలదా! నే నూహించున దిది. నీ వేమందువు? ఇందు మేఘునకు చిక్కని కాటుకతోను, కైలాసమునకు బలరామునితోను సాదృశ్యము చెప్పబడిన దగుట ఉపమ. తకార దకార భకారముల ఆవృత్తియగుట అనుప్రాస.

అవ. గౌరీశంకరుల విహారసందర్భమున సహకరింప యక్షుడు మేఘు నర్థించుట-

శ్లో. హిత్వా తస్మిన్ భుజగవలయం శమ్భునా దత్తహస్తా
క్రీడాశైలే యది చ విహరేత్ పాదచారేణ గౌరీ,
భఙ్గీభక్త్యా విరచితవపుః స్తమ్భితాన్తర్జలౌఘః
సోపానత్వం కురు మణితటారోహణాయాగ్రయాయీ. 64

అ. తస్మిన్=సుప్రసిద్ధమగు, క్రీడా-శైలే=క్రీడార్థశైలమగు కైలాసమున, భుజగ-వలయమ్=సర్పకంకణమును, హిత్వా=వర్జించి, శమ్భునా=శంకరునిచే, దత్త-హస్తా=ఈయబడిన చేయూతగల, గౌరీ=పార్వతి, పాద-చారేణ=కాలినడకను, విహరేత్ యది=విహరించినచో, స్తమ్భిత-అన్తః-జల-ఓఘః=బిగబట్టబడిన అన్తర్గత జల ప్రవాహము (ఉదకబిందు సమూహము) గలవాడవై, త్వమ్=నీవు, అగ్ర-యాయీ సన్=ముందు నడచుచున్నవాడ వగుచు, భఙ్గీ-భక్త్యా=పర్వ (మెట్లు) రచనచేత, విరచిత-వపుః సన్=కల్పితశరీరుడవై, మణి-తట-ఆరోహణాయ=మణి -తట మధి రోహించుకొఱకు, సోపానత్వమ్=సోపాన (మెట్లు) భావమును, కురు=భజించుము.

భా. మిత్రమా! మఱియొక సదవకాశము. ఎటు లుపయోగించుకొనెదవో! ఇంత చక్కటి యవకాశము లభించుటెంత యదృష్టము! తరించుట కది మహద వకాశము. జారవిడువకుము. సర్వలోకములకు మాతాపితలు ఉమామహేశ్వరులు. ఈ లోకముల కధిపతులు వారే గదా! ఆ పార్వతీపరమేశ్వరుల వినోదవిలా సవైభవముల కేర్పడినవే ఈ కైలాసమేరుమందరాదులు. దేవతాసంకల్పజన్యము లవి. అందు కైలాసమున కొక ప్రత్యేకత కలదు. అం దా పురాణదంపతుల కెన్నియో వినోదప్రదేశము లున్నవి. అందు విహరించు పార్వతికి తోడుగా నుండి, శివుడు చేయూత నిచ్చును. గౌరి భీతిల్లునని శంకరుడు సర్పవలయ (కంకణ) ముల విసర్జించును. గౌరియెడ శంకరుని ప్రణయ మట్టిది. అంతేకాదు; ఆయన

అర్ధదేహమునే ఆమెకు అంకిత మొనర్చెను. భేద మెరుంగని పుణ్యదంపతులు వారు. అట్లా గౌరీశంకరులు అన్యోన్యప్రణయాకర్షితులై ఆదర్శమూర్తులై ఉల్లాసమున విహరింతు రా కొండపై. అందు రత్నఖచితపీఠము లున్నవి, మణిమయస్థావరములు గలవు. కాని మార్గ మంత సుగమము కాదు. నిమ్నోన్నతపథ మది. ఎగుడు దిగుడు లధికము. అత్యంతసుకుమారి నగరాజతనయ. నడచి నడచి అలసిపోవును. ప్రణయభావమున పతిహస్తము నూతగా గొని కాలినడకన విహరించు గౌరికి నీ వించుక సాయపడుము. జలదా! ఎట్లందువా! ముందుగా వర్షింపు టాపుము. వర్షము విహారప్రతిబంధకము గదా! నీలోన నీటిని బిగబట్టి పదిలపఱచుము. ఆ పైని ఘనీభవింపజేయుము. అంత నా శీతల జలశిలాఖండముల సహజసోపాన మార్గమై అమరునట్లు తీర్చిదిద్దుము. అల లలలుగా కల్పించిన ఆ మెట్ల వరుస ఆ యా స్థలము లధిరోహింప ఆ పుణ్యదంపతుల కెంతయో ఉపకరించును. మిత్రమా! మఱొక్కమాట. అలసి సొలసిన ఆ గౌరికి ముందు నడచి సుగమ మగున ట్లామెకు దారి చూపుము. దేహధారికి ఇంతకంటె వేరు ఫలమేమి కలదు? ఒకచో మణిమయతటము, మఱొకతావున మణిమయ విరామస్థలము. లోకహితచింతకులగు మహేశ్వరీ మహేశ్వరు లం దధిరోహింప సోపానమార్గమున నీవు రూపొంది సహకరించుము. శివపార్వతులకు సేవాభావమున ఉపకరించి ధన్యుడవు గమ్ము. అంతకంటె పుణ్యమేమి గలదు? ఇందు భుజగమందు వలయారోపణమున రూపకము.

అవ. సురవనితాప్రహారములనుండి మేఘునికి యక్షుడు రక్షణోపాయమును సూచించుట-

శ్లో. తత్రావశ్యం వలయకులిశోద్ఘట్టనోద్గీర్ణతోయం
నేష్యన్తి త్వాం సురయువతయో యన్త్రధారాగృహత్వమ్,
తాభ్యో మోక్ష స్తవ యది సఖే ఘర్మలబ్ధస్య న స్యాత్
క్రీడాలోలాః శ్రవణపరుషై ర్గర్జితై ర్భాయయేస్తాః. 65

అ. తత్ర=కైలాసమందు, సురయువతయః=దేవకాంతలు, అవశ్యమ్=తప్పక, వలయ-కులిశ-ఉద్ఘట్టన-ఉద్గీర్ణ-తోయమ్=కంకణాగ్ర ప్రహారముల వెడలగ్రక్కు జల ధారలు గల, త్వాం=నిన్ను, యన్త్ర-ధారా- గృహత్వమ్=కృతకధారా ప్రాచుర్యము గల గేహ (గృహ) భావత్వమును, నేష్యన్తి=పొందింతురు. హే సఖే!=ఓ మిత్రమా! ఘర్మలబ్ధస్య=నిదాఘ (వేసవికాలమున) లబ్ధుడ వగు, తవ=నీకు, తాభ్యః=ఆ సురయువతులనుండి, మోక్షః=విముక్తి, న స్యాత్ యది=లభించనియెడల, క్రీడా-లోలాః=వినోదాసక్తలగు, తాః=ఆ సురాంగనలను, శ్రవణ- పరుషైః=కర్ణకఠోరము లగు, గర్జితైః=గర్జన (ఉరుము)ల చేత, భాయయేః=భయపెట్టుము.

భా. మిత్రమా! మఱియొక విశేష మేమన చూడబోయిన నీకు ప్రహారములు! ప్రమాదములు! వారికి వినోదములు. విలాసములు. ఎంత విడ్డూరము! సుర వనిత లా కైలాసమున విహరింతురు. ఎవరు కాదందురు. ఆ యద్రిశిఖరముల వినోదింతురు. మంచిదే. కైలాసశిఖరముల విహరించు ఆ సుందరాంగనలకు నీవెంతయు అందుబాటు లోనివాడవు. సులభలభ్యుడవు. రాక రాక వచ్చితివి బహుకాలమునకు. అదియు అత్యంతసంతాపకమగు నిదాఘాంతమున. విహారమం దాసక్తలు వారు. అత్యంత తాపసంతప్తలు. ఇక నీవో! నీలరూపమున శీతలచ్ఛా యావిలసితుడవు. శీతలవారి పూరితుడవు. అలసి సొలసిన ఆ సురాంగనలకు నీ రాక మోదదాయకము. వారు నిన్నెట్లు విడువగలరు. నిదాఘ(వేసవి) సంతప్తలగు వారు చలువ నిచ్చు నిన్నొక మాత్రమున విడిచి పుచ్చెదరా? జలదా! అందున నవయువతులు. చిలిపిచేష్టల వయసు. చపలచిత్తములు. సులభసంప్రాప్తుడ వగు నిన్నా యువిదలు ప్రమత్తలై మోదమున వినోదముగ రత్నఖచిత కరకంకణకోటుల (అగ్రముల) మొట్టెదరు. ప్రమదాకరకంకణప్రహారము లెంత మధురములైనను గాయములు తప్పునా? బాధ లేకుండునా? ఆ కంకణప్రహారములకు నీ దేహము తూట్లుపడును. అందుండి వారిధారలు స్రవించును. వారికి కావలసినది వారు కోరునది అదియే. అప్రయత్నముగ లభించు చిఱుచినుకులు జల్లులు! ఇంకేము న్నది! అంత నీవొక కృత్రిమ (కల్పిత) యంత్రధారాగృహముగ రూపొందెదవు. జలయంత్రధారాసదృశమగు వారిధారలతో తుషారపుజల్లులతో ప్రమత్తలగు ఆ సురవనితలు క్రీడింతురు. ఇక నీకు విమోచన మెక్కడిది? జలదా! వారు చపలచిత్తలు, భయవిహ్వలలు. ప్రమదల కది సహజము గదా! అంగనలకు భీతి యెక్కువ. నీ ముక్తికి ఒక్కటే ఉపాయమున్నది. కర్ణకఠోరములగు ఉఱుములతో, మెఱుపులతో అదరించిన వారు బెదరి చెదరిపోయెదరు. మిత్రమా! నీ విడుదల కదియే చక్కని తరణోపాయము.

అవ. కైలాసమున మేఘుని యానందప్రాప్తివర్ణన -

శ్లో. హేమామ్భోజప్రసవి సలిలం మానసస్యాదదానః
కుర్వన్ కామం క్షణముఖపటప్రీతి మైరావతస్య,
ధున్వన్ కల్పద్రుమకిసలయాన్యంశుకాని స్వవాతై
ర్నానాచేష్టైర్జలద లలితై ర్నిర్విశేస్తం నగేన్ద్రమ్. 66

అ. హే జలద!=ఓ జలదా! హేమ-అమ్భోజ-ప్రసవి=స్వర్ణకమలముల బ్రసవించు, మానసస్య=మానససరోవరముయొక్క, సలిలమ్=జలమును, ఆదదానః=గ్రహించు వాడవై, ఐరావతస్య=ఇంద్రవాహనమగు ఐరావతగజమునకు, క్షణ-ముఖ-పట-ప్రీతిమ్=జలపానసమయమున ముఖమం దాచ్ఛాదనప్రాయమగు పట(వస్త్ర)

ప్రీతిని, కుర్వన్=కలిగించువాడవై, కల్పద్రుమ-కిసలయాని=కల్పవృక్షకిసలయము లను, అంశుకాని ఇవ=మృదువసనము (వస్త్రము)ల వలె, వాతైః=స్వీయపవనములచే, ధున్వన్=చలింపచేయువాడవై, లలితైః=సున్నితములు మనోజ్ఞములు నగు, నానాచేష్టైః=పాన ఆచ్ఛాదన ఆక్షేపాది వివిధప్రక్రియలుగల క్రీడలతో, తం=ప్రసిద్ధమగు, నగేన్ద్రమ్=పర్వతశ్రేష్ఠమగు కైలాసమును, కామమ్=యథేచ్ఛగా, నిర్విశేః=అనుభవించుము.

భా. జలదా! బంగారు తమ్మిపూలకు నెలవగు ఆ మానససరోవరము నీ వెఱుగనిది కాదు. నీ కది సుపరిచితమే. బంగారు తమ్మిపూవులు! ఎంత మనోజ్ఞములు! ఎంత హృదయాహ్లాదకరములు! ఆ పచ్చని ద్యుతు లెంత రమ్యములు! మిసమిసలాడు పసిమికాంతుల ముచ్చట్లవి. వెల్లివిరిసిన ఆ తమ్మిపూవుల నిండి, సొగసులు గుమ్మరించుచు సౌరభములు వెదజల్లు ఆ మానస మెంత మనోజ్ఞమైనది! ముచ్చటైన ఆ మానస మెంత హాయి గొల్పును! అందలి నీరములు మహనీయుల మానసమువలె అత్యంతనిర్మలములు, స్ఫటికవిశదములు. సత్పురుషుల చైదములవలె నిర్దుష్టము లవి. వికసించిన స్వర్ణకమలములతో స్వాదిష్ఠములగు నిర్మలనిర్దుష్ట తోయములతో నిండి కలకలలాడుచున్న దా సరోవరము. మార్గాయాసమున బడలిక నొందిన నీవు అందలి నిర్మలనిర్దుష్ట మధురజలములు మనసార గ్రోలుము. శివపార్వతుల మంగళస్నానముల పరిపూతమైన వా జలములు. పాపహరములు పుణ్యప్రదములు. శుభదాయకములు. జలదా! నీ వెంత ధన్యుడవు! నీ వట నున్నతరి ఐరావత మట కేతెంచవచ్చును. ఇంద్రవాహన మది. అది కామచారి. ఎటకైనను అది రా పోగలదు. దాని కా స్వేచ్ఛ యున్నది. లేక ఉమామహేశ్వరుల బూజింప సురాధిపతియే అధిరోహించి వచ్చినను రావచ్చును. ఏమైనను అది జలమూను (త్రాగు) సమయమున నీవు దానికి ముఖపటము (మోముపై వ్రేలాడ కప్పువస్త్రము) గా రూపొందుము. దాని కది యెంతయో ప్రీతి నొసంగును. ముదము గూర్చును. మఱియు తత్సరోవరతీరమున కల్పతరు వున్నది. దాని బాలారుణ కిసలయములను అవ్యక్తమధురకమనీయమంజులధ్వనులు చెలరేగ వస్త్రముల విసరినట్లు స్వీయసమీరసహాయమున కుదిపి కదలింపుము. మిత్రమా! అనుభవించుట కెన్నెన గలవు ఆ కైలాసమున. యథేచ్ఛగా అటు విహరించుచు వివిధరీతుల బహుభంగుల లలితచైదముల ఇచ్చవచ్చినరీతి ననుభవించుము.

మిత్రు డెవడైనను విహితుని ఇల్లు జేరి అతని వస్తువాహనముల నిచ్చవచ్చిన రీతి ననుభవించునట్లు మేఘుడును మిత్రుడగు కైలాసము జేరి అతని వస్తుతతిని యథేచ్ఛగా ననుభవింపగలడు. మేఘపర్వతములకు కమలభాస్కరులకు చంద్రజల నిధులకు మయూరమేఘములకు అగ్నివాయువులకు సహజమిత్రత్వము. ఇందు 'అంశుకాని ఇవ' అనుచోట ఉత్ప్రేక్ష.

అవ. కామినిని పోలు అలకానగరి వర్ణన-

శ్లో. తస్యోత్సఙ్గే ప్రణయిన ఇవ స్రస్తగఙ్గాదుకూలాం
వ త్వం దృష్ట్వా న పునరలకాం జ్ఞాస్యసే కామచారిన్,
యా వః కాలే వహతి సలిలోద్గార ముచ్చైర్విమానా
ముక్తాజాలగ్రథితమలకం కామినీవాభ్రబృన్దమ్. 67

అ. హే కామచారిన్=ఓ స్వేచ్ఛావిహారీ! ప్రణయినః (ఉత్సఙ్గే), ఇవ=ప్రియుని యొడివలె, తస్య=ఆ కైలాసముయొక్క, ఉత్సఙ్గే=ఉపరిభాగమున, స్రస్త-గఙ్గాదుకూలామ్=జాఱిన గంగయే దుకూల (వస్త్ర)ముగా కల, (కామినీ విషయమున జాఱిన గంగవలె తెల్లని వలువగల), అలకామ్=అలకానగరిని, దృష్ట్వా=వీక్షించి(కామినిని వలె), త్వమ్=నీవు, పునః=తిరిగి, న జ్ఞాస్యసే ఇతి న=గుర్తించలేవనుట సంభవ ముకాదు. ఉచ్చైర్విమానా=సప్తభూమికల (ఏడంతస్తుల) భవనములుకల, (అన్యత్ర) నివారితప్రణయకోపము గల, యా=ఏ అలకాపురి, వః=మీయొక్క, కాలే=వర్ష కాలమున, సలిల-ఉద్గారమ్=జలముల వెలువరించు, అభ్ర-బృన్దమ్=మేఘసమూహ మును, కామినీ=విలాసవతి, ముక్తా-జాల-గ్రథితమ్=ముత్తెపుసరములు పొదిగిన, అలకమ్ ఇవ=ముంగురుల వలె, వహతి=వహించుచున్నదో!

భా. స్వేచ్ఛావిహారి వగు ఓ జలదా! నీవు కామచారివి. యథేచ్ఛావిహారివి. నీ గమనమున కడ్డు లేదు. నిన్నెవరును అడ్డజాలరు. నీ యాగమన నిర్గమనములు నీ ఇచ్ఛాధీనములు. నీ వెచటికైనను రాగలవు పోగలవు. నిన్నెవరును ఆపజాలరు. అదిగో! ఆ కుబేరనగరము! అలకాపురి! కైలాసము నెట్లధివసించియున్నదో! అవలోకించుము. నీ కంతయు విశదమగును. స్వాధీనపతిక యగు శృంగారనా యికవలె ముచ్చటలు వెలార్చుచున్నది. ప్రియుని యూరు(తొడ) వధిరోహించిన విలాసిని భంగి కులుకుచున్నది. విలాసిని భంగి యనుట ఏల యందువా! ప్రణయకోప ముడిగినది. ముంగురుల ముత్తెపుసరములు సింగారించినది. ముసి ముసినవ్వులు చిలకరించుచు, ఒయ్యారములు పచరించుచు అందాలు విరజిమ్ముచు ప్రణయభావమున ప్రియుని అంక మధిరోహించినది. తమిహెచ్చ నీవి సడలినది. కటివస్త్రము దిగజాఱినది. ఇంకేమున్నది! అట్లున్నది ఆ యలకానగరిస్థితి. నీ వట జని, కైలాసము నధిష్ఠించిన ఆ నగరిని వీక్షించిన అదియే అలకాపురి యని గుర్తించగలవు. జలదా! కైలాస మధివసించిన ఆ యలకానగరికి అదియే ప్రియుని యుత్సంగము. మీదినుండి క్రిందికి దిగజారు గంగయే ఆమెకు విశదదుకూలము. క్షౌమవస్త్రము వెన్నెల వెలుగు వెలార్చు ఉత్తరీయము. సప్తభూమికల ఉన్నతభవనముల నొప్పుచున్న దా యలకాపురి. కుబేరనగరము, ధనవంతుల కాస్పదము గదా! ఏడంతస్థుల దివ్యప్రాసాదములు! చూడ నెంత

ముచ్చటగును? జలదా! వర్షకాలమున మీరు చనుదేర వర్షధారల నొప్పు మిమ్ము ముత్యాలహారములు పొదిగిన ముంగురుల భంగి వహించుచు అందాలు చిమ్ముచు మురిపెమున ఆ నగరి ముచ్చటలు వెలార్చును. ఇవ్విధమున స్వాధీనపతికయై ప్రియుని(కైలాసమును) యలరించు ఆ కుబేరరాజధాని అలకాపురి నీ చూపులకు ప్రీతి చేకూర్చగలదు. ఇందు కైలాసము అనుకూలనాయకుడుగాను, అలకానగరి స్వాధీనపతికయగు నాయికగాను చిత్రించబడినది. 'ఏకాయత్తోఽనుకూలః' ఒకే యొక నాయికయం దత్యంతానురక్తుడు అనుకూలనాయకుడు. 'ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికా మతా' సదా కాంతునిచే లాలింపబడునది. (మంచి మాటల నలరింపబడునది) స్వాధీనపతిక యనబడును. ఉదాహరణము- 'లాలయన్నలక ప్రాంతాన్ రచయన్పత్రమంజరీః, ఏకాం వినోదయన్ కాంతాం ఛాయావదనువర్తతే' ఇందు కైలాసమందు ప్రణయసామ్యము, అలకాపురియందు ప్రణయినీసామ్యము సూచితమగుట ఏకదేశవివర్తిని యగు ఉపమ. ఉత్తరార్ధమున శ్రౌతీ ఉపమ. అన్యోన్యనిరపేక్షస్థితి యగుట సంసృష్టి యలంకారము. ఉత్సంగ గంగాదుకూల విమానశబ్దములకు అర్థద్వయ ముండుటచే శ్లేషాలంకారము. శ్లేష ఉపమలయందు అంగాంగిభావముండుట సంకరాలంకారము.

మహాకవి శ్రీ కాళిదాసవిరచితము మత్కృతప్రతిపదార్థ పూర్వకము, విపులభావవివరణాత్మక సుజనమనోరంజనినామక మద్విరచిత, ఆంధ్రవ్యాఖ్యాసము పేతము నగు, మేఘదూత, యను నామాంతరము గల - మేఘసందేశ మహాకావ్యమందు పూర్వమేఘమను ప్రథమసర్గ సమాప్తము.

---*----

శ్రీరస్తు

# మేఘసన్దేశః

## (ద్వితీయ సర్గః)

## ఉత్తరమేఘము

అవ. అలకానగరప్రాసాదములను మేఘునితో పోల్చుట-

శ్లో. విద్యుద్వంతం లలితవనితాః సేంద్రచాపం సచిత్రాః
సంగీతాయ ప్రహతమురజాః స్నిగ్ధగంభీరఘోషమ్,
అంతస్తోయం మణిమయభువ స్తుంగ మభ్రంలిహాగ్రాః
ప్రాసాదాస్త్వాం తులయితు మలం యత్ర తైస్తైర్విశేషైః. 1

అ. యత్ర=ఎచ్చట, అనగా(అలకానగరమున), లలిత-వనితాః=సుందరాంగనలు కలవియు, సచిత్రాః=చక్కని చిత్తరువులతో గూడినవియు, సంగీతాయ=నృత్యగీత వాద్యాత్మక (త్రిక)మగు గానముకొఱకు, ప్రహత-మురజాః=నినదితమృదంగములు గలవియు, మణి-మయ-భువః=రత్నఖచితములగు వినోదపానభూముల నొప్పున వియు, అభ్రం-లిహ-అగ్రాః=ఆకాశము నొరయు ఉపరిభాగముల శోభించునవియు నగు, ప్రాసాదాః = ధనికదేవరాజ భవనములు, విద్యుద్వంతం=విద్యుల్లేఖలు (మెఱుపుతీగలు) గలట్టియు, సేంద్ర-చాపమ్=ఇంద్రధనస్సుతో గూడినదియు, స్నిగ్ధ-గంభీర- ఘోషమ్=శ్రావ్యము గంభీరము నగు ధ్వని గలట్టియు, అంతః-తోయం=అంతర్గర్భితమగు నీరము గలట్టియు, తుంగమ్ = మహోన్నతమగు, త్వామ్=నిన్ను, తైః తైః=ఆ యా, విశేషైః=లలిత వనితత్వాది విశేషములతో, తులయితుమ్=ఉపమించుటకు, అలమ్=పర్యాప్తము (సర్వవిధముల తగియున్నది.)

భా. జలదా! ఆకాశము నొరయు గుడిగోపురములతో, మహోన్నతములగు దేవమందిరములతో, వైభవోపేతములగు రాజప్రాసాదములతో, ఉన్నత ప్రాకార ములతో అలరారుచున్నది ఆ యలకానగరము. కన్నులకు పండుగవుచు విందు లందించుచున్నది. ధనదుని రాజధాని యది. అచటనే కుబేరుని యునికి. అందచందములకు ఆకర్షణలకు కొదవేమిటి? అపూర్వరమణీయ నిర్మాణచాతురీ

విలసిత మది. కమనీయశోభారంజిత మది. వైభవములకు వినోదవిలాసములకు ధనమేగదా మూలము. అతడు ధనముల కధిపతి. ఆ మీదట యక్షులకు ప్రభువు. అతని నగర మది. ఇక దాని వైభవ మెట్లుండును? వర్ణించ నెవరితరము? అందలి రమ్యహర్మ్యము లెట్లుండును? నీ వలెనే అవియు మహోన్నతములు. వాటిమీద భాగములు మింటి నంటుచున్నవి. ఆకసము నొరయుచున్నవి. సర్వవిధముల నవి నిన్ను పోలియున్నవి. జలదా! నీలో తటిల్లతలు తళుక్కనుచు మిఱుమిట్లు గొలుపుచున్నవి. జిగిబిగులు సంతరించుచున్నవి. నిజమే, కాదనను. ఇక ఆ ప్రాసాదములయం దందువా? మెరుపుతీగల బోలు సుందరాంగనలు అందములు చిలుకుచున్నారు. చైతన్యవిలసిత స్వర్ణప్రతిమలు వారు. వారు అపురూప రూపయౌవనసంపన్నలు. వారు పుత్తడిబొమ్మలు. ఒయ్యారమున కులుకు ఆ రమణీలలామలచే ఆ రమ్యహర్మ్యములు నీ వలెనే జ్యోతిర్మయములు. దీప్తిమంతములు. పురివిప్పిన నెమలి కన్నుల తళుకుబెళుకుల నధఃకరించి వన్నెమించిన ఇంద్రధనువు నీలో వింత హొయలు సంతరించుచుండ మేలిమి రంగులు మేళవించి ప్రముఖచిత్రకారులు తమ నేర్పునంతయు పాదిగి (పొందుపఱచి) తీర్చిదిద్దిన రమ్యవర్ణ చిత్తరువు లా భవనముల ముచ్చట గొల్పుచున్నవి. శ్రవణసుఖద సుభగగంభీర నిస్వనములు నీయం దమరియున్న అట భవనభవనమున సంగీతార్థము వాదితములగు కమనీయ హృదయంగమ మృదంగశబ్దములు కర్ణపేయము లగుచున్నవి. అంతేకాదు; ఆ రమ్యహర్మ్యముల వినోదపానభూముల నిర్మలనీలమణిద్యుతులు నీరములబోలి భాసించుచు నీయం దంతర్నిహితమగు నిర్మలజలరుచుల దలపించుచున్నవి. ఇక నీవు మహోన్నతుడ వనునది జగ మెఱిగిన సత్యము. నీకు అందరాని ఔన్నత్యములు గాని అధిగమించరాని తావులుగాని ఎందును లేవు. ఏతద్విధమున ఆ భవనములును, మహోన్నతములై ఆకసము నొఱయుచుండుటయేగాక వాటి కందరాని అందచందములు గూడ మఱెందును లేవు. మిత్రమా! ఇట్లు ఆ లలితవనితాదిధర్మముల ఆ రాజభవనములు సర్వవిధముల నిన్ను బోలి ముచ్చట గొల్పుచున్నవి. నీవలెనే అవియు అత్యంత హృదయరంజకములు. ఇందు ఉపమాన ఉపమేయభూత మేఘప్రాసాదధర్మములగు విద్యుద్వనితాదులకు క్రమానుగతముగ అన్యోన్యసాదృశ్యమున మేఘప్రాసాదములకు సామ్యసిద్ధియగుట బింబప్రతిబింబభావమున పూర్ణోపమ.

అవ. అట సర్వఋతుసమాహారసంపత్తి నగరవనితల పుష్పాలంకరణాదివర్ణన-

శ్లో. హస్తే లీలాకమల మలకే బాలకుందానువిద్ధం
నీతా లోధ్రప్రసవరజసా పాండుతామాననే శ్రీః,

చూడాపాశే నవకురవకం చారు కర్ణే శిరీషం
సీమంతే చ త్వదుపగమజం యత్ర నీపం వధూనామ్. 2

అ. జలదా! యత్ర=ఎచ్చటన అలకానగరమున, వధూనామ్=ప్రమదలయొక్క, హస్తే=కరమున (ఇది జాత్యేకవచనము - బహువచనార్థకము) లీలా-కమలమ్=విలాసార్థమగు పద్మము, అలకే=ముంగురులయందు (ఇదియు జాత్యేకవచనము), బాల-కుంద-అనువిద్ధమ్=అప్పుడే విరిసిన మల్లెల దుఱుముట, ఆననే=మోమున, లోధ్ర-ప్రసవ- రజసా=లొద్దుగ పూపుప్పొడితో, పాండుతామ్=గౌరవర్ణమును, నీతా=పొందించబడిన, శ్రీః=శోభయు, చూడా-పాశే=కేశబంధమున, నవ-కురవకమ్=లేత ఎఱ్ఱగోరింట, కర్ణే=కర్ణమున (జాత్యేకవచనము), చారు=సుందరమగు, శిరీషమ్=శిరీషకుసుమము (దిరిసెన), సీమంతే=పాపటయందు, త్వత్-ఉపగమజమ్=నీరాక నుద్భవించిన, నీపం చ=నీపకుసుమమున్ను, సర్వదా సర్వర్తు సమాహార సంపత్తిచే నవి సులభసాధ్యము లచట.

భా. జలదా! ఇదెక్కడి వింత! వింతలలో వింత. ఎంతటి వింత! కాలమునకు ఒక క్రమమున్నది. గమన మున్నది. కాలచక్రము క్రమము తప్పక తిరుగుచుండును. వత్సరములు, అయనములు, ఋతువులు అందు భాగములు. క్రమముగా నవి వసంత - గ్రీష్మ - వర్ష - శరత్ - హేమన్త - శిశిరములు విదితములే గదా! వత్సరమునందు ఋతువు లారు. కాలచక్రభ్రమణమున క్రమగతి ననుసరించి అవి గతానుగతికములు. ఆ యా ఋతువుల ఆ యా తరులతాదులు పుష్పించి ఫలించుట సర్వసాధారణము. అది క్రమగతి. కాని అలకానగరమున అట్లు గాదు. అట సర్వదా సర్వఋతుసమాహారము. అవి అన్యోన్యము సమభావమున సాహచర్యమున సహవసించియుండుటం జేసి ఏకకాలమున నిరంతరము ఋతుధర్మముల ననుసరించి లతాపాదపము లట పౌరులకు పుష్పఫలాదు లందించుచున్నవి. ఆ నగరమందలి అంగనలకు స్వర్ణమణిభూషణములయం దంతగా ఆసక్తి యుండదు. అవి సౌరభవిలసితములు కావు గదా! అలకానగరప్రమదలు కుసుమాలంకరణప్రియులు. కుసుమసుకుమారిణులు. మిత్రమా! ఋతువు లన్నియు ఏకత్రితమగుట వారాశించిన సుమపుంజము లన్నియు సులభసాధ్యములు. ఆ సుందరాంగనలు శరత్సూచితముగ క్రీడాకమలమును విలాసార్థము చేత బట్టెదరు. మదలాలసలగువారు హిమ ఋతు సంబంధమగు దరవికసితకుందకుట్మలము (అరవిరిసిన మల్లెమొగ్గ) లను ముంగురుల ముచ్చటగా ముడిచెదరు. అంతేకాదు; ఆ మగువ లింకను శిశిరోద్భవమగు లోధ్రపుష్పపరాగమును(లొద్దుగపూపుప్పొడి) మోమున అద్దుకొని గౌరవర్ణమగు ఆననశోభకు ముచ్చట పడుదురు. ఇక

వసంతసూచకమగు నవకురవకము (ఎఱ్ఱగోరింట)ను కేశపాశమున దురిమి ఆ యందమున కా ముగుదలు మురిసిపోయెదరు. మఱియు గ్రీష్మసంబంధి యగు పేశలశిరీషమును కర్ణాభరణము జేసి ఆ మగువ లింతింతనరాని యానందమున మురిసిపోవుదురు. జలదా! ఇక చెప్పెడి దేమున్నది? నీ యాగమనమున ఎచ్చట జూచినను నీపమే గదా! అది నీ రాకకు ఫలము. వారి కది సులభసాధ్యము. మిత్రమా! ప్రణయలాలస లగు ఆ నగరలలనలు అవ్విధమున సదా సర్వర్తుసంబంధితములు, వివిధమధురసౌరభవిలసితములు నగు కుసుమాభరణములు ధరించి అపురూపసౌందర్యవిభవమున ప్రేక్షకులకు కనువిందు లొనర్తురు. ఇట షడృతువులు సర్వకాలముల ఉపస్థితము లగుట సదా ఆ యా ఋతుసంబంధములగు కుసుమము లన్నియు సులభసాధ్యము లన్నియు ఆ పూవుబోడులు వాటిని ఎల్లవేళల మక్కువతో ధరించి ముచ్చటపడుదు రనియు సూచితము.

అవ. అలకానగర సహజసౌందర్యవర్ణన-

శ్లో. యత్రోన్మత్తభ్రమరముఖరాః పాదపా నిత్యపుష్పా
హంసశ్రేణీరచితరశనా నిత్యపద్మా నళిన్యః,
కేకోత్కణ్ఠా భవనశిఖినో నిత్యభాస్వత్కలాపా
నిత్యజ్యోత్స్నాః ప్రతిహతతమోవృత్తిరమ్యాః ప్రదోషాః. 3

అ. యత్ర=ఏ అలకానగరమున, పాదపాః=తరువులు, నిత్య-పుష్పాః=సదాపుష్పశోభితములు, (అత ఏవ=కనుకనే అవి,) ఉన్మత్త-భ్రమర-ముఖరాః=మత్తిల్లిన తుమ్మెదరొదకలవి, నళిన్యః=పద్మలతలు, నిత్య-పద్మాః=సదా పద్మములు కలవి, (అత ఏవ=కనుకనే అవి,) హంసశ్రేణీరచితరశనాః=హంసపంక్తుల గూర్చబడిన కటిసూత్రములు కలవి, భవనశిఖినః=గృహమయూరములు, నిత్య-భాస్వత్-కలాపాః=సదా ప్రకాశించు పింఛములు కలవి, (అత ఏవ=కనుకనే అవి,) కేకా-ఉత్కణ్ఠాః=కేకారవములచే ఉద్గ్రీవములు(కంఠము సారించునవి), ప్రదోషాః=రాత్రులు, నిత్య-జ్యోత్స్నాః=నిరంతరచంద్రికలు కలవి, (అత ఏవ=కనుకనే అవి,) ప్రతిహత-తమోవృత్తి-రమ్యాః=నివారితతమోవృత్తి(వ్యాప్తి)కలవగుట నిత్యనయనానందకరములు.

భా. జలదా! అది విలక్షణమగు యక్షుల నగరము. అట నన్నియు విచిత్రములే. మధురదృశ్యములే. ఆ యలకానగరశోభ వర్ణించ నలవిగానిది. ఏల యందువా? అచటి పాదపములా! నిత్యఫలపుష్పసంభరితములు. ఋతువులతో వాటికి పనిలేదు. సదా సర్వర్తుసమ్మేళనము గదా! ఋతువుల కూడలి

యది. సదా సుమపుంజసమృద్ధము లచటి లతాపాదపములగుట సుమధురసౌరభ శోభితములు, మధుపూరితములు. ఎచ్చట జూచిన మధుబిందువులు. సుమధుర సుమసౌరభములు. భ్రమరములకు కావలసిన దదియే కదా? సుమసౌరభము లాని మధురమధుకణములు ద్రావి ఆ మత్తమధుపములు జేయు మధురధ్వను లత్యంత మంజులములు. ఆ మధురకమనీయమంజులధ్వనులతో సదా ఆ లతాపాదపము లత్యంతరమణీయములు. మఱియు మధురమంజులధ్వనిగుంజితము లవి. ఇక పద్మలత లన్ననో నిరంతరకమలభూషితములు. హేమంతాది ఋతుబాధితములు గావవి. ఎటు జూచినను ముచ్చటగు తటాకములు, సరోవరములు, నదీనదములు, సదా కమలశోభితము లచట. విలక్షణశ్రీ పరివేష్టితములు. కనుకనే కలహంసపంక్తు లా సరోవరముల నంటియుండును. నిత్యకలహంసపంక్తి పరివేష్టితములు, పద్మశోభాపరిభూషితములు నగు తటాకసరోవరముల, నదీనదముల శోభ ఎట్లుండును? అదియొక యపూర్వరమణీయ సృష్టివిలసనము. అట్టియెడలనే మంగళ (లక్ష్మి) నివాస ముండును. అంటి విడువక పరివేష్టించియున్న హంసపంక్తులు నళినులకు కటిసూత్రలావణ్యమును సమకూర్చుచున్నవి. పద్మినులు దాల్చిన కమనీయ కటిసూత్రములా యనునట్లు హంసమాలలు చూపరులకు కనువిందొనర్చుచున్నవి. ఇక గృహమయూరము లందువా! వర్షర్తు వను మాట యేల? నిత్యభాస్వత్కలాపమండితము లవి. ఆ పురుల (పింఛముల) రంగురంగుల దోబూచులాడు వింత కన్నులు ప్రేక్షకుల కన్నులకు విందులే కదా! ఆ క్రీడామయూరములు ఋతునియమ మెరుగక పంచరంగుల పురులు విప్పి ఉల్లాసమున కనులపండువుగ లయబద్ధముగ నృత్యమొనర్చుచు ఎలుగెత్తి కమనీయమగు షడ్జస్వరమున కేకారవ మొనర్చుచున్నవి. ఇక నిశీథము లందువా! అవి నిత్యజ్యోత్స్నాద్యుతివిలసితములు. శోభారంజితములు. వాటికి శుక్లకృష్ణపక్షములతో నేమి పని? సదా ప్రసన్నచంద్రికా ధవళితము లవి. వెన్నెలతోటల విలసనములు, ఇక చీకటులకు తావెక్కడిది? అంధకారమునకు చోటెక్కడిది? అచటి ప్రదోషములు చీకటి, అంధకారమన నెట్టిదో ఎరుగవు. మఱియు నికటస్థ సదాశివ జటాజూటమున బాలచంద్రు డున్నాడు కదా! సదా నిండువెన్నెల పండువెన్నెల పుచ్చపూవెన్నె లచట. ఇక చీకటెక్కడిది? మిత్రమా! ఆ యలకానగరమాహాత్మ్య మట్టిది. ఆ పురి యపూర్వరమణీయశోభ యట్టిది. అవశ్యగంతవ్య మది. అత్యంతదర్శనీయము. ఇట పద్మినులయందు నాయికాత్వము గమ్యము. హంసశ్రేణియందు రశనాత్వారోపణము వాచ్యముగాన ఏకదేశవివర్తిరూపకము.

అవ. అలకానగరమందలి ఆనందమయజీవితవర్ణన-

శ్లో. ఆనన్దోత్థం నయనసలిలం యత్ర నాన్యైర్నిమిత్తైః
నాన్యస్తాపః కుసుమశరజా దిష్టసంయోగసాధ్యాత్,
నాప్యన్యస్మాత్ ప్రణయకలహో ద్విప్రయోగోపపత్తిః
విత్తేశానాం న చ ఖలు వయో యౌవనా దన్యదస్తి. 4

అ. యత్ర =ఎందన ఆ యలకానగరమున, విత్త-ఈశానాం=ధనాధిపతులగు యక్షులకు, నయన-సలిలమ్=కంటినీరు, ఆనంద-ఉత్థమ్=సంతోషమున ఆవిర్భవించినది మాత్రమే, అన్యైః=ఇతరములగు, నిమిత్తైః=కారణములచే, న=కాదు. ఇష్ట-జన-సంయోగ- సాధ్యాత్=ప్రియజనసమాగమమున నివారితమగు, కుసుమ-శర-జాత్=మదనశరజన్యతాపము కంటె, భిన్నః=అన్యమగు, తాపః=పీడ, న=లేదు. ప్రణయ-కలహాత్=ప్రేయసీప్రియుల ప్రణయకలహము కంటె, అన్యస్మాత్ =ఇతరమువలన, విప్రయోగ-ఉపపత్తిః-అపి=వియోగప్రాప్తియును, న=లేదు. యౌవనాత్=యౌవనముకంటె, అన్యత్=ఇతరమగు, వయః చ=వయస్సును, న అస్తి ఖలు=లేదు కదా!

భా. మిత్రమా! ఈ విచిత్రమును గమనించితివా? చిత్రములలో చిత్రము. ఎచ్చటైన ఇట్టి విచిత్ర ముండునా? యక్షులు ధనాధికు లను మాట యథార్థము. ధనమున కధిపతులు వారు. ధన మున్నచోట వైభవములకు కొదవేమిటి? 'ధనమూల మిదం జగత్త'ని గదా యందురు. ధనమున్నచోట అన్నియు గలవు. అది లేనిచో ఏదియు లేదు. భోగభాగ్యములకు విలాసవైభవములకు అధికారఆదరములకు అన్నిటికి ధనమే మూలము. అవన్నియు ధనముపై ఆధారపడియున్నవి. ఇది యథార్థము. కాని ఇట్టి వింత మరెచ్చటైన గలదా? జలదా! ఆ కుబేరనగరపౌరులు యక్షులు. విచార మన నేమియో ఎరుగరు. దుఃఖ మన నెట్లుండునో వారికి తెలియదు. ఒక వేళ ఎన్నడైన వారి నయనముల నీరుబికిన ఆనందజనితబాష్పము మాత్రమే తక్క వేరొండు కాదు. వారు ఆనందమయజీవులు. వారికి దుఃఖభారము లేదు. కాన అవి దుఃఖాశ్రువులు గావు. వారి కప్పుడపుడు అంతస్తాప ముదయించుమాట నిజము. అయిన నది ప్రతీకారజన్య మెంతమాత్రమును గాదు. ప్రియజనవియోగజన్య మది. ప్రణయకోపోద్భవము. అది అనురాగప్రదీపకము. కుసుమశరసముద్భవము. మదనోద్దీపకము. ఇష్టజనసమాగమనశమనయోగ్య మది. ప్రేయసీప్రియుల సంయోగమాత్రమున నివారితము. అంత ద్విగుణీకృతసుఖాంతముగ ఆనందసంధాయకముగ నది పరిణమించును. అంతియేగాని వారు కుసుమశరజన్యభిన్నమగు తాపమునుగాని ప్రణయకలహాభిన్నమగు (మరణాదిజన్యము) వియోగమునుగాని ఎంతమాత్రము

ఎరుగనే యెరుగరు. మిత్రమా! మఱియొక విశేష మేమన భోగయోగ్యమగు ప్రాయము (యౌవనము) తక్క ముదిమి యన నేమియో వారికి తెలియనే తెలియదు. వారది యెరుగనే యెరుగరు. వారు నిత్యయౌవనలు. పరిసంఖ్యల నిరపేక్షతాస్థితివలన ఇందలంకారము సంసృష్టి. ఈ పై శ్లోకద్వయము ప్రక్షిప్తమని శ్రీ మల్లినాథుని భావన. అయినను వ్యాఖ్యాతృసార్వభౌము డగు మల్లినాథు డీ శ్లోకద్వయమును వ్యాఖ్యానించెను.

అవ. యక్షుల భోగవర్ణన-

శ్లో. యస్యాం యక్షాః సితమణిమయాన్యేత్య హర్మ్యస్థలాని
జ్యోతిశ్ఛాయాకుసుమరచితా న్యుత్తమస్త్రీసహాయాః,
ఆసేవన్తే మధురతిఫలం కల్పవృక్షప్రసూతం
త్వద్గమ్భీరధ్వనిషు శనకైః పుష్కరే ష్వాహతేషు. 5

అ. యస్యామ్=ఎచ్చటన అలకానగరమున, యక్షాః=యక్షులు, ఉత్తమ-స్త్రీ-సహాయాః సన్తః=ఉత్తమలగు అంగనలు సహచారిణులుగా కలవార లగుచు, సిత-మణి-మయాని =స్ఫటికమణివికారములు, జ్యోతిః- ఛాయా-కుసుమ-రచితాని =నక్షత్రప్రతిబింబరూప పుష్పాలంకృతములు నగు, హర్మ్య-స్థలాని=ప్రాసాద ఉపరి భాగములను, ఏత్య=చేరి, త్వత్- గమ్భీర-ధ్వనిషు=నీ గంభీరధ్వనిని బోలు ధ్వనులు గల, పుష్కరేషు=మృదంగాదివాద్యములు, శనకైః = మందమందముగ, ఆహతేషు సత్సు= నినదితము లగుచుండ, కల్పవృక్షప్రసూతమ్=మందారవృక్షసముద్భవమగు, రతి- ఫలం=రతి(భోగ) ఫలముగల, మధు=మద్యమును, ఆసేవన్తే=అప్యాయముగ సేవింతురు.

భా. మిత్రమా! ముందుగనే సూచించితిని గదా! యక్షరాజు కుబేరనగరమున యక్షులు ఆనందమయజీవులని, భోగలాలసులని. వారికి పనేమున్నది? పానము గానము నటనము వారి కానందము. వారు విలాసప్రియులు. భోగశీలురు. ఆనందోపాసకులు. ఉత్తమస్త్రీలు, సర్వవిధముల తమకు తగిన సహచారిణులు, నిరంతరము వారి నంటియుందురు. వా రా ముద్దుగుమ్మల గూడి ఎల్ల ప్రొద్దుల విలాస వినోదనిమగ్నులై యుందురు. అచటి ప్రాసాదములు రమ్యహర్మ్యములు మహోన్నతములు, స్ఫటికశిలామయములు, చంద్రశిలాస్థగితములు. ఆ భవ్యహర్మ్యముల ఉపరి (మీది) భాగములు స్ఫటికమణిస్థగితములు. కనుకనే ఆ చలువరాళ్ళయందు తారలు ప్రతిబింబితము లగును. స్వచ్ఛమగు ఆ పాలరాతిప్రదేశముల ప్రతిబింబితములగు ఉజ్జ్వలదీప్తుల వెలుగొందు నక్షత్రములు కుసుమరుచుల దలపింప ప్రణయహృదయముల దోచెడి ఆ మదిరేక్షణలు తమ్మ నుసరించి సౌధోపరిభాగముల జ్యోతిశ్ఛాయాకుసుమపరిష్కృతము (భూషితము)

లగు పానభూముల జేరి మందారతరుసంభవము, మధురపరిమళ మాదక ద్రవ్య సమ్మిశ్రితము, అత్యంతమధురము హృదయాహ్లాదకరము, రతిప్రేరకము, రతిఫలాఖ్యమగు మందారమకరందమను మాదకద్రవ్యమును (మద్యమును) ఆప్యాయముగ సేవించి మైమరచి ఆనందడోలికల నూగెదరు. మరియును జలదా! శుభదాయకము, సాంద్రగంభీరము నగు నీ మంజులమనోజ్ఞ నినదమును బోలు మృదంగాది లలితసంగీతవాద్యములు మందమందముగ మధురకమనీయశబ్దముల నీన, మద్యమున దోగి, మైకమున దేలి, అవ్యక్తమధురముగ పాడి ఆడెదరు. ఆనందజలధిని ఓలలాడెదరు. మిత్రమా! దాని మైక మట్టిది. రతి (ఆనంద) ఫల మందించు మందారమకరంద మది. రతిఫలాఖ్య మది. అచటి పౌరుల భోగానుభవ మట్టిది. 'మధు మద్యే పుష్పరసే' ఇతి అమరము. ఇం-దుదాత్త-రూపక-లుప్తోపమల సంసృష్టి.

*అవ. అలకానగరమందలి కన్యల క్రీడావర్ణన-*

శ్లో. మన్దాకిన్యాః సలిలశిశిరైః సేవ్యమానా మరుద్భి
ర్మన్దారాణా మనుతటరుహాం ఛాయయా వారితోష్ణాః,
అన్వేష్టవ్యైః కనకసికతాముష్టినిక్షేపగూఢైః
సంక్రీడన్తే మణిభిరమరప్రార్థితా యత్ర కన్యాః. 6

అ. యత్ర=ఏ యలకానగరమున, అమర-ప్రార్థితాః=దేవతలచే ప్రార్థితలగు, కన్యాః=యక్షకన్యలు, మన్దాకిన్యాః=ఆకాశగంగయొక్క, సలిల-శిశిరైః=సలిలము (జలము)లచే చల్లనైన, మరుద్భిః=సమీరము (వాయువు) లచే, సేవ్యమానాః సత్యః=సేవింపబడుచున్నవార లగుచు, తటరుహామ్ =తటము (తీరము)ల నుద్భవములగు, మన్దారాణామ్=మందారవృక్షములయొక్క, ఛాయయా=నీడచే తను, వారిత-ఉష్ణాః సత్యః=నివారితతాపము (ఆతపము) గలవార లగుచు, కనక-సికతా-ముష్టి- నిక్షేప-గూఢైః=స్వర్ణవాలుకల (బంగారు ఇసుక) యందు పిడికిలిచే నిక్షేపితము లగుట గూఢ (రహస్య) మైనవియు, అన్వేష్టవ్యైః=అన్వేషింప (వెదక) దగినవియు నగు, మణిభిః=మణుల (రత్నముల)తో, సంక్రీడన్తే=హాయిగా వినోదింతురు.

భా.- మిత్రమా! సౌందర్య మెట ఉన్నను హృదయాకర్షకమే. దానికి గుణము తోడైన ఇక చెప్పెడి దేమున్నది. అది అత్యంత అపేక్షణీయము, అమృతమయమునై ఆనందవర్ధక మగును. కన్యలయం దేమి, కుమారులయం దేమి, కమలాదికుసుమతతులయం దేమి, వివిధమనోహరమత్స్యాదిజలచరములయం దేమి మయూరమరాళశుకపికాది శకుంత (పక్షి) సంతతులయం దేమి, గోహరిణాది పశుజాతులయం దేమి, కనకమణిమయాదులయం దేమి, చిత్రశిల్పములయం దేమి,

గోపురప్రాసాద ఆలయములయం దేమి వనధిసర్వతనదీవనసీమలయం దేమి, మరే యితరప్రకృతిరమణీయవస్తుసంచయమం దేమి - సౌందర్య మెచట నున్నను నను వీక్షింపుడని ఇటు చూడుడని కన్నులను పట్టి తన వైపు కీడ్చును. సౌందర్యవైభవ మట్టిది. మహిమ యట్టిది. మిత్రమా! ధనదు పురమున యక్షకన్యలు రూపవతులు, గుణవతులు, శీలవతులు, లలితసౌందర్యమనోహారిణులు, సొగసుల రాణులు, విలాససంపన్నలు. వయఃపరిపాక లగుట అత్యంతవినోదశీలురు. అమరు లధికులని కదా యందురు. వా రెంతటివా రైనను వారికీ కన్యలయందే మక్కువ ఎక్కువ. ఈ యక్షకన్యల పరిణయమాడ వా రువ్విళ్ళూరుచుందురు. ఆ యక్షకన్యల అపురూపరూపసంపద అట్టిది. చెంతనే యున్నది వారికి వియద్గంగ. ఆ దఱిదాపులనే వాని యునికి. వయసుబాలికలు, విలాసవినోదములు వారి సొత్తు. వా రచటనే విహరింతురు. వియద్గంగాశీతలజలకణములు స్వీకరించి వాయువు లచట చల్లగా వీచుచుండును. హృదయరంజకములగు ఆ శీతలమందసమీరము లా యక్షకన్యలకు హాయిగూర్చి అలరించును. వెన్నంటి వీచి సేవించును. మఱియు నా మందాకినీతటరుహములగు మందారవృక్షములు ఛాయతో శోభాయమానముగ భాసించుచున్నవి. భాస్కరుని తీక్ష్ణకిరణముల అలసి సొలసిన ఆ యక్షకన్యలు ఆ చెట్లనీడలలో వడతాపముల బాపుకొందురు. జలదా! ఆ వియద్గంగావాలుకలు ధాతుమయము లగుట స్వర్ణవికారములు. ఆ బంగారు ఇసుకతిన్నెల జేరి ఆ యక్షబాలికలు ముష్టినిక్షిప్తగూఢమణులను వెదకుచు అమరుల గూడి ఎంతగానో వినోదింతురు. దైశికక్రీడలయం దంతటి యభిరుచి వారికి. గంగ యునికి లోకత్రయమున యందురు. అందు మందాకిని (వియద్గంగ) స్వర్లోకమున, భాగీరథి మర్త్యలోకమున, భోగవతి పాతాళమున ప్రవహించునని ప్రసిద్ధి. 'పంచైతే దేవతరవో మన్దారః పారిజాతకః, సంతానః కల్పవృక్షశ్చ పుంసి వా హరిచందనమ్' అని అమరము. దేవవృక్షమన ఈ అయిదింటికి సంకేతము. వాలుకాదుల రత్నాదులను విసరికొట్టలేక గూఢముగ ముష్టినిక్షేపమున దాచ ఇతర చెలులు వాటిని వెదకి పట్టెదరు. ఇది గూఢమణి యను ప్రాంతీయఖేలనము. ఇందు లోకాతిశయసంపత్తి అభివర్ణిత మగుట ఉదాత్తాలంకారము.

అవ. యక్షుల భోగైశ్వర్యముల వర్ణన-

శ్లో. నీవీబన్ధోచ్ఛ్వసితశిథిలం యత్ర బిమ్బాధరాణాం
క్షౌమం రాగా దనిభృతకరేష్వాక్షిపత్సు ప్రియేషు,
అర్చిస్తుఙ్గా నభిముఖమపి ప్రాప్య రత్నప్రదీపాన్
హ్రీమూఢానాం భవతి విఫలప్రేరణా చూర్ణముష్టిః. 7

అ. యత్ర=ఏ అలకానగరమున, అనిభృత-కరేషు=చపలహస్తులగు, ప్రియేషు= ప్రియులు, నీవీ-బన్ధ-ఉచ్ఛ్వసిత-శిథిలమ్=పోకముడి సడలిన శిథిలమగు, క్షౌమమ్= పట్టువలువను, రాగాత్=ప్రణయమున (అనురాగమున), ఆక్షిపత్సు సత్సు=అపకర్షించినవారు కాగా, హ్రీ-మూఢానామ్=లజ్జచే విహ్వలులైన, బిమ్బ-అధ రాణామ్=దొండపండును పోలిన అధరోష్ఠము (క్రింది పెదవి) గల ముద్దరాండ్ర, చూర్ణముష్టిః =కుంకుమాదిచూర్ణముష్టి, అర్చిస్తుఙ్గాన్=దీప్తుల నతిశయించిన, రత్న-ప్రదీపాన్=మణిదీపముల గూర్చి, అభిముఖం యథా తథా=సమ్ముఖమగునట్లు, ప్రాప్య అపి=పొందియు, విఫల-ప్రేరణా=వ్యర్థవిక్షేపము కలది, భవతి=అగుచున్నదో.

భా. మిత్రమా! యక్షరాజు కుబేరనగరమున, సతీపతుల, యువతీయువకుల ప్రేయసీప్రియుల మురిపంపు చైదములు, ప్రణయచేష్టలు, ప్రేమకలాపములు, శృంగారలీలలు విలక్షణములు, విచిత్రములు, మదనోద్దీపకములు. అచటి పౌరులు ప్రణయలోలురు. భోగైకపరాయణులు. కోరికలు మిక్కుటము. అనుభవింప నుద్వేగము. వారు ఆనందోపాసకులు. ఆ యంగనలు కుసుమకోమ లులు. అపురూపరూపలావణ్యభూషితలు. వారి చైదములు ముగ్ధమనోహరములు, మోహజనకములు. ప్రియతమవల్లభులు ఆ ముగ్ధమోహన లలితసుకుమార సుందరాంగనల గూడి సరససల్లాపములు నెఱపి సద్దు చేయక చపలహస్తముల ఆ యంగనల యధోవస్త్రముల నీవీబంధమును రాగవశమున సడలింప పట్టుదప్పిన ఆ పట్టువలువల నెట్లో తొలగద్రోసి కొంటెతనమున అపహరింతురు. అట్టియెడల ఆ లలితసుకుమారఅంగనలు ఆ బింబోష్ఠలు ముగ్ధలగుట చేయునది లేక విహ్వాలలగుచు జ్యోతు (మణిదీపము) లార్ప నుద్యమింతురు. లజ్జచే మూఢలు, ముగ్ధలు. పాప మేమి చేతురు? వారి కదియు నసాధ్యము. ఆర్పుట కచట తైలదీపములున్నను గదా! ఉన్నవి మణిజ్యోతులు. ఉజ్జ్వలములు మణిద్యుతు లెట్లారును? అసంభవము. అయినను ముగ్ధాంగనలగుటవలన కుంకుమాదిచూర్ణములు పిడికిట బట్టి రత్నదీపముల కభిముఖముగా విసరికొట్టుదురు. అదియు వ్యర్థమగుటయేగాని మణిద్యుతు లంతరించవు. రత్నదీపము లారవు. వారు ముగ్ధలు. వారి మౌగ్ధ్యమున కింతకంటె ఋజు వేమి కావలెను? ఆ యంగన లిక చేయునది లేక లజ్జచే ప్రియుల యెదుల నొదిగి పోయెదరు. అవి ఆ పురి ముగ్ధాంగనల లలితమంజుల మనోజ్ఞములగు వలపుల చిలిపిచైదములు. నెయ్యపు మురిపంపు వలపుపోకడలు. ఇందు చూర్ణముష్టిరూప హేతు వున్నను రత్నప్రదీపనిర్వాణరూపఫల ముద్భవము కాకుండుట విశేషోక్తి అలంకారము. బిమ్బాధర లనుచోట లుప్తోపమ. ఉదయమునకు అంగాంగిభావ మగుట సంకరాలంకారము.

అవ. నగరవైభవచంద్రికతోడి నిశావర్ణన -

శ్లో. యత్ర స్త్రీణాం ప్రియతమభుజోచ్ఛ్వాసితాలిఙ్గితానా
మఙ్గగ్లానిం సురతజనితాం తన్తుజాలావలమ్బాః,
త్వత్సంరోధాపగమవిశదైశ్చన్ద్రపాదైర్నిశీథే
వ్యాలుమ్పన్తి స్ఫుటజలలవస్యన్దిన శ్చన్ద్రకాన్తాః. 8

అ. యత్ర=ఏ యలకానగరమున, నిశీథే =అర్ధరాత్రి సమయమున, త్వత్ సంరోధ-అపగమ-విశదైః=నీ యాటంకము తొలగుటచే నిర్మలములగు, చన్ద్ర-పాదైః=చంద్రకిరణములచేత, స్ఫుట-జల-లవ-స్యన్దినః=నిర్మలములగు జల బిందువులను స్రవించునవియు, తన్తు-జాల-అవలమ్బాః=వితానసూత్రజాలముల వ్రేలుచున్నవియు నగు, చన్ద్రకాన్తాః=చంద్రకాంతమణులు, ప్రియతమ-భుజ-ఉచ్ఛ్వాసిత-ఆలిఙ్గితానామ్=వల్లభశిథిల బాహుబంధములు గల, స్త్రీణామ్=అంగనలయొక్క, సురత-జనితామ్=కామక్రీడోద్భవమగు, అఙ్గ-గ్లానిమ్=శరీరఖేదమును, వ్యాలుమ్పన్తి=లోపింపజేయుచున్నవో!

భా. జలదా! ఏమున్నది! ఆ నగరవైభవవిలాసము లేమని చెప్పను! మహోన్నతభవనములు, విలాసమందిరములు, వినోదశాలలు, విలాసక్రీడలు, విలక్షణచేష్టలు, వలపుల సయ్యాటలు, నెయ్యపు తీరులు, తియ్యని మాటలు, చతురోక్తులు, సరససల్లాపములు, తనివితీరని నెయ్యపు పెనగులాటలు బిగికౌగిళ్ళ యొత్తిడులు, రతిక్రియల ముచ్చటలు అలసటలు. ఆ అలసటల, ఆ ఖేదముల తీరుతెన్నులు విలక్షణమైనవి. మనోజ్ఞమైనవి. నిశీథమున ప్రియతమబాహుబంధముల యొత్తిడు లించుక సడల ఆ యంగనల రతిఖేద మెట్లుపనయించబడుచున్నదో ఇంచుక గమనించుము. ఆ రమణీరమణుల యువతీయువకుల కామినీకాముకుల కాంతావల్లభుల విలాసమందిరములు, వినోదశాలలు ఉన్నతీరు లెట్లున్నవన రత్నఖచితములవి. విలాసవస్తుభూషితములు. మాదకద్రవ్యసంభరితములు. బహుమూల్యపర్యంకశోభితములు. ఆ పైన వితాన(మేలుకట్టు) సూత్రగుంఫిత చంద్రకాంతమణిమాలలు ముత్తెపుసరములు. జలదా! చంద్రబింబము నడ్డుకొనిన నీ వించుక వైదొలగ శీతభానుని ప్రసన్నశీతలచంద్రికలు గవాక్షరంధ్రముల జొచ్చి వితానముల వ్రేలు చంద్రకాంతమణిమాలల సోక అందుండి ఉబికి స్రవించు శీతలజలకణముల చలువలకు ఆ నెలతలకు రతిఖేదము లంతరించుచున్నవి. అచటి అచ్చట్లు ముచ్చట్లు అవి. చంద్రకిరణములు సోకిన చంద్రకాంతమణులు స్రవించునని లోకప్రసిద్ధి. ఇం దలంకారము కావ్యలింగము.

అల. అలకానగరభవనముల మేఘప్రవేశవర్ణన -

శ్లో. నేత్రా నీతాః సతతగతినా యద్విమానాగ్రభూమీ
రాలేఖ్యానాం స్వజలకణికా దోష ముత్పాద్య సద్యః,
శఙ్కాస్పృష్టా ఇవ జలముచ స్త్వాదృశో జాలమార్గై
ర్ధూమోద్గారానుకృతినిపుణా జర్జరా నిష్పతన్తి. 9

అ. నేత్రా= ప్రేరకుడగు, సతత-గతినా=సదాగతుడగు వాయువుచేత, యత్ (యస్యాః) విమాన-అగ్రభూమీః=ఏ యలకానగరముయొక్క ఏడంతస్తుల భవనముల మీది భాగములను, నీతాః=పొందించబడినవియు, త్వాదృశః= నిన్ను పోలినవియు నగు, జలముచః=మేఘములు, ఆలేఖ్యానామ్=చక్కని చిత్తరువులకు, స్వ-జల-కణికా-దోషమ్=స్వీయజలబిందు (రూపుమాపు) దోషమును, ఉత్పాద్య =కలుగజేసి, సద్యః=వెంటనే, శఙ్కా-స్పృష్టాః ఇవ=కలత(భీతి) చెందినవి వలె, ధూమ-ఉద్గార-అనుకృతి-నిపుణాః=ధూమరూప నిర్గమనానుకరణమున సమర్థములైనవియును, జర్జరాః సన్తః=విశీర్ణ(శిథిల)ము లయినవియు నగుచు, జాలమార్గైః=గవాక్షరంధ్రముల ద్వారా, నిష్పతన్తి= నిర్గమించుచున్నవి.

భా. జలదా! నీకు తెలియనిది కాదు. ఆ పురిని ఉన్నతప్రాసాదములు, దివ్యహర్మ్యములు, దేవమందిరములు, రాజప్రాసాదము లున్నవని గదా యంటిని. ఏడంతస్థుల భవనము లవి. వాటిని సప్తభూమిక అందురు. అవన్నియు అలంకృతములు. వివిధమనోజ్ఞవర్ణచిత్రపరిష్కృతములు. భూషితములు. యక్షులు ధనాఢ్యులుగదా! వారి కన్నియు సులభసాధ్యములే. వారికి కొదవేమిటి? వారి భవనములు అచ్చెరువు గొలుపు అపురూపచిత్తరువులతో నిండియుండును. ఆ యమూల్యకమనీయ వర్ణచిత్తరువులు జూచి వారెంతగానో మురిసి ముచ్చటపడుచుందురు. వారు కళాప్రియులు. ఇక వర్షఋతువున నిమబోలు జలదములు ఆ భవనోపరిభాగముల జేరి ఆగడములు సలుపుచు సదాగతుని (వాయు) సాయమున అల్లనల్లన మీది అంతస్తుల కరిగి జలకణశీకర సేచనమున అందుండు రమ్యమగు వర్ణచిత్రముల కుడ్యచిత్తరువుల రూపుమాపి అపచార మొనరించును. మీది మీది గమనముకదా! క్రింది యంతస్థుల కంతగా ఆ బెడదలేదు. అ ట్లపచార మొనరించి అపరాధభయముననో యనునట్లు ధూమనిర్గమనానుకరణయం దత్యంతనిపుణములుగాన విశీర్ణములై శీఘ్రగతిని జాలమార్గముల నిర్గమించుచున్నవి. నిరంతరగమనశీలు డగుట వాయువునకు సదాగతుడని పేరు. ఇందు అంతఃపురసంచారకుడగు దూతద్వారా గూఢవర్తనమున రహస్యమార్గమున ప్రవేశపెట్టబడిన జారులు ఆట స్త్రీలతో వ్యభిచరించి తద్దోషభయమున అనుమానచకితు లగుచు గుప్తవేషమున నీచమార్గముల

అతిశీఘ్రముగ నిష్క్రమించునట్లు, అని ధ్వనించుచున్నది. ఇట వాయువునందు దూతారోపణమున సమాసోక్తి. 'శఙ్కాస్పృష్టా ఇవ అనుచో ఉత్ప్రేక్షాలంకారము.

అవ. యక్షుల ఐశ్వర్యవిలాసజీవితముల వర్ణన -

శ్లో. అక్షయ్యాన్తర్భవననిధయః ప్రత్యహం రక్తకణ్ఠై
రుద్గాయద్భి ర్ధనపతియశఃకిన్నరై ర్యత్ర సార్ధమ్,
వైభ్రాజాఖ్యం విబుధవనితా వారముఖ్యాసహాయా
బద్ధాలాపా బహిరుపవనం కామినో నిర్విశన్తి. 10

అ. యత్ర=ఏ అలకానగరమున, అక్షయ్య-అన్తర్భవన-నిధయః=తఱగని లోభవనముల అపారధనరాసులు గలవారును, విబుధ-వనితా వారముఖ్యా-సహాయాః=విబుధవనిత (అప్సరస) లగు వేశ్యలు సహాయులుగా కలవారును, బద్ధ-అలాపాః=సరససల్లాపముల నిమగ్నులు నగు, కామినః=కాముకులు, ప్రత్యహమ్=ప్రతిదినమున, రక్త-కణ్ఠైః=శ్రావ్యమగు కంఠస్వరమున, ధనపతి-యశః=ధనముల కధిపతియగు కుబేరునియొక్క కీర్తిని, ఉద్గాయద్భిః=ఎలుగెత్తి పాడుచున్న, కిన్నరైః సహ=కిన్నరుల గూడి, వైభ్రాజ -ఆఖ్యమ్=(విభ్రాజగజరక్షితము) వైభ్రాజ మను నామాంతరముగల చైత్రరథమను బాహ్యోద్యానమును, నిర్విశన్తి=అనుభవింతురు.

భా. మిత్రమా! ధనపతినగరమున ధనాఢ్యు లధికము. అంతర్భవనముల తఱుగని ధనరాశులు దాగియున్నవి. ధననిధులు! క్షీణత నెరుగని సంపదలు! సర్వభోగానుభవ సంచయసంపాదన సమర్థము లవి. భవనముల లోతట్టులు పేరియున్నవి. అనుభవించవలెనే కాని వాటికి తరుగెక్కడిది? ఇక యక్షు లందుమా! భోగప్రియులు. కోరికలపై కోరికలు. అలస టెఱుంగని అనుభవములు. ఆమీదట నిత్యయౌవను లగుట విలాసశీలురు. భోగలాలసులు. వారి అర్థవైభవప్రాబల్యమునకు మేరలేదు. ఇక అప్సరలమాట చెప్పనేల? వారు సురాంగనలు, అపురూపరూపసంపన్నలు, జ్యోతిర్లేఖలు, పుష్పమంజరులు, మధులతికలు, భోగలాలసులే గాదు. ఒయ్యారిభామలు వారు. నిత్యనూతన తరుణ వయోవిలాస విలసితలు. కళాప్రియులు కళానిష్ణాతలు. చతురవచోవిన్యాసనిపుణలు. జాణలు. ఆ నెఱజాణలతో, ఆ విబుధవనితలతో, ఆ యచ్చరలేమలతో, ఆ సుందరమోహనాంగనలతో చెలిమి ఆ యక్షులకు. వారితో ముచ్చటలు అచ్చటలు. సరససల్లాపములు. మిత్రమా! ఆ పట్టణము అప్సరోయక్ష సంయోగసంరంభవైభవ మది. వారి జీవితవిధాన మది. వారి వైఖరి తీరుతెన్ను లివి. అంతేకాదు. ఆ కిన్నరులు ఎలుగెత్తి గాంధారమున మధురస్వరమున ధనపతియశస్సును గాన మొనర్తురు. ఆ యక్షు లనుదినము అచ్చరలేమల గూడి వైభ్రాజ్య మను

కుబేరుని బహిరుపవనమున విహరింతురు. వినోదింతురు. ఆ చైత్రరథ మను ఉద్యానవనమందు సకలభోగము లనుభవింతురు. జలదా! ఆ నగరమున యక్షుల నిత్యజీవిత విధానవైభవ సమగ్రత ఇది. ఉదాత్తాలంకారము.

అవ. అభిసారికల మార్గవర్ణన -

శ్లో. గత్యుత్కమ్పా దలకపతితై ర్యత్ర మన్దారపుష్పైః
పత్రచ్ఛేదైః కనకకమలైః కర్ణవిభ్రంశిభిశ్చ,
ముక్తాజాలైః స్తనపరిసరచ్ఛిన్నసూత్రైశ్చ హారై
ర్నైశో మార్గః సవితు రుదయే సూచ్యతే కామినీనామ్. 11

అ. యత్ర=ఎచ్చటన ఆ యలకానగరమున, కామినీనాం=అభిసారికల యొక్క, నైశః=నిశాసంబంధమగు, మార్గః=బాట, సవితుః=సూర్యునియొక్క, ఉదయే సతి=ఉదయ మగుచుండగా, గతి-ఉత్కమ్పాత్=గమనవేగమున, అలక-పతితైః=ముంగురుల జాఱిన, మన్దారపుష్పైః=మందారకుసుమములచేతను, పత్ర-చ్ఛేదైః=కిసలయఖండములచేతను, కర్ణ-విభ్రంశిభిః=శ్రవణపతితములగు, కనక-కమలైః=స్వర్ణకమలములచేతను, ముక్తా-జాలైః=త్రుటితములగు ముత్తెపుసరముల చేతను, సూచితమగుచున్నది.

భా. జలదా! యక్షులు భోగాసక్తులని గదా యంటిని. అ యక్షన గరమున అభిసారికలు నిశాసమయమున ప్రణయప్రేరితలై కామోద్వేగమున ప్రియసంకేతముల జేరు మార్గమును ఎంత గూఢముగ వా రెన్నుకొన్నను ఉదయమగుసరికి అది విదిత మగుచునే యుండును. అది కదా వారు పయనించిన రహస్యమార్గము. వారి ముచ్చటలు ముపిపెములు ఇచ్చటనేగదా జరిగినవి. వారి వలపుపంటలు పండినతావు లివియేగదా! అని మార్గములు చెప్పకనే చెప్పుచున్నవి. వారలంకారప్రియులు. గమనమా! ప్రేమికుల కడకు! ప్రేమలీలలు నెఱపుటకు చక్కగా అలంకరించుకొని మెఱుగులు దిద్దుకొనిరి. ముంగురుల మందారకుసుమములు తుఱుముకొనిరి. కర్ణముల కనకకమలములు కూర్చుకొనిరి. ముద్దుముద్దుగా ముత్తెపుసరములు శిరోజముల నలంకరించిరి. కుచప్రదేశమునకు సుమహారములు ధరించిరి. ఆపైని పత్ర (కిసలయ) రచనలు! వారి అలంకారవిధాన మది. ఎంత బాగున్నది? మిత్రమా! రత్నభూషణాదులయం దంతగా వారి కభిరుచి యగుపడదు. అభిసారికల కవి అంతగా తోడ్పడవు. అభిసారిక యన (అభిసారయతే కాంతం యా మన్మథవశంగతా, స్వయం వాభిసరత్యేషా ధీరైరుక్తాభిసారికా) అని సాహిత్య దర్పణము. కామవశీభూత యగుచు తానుగా ప్రియుని సంకేతము చేరునది లేక ప్రియుని తన వద్దకు రప్పించుకొనునది. కుసుమాలంకరణల సొగసులు

సంతరించుకొని కులుకుచు ప్రేమికుల జేరి ప్రణయరతుల దేలి వేకువన ఆ కామినులు స్వగృహములు జేరుదురు. కాని గమనవేగముచేనైన త్రొట్రుపాటుకు తొందరపాటుకు ఊగులాడి ముంగురుల మందారములు క్రిందపడును. చెవుల గూర్చిన స్వర్ణకమలములు జారి భూమి నలంకరించును. ముత్తెపుసరములు ప్రిదిలి నేల నొదుగును. కిసలయఖండములు వాడి పడును. ఆ త్రుళ్లిపాటులకు స్తనముల యొత్తిడులకు త్రుటితసూత్రములగు కుసుమమాలలు మార్గము నలంకరించును. మిత్రమా! ఇవ్విధమున మార్గపతిత మందారకుసుమ కిసలయఖండ స్వర్ణకమలముక్తాజాల పత్రరచన కుసుమమాలల అభిజ్ఞలచే నిది అభిసారికలు సాగిపోయిన, సంచరించిన మార్గమని విదితమగుచున్నది. ఇందు అభిసారిక లెంచుకొనిన రాత్రించరమార్గమును (కార్యమును) గూర్చి అలకాదుల జాఱిన మందారకుసుమాది కారణబాహుళ్యముండుట సముచ్చయము. మఱియు మందార కుసుమాది సాధనములచే అభిసారికల నిశామార్గరూపమగు సాధ్యముయొక్క జ్ఞానముచేత అనుమానము అలంకారములు.

*అవ. అలకానగర మగువల వక్రీకృత వీక్షణవర్ణన-*

శ్లో. మత్వా దేవం ధనపతిసఖం యత్ర సాక్షాద్వసన్తం
ప్రాయశ్చాపం న వహతి భయాన్మన్మథః షట్పదజ్యమ్,
సభ్రూభఙ్గప్రహితనయనైః కామిలక్ష్యేష్వమోఘై
స్తస్యారమ్భశ్చతురవనితావిభ్రమైరేవ సిద్ధః. 12

అ. యత్ర=ఏ అలకానగరమున, మన్మథః =మదనుడు, ధన-పతి- సఖమ్=కుబేరుని మిత్రుడగు, దేవం=మహాదేవుని, సాక్షాత్ =ప్రత్యక్షముగా, వసన్తమ్= వసించువానినిగా, మత్వా =తలచి, భయాత్=భీతివలన, షట్పదజ్యమ్=తుమ్మెదలు అల్లెత్రాడు(నారి) గా కల, చాపమ్=ఇక్షుధనువును, ప్రాయః=తఱచుగా, న వహతి=ధరించుటలేదు. తస్య=ఆ యనంగునియొక్క, ఆరమ్భః=ప్రయోజనము, కామిలక్ష్యేషు=కాముకు లను లక్ష్యములందు, స-భ్రూ-భఙ్గ- ప్రహిత-నయనైః=కనుబొమల ముడిపాటుల చూపులు (క్రీగంటిచూపులు) గల, అమోఘైః=విఫలముకాని, చతుర-వనితా-విభ్రమైః=చతురవనితల విలక్షణ హావభావ విలసనములచేతనే, సిద్ధః=సిద్ధించు (నెరవేరు)చున్నది.

భా. జలదా! మన్మథుని ప్రవృత్తి నీకు తెలియనిదికాదు. అతని వృత్తి - అతని వ్యాపారము ఎడబాసిన యువతీయువకులను కామినీకాముకులను వేధించుట, కలతపెట్టుట, ఎట్టకేలకు ప్రణయినీప్రణయులను సన్నిహితుల గావించి ఒకటిగా జేర్చి అలరించుట. వేధించి యలరించి ఆనందించు టతని మానసికప్రవృత్తి అతని కది యొక వీడని యలవాటు. అతని నిరంతరకార్యక్రమ మది.

పుష్ప మతని ధనువని కొందరు, ఇక్షు(చెరకు) కాండ మతని కార్ముకము, పూవు లతని యమ్ము లని మఱికొందఱు అందురు. ఏది యేమైనను ఒకటి అతిమృదులము పేశలము, మఱియొకటి మధురము పేలవము. ఇక అల్లెత్రా డందుమా! అది చంచలషట్పదపంక్తి. భ్రమరమాల. తుమ్మెదల బారు. పటుత్వ మెక్కడిది? అస్థిరము, అతిపేలవము, చంచలము. అయిన నేమి? అత డా యల్పసాధనములతో అనల్పమగు కార్యమును సాధించుచున్నాడు. త్రిలోకములను వేధించుచున్నాడు. అకాముకులగు మౌనులు గూడ అతని బారినుండి తప్పించుకొనజాల రన్నచో కాముకుల మాట చెప్పనేల? వియోగుల పాలిట శత్రు వతడు. కాని యక్షనగరమున అతడా పుష్పధనువు ముట్టనైన ముట్టడు. ఎత్తుట ఎక్కుపెట్టుట నుడువనేల? ఏల నందువా! మహాదేవుడు కుబేరుని మిత్రుడు గదా! నివాసము కైలాసము దగ్గరనే కదా యున్నది. ముక్కంటి యనిన పుష్పధన్వునికి ప్రక్క బెదురు. ముక్కంటి కంటివేడిమికి బుగ్గియై ఎటులనో ప్రియసతి రతి మాంగళ్యమహిమచే బ్రతికి అనంగుడై బైట పడినాడు. అందుచే అతని కా భయము. యక్షరాజు మిత్రుడగుట సన్నిహితుడని భావించి వింటి చెంతకు బోడు. అయినను అతని కార్యసాధనకు లోటు లేదు. విల్లెత్తకున్న నేమి? అతని వృత్తి (కార్యసాధన) నిరాటంకముగ సాగిపోవుచునే యున్నది. కామిజనవిజయమే కదా అతని లక్ష్యము. అది యిచ్చట సులభసాధ్యమే యగుచున్నది. ఆ పురాంగనలు అపురూపసౌందర్యశోభితలు. హావభావవిలాసవైభవ సంపన్నలు. విలాస విన్యాస భాసురలు. చతురవచోనిపుణలు. వారి ఆ ఒయ్యారములు, ఓరచూపులు, హావభావవైఖరులు, ఆ కనుబొమ ముడిపాటులు, ఆ కుటిలభ్రుకుటీ కటాక్షవీక్షణములు, కార్యసిద్ధి కిప్పుడతడు చేపట్టిన సాధనములు. ఇప్పు డతని కుపకరించు సాయకములు. కుసుమకార్ముకము కంటె పటిష్ఠము లవి. ఇందు కాముకులయందు లక్ష్యత్వారోప మగుట రూపకము. మన్మథునికి షట్పదపంక్తిరూపమగు మౌర్వితో గూడిన ధనుర్ధారణసంబంధ మున్నను అసంబంధోక్తివలన అతిశయోక్తి. ఉభయమునకు అంగాంగిభావమగుట సంకరము.

అవ. కల్పతరువువలన శృంగారసామగ్రీసంపాదన వర్ణన ("కచధార్యం దేహ-ధార్యం పరిధేయం విలేపనం, చతుర్ధా భూషణం ప్రాహుః స్త్రీణాం మన్మథదైశికమ్" ఇతి రసాకరే, తదేవైతదాహ-)

శ్లో. వాసశ్చిత్రం మధు నయనయో ర్విభ్రమాదేశదక్షం
పుష్పోద్భేదం సహ కిసలయై ర్భూషణానాం వికల్పాన్,

లాక్షారాగం చరణకమలన్యాసయోగ్యం చ యస్యా
మేకః సూతే సకల మబలామణ్డనం కల్పవృక్షః. 13

అ. యస్యామ్=ఎచ్చటన అలకానగరమున, చిత్రమ్=వర్ణవైవిధ్యముగల, (రమ్యమైన) వాసః=వసనమును, నయనయోః=నేత్రములకు, విభ్రమ-ఆదేశ-దక్షమ్=విలాస ఆదేశసమర్థమగు, మధు=మధువును, కిసలయైః సహ=చిగురులతోడి, పుష్ప-ఉద్భేదమ్=ప్రస్ఫుటకుసుమములను, భూషణానామ్=ఆభరణములయొక్క, వికల్పాన్=విశేషములను, చరణ-కమల-న్యాస-యోగ్యమ్=చరణకమల రంజనయోగ్యమగు, లాక్షా-రాగం చ=లత్తుకరసమునున్ను, సకలమ్=సంపూర్ణమగు, అబలా-మణ్డనమ్=అంగనల అలంకారసామగ్రిని, ఏకః=ఒకేయొక, కల్పవృక్షః=ఈవిగ్రమాను (కల్పతరువు), సూతే=ఉత్పాదించుచున్నది.

భా. మిత్రమా! ఒకే యొక వృక్షము. అది కల్పతరువు ఈవిగ్రమాను. ఆ నగరప్రమదలకు అవసరమగు అలంకారసామగ్రినంతను సమకూర్చుచున్నది. ఎంత వింత! అలంక్రియావస్తుసంచయమునకై వారెచ్చటికిని పోనక్కరలేదు. ఎంత మాత్రమును ప్రయాసపడరు. ప్రయత్నించరు. అప్రయత్నలభ్యమగుట ప్రయాసకు తావు లేదు. సహజముగ అంగనలు భూషణప్రియలు. చెంతనే కల్పవృక్షమున్నది. కోరుట తడవుగా కావలసినది చేతి కందివచ్చును. అలంకరణ యనిన వారి కత్యంతప్రీతి. ఎక్కడలేని మక్కువ. సర్వాంగసుందరముగ అలంకరించుకొని ఒయ్యారములు ఒలకబోయుచు సింగారములు చిలకరించుచు నీలకలువల నీలినీడల కలికి చూపుల భ్రియుల నలరించి హృదయములు దోచుకొందురు. ఇంపుసొంపులతోడి మధురజీవితము వారి ధ్యేయము. వలపుపంటలు వారి సొత్తు. వారు ప్రణయలోలురు. కచధార్య (కేశాలంకరణము) దేహధార్య (భూషణాదికము) పరిధేయ (వస్త్రధారణము) విలేపనము (చందనాది రాగాదికము) అని అలంకరణము చతుర్విధ మని గదా యందురు. కురుల ముడుల దురిమెడి లేజిగుళ్ళనడుమ ప్రస్ఫుటముగ వికసించి కిలకిల నవ్వుపువ్వులు పూలమాలలు కుసుమమంజరులు చూపులకు విభ్రమవిలాసములు నేర్పు మధురమధువులు వింతరంగుల అందచందములు వెలార్చు చీనిచీనాంబరములు మణిమరీచుల దీపించు నవరత్నభూషణములు చరణకమలన్యాసయోగ్యమగు అరుణవర్ణలాక్షారసరంజనద్రవ్యము మైపూత కనువగు మధురగంధములు వెదజల్లు చందనాది అంగవిలేపనములు ఇత్యాదులన్నియు వారి కప్రయత్నలభ్యములు. సులభసాధ్యములు. వారి కవి కరతలామలకములు. కోరిన దీడేర్చుటకు ఈవిగ్రమా నచటనే వేచియున్నది. మిత్రమా! ఆ పురవనితల తీరుతెన్నులు, ఆ మగువల వన్నెచిన్నెలు, ఆ ప్రమదల పాదవిన్యాసములు ఏమని చెప్పను? వారెంతయు సిద్ధసంకల్పులు. ఆ యంగనలు కల్పతరువు జేరి

అనాయాసముగ కోరికలీడేర సర్వభూషణభూషితలై అంగదీప్తులు, హారకాంతులు అన్యోన్యము మేలమాడ అపురూపరూపవిలసనముల జెన్నొందుచు, ఒయ్యారములు చిందించుచు, హావభావములు పచరించుచు, ప్రియుల గూడి ఆ నగరవీథుల మదవతులై హాసమొలుక విలాసముగ సంచరింతురు. ఆ రమణీయ మనోహర దృశ్యమును చూడబోవు నీ వెంత ధన్యుడవు! ఆ దృశ్య మత్యంతమనోజ్ఞము. దర్శనీయము. అది యొక నేత్రపర్వము, నయనోపహార మది. ఈ యలంకారవస్తుసంచయము, అలంకరణ విలక్షణప్రక్రియ ఎంతయు మదనోద్దీపకములు. ఇందు వాసాదులు 'సూతే' అను ఒకే క్రియకు కర్మలు గాన తుల్యయోగిత. 'చరణకమలన్యాసయోగ్యమ్' అనుచోట లుప్తోపమ. ఉభయమునకు అంగాంగిభావమున సంకరాలంకారము.

అవ. స్వీయభవనవర్ణన -

శ్లో. తత్రాగారం ధనపతిగృహా నుత్తరేణాస్మదీయం
దూరాల్లక్ష్యం సురపతిధనుశ్చారుణా తోరణేన,
యస్యోపాన్తే కృతకతనయః కాన్తయా వర్ధితో మే
హస్తప్రాప్యస్తబకనమితో బాలమన్దారవృక్షః. 14

అ. తత్ర=ఆ నగరమున, ధన-పతి-గృహాన్=యక్షపతి (కుబేర) భవనసామీప్యమున, ఉత్తరేణ= ఉత్తరదిశను, సుర-పతి-ధనుః-చారుణా=ఇంద్రధనుస్సును పోలి సుందరమగు, తోరణేన=బాహ్యద్వారముచే, అస్మదీయమ్=మాదగు, ఆగారం=గృహము, దూరాత్=దూరమునుండియే, లక్ష్యమ్=గుర్తించదగును. యస్య=ఏ మా భవనముయొక్క, ఉపాన్తే=ప్రాకారాంతర్భాగమున, మే=నాయొక్క, కాన్తయా=ప్రేయసిచే, వర్ధితః=పోషింపబడినదియు, కృతక -తనయః= పెంపుడు బిడ్డగా భావించబడినదియు, హస్త-ప్రాప్య-స్తబక-నమితః=చేతినంద వీలగు పూగుత్తుల నొదిగియున్నదియు నగు, బాల-మన్దార-వృక్షః=బాలప్రాయ (లేత) మగు మందారవృక్షము, అస్తి=ఉన్నది.

భా. జలదా! మహావైభవోపేతము, జగత్ప్రసిద్ధము నగు అలకానగరము యక్షపతి కుబేరుని రాజధాని. మహోన్నతమగు రాజప్రాసాదములు రాణివాసమున కనువగు రమ్యహర్మ్యములు నీకు నేత్రోత్సవ మొనరించును. రాజభవనములు విలక్షణము లగుట గుర్తింప సులభసాధ్యములు. ఆ ప్రాసాదముల కావల అనతిదూరమున ఉత్తరదిశను మా భవనమున్నది. ఉన్నతప్రాకారపరివేష్టిత మది. తత్ప్రాసాదమునకు రమణీయశిల్పశోభితము మణిమయదీపితము నగు విశాలబహిర్ద్వారము గలదు. ఇంద్రధనువువలె మనోజ్ఞమై చూపులకు విందులు గూర్చుచున్నది.

ఆ ప్రాకారతోరణచిహ్నముల బట్టి మద్గృహ మత్యంతసులభగ్రాహ్యము. మిత్రమా! మఱియొక చిహ్నముగూడ గలదు. మద్గృహోపాంతమున ప్రాకారాంతర్భాగమును జేరి అప్పుడే యౌవనప్రాంగణమున అడుగిడిన బాలమందారవృక్ష మొకటున్నది. మత్కాంతచే అత్యంతగారాబమున పెంచి పోషించి పుత్రవాత్సల్యమున సాకబడుట నాకును అది మిక్కిలి ప్రేమాస్పదము. మత్ప్రేయసి పెంపుడు ముద్దుబిడ్డ యది. వినయవినమ్రమగు సజ్జనచిత్తమువలె గుబాళించు రమ్యమగు పూగుత్తులచే నది మిక్కిలి వినమితమై హృదయంగమ మగుచున్నది. హస్తప్రాప్య కుసుమమంజరుల నొప్పుచు నేత్రోత్సవకర మగుచున్నది. జలదా! మా ఇంటి గుర్తులవి. 'సురపతిధనుశ్చారుణా' అనుచోట లుప్తోపమ. మృగ, వృక్షములను పెంపుడు బిడ్డలుగా కాళిదాసు ఇతరత్రగూడ వర్ణించిన ఘట్టము లున్నవి.

అవ. మఱియు పఞ్చశ్లోకముల అభిజ్ఞానాంతరములు దెల్పుచున్నాడు-

శ్లో. వాపీ చాస్మిన్మరకతశిలాబద్ధసోపానమార్గా
హైమైశ్ఛన్నా వికచకమలైః స్నిగ్ధవైదూర్యనాళైః,
యస్యాస్తోయే కృతవసతయో మానసం సన్నికృష్టం
నాధ్యాస్యన్తి వ్యపగతశుచ స్త్వామపి ప్రేక్ష్య హంసాః. 15

అ. అస్మిన్=ఈ భవన ఆవరణమున, మరకత-శిలా-బద్ధ-సోపాన-మార్గా=మరకతమణులు పొదిగిన సోపానమార్గము కలదియు, స్నిగ్ధ-వైదూర్య-నాళైః=దీప్తిమంతమైన పగడపు నాళములు గలవియు నగు, హైమైః=స్వర్ణవికారమగు, వికచ-కమలైః=వికసించిన పద్మములతో, ఛన్నా=నిండినదియు నగు, వాపీ=దిగుడుబావియు, అస్తి=కలదు, యస్యాః=ఏ బావియొక్క, తోయే=నీటియందు, కృత-వసతయః=ఏర్పరుపబడిన వసతులు గల, హంసాః=మరాళములు, త్వామ్=నిన్ను, ప్రేక్ష్య అపి=చూచియు, వ్యపగత-శుచః=తొలగిన విచారము కలవై, సన్నికృష్టమ్ అపి=సమీపమందలిదైనను, మానసం=మానససరోవరమును, న అధ్యాస్యన్తి=చేరవు. స్మరించనైన స్మరించవు.

భా. మిత్రమా! మద్భవనము సులభగ్రాహ్యమైనదైనను, అన్యచిహ్నములుగూడ వివరింతును. మద్గృహప్రాకారాన్తర్భాగమున దీర్ఘిక యొక టున్నది. ఆ దిగుడుబావికి గరుడపచ్చలు పొదిగిన రమ్యమగు సోపానమార్గము (మెట్లవరుస) ఒకటి గలదు. దిగుట కనువగు చక్కని మెట్లబాట. అందు స్వర్ణకమలములు నిండియుండును. అవి మేలిమి మిసమిసలు చిమ్ముచుండును. పగడపు నాళములు మిలమిల మెరయుచుండును. తీయని తావులు! పసిమికాంతులు! పూర్ణవికాసములు! ఎంత రమణీయశోభ యది! తమ్మి పూవులు కొలనుయం దంతటను అలముకొని ఒక యపూర్వవిలక్షణ రమణీయసౌందర్యమును సమకూర్చుచున్నవి. ఎంత

కమనీయమనోహరదృశ్య మది? జలదా! స్వగృహ మగుట ఇంచుక సంకోచించుచునే యథార్థమును వాక్రుచ్చితిని. అన్యథా భావించకుము సుమా! ఒక యపూర్వశోభారమణి ముద్దులు మూటగట్ట ముగ్ధమోహనముగ ఆ కొలనునందు నృత్య మొనరించుచున్నదా! అని యనిపించును. ఆ కొలను సౌందర్య సౌరభ సౌభాగ్యము లట్టివి. ఇక నీ రాకతో జలములు కలకబారు నను భీతిచే హంసలు ఎటనున్నను మానసమునకు తరలిపోవుట నీకు విదితమే గదా! వర్షాగమప్రభావ మది. ఇచ్చ టా భయము లేదు. వాటి కా చింత లేదు. మా కొలను జలములు సజ్జనచిత్తము భాతి నిత్యనిర్మలములు. ప్రశాంతప్రసన్నములు. సదా నిర్మలము లగుట ఆ తేటనీటిని వసతు లేర్పరచుకొని నీ రాక గుర్తించియు, నిన్ను వీక్షించియు ఆ మరాళములు మఱెచటికిని బోవు. మానసము మరాళములకు పుట్టిని ల్లందురు. అది దగ్గరున్నను అవి ఆవంకకు బోవ నుద్యమించవు. ఆ మానసమును తలపనైన తలపవు. వర్షఋతువున జలములు కలకబార హంసలు ప్రసన్నసలిలభాసురమగు మానసమునకు తరలిపోవుట సుప్రసిద్ధము. ఇందు విశేషోక్తి, ఉదాత్తము అంగాంగి భావమగుట సంకరము.

*అవ. వాపీసమీపమందలి క్రీడాశైలవర్ణన-*

శ్లో. తస్యాస్తీరే రచితశిఖరః పేశలై రిన్ద్రనీలైః
క్రీడాశైలః కనకకదళీవేష్టనప్రేక్షణీయః,
మద్గేహిన్యాః ప్రియ ఇతి సఖే చేతసా కాతరేణ
ప్రేక్ష్యోపాన్తస్ఫురితతడితం త్వాం తమేవ స్మరామి. 16

అ. తస్యాః=ఆ బావియొక్క, తీరే=ఒడ్డున, పేశలైః=నిర్మల మైన, ఇన్ద్రనీలైః=ఇంద్రనీలమణులచే, రచిత-శిఖరః=పొదగబడిన శిఖరము గలదియు, కనక-కదళీ-వేష్టన-ప్రేక్షణీయః=స్వర్ణవర్ణమగు కదళీ (అరటి) పరివేష్టన (ఆవరణ)మున చూడ ముచ్చటైనదియు నగు, క్రీడా-శైలః=విహారయోగ్యమగు పర్వతము, అస్తి=ఉన్నది. హే సఖే=ఓ మిత్రమా! ఉపాన్త-స్ఫురిత-తడితః=పార్శ్వముల విద్యుద్విలసితుడ వగు (మెఱుపుమిలమిలలు గల) త్వామ్=నిన్ను, ప్రేక్ష్య=వీక్షించి, మద్గేహిన్యాః=మత్ప్రేయసికి, ప్రియః ఇతి=ప్రియమైన దని, తమ్ ఏవ=క్రీడాశైలమునుగా, కాతరేణ=భీతితో కూడిన, చేతసా=మనస్సుతో, స్మరామి=స్మరింతును.

భా. మిత్రమా! ఆ కొలను యొడ్డున విహారయోగ్యమగు నొక కొండ గలదు. ఆ శైలశిఖరము ప్రసన్ననీలమణిదీప్తుల వెలుగొందుచు కన్నులకు విందు లొనరించుచుండును. ఇక దాని పార్శ్వము లన్ననో కనకకదళీపరివేష్టనమున

కలకలలాడుచున్నవి. మేలిమి యరటుల వలయ మది. వినోదమునకు, విలాసవైభవమునకు అనువగు హంగులన్నియు గల వచ్చట. ఉబుసుపోకకు ఉల్లాసమునకు శ్రమాపనయమునకు మత్ప్రియసతి అప్పుడప్పు డా చలువలమల నధివసించి విశ్రాంతి నందును. మనసుకు హాయి నింపును. ఆ నగ మనిన ఆమె కత్యంతప్రీతి. జలదా! నీలవర్ణసౌరులు నింపుకొని విద్యుల్లతాదీప్తుల వెలుగొందు నీ రూప మన్నివిధముల ఆ గిరిని పోలియున్నది. నీ విద్యుత్తు, మెఱుపు ఆ కనకకదళీపరివేష్టనమును దలపించుచున్నది. ఇంద్రనీలముల కాంతి యున్ననో! అది నీ నీలవర్ణమునకు దీటువచ్చును. ప్రఫుల్లవిద్యుల్లతా విలసితుడ వగు నీకును, కనకకదళీపరివేష్టనమున శోభాయమానమగు ఆ క్రీడాశైలమునకును సన్నిహిత సాదృశ్యము గోచరించును. దగ్గర పోలిక! ఉపాంతస్ఫురితతడితంబగు నిన్ను వీక్షింప ఆ గిరి స్ఫురణకు వచ్చుచున్నది. తలపున మెదలుచున్నది. నా ప్రేయసి కది అత్యంతమోదదాయకము. ప్రేమాస్పదము. కనుకనే భీతభీతుడనై నిన్ను వీక్షింప వెఱతును. వీక్షించి చకితచిత్తుడనై దానినే స్మరింతును. స్మృతిపథమున అదియే మెదలుచుండ హృదయము కలత చెందును. ఇందలంకారము స్మరణము. "సదృశానుభవాద్వస్తుస్మృతిః స్మరణ ముచ్యతే" ఇతి.

అవ. అశోక-వకుళవృక్ష వర్ణన-

శ్లో. రక్తాశోకశ్చలకిసలయః కేసరశ్చాత్ర కాన్తః
ప్రత్యాసన్నౌ కురవకవృతే ర్మాధవీమణ్డపస్య,
ఏకః సఖ్యాస్తవ సహ మయా వామపాదాభిలాషీ
కాంక్షత్యన్యో వదనమదిరాం దోహదచ్ఛద్మనాఽస్యాః. 17

అ. అత్ర=ఆ క్రీడాశైలమందు, కురవక-వృతేః=ఎఱ్ఱగోరింట ఆవరణము గల, మాధవీమణ్డపస్య=గురివిందమండపమునకు, ప్రత్యాసన్నౌ=సామీప్యమున గల, చల-కిసలయః=కదలియాడెడు చిగురుటాకులు గల, రక్త-అశోకః=అరుణవర్ణ మగు అశోకవృక్షము, కాన్తః=మనోహరమగు, కేసరః=పొగడచెట్టును, స్తః=కలవు. ఏకః=వాటిలో నొకటి యగు రక్తాశోకము, మయా సహ=నాతో పాటు, తవ=నీయొక్క, సఖ్యాః=నెచ్చెలి(నాప్రియసి)యొక్క, వామ-పాద-అభిలాషీ=వామపాదతాడనసుఖ మభిలషించుచున్నది. అన్యః=రెండవదగు పొగడ తరువు, దోహద-ఛద్మనా=దోహద (పోషణ) క్రియ యను నెపమున, అస్యాః=ఈ నాప్రియురాలియొక్క, వదన-మదిరామ్=పుక్కిటి మదిర(మధువు)ను, కాంక్షతి=కాంక్షించుచున్నది.

భా. మిత్రమా! మద్భవనసామీప్యమున ఒక దీర్ఘిక! దాని కొక

మరకతమణిమయసోపానమార్గము! ఆ వాపీతీరమున ఒక క్రీడాశైలము! నిర్మల నీలమణిమరీచుల వెలుగొందు తచ్ఛిఖరము! ఆ విహారాద్రి కిరువైపుల విద్యుత్కాంతులు విరజిమ్ము కనకకదళీపరివేష్టనము! రక్తగోరింట యావరణమున మాధవీమండపము! తత్సామీప్యమున రక్తాశోకకేసరవృక్షములు! ఎంత మనోహర దృశ్యమది! ఎంత రమ్యమగు వైభవము ! ఇవ్విధమున మా సుఖసౌఖ్యములకు ప్రేమానురాగభోగభాగ్యములకు అనువగు హంగు లన్నియు గల వచ్చట. ఆ మీదట అన్ని యనుభవములు, మధురస్వప్నములు, తీయని కోరికలు తీరుట కనువగు లేబ్రాయము! అయిన నేమి? విధి వక్రించినది. చేసిన తప్పిదమునకు శిక్ష యనుభవించుట తప్పునా? హతభాగ్యుడను. విధివంచితుడను. జలదా! మా జీవిత మెంతయు భవదధీనము. శీఘ్రగతిని నిరాలస్యముగ మత్సందేశము గొనిపొమ్మని ప్రార్థింతును. మిత్రమా! మద్గేహమున కితరచిహ్నములు గూడ కలవు. ఆ క్రీడాద్రిని కురవకములు ఎఱ్ఱగోరింటలు విరివిగా నున్నవి. ఆ కంచె ఎంత రమ్యమైనది! కెంపురంగుల తోరణ మది. ఎంత మనోహరము! అందొక మాధవీ లతామండపము! విచ్చలవిడిగ వికసించిన ధవళకుసుమముల నొప్పుచున్నది. ఎఱ్ఱ గోరింట పూవులు! ప్రస్ఫుటధవళ మాధవీలతాకుసుమములు! వాటి కలయిక ఎంత మనోరంజకము! ఆ ప్రక్కనే యున్నవి ఒకటి చపలకిసలయముల రక్తాశోకము. మఱియొకటి సొగసు లొలికించు కేసరవృక్షము, పొగడచెట్టు. చిరుగాలి పిల్లకెరటముల నూగులాడు కెంపురంగుల చిగురుటాకుల ముచ్చటలు వెలార్చు అశోకము, మధురపరిమళములు విరజిమ్ము ముదురుమొగ్గల పొగడయు ముద్దులు గొల్పుచున్నవి. మోదము గూర్చుచున్నవి. ఎంత మనోహరము! నాట్యమాడెడి చిగురుటాకుల సొబగులకు తీపుల పొగడపూవుల మురిపెములకు పోలిక లెక్కడ! అవి రెండును మదనోద్దీపకములు. మిత్రమా! దోహద మను మాటయే కాని (అదియొక మిష మాత్రమే) ఉభయము నాతో పంతము లాడుచున్నవి. అందొకటి అశోకము. నాతోపాటు నీ చెలి (నాప్రియ) చరణకమల తాడనముల కువ్విళ్ళూరుచున్నది. రెండవది పొగడ, గండూష (పుక్కిట) మదిర (మధువు)కై తహతహలాడుచున్నది. ఇరువురమును మత్ప్రేయసి యనుగ్రహమునకై అఱ్ఱులు చాచుచున్నాము. ఆ కాలమున తరులతాగుల్మములు పుష్పించుటకు కుశలురచే జరిపించబడు ప్రక్రియ వృక్షదోహదక్రియ యనబడును. అంగనల లలితసుకుమార పాదతాడనముల అశోకము, గండూష మధుసేకమున పొగడయు పుష్పించునని ప్రసిద్ధి. ఇందలంకారము సహోక్తి.

అవ. మయూరయష్టివర్ణన-

శ్లో. తన్మధ్యే చ స్ఫటికఫలకా కాఞ్చనీ వాసయష్టి
ర్మూలే బద్ధా మణిభి రనతిప్రౌఢవంశప్రకాశైః,

తాలైః శిఞ్జావలయసుభగైర్నర్తితః కాన్తయా మే
యా మధ్యాస్తే దివసవిగమే నీలకణ్ఠః సుహృద్వః. 18

అ. కించ=మఱియు నో జలదా! తన్మధ్యే =ఆ యశోకకేసరవృక్షముల నడుమను, అనతి-ప్రౌఢ-వంశ-ప్రకాశైః=ముదురులేతలుగాని (ప్రౌఢ వయస్సుకు ముందైన) వెదురుఛాయవంటి ఛాయ గల, మణిభిః=పచ్చలచేత, మూలే=మూల మందు, బద్ధా=నిర్మించబడినదియు, స్ఫటిక- ఫలకా=స్ఫటికమయమగు (పాలరాతి) పీఠము గలదియు నగు, కాఞ్చనీ=స్వర్ణవికారమైన, వాస-యష్టిః=నివాసయోగ్యమగు స్తంభము, అస్తి=కలదు. శిఞ్జావలయ-సుభగైః=శిఞ్జితధ్వనితోడి హస్తకంకణ ములచే రమ్యమగు, తాలైః=లయబద్ధమగు కరతలధ్వనులచేత, మే=నాయొక్క, కాన్తయా=ప్రియతమచే, నర్తితః=నర్తన మొనరింపబడు, వః సుహృత్=భవన్మిత్రము, నీలకణ్ఠః=మయూరము, దివస-విగమే=దినాంతమున, యామ్=ఏ వాసయష్టిని, అధ్యాస్తే=అధివసించునో.

భా. జలదా! పచ్చని సంసారము మాది. మూడుపూవులు ఆరుకాయలుగా మా జీవితము ఆనందమయమై ముందుకు సాగినది. నిమ్నోన్నతము లెఱుగని ప్రణయజీవితము మాది. కర్మచారుడ నైనను సుఖసంతోషములకు, ఆనందమునకు ఆటంకము లెఱుగము. నిత్యనూతన నవయౌవనుల మగుట కోరికలు ముప్పిరిగొన ఆటంకము లెఱుగని ఆనందమయజీవితము మాది. ఎడబా టెఱుంగని ప్రేమైకజీవులము మేము. విధివైపరీత్యమున ఇంతలో నింత ఆయెను. అంతగా చేయని నేరమునకు ఇంతటి కఠినమగు శిక్ష! అశనిపాతమువంటి ఆజ్ఞ! ఎడబాటు (వియోగము) తప్పనిదాయె. మిత్రమా! ఆమె విదుషి, గానకోకిల, చిత్రలేఖనమున సిద్ధహస్త, నృత్యమం దామె పరిణత, లలితకళలయం దామె నిష్ణాత. అం దామె యుత్సాహ మట్టిది! అవును! మిత్రమా! సాహిత్యసౌరభమునకు గానమాధుర్యమునకు ముగ్ధు లయి హాయి నొంది ఆనందపారవశ్యమున తలలూచనివా రెవరు? కనుకనే "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ" అన్నారు. రంగుల మేలికలయికచే జీవకళ యుట్టిపడు రమ్యమగు చిత్తరువును తిలకించి ముగ్ధులు కానివా రుందురా? లయబద్ధమగు కమనీయనృత్యభంగిమలను నయనానందకరముగ వీక్షించి తన్మయత్వము నొందనివా రెవరుందురు? జలదా! ఈ వియోగమున ఆమెకు తోడు మా గృహమయూరము, నాకు తోడు నీవు. చంచలకిసలయశోభితమగు అశోకము, ప్రస్ఫుటకోరకపరిమళప్రపూర్ణమగు పొగడ వాటినడుమ వాసయష్టి (వాసయోగ్యమగు స్తంభము). అదియు స్వర్ణవికారము. దాని యధోభాగమున వేదిక. అనతిప్రౌఢ వేణువర్ణసదృశమగు మరకతమణిదీప్తులచే నది అత్యంతమనోజ్ఞము. ఉపరిభాగమున విశదకాంతుల నొప్పు స్ఫటికశిలా (పాలరాతి) ఫలక మున్నది. మిత్రమా! మూలమున

ంరకతద్యుతులు! మధ్యను స్వర్ణకాంతులు! మీదను స్ఫటికశిలావిశదరుచులు! ఃవాసయష్టి తీరువది. అదియే మా పెంపుడునెమలి వసతి. ఎంత మనోజ్ఞము ఃలదా! మా గృహమయూరము నృత్యమున గడుసరి, ఎచట నేర్చిన దా ంద్య? నా ప్రియతమ, యుష్మత్సఖి వినోదార్థము దాని కా విద్య నేర్పినది. ఃది శ్రద్ధతో నేర్చినది. అనుదినము సాయంసమయమున మత్ప్రేయసి కమనీయ ంరకంకణ శింజితధ్వనులు చెలరేగ, కరతాడనములు తాళమానములు గొలుప, ముగ్ధమోహనముగ నృత్య మొనరించి అలసి సొలసి సాయంసమయమున ఃవన్మిత్రము ఆ మయూరము ఆ యష్టిపీఠమున అధివసించి విశ్రమించును. ఃక్షిత మన భూషణధ్వని. ఇందు సమృద్ధవస్తువర్ణనమున ఉదాత్తము. ఃనతిప్రౌఢవంశప్రకాశైః అనుచోట లుప్తోపమ. ఉభయమునకు అంగాంగిభావమున ంంకరాలంకారము.

అవ. కాంతిహీనమగు యక్షుని గృహవర్ణన-

శ్లో. ఏభిః సాధో హృదయనిహితైర్లక్షణై ర్లక్షయేథాః
ద్వారోపాన్తే లిఖితవపుషౌ శఙ్ఖపద్మౌ చ దృష్ట్వా,
క్షామచ్ఛాయం భవనమధునా మద్వియోగేన నూనం
సూర్యాపాయే న ఖలు కమలం పుష్యతి స్వామభిఖ్యామ్. 19

అ. హే సాధో!=ఓ సజ్జనా!, హృదయ-నిహితైః=హృదయమందు పదిలపఱచిన, ఏభిః=ఈ చెప్పబడిన, లక్షణైః=తోరణాదిచిహ్నములచేత, ద్వార-ఉపాన్తే=ద్వారమున కిఱువైపుల, లిఖిత-వపుషౌ=చిత్రీకరించబడిన, శఙ్ఖ-పద్మౌ చ=శంఖము పద్మము అను కుబేరనిధులను, దృష్ట్వా=చూచి, నూనమ్=నిశ్చయముగా, అధునా=ఇప్పుడు, మద్వియోగేన=నా యెడబాటుచేత, క్షామ-చ్ఛాయమ్=క్షీణకాంతి గల, భవనమ్=మద్గృహమును, లక్షయేథాః=గుర్తించెదవు. అవును! సూర్య- అపాయే=సూర్యాస్తమయమున, కమలమ్=పద్మము, స్వామ్=స్వకీయమగు, అభిఖ్యామ్=శోభను, న పుష్యతి ఖలు=పోషించదు కదా!

భా. జలదా! జీవ (ఉదక) దానమున జీవు లన్నిటికి జీవమిచ్చు ఉదారాశయుడ వని వినుతి కెక్కితివి. క్షారజలముల జలనిధు లెన్ని యున్నను దప్పిగొన్న వాని కవి ఉపకరించవు గదా! వాటివలన దప్పి తగ్గునా? నీవు లేకున్న తేటనీ రెక్కడిది? ఇక జీవకోటికి బ్రతుకెక్కడ! ధన్యుడవు, ధర్మచరితుడవు, సజ్జనుడవు, నేర్పరివి. జలదా! ఇక నా సంగతి వినుము. నిత్యనూతనము పచ్చతోరణముగ సదా కలకలలాడెడి మద్గృహ మిప్పుడు పసచెడి కాంతివిహీనమై వెలవెలబోవుచున్నది. వన్నెచిన్నె లొలికించు మా సదన మిప్పుడు

చిన్నవోయినది. మిత్రమా! సూర్యుడు లేని పద్మమునకు శోభ యెక్కడిది? ఇను డస్తమించ కాంతి చెడి కమలము ముకుళించునట్లు గృహపతి లేని గృహము కళావిహీన మగును. దానికి శోభయుండునా? సుహృత్కార్యసాధన దీక్షాపరుడవు. దక్షుడవు. ఉదారచరితుడవు. వియోగుల నొకటిగా జేర్చ సమర్థుడవు. మత్సందేశమును హృదయమున పదిలపఱచుము. మఱువకుందువని ఆశింతును. తోరణ, మందార, వాపీ, క్రీడాశైల, కనక కదళీ, అశోక, కేసర, వాసయష్ట్యాదిమద్గృహచిహ్నము లన్నియు నుడివితిని గదా! అవన్నియు నీ స్మృతిపథమున మెదలుచున్నవని భావింతును. జలదా! మఱియు మా భవనద్వార పార్శ్వముల యక్షపతి కుబేరుని శంఖపద్మనిధుల రూపముగూడ చిత్రించబడినది. మిత్రమా! మదుక్తములగు ఆ యా చిహ్నము (గుర్తు) లు వీక్షించి మద్భవనమును నీవు సులభముగ గుర్తించగలవు. (మహాపద్మశ్చ పద్మశ్చ శఙ్ఖో మకరకచ్ఛపౌ, ముకుందకుందనీలాశ్చ ఖరశ్చ నిధయో నవ) ఇవి నవనిధులుగా చెప్పబడినవి. ఇం దలంకారము దృష్టాంతము. లక్షణము 'దృష్టాంతస్తు సధర్మస్య వస్తునః ప్రతిబింబనమ్' అని సాహిత్యదర్పణము.

అవ. గృహనిశ్చయానంతరకర్తవ్యబోధ-

శ్లో. గత్వా సద్యః కలభతనుతాం శీఘ్రసంపాతహేతోః
క్రీడాశైలే ప్రథమకథితే రమ్యసానౌ నిషణ్ణః,
అర్హస్యన్తర్భవనపతితాం కర్తు మల్పాల్పభాసం
ఖద్యోతాలీవిలసితనిభాం విద్యుదున్మేషదృష్టిమ్. 20

అ. శీఘ్ర-సంపాత-హేతోః=త్వరితగతిని దిగుటకు, సద్యః=వెంటనే, కలభ-తనుతామ్=ఏనుగుగున్న దేహమువంటి సూక్ష్మదేహత్వమును, గత్వా=పొంది, ప్రథమ-కథితే=ముందుగనే జెప్పిన, రమ్య-సానౌ=అనువైన సమతలముగల, క్రీడాశైలే=ఆ రామగిరియందు, నిషణ్ణః సన్=ఆసీనుడవై, అల్ప-అల్ప-భాసమ్=అల్పాల్పమగు కాంతిగల, విద్యుత్-ఉన్మేష-దృష్టిమ్=విద్యు (మెఱుపు) ద్రూపమగు దృష్టిని, అన్తః- భవన-పతితామ్=భవన అంతర్భాగమున పడునట్లుగా, కర్తుమ్=చేయుటకు, అర్హసి=అర్హుడవు.

భా. జలదా! నీవు మహోన్నతుడవు. ఆకాశమునంటి సంచరింతువు. స్థూలకాయుడవు. మద్గృహ మంత విశాలమైనదికాదు. నీవం దెట్లు ప్రవేశించగలవు? రూపము నీ ఇచ్ఛాధీనము గదా! నీవు కామరూపుడవు. ఏ రూపమునైన ధరించగలవు. ఇచ్ఛాధీనరూపుడ వగుట మద్గృహప్రవేశమున కనువగు కరికలభ (ఏనుగుగున్న) శరీరసదృశమగు సూక్ష్మరూపమును గ్రహించుము. ప్రవేశమున

కది అనువైన రూపము జలదా! మద్గృహవాపీతీరమున క్రీడాశైల మున్నదని వింటివి గదా! తత్సాను వత్యంతరమణీయము. ఆకసమునుండి భువికి నీ వవతరించుట కా గిరిశిఖరసమతల మెంతయు తగియున్నది. ఆ సుందరమగు సానువునం దుపవిష్టుడవు కమ్ము. ప్రయాణమున అలసియుందువు. అం దించుక విశ్రాంతి గొనుము. కార్యసాధన కాటంకముకాని ఆరామము! విరామము! జలదా! నీది విద్యుదున్మేషదృష్టిగదా! మెఱుపుచూపు. అత్యంత ఉజ్జ్వల మది. తీక్ష్ణమైనది. చూపరులకు మిరుమిట్లు గొలుపునది. భీతిహేతు వది. కాన అల్పాల్పముగ మిణుకుమిణు కనుచు మిణుగురుల కాంతిరేఖాసదృశముగ భవద్దృష్టిని మద్గృహాంతర్భాగమున ప్రసరింపజేయును. అట్లు చేయుటకు నీవెంతయు సమర్థుడవు. అంతట నీ కంతయు నవగతమగును. ఏదైన కించి దన్వేషించునతడు ఉన్నతస్థల మధిరోహించి అల్లనల్లన మెల్లగా సూక్ష్మదృష్టి నిష్టప్రదేశమున ప్రసరింపజేసి ఇష్టార్థము నన్వేషించునని ధ్వనించుచున్నది. ఇందు (కలభతనుతాం) అనుచోట లుప్తోపమ. ఖద్యోతాలీవిలసితనిభాం అనుచోట ఉపమ, విద్యదున్మేషదృష్టిం అనుచోట రూపకము అలంకారములు. ఇవి అంగాంగిభావమున సంకరాలంకారము.

అవ. యక్షుని ప్రియతమ యగు యక్షిణి రూపచిత్రణము -

శ్లో. తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబిమ్బాధరోష్ఠీ
మధ్యే క్షామా చకితహరిణీప్రేక్షణా నిమ్ననాభిః,
శ్రోణీభారా దలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్ర స్యాద్యువతివిషయే సృష్టిరాద్యేవ ధాతుః. 21

అ. తన్వీ=స్థూలము సూక్ష్మము గాక చక్కని అంగసౌష్ఠవము గలది, శ్యామా=యౌవనమధ్యస్థ (యౌవనమున సగ మదుగిడినది)యు, శిఖరి-దశనా=కొన లుదేరి చక్కని అమటిక గలిగిన పలువరుసగలదియు, పక్వ-బిమ్బ- అధర-ఓష్ఠీ=పండిన దొండపండును బోలి అరుణవర్ణమగు అధరోష్ఠము (క్రింది పెదవి) గలదియు, మధ్యే=మధ్యము (నడుము)న, కృశా=కృశత్వము (అల్పత్వము)గలదియు, చకిత-హరిణీ-ప్రేక్షణా=భీతిచెందిన హరిణి (ఆడులేడి)యొక్క బెదరుచూపుల బోలిన చూపులు గలదియు, నిమ్న-నాభిః=లోతు పొక్కిలిగలదియు, శ్రోణీభారాత్=పిరుదుల భారమువలన, అలస-గమనా=మందగామినియు, స్తనాభ్యామ్=కుచముల బరువుచే, స్తోక-నమ్రా=ఇంచుక అవనతయు, యువతి-విషయే=యువతుల(అంగనల) విషయమున, ధాతుః=సృష్టికర్తయగు(బ్రహ్మయొక్క), ఆద్యా=మొదటిదగు, సృష్టిః ఇవ=రచన (శిల్పము) వలె, యా=ఏ యువతి (లలన), తత్ర=ఆ మా గేహమున, స్యాత్=ఉండునో ఆమెయే నా ప్రేయసి యని గుర్తింపుము.

భా. మిత్రమా! సతిరూపమును పతి వర్ణించు టెందైన గలదా! అట్లు వర్ణించు టుచితమా! అదెంత విలువ. ఎంత అసంగతవిషయము. అయినను తప్పదు. కానిచో నీవు గుర్తించుటెట్లు? అభాగ్యుడను. విధివంచితుడను. దుర్విధి ఇంతింతలుగా మమ్మెడబాపి పచ్చని మా సంసారమున చిచ్చులు రగిల్చినది. పండువంటి మా నిండు జీవితమున నిప్పులు చెరిగి మంటలు రేపినది. యక్షరాజు కొలువున్నను మా సుఖశాంతులకుగాని ఆనందమునకుగాని ఆటంక మెన్నడును కలుగలేదు. ప్రమాద మెఱుగని ప్రణయజీవితము మాది. అలసట లెరుంగని వలపులు మావి. వలపు కూరిమి వెచ్చదనమున మసలితిమి. మమతలు చెలరేగ అంతులేని భోగము లనుభవించితిమి. చింతలేని జీవితము మాది. ఇంతలో వింత అయ్యె. ఏమి చెప్పను! ఎంత మార్పు! ఎంత దోసమాయె! ఓర్వలేమి విధి వక్రించినది. భోగము లంతరించినవి. ప్రణయైకజీవుల మగుట మమతలు చెలరేగ మైమరచి సంచరించినమాట నిజము. అంతకు ఇంత శిక్షయా! మే మొనరించిన పాప మట్టిదా! ఇంతటి కాఠిన్యమా! ఇంత శాపమా! ఏమి సబబు! వలపు తీపుల అంచుల సంచరించు మా కెంతటి యెడబాటు! ఎట్లు భరించగలము? జలదా! నా ప్రేయసి రూపమెట్టిదో ఇంచుక వివరింతును. సావధానముగ ఆలకించుము. చక్కని దేహపుష్టి. చిక్కని అంగసౌష్ఠవము. బంగారుఛాయ. ఆమె స్థూలమూ గాదు, అంతగా సూక్ష్మమూ గాదు. సమతూకమున అందమగు అంగముల పొందిక గలిగి అపురూపసౌందర్యమున దీపించు పదారువన్నె పుత్తడిబొమ్మ యామె. చైతన్యవిలసిత సౌవర్ణమూర్తి. సౌదామిని. ఆమె యౌవనమధ్యస్థ. ఎలప్రాయపు టెలనాగ యామె. లేప్రాయపు అంచులు మీటిన పూబోడి. యౌవన ప్రాంగణమున బాగుగా కాలూనిన పడతి యామె. గడుసు వయసు సుందరాంగి. ఆమె సుదతి. చక్కని పలువరుస. ఆమె దంతములు సమతూకమున ఒకటి నొకటి అంటియుండి సమములు, స్నిగ్ధములు, పటిష్ఠములునై అమఱిక గల దాడిమ గింజల వరుసను తలపించుచున్నది. ముద్దులొలుకు మల్లెమొగ్గలవలె కొనలుదేరి విశదమై ఆమె దంతములు (పలువరుస) వెన్నెలలు వెలార్చుచు పుచ్చపూవులనవ్వులు చిలుకుచున్నవి. ఇక ఆమె యధరోష్ఠమన్ననో పండిన దొండపండు రక్తిమను అధఃకరించుచున్నది. ఆ వాతెర బింబఫలము నెత్తిపై నెక్కి వెక్కిరించుచున్నది. దాని రక్తిమ అట్టిది! ఆమె యధరోష్ఠపు తీరుతీయము లట్టివి. ఇక ఆమె మధ్యము (నడుము)మాటయా! ఉన్నది లేదు అను శంకకు నెడమిచ్చుచు కార్శ్యత్వమున అంతంతమాత్రముగ పిడికిలిలో నగుచున్నదా యనిపించును. ఆమె నడుము తీరుతెన్నులు అందచందములు అట్టివి. జలదా! నీవెరుగుదువుగదా! హరిణవీక్షణము లత్యంతచపలములని. ఇక హరిణి (ఆడలేడి) వీక్షణముల మాట చెప్పనేల? అంతకంటె చపలము లవి. ఆపైని భీతిజెందిన హరిణీవీక్షణము లెట్లుండును! బొత్తిగా నిలకడలేని

ఆ బెదరుచూపు లత్యంత మనోరంజకములు. ఆమె చూపుల మాధుర్యములు సొబగులు సొగసులు అట్టివి. ఇక పొక్కిలితీ రెట్టిదన ఆమె నాభి గహనమైనది. అది లోతు పొక్కిలి. మదనరసాతిప్రేరక మది. ముచ్చట గొలుపు సుందరనాభి. "నారీణాం నాభిగామ్భీర్యా న్మదనరసాతిరేక" ఇతి కామసూత్రార్థః సూచ్యతే. ఆమె గమన మందువా! అది యొక వింతనడక. విలక్షణమగు మందగమనము. ఊగుచు తూగుచు అల్లనల్లన అడుగు లిడుచు అడుగడుగున అందములు చిందించుచు మురిపెములు ముచ్చటలు గుమ్మరించు నడక యామెది. అది జంఘాదోషమున కాదు. వెడదపిరుదుల భార మది. కనుకనే ఆమె అలసగమన. గజగామిని. అంచయాన. ఆమె ఇంచుక అవనత. మేని దోషమున గాదు. వలుద కుచముల బరువు. గబ్బిగుబ్బలాయె. బక్కచిక్కిన నడుము అంతభార మెట్లు మోయగలదు! కనుకనే ఆమె ఆ కుచభారమున ఇంచుక అవనత. ఆమె కృశోదరి. మిత్రమా! శబ్దచిత్రణము గానిమ్ము. శిలాశిల్పవిశేష మగుగాక. వర్ణచిత్రమైనను గానిమ్ము. ఏదియైనను ముందుగా హృదయఫలకమున రూపుదాల్పవలె. ఆ మీదటగదా అది ప్రస్ఫుటముగ వెలుగొందుట! మురిపెములు మూటగట్టుట! ముచ్చటలు వెలార్చుట! నీకు తెలియును. అఘటనఘటనాసమర్థుడగు విధాత ప్రతిభాప్రభావముల ప్రభుత. అతని యపురూపనిర్మాణకౌశలము! సృష్టివైవిధ్యముతోడి విలక్షణచిత్రణము అతని రచనావిలాసవైఖరి. జలదా! స్రష్ట తన సృజనాసామర్థ్యమును, నైపుణ్యమును పణముగా నొడ్డి తన నేరిమి కూరిమి నంతయు అందు పొందుపఱచి వనితాసృష్టికి ఒరవడిగా తీర్చి దిద్ది రూపొందించిన ఉత్తమసృష్టియా ఆమె అనిపించుచున్నది. ఆమె అపురూపమగు స్వర్ణప్రతిమ, చైతన్యవిలసిత రమ్యశిల్పము, రంగులపొందిక మేళవింపున వింతరూపు దాల్చిన అచ్చెరువు గొలుపు ముచ్చట యగు చిత్తరువు. వలపు తీపుల ముద్దుగుమ్మ యామె. ఆమె యొక వింతసొబగుల సంతరింపు, కుందనపుబొమ్మ. అమృతపు చినుకు లొలికించు మధురవీణ. సుకవి పలుకుల తొణికిసలాడెడి సుధ యామె. రమణీయమగు చందనశిల్పము. అమృతస్రవంతి. మిరుమిట్లు గొలుపు మెరుపుతీగ యామె. మధురపరిమళములు వెదజల్లు మాలతీలత, మధురకవిత యామె. మిత్రమా! వేయేల? తమ్మిరేకుల మించిన ఆ కనులతీరు! చిలుకముక్కును పరిహసించు నామె నాసికపు సొరు! చలువ వెన్నెలలు చిలకరించు అర్ధచంద్రుని అధఃకరించు ఆమె విశదవదనము! శంఖమును బోలు ఆమె శ్రవణదీప్తులు! భ్రమరకాంతుల కిమ్మననీని ఆమె శిరోజముల నీలరుచులు! మధురనాదము లొలికించు ఆమె కంబుకంఠము! అమృతపు చినుకులు మేళవించి చిలుకపలుకులు పచరించు ఆమె జిహ్వ! గువ్వల జంటబోలి ఎడమెరుగక కలసియుండు ఆమె వలుదకుచములు! అందములు చిలకరించు ఆమె లోతు పొక్కిలి! వెడదపిరుదులు! కదళీతరువుల ధిక్కరించు ఆమె

యూరువులు! పద్మసౌరులు పుణికిపుచ్చుకొన్న ఆమె పదముల తీరుతెన్నులు! ఏమి చెప్పను? ఆమెసర్వకళాసమ్మిళిత దివ్యసుందరస్వరూపిణి. సర్వశుభలక్షణసంపన్న యామె. జలదా! మద్గృహాంతర్భాగమున ఏతచ్ఛుభలక్షణలక్షిత యగు ఏ కాంత నీకు దృగ్గోచరమగునో ఆమెయే వాడి, ప్రతిపచ్చంద్రరేఖవలె రేఖామాత్రముగ దీపించు నామెయే మత్ప్రియవల్లభ. నా బహిఃప్రాణము. నా బ్రతుకుతెరువు. ఆమెయే నా సర్వస్వము. శిల్పులకు ప్రథమనిర్మాణమున యత్నాధిక్యత సహజము గాన అందు శిల్పనిర్మాణసౌష్ఠవ ముట్టిపడుట సర్వజనవిదితము. ఇందు అధరఓష్ఠశబ్దములు పర్యాయవాచికములుగాన, పునరుక్తవదాభాసము, అలంకారము. ఓష్ఠశబ్దము సామాన్యముగా వాతెర కర్థము. అధర మనిన కేవలము క్రింది పెదవిని సూచించును. అది తెలిసిన ఆభాసము తొలగును. పక్వబిమ్బాధరోష్ఠీ అనుచోట లుప్తోపమ. చకితహరిణీప్రేక్షణా అనుచోట లుప్తోపమ. సృష్టిరాద్యేవ అనుతావున ఉత్ప్రేక్ష. ఇట్లలంకారముల పరస్పరనిరపేక్షతను సంసృష్టి. మఱియు నామె పద్మినీజాతికి చెందినది. “చకితమృగదృగాభే ప్రాంతరక్తే చ నేత్రే” ఇతి రతిరహస్యే.

అవ. యక్షుని భార్య యక్షిణి అవస్థావర్ణన.

శ్లో. తాం జానీథాః పరిమితకథాం జీవితం మే ద్వితీయం
దూరీభూతే మయి సహచరే చక్రవాకీ మివైకామ్,
గాఢోత్కణ్ఠాం గురుషు దివసేష్వేషు గచ్ఛత్సు బాలాం
జాతాం మన్యే శిశిరమథితాం పద్మినీం వాన్యరూపామ్. 22

అ. సహచరే=కలసి మెలసి యుండెడి, మయి=నేను, దూరీభూతే సతి=దూరస్థుడను కాగా, చక్రవాకీమ్ ఇవ=సహచరు నెడబాసిన చక్రవాకిని వలె, ఏకామ్=ఒంటరిదియు, పరిమిత-కథామ్=అల్పభాషిణియు నగు, తామ్=గృహమువీడని మత్ప్రియసతిని, మే=నాయొక్క, ద్వితీయమ్=రెండవదగు, జీవితమ్=ప్రాణముగా, జానీథాః=గుర్తించుము. గాఢ-ఉత్కణ్ఠాం=భారమగు విరహవేదన గల, బాలామ్=ఆ నవయువతిని, గురుషు=భారమగు, ఏషు= ఈ ప్రస్తుత, దివసేషు=వియోగవ్యథతోడి దివసములు, గచ్ఛత్సు సత్సు=గడచుచున్నవి కాగా, శిశిర-మథితామ్=శిశిరతుషారపీడిత యగు, పద్మినీం వా=పద్మలతను వలె, అన్యరూపాం జాతామ్=రూపాంతరము జెందినదిగా, మన్యే=భావింతును.

భా. జలదా! ఏమని చెప్పను! ఏరికిని ఎన్నడును ఎగ్గు తల పెట్టని ఋజుప్రవర్తన మాది. ఎన్నడును ఎడబా టెఱుంగని ప్రణయైకజీవులము మేము. ఒండొరుల వీడలేక సదా తోడునీడలై ప్రణయైకభావమున సంచరించితిమి.

చిలకా గోరింకలవలె గువ్వలజంట భాంతి చక్రవాకమిథునముబోలె ఎడమోర్వని ప్రణయజీవనము మాది. మాది మధుమయజీవితము. విధివైపరీత్యమున ఇడుముల పాలైతిమి. దైవోపహతులము. విధివంచితులము. విధి వక్రించిన ఎవ రేమి చేయగలరు? ఏటి కెదురీదు టెవరితరము! స్వప్నముననైన ఊహించని ఎడబాటు. దుర్భరవియోగము దీర్ఘప్రవాసము. ఆమె నా జీవితసర్వస్వము. ప్రణయిని. మిత్రమా! ఆ నా ప్రేయసి నీ సోదరి ఎట్లున్నదో! ఏమి చెప్పను! ఈ మా ఎడబాటుకు ఎవరిని నిందించను! ఏమి ప్రయోజనము? అది విధికృతము. ఎవ రేమి చేయగలరు? సహచరుడను, ప్రియుడను. ఎడలేక చీర చెరగుపట్టి సదా ప్రణయమున ఆమె వెన్నంటియుందు నేనిట్లు మిన్నులు పడ్డచోట ప్రవాసమున దూరమ్మైయుండ నవయౌవని, అబల, నా ప్రియసఖి, ఈ వియోగభార మెట్లు భరించగలదు? చక్రవాకము నెడబాసిన చక్రవాకి భాంతి ఇప్పు డామె ఏకాకిని. అల్పభాషిణి. అవును! ప్రియుడను, సదాప్రణయరస మొలికించు నే నిట దూరమున భారమగు జీవితము గడపుచుండ సతి ప్రణయశీల యగు నామె నలువురిలో చనువున ఎట్లు మనగలదు! సంతోషమున ఎట్లు భాషించగలదు! గృహము వీడక తదంతర్భాగమున మితభాషిణియై ఒంటరిగా వేదనాభారమున రోజులు వెళ్ళబుచ్చుచుండనోపు. జలదా! ఆమె రూపురేఖలను నీ కించుక వివరించితిని. నీ వామెను సులభముగ గుర్తించగలవు. ఆమె నా సహచారిణి, నా జీవితభాగస్వామిని. ఆమె నా ప్రాణమునకే ప్రాణమని భావించుము. ఆమెయే నా జీవితసర్వస్వము. ఆమె లేనిది నా కంతయు అంధకారబంధురము. మరి యొక్కమాట! గాఢవిరహోత్కంఠ యగుచు మోయజాలని విరహవేదన అనుభవించుచు ఆమె ఈ వియోగభరితమగు దినములు గడుపుచు క్రుంగి కృశించుచు శిశిరఋతువున శీతలతుషార (మంచుతుంపర) దూషిత యగు పద్మినిభాంతి కాంతివిహీనమై రూపాంతరము (అన్యరూపము)నొందియుండునని భావింతును విరహదుఃఖిత యగుట ఇంచుక రూపుమాసినను ఆమెను అన్యగా భావించకుము. ఆమెయే నా ప్రియసతి. రేఖామాత్రముగ నున్నను చంద్రిక చంద్రికయే గదా! వియోగభారమున అనురాగము విఫలమగుట దురంతవేదనాభరిత యగుట తత్కారణముగ అవయవకార్శ్యత్వమును ఉత్కంఠ యని విజ్ఞు లందురు. ఇందు ప్రథమచరణమున యక్షపత్ని - జీవితములకు భేదమున్నను, అభేదాధ్యవసాయమున అతిశయోక్తి. ద్వితీయచరణమున పూర్ణోపమ. చతుర్థచరణమున (పద్మినీవ అనుచో) ఉపమ. ఇవి అన్యోన్య అనపేక్షము

లగుట సంసృష్టి యలంకారము.

అవ. యక్షపత్ని వదనవర్ణన-

శ్లో. నూనం తస్యాః ప్రబలరుదితోచ్ఛూననేత్రం ప్రియాయా
నిశ్వాసానా మశిశిరతయా భిన్నవర్ణాధరోష్ఠమ్,
హస్తన్యస్తం ముఖమసకలవ్యక్తి లమ్బాలకత్వా
దిన్దోర్దైన్యం త్వదనుసరణక్లిష్టకాన్తే ర్బిభర్తి. 23

అ. హే మేఘ=ఓ జలదా! ప్రబల-రుదిత-ఉచ్ఛూన-నేత్రమ్=అమిత రోదనమున ఉబికిన నేత్రములు కలదియు, నిశ్వాసానామ్=నిట్టూర్పుల యొక్క, అశిశిరతయా=ఉష్ణత్వము (చల్లదనములేమి) చే, భిన్న-వర్ణ-అధర-ఓష్ఠమ్=రూపుమాసిన అధరోష్ఠము గలదియు, హస్త-న్యస్తమ్=హస్తమం దుంచబడి నదియు, లమ్బ-అలకత్వాత్=వ్రేలుచున్న కుంతలము (ముంగురు)లు కలదగుట, అ-సకల-వ్యక్తి=అసంపూర్ణముగ అగుపించునదియు నగు, తస్యాః=ఆ నా, ప్రియాయాః=ప్రేయసియొక్క, ముఖమ్=మోము, త్వత్-అనుసరణ-క్లిష్ట-కాన్తేః=నీ వద్దుపడుటచే క్షీణకాంతి గల, ఇన్దోః=చంద్రునియొక్క, దైన్యమ్=దీనత్వమును, బిభర్తి=భరించుచున్నది. నూనమ్=అది యథార్థము.

భా. జలదా! నే నిచ్చట, ఆమె అచ్చట. అధిగమించరాని వియోగభారము. మోయరాని బరువు. ప్రణయినీప్రణయులము. తెరిపిలేని యావేదన, తీరని దుఃఖము. నిరంతర అంతస్తాపము. ఎట్లు భరించగలము? ప్రవాస (వియోగ) మెంత కఠినమైనది? అదెంత బాధాకరము? ఆయినను పురుషుడ నగుట నే నెటులనో భరించ నోపుదును. మఱి అధీర యగు నామె మాట! అబల యగు ఆమె ఈ మనోవేదనను హృదయతాపమును ఎట్లు భరించగలదు? ఈ వియోగసాగరము నెట్లీదగలదు? దురంత దుస్తర వియోగసంతాపమున క్రుగ్గెడి యామె మనస్తాపోపశమనమునకు రోదనము తక్క అన్యమార్గ మగపడదు. నిరంతరరోదనము! ఎడ మెఱుంగని దుఃఖము! తెఱిపిలేని కన్నీటిధార! అట్టి తఱి యామె నయనము లెట్లుండును! ఉబికియుండు టబ్బురమా? దుఃఖాతిశయమున పొంగి ఇంతింతలై యుండనోపు. ఏలయన, ఆమె విషాద మట్టిది. జలదా! అంతస్సంతాపోష్ణత్వాధిక్యతచే ఆమె నిశ్వాసముల చల్లదన మంతరించినది. శిశిరత్వ మింకిపోయినది. మా ప్రణయజీవితసౌఖ్య సౌరభసంకేతమగు ఆమె యధరబింబోష్ఠము ఊష్మనిశ్వాసములచే వన్నె తరిగి రమ్యత చెడియుండును. అందలి మధురామృతరస మింకియుండును. నిరంతర అంతస్తాపమునకు విషాదము తక్క ఆలోచన లెక్కడివి? సంతోషమునకు తా వెక్కడిది? వామహస్తమున చెక్కిలి మోపి తన దుర్భాగ్యమునకు కుమిలి

కుమిలి దిగులొందుచుండును. ఇక నామె వదనమునకు కాంతి యెట్లుండును? ప్రియు నెడబాసిన కాంతకు కళాకాంతు లెక్కడివి? పతికి దూరమైన సతికి శోభ యెట్లుండును? మదన్య మెరుగని నా ప్రియసతి కేశసంస్కారహీన. ఆ కుటిలకుంతలములకు శిరోజములకు సంస్కారపరిష్కారములు శూన్యమగుట చెదరి ఆమె ముఖబింబ మాక్రమించినవి. ఆమె వదన మిప్పుడు త్వదనుసరణము (ఆటంకము)న కాంతిహీనమగు చంద్రబింబము భాంతి వన్నె తరుగుట తథ్యమని భావింతును. అయినను ఆమెను అన్యురాలుగా భ్రమించకుము. ఆమెయే నా ప్రియసతి యని గుర్తించుము. ప్రేయసి మోము చంద్రుని దైన్యము నెట్లు సహించును? ఈ విషయము బింబప్రతిబింబభావమున పరిహరించబడున దగుట నిదర్శనాలంకారము.

అవ. యక్షిణి స్థితివర్ణన-

శ్లో. ఆలోకే తే నిపతతి పురా సా బలివ్యాకులా వా
మత్సాదృశ్యం విరహతను వా భావగమ్యం లిఖన్తీ,
పృచ్ఛన్తీ వా మధురవచనాం శారికాం పఞ్జరస్థాం
కచ్చిద్భర్తుః స్మరసి రసికే త్వం హి తస్య ప్రియేతి. 24

అ. హే మేఘ!=ఓ జలదా! సా=ఆ నా ప్రియతమ, బలి-వ్యాకులా వా=ప్రవాసితుడ నగు మదాగమనా (నారాక)ర్థమగు దేవతారాధనలయందు నిమగ్నమైనదిగా గాని, విరహతను=వియోగమున కృశించినదియు, భావగమ్యమ్=ఊహాజనితమైనది యునగు, మత్-సాదృశ్యమ్=నా రూపసామ్యమును, లిఖన్తీ వా=చిత్రించుచున్నదిగా గాని, హే రసికే=రసార్ద్రహృదయ వగు ఓ మైనా! భర్తుః=నా స్వామిని, స్మరసి కచ్చిత్=స్మరింతువా! హి=ఏలనందువా! త్వమ్=నీవు, తస్య=ఆయనకు, ప్రియా=వల్లభవు, ఇతి =అని, మధుర-వచనామ్=తీయని పలుకులు గల దియు, పఞ్జరస్థామ్=పెంపుడు మైనము గాన పంజర మందున్నదియు నగు, శారికాం=మైనపుగోరింకను, పృచ్ఛన్తీ వా=ప్రశ్నించుచున్నదిగా గాని, సా=ఆ నా ప్రియవల్లభ, తే=నీయొక్క, ఆలోకే=దృష్టిపథమున, పురా నిపతతి=పడగలదు.

భా. జలదా! కాలము బహువిచిత్రమైనది. అవ్యాహతమైనది. ఒకరి అడుపాజ్ఞలతో దానికి పనిలేదు. ఏదియు దాని నడ్డజాలదు. దాని కన్నియు లోబడవలసినదే. అది నిరాటంకముగా నిర్లిప్తముగా సాగిపోవుచునే యుండును. దానికి ఆద్యంతములుగాని పక్షపాతముగాని లేవు. ధనికనిర్ధనికత్వములతో గాని అధికారనిరధికారములతో గాని అజ్ఞతావిజ్ఞతలతో గాని దాని కెంతమాత్రము నిమిత్తము లేదు. దాని కొక రూపముగానీ రూపభేదము గాని ఎగుడుదిగుడులు గాని అగుపించవు. ఘడియవిఘడియలు గాని సంధ్యాదినరాత్రులు గాని

వారపక్షమాసఅయనాబ్దములు గాని ఋతుభేదములు గాని సున్న. అవన్నియు మానవకల్పితము లని విజ్ఞు లందురు. అది ఒప్పు మెప్పు తప్పులతో పనిలేక నిరపేక్షాభావమున క్రమబద్ధకర్తవ్యతాభావమా యనునట్లు చక్రభ్రమణభ్రాంతి అదృశ్యపూర్వకముగ జరిగిపోవుచునే యుండును. దాని కాద్యంతములు గాని అంతుపొంతులు గాని అగపడవు. అయినను దాని ప్రభావ మేమియో గాని ప్రకృతిలో ఎంతయో మార్పు సంభవమగుచున్నది. కనుకనే (కాలస్వరూపాయ దేవాయ నమః) అందురు. జలదా! ఏది యేమైనను ఆనందమయజీవులకు సుఖసంతోషములతో కాలము తెలియకుండగనే ఎగుడు దిగుడులు లేక సరసర సరళముగా సాగిపోవును. కాని అభాగ్యులమగు మా స్థితి వేరు. మముబోటి విధివంచితులకు అది శీతలహేమంతనిశీథిని బోలి దీర్ఘముగాను, పేదవాని బ్రతుకు భ్రాంతి భరించరాని భారముగాను, వార్ధక్యము బోలి అనూహ్యామగు బరువు మాదిరి అగపడుచు అడుగడుగున అలసటతో సతమతమగుచు ముందుకు సాగక దీర్ఘమై తోచును. మిత్రమా! నీవు మద్గేహము చేరుసరికి నా పతి ఎట్లుండు నందువా? తీరని ఎడబాటు. అధికమగు విరహవేదన. కాలవ్యవధి దీర్ఘమైనది. దినములు గడవవలె. ఉబుసుపోకకు ఎందైన మనసు లగ్నము కావలె. అట్లు కాదేని ప్రణయతాప మధికమై ప్రాణాంతక మగును. ఆశాజీవులము కదా! ఆమె మనస్సెందైన లగ్నమై యుండనోపు. ఆమె మదాగమనాభిలాషిణియై దేవతారాధనయందైన నిమగ్నమై యుండవచ్చు. ఈప్సితార్థసాఫల్యమునకు దేవారాధన అవశ్యకర్తవ్యము గదా! లేదా ఆమెకు చిత్రలేఖనానైపుణ్యము గలదని మున్ను నుడివితిని గాద! విరహిణులకు చిత్రలేఖనము వినోదహేతువు. అయినను విరహవేదనాదూషితమగు (కృశించి రూపుచెడిన) నా రూప మామె ఎట్లు చిత్రించగలదు? ఆమె నిపుణ. బుద్ధిమతి. భావనాపటిమ నూహించి రేఖామాత్రముగ ఎందైన ఫలకమున చిత్రించి వినోదించుచుండనోపు. జలదా! మా యింట శారిక యొకటున్నది. అది మధురభాషిణి. తేనెపలుకుల మైనా యది. హింసాయుతజంతువులబారి పడకుండుటకు గాను రక్షణార్థము విశాలమగు పంజరమున స్వస్థత గలిగి యున్నది. ప్రేమార్ద్రహృదయ. అది నాప్రియతమకు ముద్దుముచ్చట లొలికించు మైనా. నా పతి నేర్పిన పలుకులన్నియు నేర్చిన దిట్ట. నా కత్యంతప్రియమైనది. విశ్వాసమున మెలగు మైనా యది. ఓ రసగ్రహణపారీణా! ఆర్ద్రహృదయా! ఓ మైనా! నాస్వామి నెన్నడైన స్మరించుచుంటివా! ఆయన నీ కెంతయు కూర్చిన మిత్రుడు కదా! ఆయన కత్యంతప్రేమాస్పదవు. కాన స్మరించు టెంతయు యుక్తము. నా స్వామిని మరువలేదు కదా! అని ప్రశ్నించుచు నైన యుండవచ్చు. జలదా! ఏమి చెప్పను! ఇవ్విధమున నా రాకకై పూజలు సలుపుచు ఊహాజనితమైన ప్రతిరూపమును చిత్రించుచు పంజరస్థమగు శారికను

పలుకరించుచు దయనీయజీవితము నెట్లో వెళ్ళబుచ్చుచు రోజులు లెక్కించుచు ముందుగా నీ దృష్టిపథమున పడవచ్చును.

*అవ. యక్షిణి గాన ఉపక్రమణికా వర్ణన-*

శ్లో. ఉత్సఙ్గే వా మలినవసనే సౌమ్య నిక్షిప్తవీణాం
మద్గోత్రాఙ్కం విరచితపదం గేయ ముద్గాతుకామా,
తన్త్రీమార్ద్రాం నయనసలిలైః సారయిత్వా కథంచి
ద్భూయో భూయః స్వయమపి కృతాం మూర్ఛనాం విస్మరన్తీ. 25

అ. హే సౌమ్య=ఓ సరళహృదయా! మలిన-వసనే=మాసిన వలువ గల, ఉత్సఙ్గే=ఒడియందు, వీణామ్=విపంచిని, నిక్షిప్య=ఆనించి, మత్-గోత్ర-అఙ్కమ్=నా నామచిహ్నము గలదియు, విరచిత- పదమ్=చక్కగా కూర్చబడిన పదములు కలదియు నగు, గేయమ్=గీతమును, ఉత్-గాతు-కామా=ఉచ్చైః స్వరమున పాడ నుత్సుకత గలదై, నయన-సలిలైః=అశ్రుకణములచే, ఆర్ద్రాం=చెమ్మగిలిన, తన్త్రీమ్=వీణతీగను, కథంచిత్=ఎటులనో అతికష్టమున, సారయిత్వా=తుడిచి, భూయః భూయః=మాటిమాటికి, (తరచు) స్వయమ్=తానుగా, కృతామ్ అపి=రచించిన దైనను, మూర్ఛనామ్=స్వరకల్పనను, విస్మరన్తీ=మఱచుచున్నదగుచు, నీకంట బడవచ్చును.

భా. ఓ కృపాస్వరూపా! మా దయనీయగాథ నేమని నుడువుదును? ప్రియతముడ నేను ప్రవాసితుడను. ఆమెయా అబల. ఏకాకిని. ఇక సుఖసౌఖ్యము లెక్కడివి? శాంతి ఎక్కడ? సంతోషమేది? ఆనందమునకు తావెక్కడ? అలంకార మెక్కడిది? అంగములు శుష్కింప అలంకరణ దూరమైనది. కేశసంస్కారమునకు తావు లేదు. అసలు మలినవసన (చీర) మే ఆమె కాచ్ఛాదన, నిరంతరచింత తోడి వియోగము. భరించ నలవిగాని తాపము. కాల మెట్లు గడపగలదు? ఆపె విదుషి. గాన మామెకు ప్రాణము. సంగీతసాహిత్యము లామెకు వెన్నతో బెట్టిన విద్యలు. ఆమె కమనీయకంఠమున మాధుర్య మలది యున్నది. అమృతము తొణికిసలాడుచున్నది. ఎలుగెత్తి పాడి గానమాధుర్యమున లోకముల మురిపించగలదు. సాహిత్యమునకు చక్కని స్వరములు కల్పించగలదు. మనోవికలతను బాపి హృదయమున కూరట కల్పించి వినోదమున కాలము గడపజూచును. జలదా! నీ వచట కరుగునప్పటికి నా ప్రియసతి ఇట్లున్నను ఉండవచ్చునని యూహింతును. మలినవసనాచ్ఛాదితమగు ఒడిని వీణ మోపి మన్నామాంకితముగ - ఎట్లన సవిశేషముగ పదము పదమున నా నామ మమరునట్లు చక్కని గేయము రచించి అందు కనువగు స్వరములు కూర్చి ఉచ్చస్వరమున ఆలాపన కుద్యమింప

అంతలో మద్గుణస్మరణమున జనించిన కణ్ఠావరుద్ధతను కన్నుల అశ్రువులు చింద విపంచీతంత్రులు చెమ్మగిల్లి పలుకమి ఎట్లో అతికష్టమున పరిమార్జన మొనర్చి తానుగా కూర్చినదైనను స్వరారోహణ అవరోహణ క్రమమును మఱచి అస్పష్టతను అస్తవ్యస్తముగ వీణ వాయించుచు నైన మత్ప్రియసి నీ కంట బడవచ్చును. ఇట ప్రియగుణస్మృతిజనిత మూర్ఛనైన విస్మరణ (మఱపు)- షడ్జమధ్యమము లను గ్రామములు (సంగీతమున స్వరక్రమము) మానవులకు చెందినవి. గాంధారగ్రామము దేవయోనికి జెందినది. యక్షిణి ఉచ్చైస్స్వరమున పాడ నుద్యమించుట అస్వాభావికము గాదు. ఆమె మధురకంఠమున నవరసము లొలికించు నిపుణగాయకి యైనను వియోగభారమున ఆమె కంఠ మవరుద్ధమై నయనజలములు చింద మఱపు జనించినది. మత్సాదృశ్యాదులచే మనస్సంగానువృత్తి సూచితము. సప్తస్వరముల ఆరోహణావరోహణక్రమము మూర్ఛన యనబడును. అలంకారము వికల్పము.

అవ. యక్షపత్ని వినోదవర్ణన-

శ్లో. శేషాన్మాసా న్విరహదివసస్థాపితస్యావధేర్వా
విన్యస్యన్తీ భువి గణనయా దేహళీదత్తపుష్పైః,
సంభోగం వా హృదయనిహితారమ్భ మాస్వాదయన్తీ
ప్రాయేణైతే రమణవిరహే ష్వఙ్గనానాం వినోదాః. 26

అ. అథవా=లేక, విరహ-దివస-స్థాపితస్య=విరహదివస ఆరంభము మొదలు, అవధేః=శాపావధి పర్యంతము, శేషాన్=మిగిలియున్న, మాసాన్=నెలలను, దేహళీ-దత్త-పుష్పైః=గడపయం దుంచబడిన పుష్పములతో, గణనయా=లెక్కించుటచేత, భువి=భూమిపై, విన్యస్యన్తీ వా=ఉంచుచున్నదిగా గాని, హృదయనిహిత-ఆరమ్భం=మనస్సంకల్పప్రాయమగు, సంభోగమ్=రత్యానందమును, ఆస్వాదయన్తీ వా=అనుభవించున్నదిగా గాని, నీ దృక్పథమున బడవచ్చును. జలదా! ప్రాయేణ=తరచుగా, రమణ- విరహేషు=ప్రియతమవియోగమున, అఙ్గనానాం=దయితలకు, ఏతే=ఇవియే, వినోదాః=వినోదములు గదా!

భా. జలదా! మున్ను ప్రణయమున ఆనందమయజీవితము గడపెడి మాకు కాలము తెలియకుండగనే జారిపోయెడిది. ఆ యానందమయజీవితమున వత్సరములు దినప్రమాణమాత్రములుగా గడచిపోయెడివి. నేడో! అట్లు గాదు. అంతయు తద్వ్యతిరేకము. ఆనంద మెక్కడిది? సుఖమా! శూన్యము. మిగిలినది దుఃఖము, తాపము, ఎడబాటు. వియోగభారమున వాసరములు వత్సరములుగా మారి ముందుకు జరుగక దీర్ఘముగ సాగుచున్నవి. రోజులు గడుచుటయే దుర్ఘట మగుచున్నది. ఇంతకు మేము చేసిన నేర మేమిటి? మే

మొనరించిన పాపమేమిటి? నూతనదంపతుల మగుట ఆనందపారవశ్యముచేనైన ఏమరపాటున ఆలస్యమైన మాట నిజము. విధివైపరీత్యము తక్క అంతకు ఇంతటి కాఠిన్యమా! రసహీనమగు జీవితము గడపుచుంటిమి. ఎంతకాల మిది? జలదా! నీవట కేగుసరికి నీ సఖి నా సతి ఎట్లుండ నోపునో ఏమి చెప్పగలను? అయినను ఇ ట్లూహించెద. భారమగు దీర్ఘవియోగము. భరించరాని కష్టము. చేయునది లేదు. రోజులు లెక్కించుచుండును. మాసములు గణించుచుండును. ఎట్లందువా! ద్వారదారువునం దుంచబడిన పూవు లందుకొని ఒకటి రెండని పుడమి నుంచుచు వియోగాది శాపావధిపర్యంతము శేషదినములు లెక్కించుచు నైన నుండనోపు. మిత్రమా! నీకు తెలియని దేమున్నది! ప్రణయము కరువాయె. ఆనందము దూరమైనది. మిగిలినది పరోక్షము. ఊహాజనితము మాత్రమే. హృదయగతము మానసికము తక్క మిగిలిన యానంద మెక్కడిది! ఊహాప్రపంచమున ఉవ్విళ్ళూరుచు నాతోడి సరససల్లాపముల మాధుర్యము చుంబనాది రతిక్రియా కలాపముల మకరందము జుఱ్ఱుచు నైన నుండవచ్చును. ప్రత్యక్షసుఖసౌఖ్యములకు సంభోగ మకరందములకు దూరమైతిమి గదా! మిత్రమా! విధివైపరీత్యమున ఒండొరులకు దూరమైన ప్రణయజీవులగు యువతీయువకులకు సతీపతులకు ఇంతకంటే మిగిలిన దేమున్నది? సర్వసాధారణముగ వియోగినులకు మిగిలిన వినోదము లివియే గదా! కాలయాపనోపాయము లిట్టివే గదా! శేషించిన సుఖసంతోషము లింతమాత్రమే గదా!- ఇందు సంకల్పావస్థ సూచితమైనది. ప్రియవిషయక మనోరథము సంకల్పము. ఇందలంకారము వికల్పము. సామాన్యముచే విశేషసమర్థనమున అర్థాంతరన్యాసము. ఉభయమునకు అంగాంగిభావమున సంకరము అలంకారము.

అవ. సందేశ మందజేయతగిన సమయసూచన-

శ్లో. సవ్యాపారా మహని న తథా పీడయే ద్విప్రయోగః
శఙ్కే రాత్రౌ గురుతరశుచం నిర్వినోదాం సఖీం తే,
మత్సన్దేశైః సుఖయితుమలం పశ్య సాధ్వీం నిశీథే
తాముున్నిద్రా మవనిశయనాం సద్మవాతాయనస్థః. 27

అ. హే సఖే!=ఓ మిత్రమా!, అహని=పగటియందు, సవ్యాపారామ్=చిత్రలేఖనాదివ్యాపారనిమగ్న యగు, తే=నీయొక్క, సఖీమ్=చెలియలగు నా ప్రియతమను, విప్రయోగః=వియోగము, తథా=అంతగా, న పీడయేత్=పీడించదు, యథా=ఎంతగా, రాత్రౌ=నిశాసమయమున, పీడయేత్=పీడించునో, రాత్రౌ=నిశీథమున, నిర్వినోదామ్=వినోదరహిత యగు, తే=నీయొక్క, సఖీమ్=సఖిని, గురతర-శుచమ్=అధికతరమగు దుఃఖశీలినిగా, శఙ్కే=శంకింతును. నిశీథే=నడిరే

యని, ఉన్నిద్రామ్ =నిద్రలేనిదియు, అవనిశయనామ్=పుడమిని శయనించునదియు, సాధ్వీమ్=పతివ్రతయు నగు, తామ్=ఆ నా ప్రేయసిని, మత్-సందేశైః =నా క్షేమవార్తలతో, అలమ్=అత్యంతము, సుఖయితుమ్=సంతోషపెట్టుటకు, సద్మ-వాతాయనస్థః=మద్భవనగవాక్షమున ఉపవిష్టుడ వగుచు, పశ్య=వీక్షింపుము.

భా. జలదా! విరహిణులకు పగటికంటె రాత్రి తాప మెక్కువ. ఆవేదన యధికము, శోకము మిక్కుటము. ఏల అందువా! నిత్యకృత్యములు విధినిర్వహణములు, చిత్రలేఖనాదులు అవి ఇవి ఏవియో యుండునుగదా! అందు నిమగ్నలగుట పగలెట్లో గడచిపోవును. అంతగా బాధ యగపడదు. ఇక రాత్రి యందువా! అట్లు గడవదు. శయ్యాగతులగుట, గతమధురస్మృతు లన్నియు ఒకటొకటిగా స్ఫురణకు వచ్చి నిద్రకు కరువగును. తాప మతిశయించును. దుఃఖము వెంబడించును. ఇక సుఖ మెక్కడిది! సహజముగా అంగనలు కుసుమసుకుమారలు, సుఖజీవులు, భోగలాలసులు, మధుమయులు. అవి దూరమగుట వారికి జీవితము అంధకారబంధురము. కుసుమసుకుమారలగుట తాపమున కోర్వజాలరు. మిత్రమా! నీ చెలియలు నా ప్రేయసి ఎట్లున్నదో గదా! పగలెట్లో కాలము వెళ్ళబుచ్చును. కోర్కె లీడేర దుఃఖము సమసిపోవ ఎడబా టంతమొంద, దైవచింతనలు, దేవతాపూజలు ఆ మీదట చిత్రరచనలు, వీణావాదనలు శారికాసల్లాపములు కాల మెట్లో గడచిపోవును. ఇక పెనుభూతమువలె పీడకలవలె నిశి దాపురించును. వినోదమునకు తావు లేదు. విధినిర్వహణకు చోటు లేదు. నిరంతర మావేదన. ఎడతెగని చింత. నిద్రకు తావు లేదు. ఇక సుఖ మెక్కడిది! ఆమె వియోగతాపపీడిత, దుఃఖిత. నిశీథమున ఆమెను చూడబొమ్ము. అర్ధరాత్రి తగిన సమయము. నీ కంతయు అవగతమగును. ఆమె సాధ్వి, సతి, నీతినియమము గలది. అన్యధా భావించకుము. నీ చెలియలివంటి దామె. నియమబద్ధ యగుట ఆమె అవనిశయన. పతి నెడబాసిన యామెకు పర్యంకముతో నేమి పని? పుడమియే ఆమెకు పర్యంకము. అచటనే యామె పడక. అమిత యావేదన, తీరని దుఃఖము, నిద్ర యెక్కడిది! కన్ను మూయదు. ఆమె స్థితి యది. అది మా యదృష్టము. నే చెప్ప నెందుకు! నీవు స్వయముగా వీక్షించగలవు. జలదా! వెంటనే లోని కరుగకుము. తొందర కార్యహానికి హేతువగును. నిదాన మవసరము. మద్భవనమును జేరి గవాక్ష మధిష్ఠించి శాంతి వీక్షించి ఆమె పరిస్థితిని గమనించి తియ్యని పలుకుల మత్ క్షేమవార్త దెలిపి ఆమె కత్యంతముదము చేకూర్తువని ఆశించెద. సఖి, దాది, మాతాపితలు, మిత్రదూతశుకాదులు ఇష్టకథనాది ఉపాయముల విరహిణిని

శ్లో. అన్వేష్టవ్యా మవనిశయనే సన్నికీర్ణైకపార్శ్వాం
తత్పర్యంతప్రగళితలవై శ్ఛిన్నహారైరివాస్రైః,
భూయో భూయః కఠినవిషమాం సారయంతీం కపోలా
దామోక్తవ్యా మయమితనఖేనైకవేణీం కరేణ. 2

అ. అవని-శయనే=పుడమిశయనమందు, సన్నికీర్ణ-ఏక-పార్శ్వామ్=వ్యాప్త మగు(చాచిన), ఏక (ఒకే) పార్శ్వము గలదియు, తత్-పర్యంత-ప్రగళిత-లవైః=ఆమెయున్నంతమేర రాలిన లేశము(ఖండము)లు గల, ఛిన్నహారై ఇవ=తెగిన ముత్తెపుహారములబోలు, అస్రైః=అశ్రుబిందువులచే, అన్వేష్టవ్యామ్=గుర్తించబడు నదియు, అయమిత-నఖేన =అఖండితనఖములుగల, కరేణ=చేతితో, కఠినవి షయామ్=బిరుసెక్కి చిక్కుపడినదియు, ఆమోక్తవ్యామ్=శాపాంతమున నాచే చక్కజేయబడునదియు నగు, ఏకవేణీం=శాపప్రారంభమున ముడువబడిన వేణిని, కపోలాత్ =చెక్కిటినుండి, భూయః భూయః=మాటిమాటికి, సారయంతీమ్=సవ రించుచున్న నా ప్రియతమను, ఉపేయాః =సమీపించుము.

భా. మిత్రమా! మద్వియోగమున ఆమె నియమబద్ధ. కనుకనే ఆమె పర్యంకము వీడి భూతలశాయిని. అవనియే ఆమెకు పూలపానుపు. అదియే ఆమెకు స్వర్ణపర్యంకము. ఆమె నిష్ఠ యది. నియమ మది. మఱియు నామె ఏకపార్శ్వగత. ఒకే ప్రక్కకు ఒదిగిన పడక, అలికిడి లేని శూన్యగృహమున అంధకారమున ఆమెను గుర్తించుటంచుక కష్టమే యగును. సందడి లేని బ్రతుకగుట స్థిమితము లేక అటు నిటు దొర్లుటచే ఆమె సామీప్యమున చిందరవందరగు ముత్తెపుసరముల శకలములా యనునట్లు అశ్రుబిందువులు చిందియున్నవి. వాటినిబట్టి సునాయాసముగ నీ వామెను గుర్తించగలవు. జలదా! ఆమె ఏకవేణి. శాపారంభమున ముడిచిన వేణి మఱి వీడలేదు. ప్రియతముడను నేను ప్రవాసమున నుండ ఆమె కేశాలంకరణ కిష్టపడదుగదా! ఆమె కేశబంధము సంస్కారహీనమగుట అస్తవ్యస్తము. కురులు పోషణ లేక రూపుమాపి బిరుసెక్కినవి. అందచందము లడుగంటినవి. నఖము లపరిష్కృతములు, కత్తిరింపులు లేవు. వాటికి రూపురేఖలు సున్న. ఏమని చెప్పను! ప్రిదిలి చెక్కిట చెదరిన ఆ కేశబంధమును అపరిష్కృతనఖముల మాటిమాటికి సవరింపుచున్నది. శాపాంతమున నాచే పరిష్కరింపదగు కేశబంధ మది. మిత్రమా! ఇదీ మా స్థితి. ఈ పై రెండు శ్లోకములు ప్రక్షిప్తములని తోచుచున్నది. ఏలయన అన్యశ్లోకములయందలి పదలాలిత్యముగాని భావబంధురతగాని భావసౌరభముగాని ఇం దగపడవు.

అవ. యక్షపత్నియొక్క కార్శ్యవర్ణన-

అధిక్షామాం విరహశయనే సన్నిషణ్ణైకపార్శ్వాం
ప్రాచీమూలే తనుమివ కళామాత్రశేషాం హిమాంశోః,
నీతా రాత్రిః క్షణ ఇవ మయా సార్థమిచ్ఛారతై ర్యా
తామే వోష్ణై ర్విరహమహతీ మశ్రుభి ర్యాపయన్తీమ్. 28

అ. ఆధి-క్షామాం =మనోవ్యథచే కృశించినదియు, విరహ-శయనే = విరహశయ్యయందు, సన్నిషణ్ణ-ఏక-పార్శ్వామ్ =లెస్సగా నొదిగిన ఏకపార్శ్వము గలదియు, ప్రాచీ-మూలే =తూర్పుదిశకోణమున, కళా-మాత్ర- శేషామ్ =కాంతిరేఖ మిగిలినదిగా కల, హిమ-అంశోః =శీతభానునియొక్క, మూర్తిమ్ ఇవ స్థితామ్ =ఆకారము బోలి యున్నదియు, యా =ఏ, రాత్రిః= నిశ, ఇచ్ఛా-రతైః=అభిమత రతిక్రీడలతో, క్షణః ఇవ =క్షణముగా, నీతా =గడపబడినదో, తామ్ ఏవ =అదే రాత్రిని, విరహ-మహతీమ్ = విరహభారమున గురుతరమైనదిగా, ఉష్ణైః =వేడివగు, అశ్రుభిః = కన్నీళ్ళతో, యాపయన్తీమ్ =గడపుచున్నదియు నగు, తామ్ =ఆమెను, పశ్య =చూడుము. పూర్వమున కన్వయము.

భా. జలదా! మరొక విచిత్రజీవితము. ఒకపరి అందరాని యానందము, మఱియొకసారి భరించరాని యావేదన. ఒకపరి ఆకాశమున ఆనందవిహారము, మఱొకమారు పాతాళమున నరకయాతన. ఒకప్పుడు భోగముల మునిగితేలుట, మరొక్కప్పుడు కష్టముల దఱి కానలేకుండుట. ఒకప్పుడు ప్రణయజలనిధుల నీదుచు ఓలలాడుట, ఇంకొకప్పుడు అమితయాతనల గుందుచుండుట. ఒకపరి జీవితమాధుర్యమును జుఱ్ఱుట, మఱియొకపరి బ్రతుకుభారమున క్రుంగుట. ఒకపరి యానందడోలికల నూగుట, మఱియొకపరి విరహభారమునన్నైన మనోవ్యథకు దారికానక అంధకారమున తడుములాడుట. మిత్రమా! విధివైపరీత్యమో ఏమో! కాని మా బ్రతుకుతెర విది. మాజీవితసరళి కొంతవఱకు ఇంతకుమున్నే వివరించియుంటిని. నే నందుబాటున లేకుండుట నా సతి విరహతాపమున కృశించియుండును. విరహశయ్యను ప్రక్కకు నొదిగి అంటియుండును. ఆమె రూపము మారిపోవుట ఖాయము. రూపసౌరభ మంతరించుట నిశ్చయము. విరించి ఒరవడిగా తీర్చిదిద్దిన ఆమె సౌందర్యవైభవ మిప్పుడు అణగి మణగి అంతంతమాత్రముగ, రేఖాసదృశముగ లేశమాత్రము మిగిలియుండును. జలదా! నీవు గమనించియే యుందువు. కృష్ణపక్షాంతమున ప్రాచీ (తూర్పుదిక్కు) మూలమున కృశించి రూపుమాసి అంతంతమాత్రముగ మిగిలియున్న చంద్రరేఖను బోలియుండును మత్ప్రియసఖి. ఉదయాద్రి నుదయించి మిణుకు మిణుకుమను శీతాంశుని క్షీణరేఖ యామె. మిత్రమా! ఏరికైనను శుభసుఖదినములు

తెలియకుండగనే ఇట్టే సులభముగ సుఖముగ గడచిపోవును. అవే దినములు కష్టకాలమున బరువుభారములై క్రుంగదీయుచు అడుగడుగున దీర్ఘముగ సాగుచు గడచుటయే కష్టమగును. సుఖదినములు కుదింపు మదింపు తెలుగవు. దీర్ఘములైనను సుఖసంతోషసమయములు కురచలై క్షణముగ తెలియకుండగనే గడిచిపోవును. కష్టసమయముల నవి దీర్ఘాతిదీర్ఘములై గడపశక్యముగానివై క్షణమొక యుగముగా వేధించును. ఇది సర్వజనవిదితము. మిత్రమా! అన్యోన్యప్రణయమున ఇష్టరతుల దేలితిమి. మనోభీష్టముగ భోగము లనుభవించితిమి. జీవితసౌరభము లందుకొంటిమి. మైమఱచి ఆనందరసధునుల వీచికాడోలికల నూగులాడితిమి. దీర్ఘరాత్రులు క్షణముగా గడచిపోయినవి. ఇక నేడో! అవే రాత్రులు విరహతాపమున దుఃఖభారమున దీర్ఘాతిదీర్ఘములై గడచుటయే దుర్ఘటమగుచున్నది. క్షణ మొక యుగముగా బాధాకరమగుచున్నది. ఇక మిగిలెడివి కన్నీటిధారలు! మిత్రమా! నా జీవిత భాగస్వామిని, నా జీవితసౌరభము, నా ప్రాణమునకు ప్రాణము, నా బ్రతుకుతెరువు అగు నా ప్రియసతిదైన స్థితి యిది. జలదా! ఒకపరి వీక్షించిన నీ కంతయు విశదమగును. ఇందు కార్శ్యావస్థ సూచితము. అలంకారము ఉపమ.

అవ. విరహిణి యగు యక్షిణి విషయద్వేష అవస్థావర్ణన-

శ్లో. పాదా విన్దో రమృతశిశిరాన్ జాలమార్గప్రవిష్టాన్
పూర్వప్రీత్యా గత మభిముఖం సన్నివృత్తం తథైవ,
ఖేదాచ్చక్షుః సలిలగురుభిః పక్ష్మభిశ్ఛాదయన్తీం
సాభ్రేஉహ్నీవ స్థలకమలినీం న ప్రబుద్ధాం న సుప్తామ్. 29

అ. జాల-మార్గ-ప్రవిష్టాన్ =గవాక్షమార్గమున ప్రవేశించినవియు, అమృత-శిశిరాన్ =అమృతమువలె చల్లనై ఆహ్లాదకరమైనవియు నగు, ఇన్దోః =చంద్రునియొక్క, పాదాన్= కిరణముల గూర్చి, పూర్వ-ప్రీత్యా =పూర్వపు ప్రీతి (స్నేహము)చే, అభి-ముఖమ్ =ఎదురుగా, గతమ్ = వెళ్ళినదియు, తథా ఏవ =అదేరీతిని, సన్నివృత్తమ్ =వెనుతిరిగినదియు నగు, చక్షుః =నేత్రమును, ఖేదాత్ =దుఃఖమువలన, సలిల-గురుభిః =కన్నీటిచే బరువెక్కిన, పక్ష్మభిః =కనురెప్పలచేత, ఛాదయన్తీమ్ =కప్పుచున్నదియు, సాభ్రే =మేఘావృతమగు, అహ్ని =దివా (పగటి) సమయమున, న ప్రబుద్ధామ్ =వికసించనిదియు, న సుప్తామ్ =ముకుళించనిదియు నగు, స్థల-కమలినీమ్ ఇవ-స్థితామ్= స్థలపద్మినివలెనున్న మత్కాంతను సమీపించుము.

భా. ఆ సమయమున అప్పులే విరోధు లగుదు రను సామెత యున్నది కదా! అక్షరాలా నిజ మది. లోకమున వెన్నెల ఎవరికి ప్రీతి నొసంగదు!

సుఖమీయదు! ఎవరి కాహ్లాదకరము కాదు! ఎవరి హృదయముల రంజింపదు! ఎవరిని మురిపింపదు! వెన్నెల అమృతమయ మందురు. కనుకనే ఎల్లరికి అది ప్రీతి, అహ్లాదకరము, హృదయరంజకము. అంత చల్లదనమున్నది కనుకనే అంత హాయి చేకూర్చును. సేదదీర్చి ఉల్లాస మొనగూర్చును. లోకమందలి జీవులన్నిటికి అత్యంత ఆదరణీయ మది. అందఱును దానికి స్వాగతము పలికెదరు. కాని ఆ చల్లని వెన్నెలయే, ఆ యమృతకిరణములే, విరహిణుల పాలిట ఆరని అగ్నిజ్వాలలు. అత్యంత సంతాపకరములు. ఆహ్లాదము మాట అటుంచుము. భేదమున కవి రాచబాటలు. మిత్రమా! వియోగాత్ పూర్వము ఆ శుభదినముల ఆ శోభనపర్వదివసముల ప్రణయమున మే మన్యోన్యము మెలగునపుడు ఆనందడోలికల నూగునపుడు మత్కాంత, మత్ప్రియతమ ఆ వెన్నెలకు ఆ శీతలచంద్రకిరణములకు నిండుమనసున స్వాగతము పలికెడిది. ఉల్లాసమున ఉబ్బితబ్బిబ్బయ్యెడిది. వెన్నెల యనిన ఆమె కెంతయో ప్రీతి. సంతోషమున ఎదురేగి ఆ చల్లని వెన్నెలకౌగిట ఒదిగిపోయెడిది. వెన్నెలతో నామె దోబూచులాడెడిది. ఆ ఉభయుల అన్యోన్యమైత్రి అట్టిది. ఇక ఇప్పుడన్ననో! తద్భిన్నము. ఎప్పటియట్లు శీతభానుని శీతలకిరణములు మద్గృహగవాక్షములలోనికి ప్రసరించును. పూర్వస్నేహమున నా సతి ప్రీతితో స్వాగతము పలుక నెదురేగి ఆ వెన్నెల వేడితాపమున కామె కన్ను లెట్టబారి ఓర్వజాలక వెంటనే వెనుదిరుగును. ఆ చల్లని వెన్నెలలో అంత వేడి! అంత తాపము. ఎంతలో ఎంత మార్పు. ఆమె కన్నుల నీరు క్రమ్మును. రెప్పలు బఱువెక్కును. కన్నులు మూతబడును. ఆమె అంత తాప మెట్లు భరించగలదు? ఒకప్పుడు మిత్రులు శత్రులగుదు రనుట కింతకంటె సాక్ష్య మేమి కావలెను? ఇంతకంటె నిదర్శనమేల? జలదా! నీకు తెలియనిది కాదు. జలపద్మినియే కాదు, స్థలపద్మిని గూడ యున్నది. అదియు మేఘావృతదివసమున (దానిపాలిట దుర్దినమది) సూర్యరశ్మిలేమి పగలైనను వికసించదు. ముకుళించునా యనిన అదియును కాదు. ముకుళించుటకు రాత్రి కాదు గదా! నా ప్రేయసిదైన స్థితి యది. నిత్యనూతనచైతన్యసంతోషముల నూగులాడెడి నా సతి నేడు నా ప్రవాసమున సంతోష ముడిగి వికసించీ వికసించని స్థలపద్మినిబోలి, నిద్రయూ లేక జాగృతియూ లేక, అలసట జెంది కునుకుచు నిస్త్రాణ నిద్రాణయై పరితపించు నా ప్రియతమను సమీపించుము. ఇందు (అమృతశిశిరాన్) అనుచోట లుప్తోపమ. 'స్థలకమలినీమ్ ఇవ' అనుచోట శ్రౌతీ ఉపమ. ఇట్లుభయమునకు నిరపేక్షతను సంసృష్టి అలంకారము. ఇందు విషయద్వేషాఖ్యమగు షష్ఠదశ సూచితము.

అవ. యక్షపత్నియొక్క ఉత్కటవిరహవేదనావర్ణన-

శ్లో. నిశ్వాసేనాధరకిసలయక్లేశినా విక్షిపన్తీం
శుద్ధస్నానా త్పరుషమలకం నూన మాగణ్డలమ్బమ్,
మత్సంభోగః కథ ముపనయేత్ స్వప్నజోఽపీతి నిద్రా
మాకాంక్షన్తీం నయనసలిలోత్పీడరుద్ధావకాశామ్. 30

అ. శుద్ధ-స్నానాత్ =తైలాదిరహితస్నానముచేత, పరుషమ్ = కర్కశమైన వియు, ఆగణ్డ-లమ్బి = చెక్కిళ్ళపర్యంతము వ్యాపించినవియు నగు, అలకమ్ =చూర్ణకుంతలములను (జాత్యేకవచనము) అధర-కిసలయ-క్లేశినా = కిసలయ (చిగురు) ముల బోలు పెదవుల పీడించుచున్న, నిశ్వాసేన = నిట్టూర్పుచేత, విక్షిపన్తీమ్ = తొలగద్రోయుచున్నది, స్వప్నజః అపి = స్వప్నజనితమైన దైనను, మత్సంభోగః = నాతోడి రతి, కథమ్ = ఏ విధముగా, ఉపనయేత్ =సంప్రాప్తమగునో ఇతి =అని, నయన- సలిల-ఉత్పీడ-రుద్ధ-అవకాశామ్ =కన్నీటి పీడనచే నరికట్టబడిన అవకాశముగల, నిద్రామ్ =నిద్రను, ఆకాంక్షన్తీమ్ = కాంక్షించుచున్న నాప్రియసతిని వీక్షింపుము.

భా. జలదా! ఆమె వియోగపీడిత, నేను ప్రవాసితుడను. అట్టి మాకు సుఖ మెక్కడిది! సౌఖ్య మేది? సంతోష మెట్లుండును? సంతోషమున్నను గదా! అలంకరణలు ఆభరణములు! స్నానమా! తైలరహితము. శిరోజములా! సుగంధ ద్రవ్యసార సమ్మిశ్రిత తైలవిహీనములగుట పరుషములు, కర్కశములు. స్పర్శానుకూలపేశలములు గావు. స్నిగ్ధత ఎట్లు వచ్చును! ఆ కురుల కిక అందచందము లెటనుండి వచ్చును? మిత్రమా! వియోగాత్పూర్వము నీలివు నిగనిగలతోడి ఆ శిరోజములు నేడు రూపు చెడి బిరుసెక్కి గండభాగములపై మూగుచున్నవి. చెక్కిళ్ళపై వ్రాలెడి ఆ కురులను, కుంతలములను ఆమె నిట్టూర్పు ఊష్మవాయువులు మీదికి నెట్టుచున్నవి. ప్రక్కకు త్రోయుచున్నవి. జలదా! మఱియు ఆ వేడి నిట్టూర్పులకు చిగురుటాకులబోలు ఆమె పెదవులు కందుచున్నవి. వాడి వత్తు లగుచున్నవి. నవపల్లవకోమలసదృశములగు ఆమె ఓష్ఠములకు పట్టిన దుర్గతి యది. ఇక భోగములందువా! ప్రణయభోగము లంతరించినవి. రత్యాదులు దూరమైనవి. సాంసారికసుఖములు సున్న. యువతీయువకులము. భోగము లనుభవించుట కనువగు యౌవన మడుగంటుచున్నది. వియోగుల మగుట ప్రత్యక్షానుభవమునకు తావేది? ఇక మిగిలినది స్వప్నసుఖము. నిద్రాజన్య మది. నిద్రయున్నను గదా! స్వప్నము. స్వప్నసౌఖ్యము! స్వప్నరతి! మిత్రమా! నిద్రలేమి అదియు నలభ్యము. ప్రత్యక్షసంభోగ మలభ్యమగుట స్వప్నముననైన నాతోడి

పొందు లబ్ధమగునేమో యను తలంపున మత్సతి నిద్రకై యారాటపడుచున్నది. ఆవేదన పడుచున్నది. ఆ యారాట యావేదనలచే నిద్రకు తావెక్కడిది? దుఃఖమున కన్నీ రుబుకుచున్నది. విధి ఎంత కఠినమైనది. దానికి కనికర మెక్కడిది? ఇంత పగ యేలనో! మే మంతటి దోష మొనరించితిమా! జలదా! నిద్రయందైనను మద్రతి యొనగూడునా యని నిద్రకై తహతహలాడు మత్ప్రియసతి నీ చెలియలను జాగుచేయక పోయి వీక్షించుము. ఇందు కన్నీరు కారుట లజ్జాత్యాగవ్యంజితము. 'అధరకిసలయక్లేశినా' అనుచోట లుప్తోపమ.

యక్షపత్నీశిరోజవర్ణన-

శ్లో. ఆద్యే బద్ధా విరహదివసే యా శిఖా దామ హిత్వా
శాపస్యాన్తే విగళితశుచా తాం మయోద్వేష్టనీయామ్,
స్పర్శక్లిష్టా మయమితనఖే నాసకృత్సారయన్తీం
గణ్డాభోగా త్కఠినవిషమా మేకవేణీం కరేణ. 31

అ. ఆద్యే = మొదటిదగు, విరహ-దివసే =వియోగదివసమున, దామ = పూలమాలను, హిత్వా =విసర్జించి, యా =ఏ, శిఖా= కేశపాశము, బద్ధా = ముడువబడినదో, శాపస్య =శాపముయొక్క, అన్తే=అవసానమున, విగళిత-శుచా =పోయిన దుఃఖముగల, మయా = నాచే, ఉద్వేష్టనీయామ్=విడదీయదగినదియు, స్పర్శ-క్లిష్టామ్= అంటుటకు కఠినమైనదియు, కఠిన-విషమామ్= కాఠిన్యముగ అస్తవ్యస్తమైనదియు నగు, తాం = ఆ, ఏక-వేణీమ్ =పూర్వోక్త కేశబంధమును, అయమిత-నఖేన = పరిష్కార మెఱుగని నఖము (గోరు) లు గల, కరేణ =హస్తముచే, గణ్డ ఆభోగాత్ = విశాలమగు కపోలమునుండి, అసకృత్ =మాటిమాటికి, సారయన్తీమ్ = తొలగించుచున్న మత్ప్రియతమను సమీపించుము.

భా. జలదా! అంగనల కేశాలంకరణ బహువిధమైనది. కేశపాశములు బహుభంగుల గ్రథితములై ముచ్చటలు వెలార్చును. అందచందములు చిలుకును. ఆ రమణీయ కేశబంధములు వాటి యలంకరణలు లలనల కెంతయు మనోరంజకములై ఆనంద మొనగూర్చును. ముదము చేకూర్చును. వారి కవి సౌందర్యపోషకములు. సొగసు లొనగూర్చును. సుగంధితచందనాదితైలము లద్ది రుద్ది అగరుధూపముల తడి యార్చి కమనీయసౌరభముల కుసుమమాలలు గూర్చి ముద్దులొలుక ముడిచిన కేశకలాపముల ముచ్చటలు, మురిపెములు జూచి ఒయ్యారమున మురిసిపోవుట అంగనల స్వభావము. అంతియ కాదు. ప్రియతముల మురిపింతురు. ప్రేక్షకులకు కనువిందు లొనర్తురు. వారి రూపమున కవి మెఱుగులు దిద్దును. వారి వదనముల కవి ముద్దుముచ్చటలు సమకూర్చును. కాని మిత్రమా! మా కా యదృష్ట మెక్కడిది? ఆమె విరహార్త.

వినోదమునకు తావెక్కడిది! ముచ్చట లెచ్చటినుండి వచ్చును! వియోగుల మగుట వియోగిని యగు మత్సతి పూవులు ముడువదు. మాలల కట్టదు. ఆమె వ్రత మది. అగరువలుగులుగాని సుగంధితతైలములుగాని లేవు. ఆమె వాటిజోలికి పోదు. కురులు బిరుసెక్కి పస చెడినవి. సుఖస్పర్శకు తావు లేదు. మార్దవములేని కుంతలము లవి. వియోగప్రథమదివసమున కలిపి బిగించిన ఏకవేణి యది. నేటిదనుక సంస్కార మెఱుగనిది. విదు పెరుగనిది. జలదా! శాపాంతమున దుఃఖరహితుడ నగుచు మోదమున నాచే మోచనీయ మా కేశబంధము. ఆ శిరోజములు సంస్కారహీనము లగుట స్పర్శమాత్రమున అత్యంతబాధాకరములు. చేతి నంటినచాలు అంతలో నామె కంత బాధ. దీర్ఘసమయ మగుట మొదట ముడిచిన ఆ యేకవేణి ఇంచుక ప్రిదిలి విశాలగండభాగమున అస్తవ్యస్తముగ చెదిరినది. అనుదినము అందచందములు సంతరించుకొను ఆమె కరరుహములు (గోళ్ళు) నేడు కత్తిరింపులుగాని రంగుమెఱుగులుగాని యెఱుగవు. కర్కశములు. వాటిస్థితి యది. ఆ కర్కశనఖముల హస్తమున విశాలగండభాగముల చెదిరి వ్యాపించిన కురుల నావల ద్రోయ మత్కాంతను శీఘ్రముగ సమీపించ ప్రార్థన. ఇందు అసకృత్ కేశబంధ అపసారణము చిత్తవిభ్రమదశను సూచించుచున్నది. అలంకారము స్వభావోక్తి.

అవ. యక్షపత్నియొక్క కారుణ్యదశావర్ణన-

శ్లో. సా సంన్యస్తాభరణ మబలా పేశలం ధారయన్తీ
శయ్యోత్సఙ్గే నిహిత మసకృద్దుఃఖదుఃఖేన గాత్రమ్,
త్వా మప్యస్రం నవజలమయం మోచయిష్య త్యవశ్యం
ప్రాయ స్సర్వో భవతి కరుణావృత్తి రార్ద్రాన్తరాత్మా. 32

అ. అబలా=దుర్బలయు, సంన్యస్త-ఆభరణమ్= త్యజింపబడిన ఆభరణములు గలదియు, అసకృత్=తఱచు, దుఃఖదుఃఖేన=అత్యంతదుఃఖముచేత, శయ్యా-ఉత్సఙ్గే=పర్యంక మధ్యభాగమున, నిహితమ్= చేర్చబడినదియు, పేశలమ్=అత్యంతమృదు (పేలవము)వగు, గాత్రమ్=దేహమును, ధారయన్తీ=అతికష్టమున ధరించుచున్నదియు నగు, సా=ఆ నా ప్రియతమ , త్వామ్ అపి= నిన్నును, నవ-జల-మయమ్=నూతనాంబురూపమగు, అస్రమ్= నేత్రజలమును, అవశ్యమ్=తప్పక, మోచయిష్యతి= విడుచునట్లొనర్చును. తథా హి=అవును. ప్రాయః=తరచు, ఆర్ద్ర-అన్తరాత్మా=దయార్ద్రహృదయుడగు, సర్వః= ప్రతివాదును, కరుణా-వృత్తిః=కారుణ్యప్రవృత్తిగలవాడు, భవతి=అగుచున్నాడు.

భా. మిత్రమా! సర్వసాధారణముగా ప్రమదలు ఆభరణప్రియలు, అలంకరణాభిలాషిణులు. అందున మత్కాంత సదా అలంకరణప్రియ. ఆభరణా

భిలాషిణి యామె. కాని నే డామె విరహపీడిత, వియోగిని, సతి. పతి యెడబాటున ఆమెకు భూషణములతో నేమి పని? అలంకరణతో నేమి ప్రయోజనము? భూషణాలంకరణల ప్రయోజనము పతియానంధసంతోషములకే గదా! అదియే ఆత్మసంతృప్తికి హేతువగును. నా ప్రవాసహేతువుగ ఆమెకు భూషణాలంకరణలపై అరుచి జనించినది. మమత అంతరించినది. వాటి నామె త్యజించినది. ఎడతెగని యావేదన వియోగతపన నిరంతరదుఃఖము పేశలశరీరమును మఱియు దుర్బలపరచుచునే యున్నవి. పర్యంకమధ్యమున తనువు జేర్చి అతిభారమున బ్రతుకును వెళ్లబోయుచున్న దామె. ఆమెకు బ్రతుకే భారముగ తోచుచున్నది. మిత్రమా! ఏరికైనను దయనీయమై ఆమె స్థితి జాలి గొల్పక మానదు. అంతవర కెందుకు? నీవైనను ఆమెను వీక్షించిన శోచనీయమగు ఆమె దయనీయస్థితికి బొట బొట కన్నీరు కార్చక మానవు. హృదయము ద్రవీభూతమగుట దుఃఖమాగక విలపింతువు. ఆమె నిన్నుకూడ విలపింపజేయును. ఆమె స్థితి యట్టిది. మిత్రమా! నీవు విస్తృతసంచారివి. ప్రపంచమంతయు చుట్టివచ్చితివి. త్రిలోకజ్ఞుడవు. మానవప్రవృత్తి నాళికంపు చేసుకొంటివి. లోకానుభవ మున్నది. తఱచు ఆర్ద్రహృదయులు దయామయు లెవరైనను ఆచరించున దొక్కటే. ప్రదర్శించునదియు ఒక్కటే. అది కారుణ్యప్రవృత్తి, కరుణావ్యాసంగము. ఆర్తులయెడ ద్రవీభూతహృదయులై సాను క్రోశమున వారి దుఃఖమున పాలు పంచుకొనుట అందరికి తెలిసిన విషయమే. అనంతర విపత్కరదశానివృత్త్యర్థము శీఘ్రముగ గంతవ్యమని భావము. ఇందు చతుర్థచరణమున (ప్రాయః) కోమలహృదయు లందరును కరుణాపూరితచిత్తవృత్తి కలవారే యను సామాన్య ఉక్తిచే తృతీయచరణమందలి (నా ప్రేయసి నీచేగూడ అశ్రుజలములు కార్పించగలదను) విశేషోక్తియొక్క సమర్థనమున, అర్థాంతరన్యాసము. శయ్యోత్సంగమున పేశలశరీరధారణ అశక్తిచే నగుట మూర్ఛావస్థ సూచితము.

అవ. యక్షపత్నియొక్క ప్రేమ ఉత్కటవిరహవేదనావర్ణన-

శ్లో. జానే సఖ్యాస్తవ మయి మనఃసంభృతస్నేహ మస్మా
దిత్థంభూతాం ప్రథమవిరహే తా మహం తర్కయామి,
వాచాలం మాం న ఖలు సుభగమ్మన్యభావః కరోతి
ప్రత్యక్షం తే నిఖిలమచిరాద్భ్రాత రుక్తం మయా యత్. 32

అ. హే మేఘ! = ఓ జలదా! తవ =నీయొక్క, సఖ్యాః = చెలియొక్క, మనః=మనస్సు, మయి=నాయందు, సంభృత-స్నేహమ్ = చక్కగా అమరిన స్నేహముగలది. జానే =ఎఱుగుదును. అస్మాత్ = ఇందువలననే,

ప్రథమ-విరహే=తొలియెడబాటున, తామ్ =నీ చెలియను (మత్పతిని), ఇత్థంభూతామ్ =ఈ (నేజెప్పిన) ప్రకారమైనదానినిగా, తర్కయామి=ఊహింతును. సుభగంమన్య-భావః= అదృష్టవంతుడ నను భావము, మాం =నన్ను, వాచాలమ్ = అధికప్రసంగుడను, న కరోతి ఖలు =చేయజాలదు కదా!, హే భ్రాతః= ఓ సోదరా!, యత్ =ఏది, మయా=నాచే, ఉక్తమ్ = నుడువబడినదో, తత్ =అది, నిఖిలమ్= సర్వమును, అచిరాత్ = అనతికాలముననే, తే =నీకు, ప్రత్యక్షమ్ =ప్రత్యక్షమైనది, భవిష్యతి= కాగలదు.

భా. జలదా! మత్ప్రియతమ సౌందర్యవైభవమును, కళావైదగ్ధ్యమును, శీలసంపదను, అవస్థాభేదములను, విరహవేదనాభరిత ఆధివ్యాధులను, మనోవైక్లబ్యమును ఇంతవరకు నీ కెంతగానో వివరించితిని. ఇట్టి అవస్థ నామె పొందినదని నీవెట్లు నిర్ణయించితివని నీవు ప్రశ్నించవచ్చును. ఎట్లందువా! ఆమె హృదయము నే నెఱుగుదును. ఆమె మనస్సు నాకు విదితము. ఆమె శీలవతి. ప్రేమమయి. అన్యథా భావించకుము. నా చెలి మనసు నాయం దనురాగపూరితము, ప్రేమభరితము, స్నేహమయము. కనుకనే నా కట్టి యూహ జనించినది. నా నిశ్చితాభిప్రాయ మది. అందున ప్రథమవియోగము. దుఃఖాతిదుఃఖము గాన అత్యంతసంతాపకరము. వేదనాభరితము. భరించరాని బాధ. మిత్రమా! అట్టితరి ఆమె ఇక ఎట్లుండును? అంగనలు తమయం దనురక్తు లగుటచే తామెంతయో ధన్యులమని భావించుట అసహజముగాదు. నా సతి సౌందర్యవతి, శీలవతి, స్నేహశీల యను సంతృప్తిచే నే నిట్లూహించుచుంటినని భావించకుము. నేనంత వాచాలుడను కాను. వాచాలత నాకు దూరము. ప్రలపించుట నా కసహ్యము. మిత్రమా! నేజెప్పిన దంతయు యథార్థము. అనతికాలమున నీ కంతయు విశదమగును. నేజెప్పిన దంతయు ప్రత్యక్షమగుట నీవు గుర్తించగలవు. ఇందు తృతీయచరణార్థమునుగూర్చి చతుర్థచరణగతవాక్యార్థము హేతువగుట వాక్యార్థహేతుక కావ్యలింగ మలంకారము.

అవ. యక్షిణి వామనేత్రస్పందనా వర్ణన-

శ్లో. రుద్ధాపాఙ్గప్రసరమలకైరఞ్జనస్నేహశూన్యం
ప్రత్యాదేశా దపి చ మధునో విస్మృతభ్రూవిలాసమ్,
త్వయ్యాసన్నే నయనముపరిస్పన్ది శఙ్కే మృగాక్ష్యాః
మీనక్షోభాచ్చలకువలయశ్రీతులా మేష్యతీతి. 34

అ. అలకైః =ముంగురులచే, రుద్ధ-అపాఙ్గ-ప్రసరం = ఆటంక పరుపబడిన క్రీగంటిచూపుల ప్రసారము గలదియు, అఞ్జన-స్నేహ- శూన్యమ్ =కాటుకయొక్క

స్నిగ్ధత లేనిదియు, అపిచ =మరియు, మధునః =మధువుయొక్క, ప్రత్యాదేశాత్ =నిరాకరణ(సేవించకుండుట) వలన, విస్మృత-భ్రూ-విలాసమ్ =మరచిన కనుబొమల (వైఖరి) విలాసము గలదియు, ఉపరి-స్పంది =మీదిభాగమున అదరునదియు నగు, మృగాక్ష్యాః =లేడిచూపులబోలు చపలవీక్షణములు గల మత్కాంతయొక్క, నయనమ్ =నేత్రము, త్వయి =నీవు, ఆసన్నే సతి =సమీపస్థుడవు కాగా, మీనక్షోభాత్ =మత్స్య చలనమున, చల-కువలయ- శ్రీతులామ్ =కదలియాడు నల్లకలువపూవు సాదృశ్యమును, ఏష్యతి = పొందగలదు, ఇతి =అని, శఙ్కే =ఊహింతును.

భా. జలదా! పతి నెడబాసిన నా కీ యలంకరణాదులతో నేమి పని యని కఠినవ్రతశీలయై వాటికి దూరమైనది నా సతి. వాటి నావల ద్రోసినది. కేశసంస్కారము లేదు. ముంగురు లపరిష్కృతములు. తైలమర్దనములేని కుంతలములు. చక్కదిద్దని ముంగురులు. అస్తవ్యస్తముగ నవి మోముపై వ్రాలి కడగంటిచూపుల నడ్డుచున్నవి. కటాక్షవీక్షణముల కాటంకము లగుచున్నవి. ఇక నయనము లన్ననో! అవి అంజనశూన్యములు. కాటుకద్దని కన్నులవి. మార్దవ మెట్లుండును? స్నిగ్ధతలేని ఆ కన్నులకు కాంతి ఎక్కడిది? మధువా! నిషిద్ధము. పూర్తిగా నిషిద్ధము. ఇక భ్రూవిలాసములు భృకుటీ విభ్రమములు ఎటనుండి వచ్చును? ఇప్పుడా కనుబొమలకు ముడులు, మురుపులు, విరుపులు, ముఱిపములు దూరమైనవి. అవన్నియు విస్మృతములు. మాయమైనవి. మిత్రమా! ఆ కన్నుల కిక మిగిలినది ఒకే యొక శుభలక్షణము, శోభ. సరళస్వభావుడవు. ప్రసన్నరూపుడవు. ఉదారాశయుడవు. నీవు మత్కుశలవార్త నందింప దరిజేర ఉపరిభాగమున ఆమె వామనేత్ర మదురుటయే ఆ శుభలక్షణము. కంటి పైభాగము స్పందించుట! ఆమె మృగాక్షి. విశాలనేత్రి. చక్కని లేడిచూపులు. అందమైన హరిణీవీక్షణములు. జలదా! మత్కుశలవార్త నందింప నీ వామెను సమీపింప ఇంతదనుక రుద్ధాపాంగము, అంజనశూన్యము, విస్మృతభ్రూవిలాసము నగు ఆ కురంగనేత్రి నేత్రవైఖరి ఎట్లుండు ననుకొంటివి? అది స్పందించి అపురూపమగు శోభ నందుకొనును. సౌందర్యగరిమను చేరుకొనును. ఎట్లుందువా? మత్స్యసంచలనమున కదలియాడు కువలయశోభ యది. చేప కదలిక నూగులాడు నల్లకలువ (నీలకమలము) నీలినీడల (నీలవర్ణము) సరితూగు ఆమె నేత్రశోభ అని నే తర్కింతును. ఊహింతును. ఎంత రమణీయమైనదా వీక్షణము! ఆ నయనశోభ! జలదా! ఇదంతయు నీ చలువ యని వేరే నుడువ బనిలేదు. అలంకారము ఉపమ. శిరస్సున స్పందించిన ఛత్రలాభము, లలాటమున చీనాంబరప్రాప్తి. నేత్ర ఉపరిభాగమున ఇష్టసిద్ధి. అపాంగమున హాని సంభవము. అంగనలకు వామభాగము, పురుషులకు దక్షిణభాగము శ్రేష్ఠమని నిమిత్తనిదానము.

అవ. యక్షపత్ని ఊరువర్ణన -

శ్లో. వామశ్చాస్యాః కరరుహపదైర్ముచ్యమానో మదీయై
ర్ముక్తాజాలం చిరపరిచితం త్యాజితో దైవగత్యా,
సంభోగాన్తే మమ సముచితో హస్తసంవాహనానాం
యాస్యత్యూరుః సరసకదళీస్తమ్భగౌరశ్చలత్వమ్. 35

అ. మదీయైః =నావి యగు, కర-రుహ-పదైః = నఖచిహ్నములచేత, ముచ్యమానః =విడువబడినదియు, దైవ-గత్యా = విధివశమున, చిర-పరిచితమ్ =చిరకాలపరిచితమగు, ముక్తా-జాలమ్ = మౌక్తికమణిమయమగు కటిభూషణము, త్యాజితః =త్యజింప (వర్జింప) జేయబడినదియు, సమ్భోగ-అన్తే =సురతాంతమున, మమ =నాయొక్క, హస్త-సంవాహనానామ్ =చేతి (మర్దనము) యొత్తిడులకు, సముచితః = అర్హమైనదియు, సరస-కదళీ-స్తమ్భ-గౌరః =రసముచే ఆర్ద్రిమగు, అరటి కంబమువలె గౌరవర్ణమైనదియు నగు, అస్యాః =ఈ నా ప్రేయసియొక్క, వామ =ఎడమదగు, ఊరుః =తొడ, చలత్వమ్ =చపలత్వమును, యాస్యతి చ =పొందును గూడ.

భా. జలదా! ఏమి చెప్పను! ఆమె ప్రణయిని, ప్రణయోపాసకుడను నేను. ఆమె ప్రేమపూజారిణి. నేను ప్రణయపూజారుడను. ఉభయులము ప్రణయోపాసకులము. అత్యంతాన్యోన్యాకర్షితులము మేము. ఎడబా టెఱుంగని ప్రణయజీవితము మాది. అయిన నేమి! అంతకు ఇంత ఆయె. వియోగమన నేమియో ఎరుంగని మాకు ఇంతటి యెడబా టొనగూడినది. సరససల్లాపములు దూరమైనవి. నర్మభాషణములు కరువైనవి. ప్రణయవీక్షణములకు తావెక్కడిది? ఇక రతిసుఖముల మాట చెప్పనేల! సుఖసౌఖ్యములు దూరమైనవి. ఆనందమునకు చోటు లేదు. విధివైపరీత్యమున మా జీవిత మిట్లు నిస్సారమైనది. మూడు పూవులు ఆరు కాయలుగ నున్న పండువంటి మా సంసారమునకు, గృహజీవితమునకు, దాంపత్య సుఖజీవితమునకు గ్రహణము పట్టినట్లైనది. నవయౌవనము మాది. అయినను యౌవనఫలమునకు దూరమైతిమి. మిత్రమా! మత్ప్రేయసి భూషణప్రియ. అలంకరణయం దాసక్తి మెండు. అయిన నేమి! ఆమె వియోగిని. పతి నెడబాసిన సతికి ఆభూషణములతో నేమి పని? సొమ్ముల సొగసు లెందుకు! సంతోషమున్నను గదా! అలంకరణలు. వలపుచైదములు లేమి నఖక్షతము లంతరించినవి. మౌక్తికసరములు మాయమైనవి. కటిసూత్రములు విసర్జితములు. ఇవి యవి యననేల? భూషణవర్జిత యామె. జలదా! మత్సందేశము గొని నీ వామెను సమీపించ సురతాంతమున మత్కరమర్దనోచితము ప్రాయము సరసార్ద్రిమగుట గౌరవర్ణశోభితకదళీస్తంభసదృశము నగు ఆమె వామయూరువు

శుభసూచకముగ స్పందించును. ప్రాయపు అరటికంబము బోలు ఆమె ఎడమతొడ అదరును. ప్రవాసితు డగు పతి క్షేమవార్త సతి కెంతయు ముదావహము! ఆనందదాయకము! జలదా! అలంకారము ఉపమ.

అవ. యక్షపత్నియొక్క స్వాప్నికసంభోగవర్ణన-

శ్లో. తస్మిన్కాలే జలద యది సా లబ్ధనిద్రాసుఖా స్యా
దన్వాస్యైనాం స్తనితవిముఖో యామమాత్రం సహస్వ,
మా భూదస్యాః ప్రణయిని మయి స్వప్నలబ్ధే కథంచిత్
సద్యః కణ్ఠచ్యుతభుజలతాగ్రన్థి గాఢోపగూఢమ్. 36

అ. హే జలద! =ఓ మేఘుడా! తస్మిన్=నీవు సమీపించు, కాలే =సమయమున, సా =ఆ నాప్రియతమ, లబ్ధ-నిద్రా-సుఖా =ప్రాప్తించిన నిద్రాసుఖము గలది, స్యాత్ యది =అయినచో, ఏనామ్ =నిద్రితయగు ఆమెను, అన్వాస్య =అనుసరించి(వెనుక) యుండి, స్తనిత-విముఖః సన్ =నిశ్శబ్దుడవై, యామ-మాత్రమ్ = ఏడున్నరఘడియలు (ఝామము), ప్రతీక్షస్వ =వేచియుండుము. అస్యాః = ఈమెకు, ప్రణయిని =ప్రియతముడ నగు, మయి =నేను, కథంచిత్ =ఎటులనో అతికష్టమున, స్వప్న-లబ్ధే-సతి =స్వప్నమున పొందబడినవాడను కాగా, గాఢ-ఉపగూఢమ్ =గాఢమగు ఆలింగనము, సద్యః =తత్క్షణము, కణ్ఠ-చ్యుత-భుజలతా గ్రన్థి=కంఠమునుండి జారిన లతలబోలు బాహువులపట్టు గలది, మా భూత్ =కాకుండును గాక!

భా. మిత్రమా! మే మంతగా ఏ పాప మొనరింపకున్నను విధి మా యెడ క్రౌర్యమున వక్రించినది. విధి బలీయమగుట వివశులము. అన్యోన్యప్రణయజీవుల మగు మా కీ కఠినవియోగ మెందుకు? పండువంటి మా యౌవనము ఫలరహితమగుట అత్యంతబాధాకరము. అన్యోన్యము ఒండొరుల కందుబాటునకు దూరమై వియోగదుఃఖమున నిస్పృహకు నికృష్టజీవితమునకు లోనైతిమి. పురుషుడనగుట నేనెట్లో ధైర్య మూని కాలము నెట్టుచుంటిని. అబల యగు నా సతి ప్రబలవియోగభారమున కుసుమసుకుమారమగు జీవితము నెట్లు గడుపుచున్నదోగదా! నిద్ర దూరము; ఆహారము రుచింపదు; నిరంతరచింత. ఏమి చెప్పను! బ్రతుకే భారమైనది. జలదా! మా దయనీయస్థితికి కరుణార్ద్రహృదయుడవై మా కుపకరించు తలంపున మత్సందేశము గొని నీవు మద్భవనము చేరుసరికి మత్ప్రేయసి నిద్రితయై యుండవచ్చును. నీవు ఆమెను సమీపించుసరికి నిదురలేమి కనురెప్పలు బరువెక్కి ఇంచుక మగతనిద్రకు లోనుగావచ్చు. గాఢనిద్రకు తావెక్కడిది? అట్టితరి సద్దు చేయకుము. గర్జించుట (ఉఱుములు) తగదు సుమీ; రాక రాక వచ్చిన నిద్రకు భంగము సుమీ!

నిద్రాభంగమునకు హేతువది. స్వప్నసుఖమున కాటంకము. రాక రాక వచ్చిన నిద్ర. లేక లేక ప్రాప్తించిన స్వప్నసుఖము. ప్రత్యక్షానుభవమునకు తావెక్కడిది? ప్రణయజీవిని యగుట నిరంతరధ్యానమున ప్రియతముడను గాన స్వప్నలబ్ధుడను గావచ్చును. చిరంతనలబ్ధుడ నగు నన్నామె హృదయమున హత్తుకొని కుసుమసుకుమారబాహులతికలను మత్కంఠమున బాగుగా బిగించి గాఢాలింగనమున ఎనలేని చిరకాలసంప్రాప్త స్వప్నసుఖ మనుభవించుచు నైన నుండవచ్చు. అట్టితఱి వెనుకభాగమున యామమాత్రము వేచియుండుము. సద్దుచేసి స్వప్నసుఖమును చెదరనీయకుము. బిగికౌగిలి సడలనీయకుము. ఒక్క జాము వేచియుండుము. ప్రణయజీవులగు యువతీయువకుల సురతప్రక్రియలు, రతిక్రియాకలాపములు యామమాత్రావధికములు గదా! ప్రేమైకజీవులము, ప్రణయపూజారులము. అభాగ్యులము, వియోగులము. మిత్రమా! అంతదనుక నిరీక్షింపుము. ఇందు 'యామమాత్రం సహస్వ' అనుపూర్వార్ధవాక్యమునకు ఉత్తరార్ధవాక్యము హేతువగుట కావ్యలింగము అలంకారము. 'భుజలతా' యనుచోట లుప్తోపమ. ఇట్లుభయమునకు అంగాంగిభావమున సంకరాలంకారము.

అవ. యక్షుడు మేఘునికి సందేశకథనప్రకారము వివరించుట-

శ్లో. తా ముత్థాప్య స్వజలకణికాశీతలే నానిలేన
ప్రత్యాశ్వస్తాం సమమభినవైర్జాలకైర్మాలతీనామ్,
విద్యుద్గర్భః స్తిమితనయనాం త్వత్సనాథే గవాక్షే
వక్తుం ధీరః స్తనితవచనైర్మానినీం ప్రక్రమేథాః. 37

అ. తామ్=ఆ నా ప్రేయసిని, స్వ - జల -కణికా-శీతలేన=భవదీయ (నీ) జలబిందువులచే చల్లనైన, అనిలేన=వాయువుచే, ఉత్థాప్య= మేలుకొలిపి, అభినవైః=క్రొత్తవి యగు, మాలతీనామ్=మాలతీ (జాజి) లతలయొక్క, జాలకైః సమమ్ =మొగ్గలతోబాటు, ప్రత్యాశ్వస్తామ్=పునరుజ్జీవితయు, త్వత్సనాథే =నీతోగూడిన, గవాక్షే =గవాక్ష (కిటికీ) మందు, స్తిమిత-నయనామ్=కదలికలేని చూపులుగలదియు, మానినీమ్=అభిమానవతియు నగు నా ప్రియతమను గూర్చి, విద్యుత్-గర్భః =మెఱుపు (హృదయమున) గర్భమందు కలవాడ వగుచు, ధీరః సన్ =స్థిరుడవై, స్తనిత - వచనైః =గర్జితవాక్కులతో, వక్తుమ్ =ప్రస్తావించుటకు, ప్రక్రమేథాః= ఉపక్రమించుము.

భా. జలదా! స్వప్నసురతానంతరము నా పతి అలసి సొలసి యుండవచ్చును. నీవు చల్లనివాడవు. నీ హృదయము చల్లనిది. నీ హృదయమున చల్లని జలకణములు దాగియుండును. చిరుచినుకులు మది నింపిన నీ వెంతటి చల్లనివాడవు! నవజలకణసేకమున సర్వమును నవచైతన్యవిలసిత మగును. శోభ

రౌణికిసలాడును. తొలకరి మేఘునికి స్వాగత మీయనివా రెవరుందురు? విరుచినుకుల చల్లనైన పిల్లతెమ్మెరల సాయమున మత్ప్రియతమను మెల్లగా మేల్కొలుపుము. అంత మాలతీనవకోరకము (మొగ్గ) భాంతి ఆమెయు శీతలసమీరసంస్పర్శమున అలసట దీరి పునరుజ్జీవిత యగును. జలదా! ఒక్క విషయము! మద్భవనగవాక్ష మధిష్ఠించిన నిన్ను వీక్షించి ఇంచుక విస్మయావిష్ట యగును. నిశ్చేష్ట యగును. నివ్వెరపోవును. ఎవరు వీరు? ఎందుకిచ్చట యని నీ యెడ తెప్పవాల్చక చూపులు నిగుడించవచ్చును. అవును ! ఆమె సతి. మానవతి యామె. అన్యమెఱుగని అభిమానవతి. అనౌచిత్యము సహించజాలని మానిని యామె. ఏకాంతమున తనను చూడవచ్చిన అపరిచయు డీత డెవరను శంక నొడమి ఇంచుక దిగ్భ్రాంత యగును. అంత నివ్వెరపా టొదవ నిబ్బరమగు వీక్షణముల నిన్ను వీక్షింపవచ్చును. మిత్రమా! అంతమాత్రమున ఇదేమి యని తొట్రుపాటు వలదు. మరొక్కమాట! అంతర్లీనవిద్యుత్కుడవు గమ్ము. వెలువకుము సుమీ! విద్యుత్తు (మెఱుపు) దృష్టిప్రతిఘాతము. సందేశము వినుపింప సమర్థుడవు నీవు. మెఱసిన, ఆమె నిన్నెట్లు వీక్షించగలదు? సందేశహరుని వీక్షించు టెంతయు సముచితము గదా! విద్యుత్తు నదిమిపట్టుము. ధీరుడవు కమ్ము. స్ఖలద్వచనములు సాంత్వనములు కాజాలవు. ఓదార్పు నీయజాలవు. విశ్వాసమునకు దూరము లవి. జలదా! నీ నినదము (వాక్కు) లు గంభీరములు. నిర్భయముగ , నిబ్బరముగ మత్ప్రియతమకు మత్కుశలవార్త వినిపింప నుద్యమించుము. ఇందు 'జాలకైః సమమ్' అనుచోట సహోక్తి యలంకారము. 'స్తనిత' మందు వాగారోపణ ప్రకృతోపయోగియగుట పరిణామాలంకారము. అన్యోన్యనిరపేక్షతను సంసృష్టి.

అవ. మేఘునిచే యక్షిణికి తన పరిచయవర్ణన-

శ్లో. భర్తుర్మిత్రం ప్రియ మవిధవే విద్ధి మా మమ్బువాహం
తత్సన్దేశైర్హృదయనిహితై రాగతం త్వత్సమీపమ్,
యో బృన్దాని త్వరయతి పథి శ్రామ్యతాం ప్రోషితానాం
మన్ద్రస్నిగ్ధైర్ధ్వనిభిరబలావేణిమోక్షోత్సుకాని. 38

అ. హే అవిధవే =ఓ సుమంగళీ! మామ్=నన్ను, భర్తుః=నీ ప్రియునియొక్క, మిత్రమ్=స్నేహితుడును, హృదయ-నిహితైః= హృదయమున పదిలపఱచబడిన తత్-సన్దేశైః=అతనియొక్క క్షేమవార్తలతో, త్వత్-సమీపమ్ =నీ సమీపమును, ఆగతమ్=చేరిన, అమ్బువాహమ్ =మేఘునిగా, విద్ధి =తెలియుము. యః =ఏ మేఘుడు, అబలా-వేణీ-మోక్ష ఉత్సుకాని =వియోగినుల కేశబంధ (పాశ) ముల విడదీయుటయం దుత్సుకతగల, పథి=మార్గమున, శ్రామ్యతాం =విశ్రాంతి నందుచున్న, ప్రోషితానామ్ =ప్రవాసితులయొక్క, బృన్దాని =సమూహములను,

మన్ద్రి-స్నిగ్ధైః =గంభీరములు మధురములు నగు, ధ్వనిభిః =గర్జనలచే, త్వరయతి=గృహోన్ముఖులగుటకు త్వరపెట్టుచున్నాడో!

భా. జలదా! వాక్చతురుడవు. చతురవచోనిధివి. శ్రోతల నాకర్షించి త్వదభిముఖీకరణమున నేర్పరివి. నాజాడ తెలియమి మత్ప్రియతమ అత్యంతభయ విహ్వల, ప్రణయవ్యాధిపీడిత. చల్లని పిల్లతెమ్మెరల సేదదీరిన మత్ప్రేయసి నుద్దేశించి మత్సందేశము నిట్లు వినిపింపుము. ఓ భద్రా! సుమంగళీ! సజీవుడు నీ భర్త, క్షేమము నీ పతికి. నీ ప్రియతము డంపగా సందేశము గొనివచ్చిన ఆప్తుడను. ప్రియబాంధవుడను. నీ పతి కత్యంతము కూరిమి చెలికాడను. నే మేఘుడను. అన్యథా భావింపకుము. మిత్రకార్యము నెరపవచ్చిన సుహృదుడ నేను. హృదయమున పదిలపఱచిన త్వద్భర్తృసందేశము గొని ఇట కరుదెంచితి. నిన్ను సమీపించితి. నా యాత్ర సఫలమైనది. నే ధన్యుడను. కృతార్థుడను. కళ్యాణీ! కేవలము వార్తాహరుడను మాత్రమే కాదు. సంధాయకుడను గూడ. నీకు తెలియని దేమున్నది. కార్యధురంధరులు పురుషులు. వారు కార్యసాధకులు. కార్యాంతరమున పరదేశగతులు. వారు అట్లరుగునప్పుడు తమంతతాముగా ముడిచిన అబలావేణీ విబంధనోత్కంఠితు (ఉత్సుకు) లనుమాట నిజమే. కాని మార్గము సుకరము గాదు. పరదేశగతులు పాంథులు. మార్గము దీర్ఘమగుట అలసి సొలసి అట నట విశ్రమింతురు. గృహోన్ముఖులైనను జాగుచేతురు. నే నూరకుందునా! అట్టితరి మృదుమధుర గంభీర (ధ్వనుల) స్వరముల హెచ్చరించి వేగిరపఱతును. అది నా కర్తవ్యమని భావింతును. వియోగిజనసంధాయకుడను.ఇక మిత్రకార్యమన్న వేరుగ చెప్పవలయునా! మిత్రకార్యసాధనకన్న మించిన దేమున్నది? అవిధవే యను సంబోధనము భర్తృసజీవత్వసూచకము. అలంకారము పరికరము.

అవ. యక్షపత్ని సందేశము విను విధానము-

శ్లో. ఇత్యాఖ్యాతే పవనతనయం మైథిలీ వోన్ముఖీ సా
త్వా ముత్కణ్ఠోచ్ఛ్వసితహృదయా వీక్ష్య సంభావ్య చైవ,
శోష్యత్యస్మాత్పరమవహితా సౌమ్య సీమన్తినీనాం
కాన్తోదన్తస్సుహృదుపనతః సఙ్గమాత్కిఞ్చిదూనః. 39

అ. ఇతి=ఈ ప్రకారము, ఆఖ్యాతే సతి = చెప్పినవాడవు కాగా, పవన-తనయమ్ =వాయుపుత్రుడగు హనుమంతుని, మైథిలీ ఇవ =జానకివలె, సా =ఆ నా సతి, ఉన్ముఖీ =ఊర్ధ్వముఖియై, ఉత్కణ్ఠ-ఉచ్ఛ్వసిత- హృదయా =ఔత్సుక్యముచే వికసించిన హృదయము కలదై, త్వామ్= నిన్ను, వీక్ష్య= చూచి, సంభావ్య చ=గౌరవించియు, అస్మాత్ = భర్తృమైత్రీకారణమువలన,

పరమ్=మీదట సర్వమును, అవహితా సతీ = సావధానచిత్త యగుచు, శ్రోష్యతి ఏవ =విననే వినును. హే సౌమ్య! =ఓ సాధుస్వభావా! సీమన్తినీనామ్ =అంగనలకు, సుహృత్- ఉపనతః =మిత్రునిద్వారా కొనిరాబడిన, కాన్త-ఉదన్తః= ప్రియతమవృత్తాంతము, సఙ్గమాత్ =ప్రియతమసమాగమము కంటె, కించిత్= కొంచెము, ఊనః =తక్కువ.

భా. జలదా! నేను అప్పుడను, పతి సందేశము గొనివచ్చిన మిత్రుడ నని నీవు నుడువుటయే తడవుగ మత్సఖి ఉన్ముఖి యగును. ఉత్సుక యగును. ఉత్కంఠితయై మోము పైకెత్తి (ఆకాంక్ష) ఆతురతతో నీవంక తేరి పారజూచును. మత్ క్షేమవార్తకు చెందిన నీ పలుకులు ఆమె వీనులకు విందులై అమృతపు చినుకులవలె సోకును. ఔత్సుక్య మతిశయించ శ్రద్ధగా ఆలకించును. ఆమెహృదయము స్వస్థత జెందును. వింటివిగదా! వాడు పవననందనుడు, మారుతి నెఱపిన సందేశము! ఇటు సతీవియోగమున రామచంద్రుని హృదయపరితాపము. అటు పతి నెడబాసిన పావని మైథిలి యావేదన. హనుమంతు డట్లు రామసందేశము కొని జలనిధి దాటి లంక జేరి అశోకవని జొచ్చి దుఃఖిత యగు సీతకు వినిపింప నామె ఉత్కంఠ మేరమీర ఔత్సుక్యమున అశ్రులు చింద ఆప్యాయతను చేరబిలిచి ఆదరమున ఆలకించినది. తద్విధమున మత్సతియు మత్సందేశము గొనివచ్చిన విన్ను ఉత్సుకతను వీక్షించి భర్తృమైత్రీకారణముగ ఆదరించి ఆ మీదట సర్వమును అప్రమత్తచిత్తయై ఔత్సుక్యమున ఆలకించును. జలదా! వార్తాశ్రవణమాత్రమున ప్రయోజన మేమని భావించకుము. చులకన చేయకుము. వియోగమున సతీపతులు ప్రణయపీడితులై అన్యోన్యాపేక్షితులై కాలము నెట్లో వెళ్ళబుచ్చెదరు. అట్టియెడల అంగనలకు సుహృజ్జనసమానీతమగు భర్తృవార్తాశ్రవణము కర్ణపేయ మగును. అది అత్యంతహృదయాహ్లాదకరము. అంతేకాదు. అన్యోన్యప్రణయసమాగమము (కలయిక) కంటె ఈషన్మాత్రము తక్కువ. తత్తుల్యమునకు ఇంచుక భిన్నము. ఇందలంకారములు ఉపమ అర్థాంతరన్యాసములు. ఉభయమునకు సంసృష్టి.

అవ. యక్షుడు మేఘునిద్వారా పంపెడి సందేశవివరణ-

శ్లో. తామాయుష్మన్ మమ చ వచనా దాత్మన శ్చోపకర్తుం
బ్రూయా ఏవం తవ సహచరో రామగిర్యాశ్రమస్థః,
అవ్యాపన్నః కుశల మబలే పృచ్ఛతి త్వాం వియుక్తః
పూర్వాభాష్యం సులభవిపదాం ప్రాణినా మేతదేవ. 40

అ. హే ఆయుష్మన్= కలకాలము వర్ధిల్లు నో జలదా!, మమ =నాయొక్క,

వచనాత్ చ =ప్రార్థనవలనగాని, ఆత్మనః =నిన్ను నీవు, ఉపకర్తుం చ=పరోపకారమున కృతార్థునిగా చేయు తలంపునగాని, తామ్ =నా ప్రేయసి నుద్దేశించి, ఏవమ్ =ఈ ప్రకారము, బ్రూయాః= పలుకుము, హే అబలే! =ఓ అబలా! విరహపీడితా!, తవ =నీయొక్క, అనుచరః =సహచరుడు, రామగిరి-ఆశ్రమ-స్థః =చిత్రకూటాశ్రమముల నున్నవాడై, అవ్యాపన్నః =నిరపాయముగ నున్నవాడై, త్వాం =నిన్ను, కుశలమ్ =క్షేమమును, పృచ్ఛతి = అడుగుచున్నాడు. సులభ-విపదామ్= నిర్నిమిత్తముగ ఆపదపాలైన, ప్రాణినామ్ =ప్రాణులకు, ఏతత్-ఏవ =ఈ కుశల ప్రశ్నయే గదా! ఆద్య-ఆభాష్యమ్ =ముందుగా అడుగతగినది.

భా. ఆయుష్మంతుడా! నీవు ధన్యుడవు. పరోపకారిత్వమున నీ జీవితము ధన్యత నొందినది. తత్కారణమున నీవు చిరంజీవివి. నీ ప్రతిష్ఠ ఇనుమడించినది. నీవు శ్లాఘ్యుడవు. ప్రశంసాపాత్రుడవు. విరహిణీవిరహులకు నీవు సంధానకర్తవు. జీవనప్రదాతవు. బాధితులపాలిటి ఆప్తబంధుడవు. జీవనప్రదానము నీ జీవితపరమార్థము. ధ్యేయము. జలదా! మా స్థితి, అవస్థ నీకు తెలియనిది కాదు. దైన్యమున అర్థించితి. సందేశము గొనిపొమ్మని ప్రార్థించితి. అకారణముగ కాని లేక పరోపకారము నీ సహజస్వభావ మగుటవలనగాని కారణ మేదియైనను మత్కాంతకు నా కుశలవార్త నందింపుము. అతిశయోక్తుల బనిలేదు. దాచవలసిన దంతకంటెను అగపడదు. ఉన్నదున్నట్లు ఇంచుమించులు లేక నా మాటగా ఆమె కిట్లు వాక్రుచ్చుము. ఓ యబలా! నీ పతి, నిన్నంటి చరించు నీ ప్రియతముడు, చిత్రకూటాద్రి పరిసర ఆశ్రమముల నిరపాయుడు. ప్రమాదరహితుడు. సజీవుడు. అయిన నేమి? వియోగతాపసంతప్తుడు. ఉత్సాహచైతన్యము లంతరించినవి. నిస్సారమైన బ్రతుకు. ఎట్టెటులనో కాలము నెట్టుచున్నాడు. నీక్షేమ మర్థించుచున్నాడు. నీ కుశల మాశించుచున్నాడు. ఇంతకంటె మరేమి చెప్పను? ఇక నీ పరితాప మన్ననో నాకు తెలియనిది కాదు. విరహసంతప్తవు నీవు. కృశించిన నీ దేహ మా విషయమును చాటుచునే యున్నది. అయినను ఇంతకంటె ఆశించున దేమున్నది? విధివంచితులు నిర్హేతుక (సులభ) దుఃఖభాజనులగు మందభాగ్యులకు కుశలప్రశ్నయే గదా! ఆద్యవచనము. మొదటిప్రశ్న. ఇంతకంటె వేరుప్రశ్న మరేమి కలదు? ఇందలంకారము అర్థాంతరన్యాసము.

అవ. యక్షిణీయక్షుల సమాన అవస్థావర్ణన-

శ్లో. అఙ్గేనాఙ్గం ప్రతను తనునా గాఢతప్తేన తప్తం
సాస్రేణాశ్రుద్రుతమవిరతోత్కణ్ఠముత్కణ్ఠితేవ,
ఉష్ణోచ్ఛ్వాసం సమధికతరోచ్ఛ్వాసినా దూరవర్తీ
సఙ్కల్పైస్తైర్విశతి విధినా వైరిణా రుద్ధమార్గః.

అవ. యక్షుని సందేశకథనము-

శ్లో. శబ్దాఖ్యేయం యదపి కిల తే యః సఖీనాం పురస్తాత్
కర్ణే లోలః కథయితుమభూ దాననస్పర్శలోభాత్,
సోఽతిక్రాన్తః శ్రవణవిషయం లోచనాభ్యా మదృశ్యః
స్త్వా ముత్కణ్ఠావిరచితపదం మన్ముఖేనేద మాహ. 42

అ. హే అబలే! ఓ కృశాంగీ, యః =ఏ నీ పతి, తే =నీయొక్క, సఖీనామ్ =చెలులయొక్క, పురస్తాత్ =ఎదుట, యత్ =ఏ విషయము, శబ్ద-ఆఖ్యేయమ్ - అపి =బహిర్గతముగ వెల్లడించ తగినదైనను, తత్ అపి =దానినిగూడ, ఆనన-స్పర్శ-లోభాత్ =మోము చుంబించు లోభత్వమున, కర్ణే =కర్ణమున, కథయితుమ్ =చెప్పుటకు, లోలః =చపలుడు, అభూత్ = ఆయెనో, శ్రవణ-విషయమ్ = కర్ణపథమును, అతిక్రాన్తః =అతిక్రమించినవాడు, లోచనాభ్యామ్ = నయనములచేతను, అదృశ్యః =చూడబడనివాడు నగు, సః కిల= అ నీ కాంతుడే సుమా! ఉత్కణ్ఠా- విరచిత పదం= ఔత్సుక్యముచే రచింపబడిన పదములు గల, ఇదమ్ =ఈ సందేశమును, మత్ - ముఖేన =నా మోముద్వారా, త్వాం =నిన్ను గూర్చి, ఆహ =పలికెను.

భా. ఓ యబలా! అరమరికలు లేని స్నేహము మాది. దాపరిక మెఱుంగని మిత్రత్వము. మీ ప్రణయప్రకియలు సంకేతముగ నీ ప్రియు డంపిన సందేశము గొనివచ్చితి. అప్పుడ నగుట మీ అన్యోన్యప్రణయము, అనురాగప్రకటనము నా కెంతయు సువిదితము. ఎట్లందువా? చెలుల సమక్షమున చాటిచెప్పుట కనువైనదైనను అతనికంతయు రహస్యమే. కారణము? లుబ్ధత్వము, లోలుపత్వము, లాలసత్వము, రహస్యమను నెపమున కర్ణపథమున మోముంచి అందమైన నీ మోము చుంబించు టతని యాకాంక్ష. ప్రగాఢమైన కోరిక. సదా ఆ యానంద మతడు కోరునది. నీ వదనచుంబనలోలుపత్వమే అందుకు కారణము. ఆ లోభత్వమే దానికి హేతువు. మీ అన్యోన్యప్రణయమున కది చక్కని తార్కాణము. విధి వైపరీత్యమున మీరు దూరమైతిరి. అన్యోన్యము ఒండొరుల సమక్షమున పలుకుటకు గాని, ఆలకించుటకు గాని వలనుపడదు. విధి దాని కడ్డుపడును. వినికిడికి అందక , చూపులకు దూరమై, అన్యోన్యము విరహపీడితులై తపన మొందెదరు. ఓ కృశాంగీ! నీ పతి నీ ప్రియుడు ఔత్సుక్యమున ఉత్కంఠతను రచించి అందించిన ఆ సందేశము నాలకించుము. వదనము నాది. మాట లతనివి. నేను నిమిత్తమాత్రుడను. నన్నంతరము జేసి నీ కాంతు డంపిన సందేశ మిది. అతడే పలుకునది. వివరించునదియు అతడే.

అవ. యక్షపత్నియొక్క సౌందర్యవర్ణన-

శ్లో. శ్యామాస్వఙ్గం చకితహరిణీప్రేక్షణే దృష్టిపాతం
వక్త్రచ్ఛాయాం శశిని శిఖినాం బర్హభారేషు కేశాన్,
ఉత్పశ్యామి ప్రతనుషు నదీవీచిషు భ్రూవిలాసాన్
హన్తైకస్మిన్ క్వచిదపి న తే చణ్డి సాదృశ్యమస్తి. 43

అ. శ్యామాసు = ప్రియంగు లతలయందు, తవ =నీయొక్క, అఙ్గం=శరీరమును, చకిత - హరిణీ--ప్రేక్షణే =భీతిజెందిన హరిణి (ఆడలేడి) యొక్క చూపులయందు, తే =నీయొక్క, దృష్టి-పాతమ్ = వీక్షణవిన్యాసమును, శశిని =శశాంకునియందు, వక్త్రచ్ఛాయామ్ = వదనకాంతిని, శిఖినామ్ =మయూరముల యొక్క, బర్హభారేషు = చిక్కని పింఛభారములయందు, కేశాన్ =కేశపాశములను, ప్రతనుషు =అల్పములగు, నదీ-వీచిషు =నదీతరంగములయందు, భ్రూ- విలాసాన్ =కనుబొమలతీరును, ఉత్పశ్యామి =ఉత్ప్రేక్షింతును. హే చణ్డి! =ఓ ప్రచండప్రణయకోపినీ!, హన్త! =అయ్యో!, క్వచిదపి = ఎచ్చటను, ఏకస్మిన్ =దేనియందును, తే =నీయొక్క, సాదృశ్యమ్ =పోలిక, న అస్తి =లేదు (అగపడదు).

భా. ప్రియతమా! ఏమి చెప్పను! పాడుదైవము కారణముగ మన ప్రణయజీవితమున కడ్డుగోడ లుదయించినవి. అవధు లేర్పడినవి. నిదుర లేదు. నిర్వృతి లేదు. పునస్సమాగమమున కింకను వ్యవధి తీరదు. ప్రత్యక్ష అన్యోన్యవినోదమునకు తావెక్కడిది? నీ రూపసామ్యమున కెంతయు వెదకి చూచితిని. కాని అది కరువైనది. అందు వినోదించుటకు పరితపించితిని. ఎందైనను నీ పోలిక లుండకుండునా యని మఱీ మఱీ తఱచిచూచితిని. — ఒకటొకటిగ ఉపమానవస్తువులను పరికించి పరీక్షించితిని. నీ మేను తీరుతెన్నులు, నీ చూపుల ఇంపుసొంపులు, నీ కేశకలాపముల వింతసొరులు మోహజనకములగు నీ భ్రూవిభ్రమములు, విలాసవైఖరులు, నీ వదనసౌరభసౌందర్యములు ఎచ్చటను అగుపడవు. వాటి కంతటను కఱువు. నీ రూపసామ్యమున ఉపమానద్రవ్యసాహాయ్యమున ఇంచుక వినోద మాశించితిని. ఊరట జెంద నూహించితిని. పరితాప మపనయించ గోరితిని. కాని హతాశుడను. ప్రేయసీ! ప్రియంగులతలు మార్దవమునకు, సౌకుమార్యమునకు హద్దు లందరు. కాని నీ యంగ(శరీర)సామ్య మించుకంతయు అం దగపడదు. ఏమి ప్రయోజనము! భీతహరిణీవీక్షణము లత్యంతచంచలము లనియు, రమ్యము లనియు ప్రతీతి. కాని ఆ యాడులేడి బెదరుచూపులు గూడ నీ చూపులతీపులకు సరితూగవు. ఏమి లాభము! ఇక నీ చిక్కని శిరోజముల కేశపాశముల వైఖరు లందునా! అవి వింతసొరులు నింపుచుండును. వింతరంగుల మయూరపింఛములు

అందచందములకు సంకేతము లందురు. తరచి - తరచి చూచితిని వాటి పోలికలు. అయినను అ బర్హిబర్హణములు నీ కేశపాశరుచులకు ఈడు రావు. ఇంచుకంతయు సరితూగవు. ఇక మిగిలినవి భ్రూవిభ్రమ విలాసవైఖరులు. ఇట ప్రవహించు సెలయేఱుల చిఱుతరగల సొగసులతో పోల్చి చూచితిని. నిస్పృహ జెందితిని. ఎక్కడ ఆ భ్రూవిభ్రమవిలాసవైఖరులు! మఱియెక్కడ ఈ చిఱుతరగల సొగసులు! తరతమభేద మెంతయో యగపడుచున్నది. మఱి మోమునకైనను ఎందైన సాటి యగపడునా యని గంపెడాశతో వెదకి వెదకి చూచితిని. ఆణిముత్తెపుసొరులు నింపు నీ మోము తీరుతియ్యములకు మచ్చతోడి ఆ పున్నమచందురుని తీరెట్లు సరితూగగలదు? ఏమి సేతును! తీరని పరితాపము! నిర్వృతి లేదు. ఇట్లనుట అనుపమసౌందర్యసూచకము. చండీ! నే సజీవినై యుండ పోలిక లరయుచుంటివా యని క్రోధమొందకుము. విరహమున వినోదించుట కంతకంటె మఱి మిగిలిన దేమున్నది! తన పరోక్షమున ప్రియుడు భావదృష్టిని అన్యకాంతల వీక్షించిన ప్రమదలకు ప్రణయకోప మధికము. యక్షుడు రూపసామ్యమున ప్రియంగులతాదుల వీక్షించుట యక్షిణికి కోపకారణమైనది. కనుకనే కవి యక్షునినోట చండీపదప్రయోగ మొనరించినాడు. ఇందు ప్రియురాలి అంగసదృశములగు ప్రియుంగులతాదివస్తుసందర్శనమున ప్రేయసీరూపస్మృతి కలుగుట స్మరణాలంకారము. సదృశ, ప్రతికృతి, స్వప్నదర్శన, తదంగస్పర్శ, ఈ నాలుగు విరహిజనవినోదస్థానములు. ఇందు రెండవది ప్రతికృతి.

అవ. యక్షునియొక్క ప్రేయసీచిత్రరచనావర్ణన-

శ్లో. త్వా మాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగై శ్శిలాయా
మాత్మానం తే చరణపతితం యావదిచ్ఛామి కర్తుమ్,
అస్రైస్తావ న్ముహురుపచితై ర్దృష్టి రాలుప్యతే మే
క్రూర స్తస్మిన్నపి న సహతే సఙ్గమం నౌ కృతాన్తః. 44

అ. ప్రియతమా! ధాతు - రాగైః =గైరికాది రంజనద్రవ్య(ద్రవ)ములతో, ప్రణయ-కుపితామ్ =ప్రణయక్రోధ మూనిన, త్వాం =నిన్ను, శిలాయామ్ =రాతిఫలకమున, ఆలిఖ్య =చిత్రించి, యావత్ = ఎంతలో, ఆత్మానం = నన్ను , తే =నీయొక్క, చరణ-పతితం =పాదములపై పడినవానినిగా, కర్తుం =చేయుటకు, ఇచ్ఛామి = ఇచ్ఛయింతునో, తావత్ = అంతలో, ముహుః = మాటిమాటికి, ఉపచితైః =పొరలి వచ్చెడి, అస్రైః=అశ్రువుల (కన్నీటి)తో, మే = నాయొక్క, దృష్టిః =చూపు, ఆలుప్యతే =లోపించుచున్నది. క్రూరః =కనికర మెఱుగని , కృతాన్తః=దైవము, తస్మిన్ అపి =చిత్తరువునందును, నౌ =మనయొక్క, సంగమమ్ = సహవాసమును, న సహతే =సహించుట లేదు.

అ. ప్రియతమా! నీ యంగసామ్యమున, నీ రూపసాదృశ్యమున ఇంచుక రమింపవచ్చుననియు, ఊరట చెందనోపుననియు భావించి ఇట్లు చేసితిని. అట్లూహించితిని. ఉత్ప్రేక్షించితిని అని యంటిని గదా! అంతమాత్రమున నీకు ప్రణయకోప మావహించి యుండవచ్చును. నే సజీవినై యుండ నా పరోక్షమున నా రూపసామ్యము నెంచుచుంటివా యనియు, మన ప్రణయమునకు ఫల మిదియేనా? అనియు నాపై నీకెంతయో క్రోధ ముదయించి యుండనోవు. అవును! అది సహజము. కాదనను. తాను మనసార ప్రేమించిన ప్రియుడు తన పరోక్షమున అట్లాచరించుట ఏ మానిని సహించగలదు! ప్రేమాతిశయమునకు ప్రతిరూప మది. ప్రతిక్రియ యది. ఊరట లేక మనశ్శాంతికై అట్లూహించితిని. పశ్చాత్తప్తుడను. జరిగిన దేదో జరిగినది. ఇక నీ ప్రతికృతి, నీ యాకారము, నీ యపురూప సౌందర్యము నైన ఇంచుక చిత్రించి ఊరట జెంద నూహించి ఎట్టకేలకు అతికష్టమున గైరికాదిధాతురసమున వర్ణసంకలనమున అంజనద్రవ్యసాహాయ్యమున రాతిఫలకమందు నిర్దుష్టమగు నీ రూపకల్పన జేసితిని. అతిలోకసౌందర్యవతి వగు నిన్ను చిత్రించు టెవరి తరము! ఎంత కష్టమది! నీ ప్రకృతిప్రతికృతులకు సామ్య మెచ్చట గలదు! సామ్య మెఱుగని నీ యంగసాదృశ్య మరయుట ఎంత యవివేకము! ఆ యపచారమునకు ప్రాయశ్చిత్తముగ నీ ప్రతికృతికి సరసన నా ప్రతిరూపము నిలిపి నీ పాదము లంటునట్లు నన్ను చిత్రింప నూహించినంతలో నా కన్నులు చెమ్మగిల్లినవి. ఎడతెగని యశ్రుబిందువు లావరించినవి. దృష్టిపథము లోపించినది. ఇక చిత్రరచన యెక్కడిది? ప్రియతమా! విధి యెంత బలీయము! ఎంత కఠినమైనది! దైవ మెంత క్రూరమైనది. చిత్తరువున గూడ మన కలయిక నోర్వజాలదు. చిత్రరచన సాగనీయదు. ఇక ప్రత్యక్షసంగతి సహవాసము నెట్లోర్వగలదు? విధివంచితులము. ఇందు (తస్మిన్ అపి) అనుపదమున అర్థాపత్తి యలంకారము.

అవ. యక్షునియొక్క స్వప్నదర్శనచిత్రీకరణము-

శ్లో. మా మాకాశప్రణిహితభుజం నిర్దయాశ్లేషహేతో
ర్లబ్ధాయాస్తే కథమపి మయా స్వప్నసందర్శనేషు,
పశ్యన్తీనాం న ఖలు బహుశో న స్థలీదేవతానాం
ముక్తాస్థూలా స్తరుకిసలయే ష్వశ్రులేశాః పతన్తి. 45

అ. స్వప్న-సందర్శనేషు=స్వప్నావస్థలయందు, మయా =నాచేతను, కథమ్ అపి =అతికష్టమున, (ఎటులనో) లబ్ధాయాః = పొందబడిన, తే =నీయొక్క, నిర్దయ-ఆశ్లేష-హేతోః =గాఢాలింగనార్థము, ఆకాశ-ప్రణిహిత -భుజమ్=శూన్య మున ప్రసారితబాహువులు గల , మామ్=నన్ను, పశ్యన్తీనామ్ =వీక్షించుచున్న,

స్థలీ-దేవతానాం= వనదేవతలయొక్క, ముక్తా-స్థూలాః =ముత్తెములవలె స్థూలము లగు, అశ్రు-లేశాః =కన్నీటిబిందువులు, తరు-కిసలయేషు = చెట్లచిగుళ్ళయందు, బహుశః =తరచుగా, న పతన్తి న ఖలు = పడకుండుటలేదు కదా!

భా. ప్రియతమా! ప్రణయైకజీవులము, ఒండొరుల విడిచి యెఱుగము, విధివశమున దూరమైతిమి. ప్రవాసితులము. దుర్విధిచైదము. ఏమి చేతుము! వివశులము. ప్రత్యక్షానుభవమునకు తావు లేదు. జగత్తు. స్వప్నమందలి యానందము. అదియును అందుబాటున లేదు. నిదుర ఉండిన గదా స్వప్నము! అందలి యానందము! విరహిణులకు స్వప్న మెక్కడిది? విరహతాపమున ఉస్సురుస్సురను వియోగులకు నిద్ర యెట్లుండును. స్వప్న మెట్లు వచ్చును? అయినను ప్రియతమా! ఎల్లకాలము నిదుర రాకుండునా! ఎట్లో ఎడమెడమ అల్పనిద్ర. రాకరాక వచ్చు మగతనిద్ర. అందు మధురస్వప్నము. ఆ స్వప్నమున మత్సమక్షమున ప్రత్యక్షమగు నీ రమణీయ మనోహర రూపసంపద! ఇక నా సంతోషమునకు హద్దు లెక్కడివి! ఆనందమునకు అవధులెక్కడివి? ఎన్నాళ్ళకీ పునస్సమాగమము! ఎట్లూరకుందును! స్వప్నలబ్ధమగు నిన్ను మనసార హృదయమున గట్టిగా హత్తుకొని గాఢాలింగన మొనర్ప గంపెడాసతో హస్తములు ప్రసారింతును. బాహుబంధముల బిగింప నూహింతును. ఏమి ప్రయోజనము! అంతయు శూన్యము. శూన్యమున నీ ప్రాపుకై ఆశతో పెనుగులాట యది. నిజమని భావించిన నీవట లేవు. అదీ నా దైన్యస్థితి. దయనీయపరిస్థితి. దుస్థితి. దానికి వనదేవతలు సాక్షులు. నా దుస్థితికి వారెంతయు దుఃఖితులు. వారి నయనముల అశ్రులు చిందువారును. అవి ఆణిముత్తెములవలె రాలి తరుకిసలయముల జాలువారును. మహాత్ముల కన్నీరు పుడమిపై పడరాదు. అది అనర్థమునకు హేతువు. 'మహాత్మగురుదేవానా మశ్రుపాతః క్షితౌ యది, దేశభఙ్గో మహాదుఃఖం మరణం చ భవేద్ధ్రువమ్' ఇతి. పుడమిపై దేవతాశ్రుపాతనిషేధ దర్శనమున యక్షుని మరణాభావసూచనార్థము తరుకిసలయముల బడుచున్నవని నుడువబడినది. 'ముక్తాస్థూలాః' అనుచోట లుప్తోపమ.

అవ. యక్షుని హిమగిరివాయువుయొక్క ఆలింగనవర్ణన-

శ్లో. భిత్త్వా సద్యః కిసలయపుటాన్ దేవదారుద్రుమాణాం
యే తత్క్షీరస్రుతిసురభయో దక్షిణేన ప్రవృత్తాః,
ఆలిఙ్గ్యన్తే గుణవతి మయా తే తుషారాద్రివాతాః
పూర్వం స్పృష్టం యది కిల భవేదఙ్గమేభిస్తవేతి. 46

అ. దేవదారుద్రుమాణామ్=దేవదారువృక్షములయొక్క, కిసలయ - పుటాన్=

పల్లవపుటములను, సద్యః=అప్పుడే, భిత్వా =భేదించి, తత్ క్షీర-స్రుతి-సురభయః=ఆ దేవదారుద్రుమముల క్షీరస్రావములచే సురభితములగు, యే=ఏ, తుషార-అద్రి-వాతాః=హిమగిరి వాయువులు, దక్షిణేన=దక్షిణదిశగా, ప్రవృత్తాః=పయనమైనవో, హే గుణవతి!=ఓ శీలవతీ!, ఏభిః=ఈ వాయువులచే, తవ=నీ యొక్క, అఙ్గమ్ =శరీరము, పూర్వమ్ =ముందుగా, స్పృష్టమ్ = స్పృశింపబడినది, భవేద్ యది కిల ఇతి=అయియుండును గదా యని, మయా=నాచేతను, తే=ఆ వాయువులు, ఆలిఙ్గ్యన్తే=ఆలింగనమొనరింప (సేవింప) బడుచున్నవి.

భా. ప్రియతమా! మందభాగ్యుడను. విధివంచితుడను. నా కీ దుర్దినము లెట్లు గడుచును? నేను స్వర్గసౌఖ్యమును కోరలేదు. భోగభాగ్యముల చెంత కరుగలేదు. నే గోరినది నీ సాన్నిహిత్యము. నీ సన్నిధానము. నీ ప్రవిమలప్రణయభావము. విధిపాలిట కదియే వికటమైనది. అంతమాత్రమున కింత కాఠిన్యమేల! దానికి విప్రయోగమా! ఎంత దారుణము! స్వప్నసుందరివగు నీ ప్రేమబంధముగూడ దుర్లభమైనది. స్వప్నమునగూడ నీ చెలిమి నీ ప్రావు నీ యాలింగనము సహించరానిదైనది. ఆ క్రూరదైవము నేమందుము? ఓ గుణవతీ! ఇక నాకు మిగిలిన దేమున్నది! వియోగము విరహతాపము తక్క. దక్షిణమునకు ప్రసరించు ఈ హిమగిరివాయువులే నా కిక శరణ్యములు. అవియే నా కించుక శాంతిదాయకములు. అవియే ఇంచుక యూరట కలిగించును. ఏలయన ఉత్తరమున నీ యునికి, దక్షిణమున నే నుంటివి. హిమగిరిపవనములు అట ఏపుగా బెరిగిన దేవదారువృక్షముల ఆకుజొంపముల కిసలయపుటములను భేదించి అందుండి జాలువారు క్షీరసౌరభములు గ్రహించి ఘుమఘుమాయమానము లగుచు దక్షిణమునకు పయనించు, మున్నవి నీమేను సోకినవగుట నా కవి అత్యంతమోదదాయకము లగుచున్నవి. వాటివి నే నాప్యాయమున కౌగిలింతును. ప్రీతిపూర్వకముగ ముందుగా నీమేను సోకిన ఆ దేవదారుక్షీరసురభిత హిమగిరివాయువులకు స్వాగత మీయజాలుతును. నా కవియే శరణ్యములు, శాంతిదాయకములు. వాయువు అశరీరి. ఆలింగన మెట్లు సంభవము అను ప్రశ్న వలదు. యక్షు డున్మత్తుడు. ఉన్మత్తుని ప్రలాప మది.

అవ. యక్షుని విరహ ఉత్కంఠతా వర్ణన-

శ్లో. ధారాసిక్తస్థలసురభిణ స్త్వన్ముఖ స్యాస్య బాలే  
దూరీభూతం ప్రతనుమపి మాం పఞ్చబాణః క్షిణోతి,  
ఘర్మాన్తే ౽స్మి న్విగణయ కథం వాసరాణి వ్రజేయు  
ర్దిక్సంసక్తప్రవితతఘనవ్యస్తసూర్యాతపాని.

అ. హే బాలే!=ఓ ప్రేయసీ!, పఞ్చబాణః= మన్మథుడు, ధారా-సిక్త-స్థల-సురభిణః=వర్షధారల తడిసిన పృథివీగంధము గల, అస్య=ఈ సుందరమగు, తవ=నీ, ముఖస్య=వదనమునకు, దూరీభూతమ్=దూరమం దున్నవాడనై, ప్రతనుమ్ అపి=కృశించిన శరీరము కలవాడనైనను, మామ్=నన్ను, క్షిణోతి=వేధించుచున్నాడు. అస్మిన్=ఈ ఘర్మ-అన్తే=వేసవి అంతమందు, దిక్-సంసక్త-ప్రవితత-ఘన-వ్యస్త-సూర్య-ఆతపాని=దిక్కులనంటి వ్యాప్తిజెందిన మేఘములచే కప్పబడిన సూర్యునియొక్క ఆతపము (ఎండ) గల, వాసరాణి=దినములు, కథం= ఎట్లు , వ్రజేయుః=గడచును, ఇతి=అని, విగణయ=యోచింపుము.

భా. ప్రియతమా! విధివశమున అసహాయుడనై నీకు దూరమైతిని. ప్రణయభారమున క్రుంగి కృశించితిని. ప్రేయసీ ! చక్కని ప్రథమోదబిందువులు సోక తడిసిన పుడమినుండి కమ్మని కమనీయపరిమళము లావిర్భవించును. అవి పద్మగంధసదృశములు. ఆ పృథివీసుగంధసదృశమగు నీవదనమారుతసౌరభములకు దూరమై ఇంతగా నీరసించితిని. అశక్తుడను. అసహాయుడను. అయినను పంచబాణుదు నన్ను విడువలేదు. కారుణ్యరహితుడై కనికరము వీడి రాత్రింబవళ్ళు వెన్నంటి వేధించుచున్నాడు. అతనికి బాణము లేదు. అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలములు అత్యంతమృదులము లవి. అయినను అదేమి వింతయో గాని అతని చేతియం దవి అత్యంతతీక్ష్ణములు. అదేమి పాపమో గాని విరహులను వేధించి పీడించుచున్నాడు. ఎంతటివారైనను అతని బారికి దూరులు కాజాలరు. పశుపతిప్రభావమున బుగ్గియైనను ఆ యమ్మ పార్వతి పుణ్యమా యని పునరుజ్జీవితుడై విజయగర్వమున విర్రవీగుచున్నాడు. ప్రవాసితులపాలిటి ప్రథమశత్రు వతడు. వియోగులపాలిట యమకింకరుడు. ప్రియతమా! వేసవి అంతమున ఆకాశమం దంతటను వ్యాపించి సూర్యాతపము నడ్డుకొని విజృంభించు మేఘావృత వర్షపుదుర్దినములు గడచుట ఎట్లో గదా! ఇంచుక యోచింపుము. నీకు దూరమై మదనుని కఱకు సాయకములకు గుఱియై ఇట్లు తపించుచుంటిని. ఏమి సేతును? అవశుడను.

మఱియు యక్షుని విరహోత్కంఠావర్ణన-

శ్లో. సంక్షిప్యేత క్షణ ఇవ కథం దీర్ఘయామా త్రియామా
సర్వావస్థా స్వహరపి కథమ్మన్దమన్దాతపం స్యాత్,
ఇత్థం చేత శ్చటులనయనే దుర్లభప్రార్థనం మే
గాఢోష్మాభిః కృతమశరణం త్వద్వియోగవ్యథాభిః. 48

అ. దీర్ఘ-యామా= దీర్ఘయామ (ఝాము)ములు గల, త్రియామా= రాత్రి, క్షణః ఇవ=క్షణముభాంతి, కథమ్=ఎట్లు, సంక్షిప్యేత=సంక్షేపింపబడును?

సర్వాసు=సకలమైన, అవస్థాసు= అవస్థలయందును, అహః అపి=పగలున్ను, కథమ్=ఏ విధముగా, మన్ద-మన్ద-ఆతపమ్=అత్యల్పతాపముగలది, స్యాత్=అగును? హే చటుల-నయనే!=ఓ చంచలాక్షీ!, ఇత్థమ్=ఈ విధముగా, దుర్లభ-ప్రార్థనమ్=సిద్ధించని కోరికగల, మే=నాయొక్క, చేతః=చిత్తము, గాఢ-ఊష్మాభిః=అతి తీవ్రములగు, త్వత్-వియోగవ్యథాభిః=నీ వియోగవేదనలచే, అశరణమ్=రక్షణలేనిదిగా, కృతమ్=చేయబడినది.

భా. ప్రియతమా! కష్టముల సతమతమగు వారికి కాలము గడచుట మహాకష్టము. అది లోకవిదితము. కష్టములకు తోడు కాలము సుదీర్ఘమగును. విఘడియలు ఘడియలుగా, ఘడియలు యామములు, యామములు దినములు, దినములు వారములు, వారములు నెలలు, నెలలు వత్సరములుగా పరిణమించుచు, దీర్ఘము లగుచు కొనలు సాగుచుండును. సుఖముల తేలియాడువారి కది తద్భిన్నము. యుగ మొక క్షణముగా మారి ఆనందమున తెలియకుండగనే జారిపోవును. ఓ చంచలాక్షీ! వియోగులకు కాలము గడవనే గడవదు. అది ప్రవాహమున కెదురీదుట వంటిది. ప్రణయినీప్రణయులకన్ననో కాల మగుపడనే యగపడదు. తెలియకుండగనే యది చరచర జరిగిపోవును. ప్రణయులము, వియోగపీడితులము మనకు కాల మెట్లు గడచును? ప్రేయసీ! మనకు మిగిలినది యావేదన, తపన, వృథాప్రయాస. ధ్యాన, విరహయాతనలతో నిదురలేని ఈ దీర్ఘయామములతో యామిని (రాత్రి), వేదనారహితమై క్షణముగా ఎట్లు మారునని నిరంతర మావేదన. అటులనే దివముగూడ అల్పోష్ణతను తాపసంతప్తము గాక విరహపీడన లేక సర్వావస్థల యందును సుఖప్రదమై సాగిపోవునా యని యాకాంక్ష. ఇదియే నా కోరిక, ఆశ. కాని విఫలమనోరథుడను. తీరని కోరిక. ఆరని యావేదన. యామిని గడచుటయే దుర్ఘటము. పగలు తాపసంతప్తము. దివారాత్రములు విరహపీడన. వియోగసంతాపము. సదా విరహవేదనా భారదూషితము నా మనసు. ఓ కురంగాక్షీ! నిరంతర భవద్వియోగ తాపసంతప్తుడ నగు నాకు నిర్వృతి లేదు. శరణ్యము లేదు. అసహాయుడను, దీనుడను, గాఢ ఊష్మ సంతప్తుడను. వేదనాభరితుడను. ఏమి చెప్పను నా దుస్థితి!

అవ. యక్షుడు విరహిణి యగు నిజపత్నికి ధైర్యము పురికొల్పుట-

శ్లో. నన్వాత్మానం బహు విగణయ న్నాత్మనైవావలమ్బే
తత్కల్యాణి త్వమపి నితరాం మాగమః కాతరత్వమ్,

కస్యైకాన్తం సుఖముపనతం దుఃఖమేకాన్తతో వా
నీచైర్గచ్ఛత్యుపరి చ దశా చక్రనేమిక్రమేణ. 49

అ. నను =ఓ ప్రియతమా! బహు= పరిపరివిధముల శాపాంతమున, ఈ యీ విధముగ చేయుదునని, విగణయన్ = భావించుచు, అహమ్ =నేను, ఆత్మానమ్ =నన్ను, ఆత్మనా ఏవ = స్వయముగనే, అవలమ్బే=ధరించు (నిగ్రహించు)చున్నాను. తత్ = కనుక, హే కల్యాణి =ఓ సౌభాగ్యవతీ! త్వమ్ అపి =నీవును, నితరామ్ = ఎంత మాత్రము, కాతరత్వం చ =భీరుత్వమును, మా గమః =పొందకుము. ఏలయన, కస్య =ఎవనికి, ఏకాన్తమ్ =ఎల్లకాలము, సుఖమ్ =సౌఖ్యము, వా =లేక, ఏకాన్తతః =కేవలము, దుఃఖమ్ =క్లేశము, ఉపనతం =ప్రాప్తము? దశా =అవస్థ, చక్ర-నేమి- క్రమేణ =చక్రముయొక్క అంచు (పట్టా)వలె, నీచైః =క్రిందికి, ఉపరి చ =మీదికిని, గచ్ఛతి =పరిభ్రమించును.

భా. ఓ కల్యాణీ! మదీయదుర్దశాశ్రవణమున బాధపడకుము. భీతి చెందకుము. నీ సౌభాగ్యగరిమను నేను సజీవుడను. భద్రుడను. నీ మాంగల్యబలము నన్ను పట్టియుంచినది. నీ సుభగత్వమాధారముగ జీవితము నెట్టుచున్నాను. అనతి కాలమున శాపాంతము సమీపించ వియోగాంతశుభదినముల నిన్ను గూడి ఏ దేదియో నెఱపి సుఖజీవితము వెళ్ళబుచ్చుదునని ఏ వేవియో మధురభావము లూహించుచు ఊరట జెందుచున్నాను. నిస్పృహనుండి భవిష్యదాశాకిరణము లంకురింప ధైర్యమూని నాకు నేనే స్వయముగా ఆలంబన మగుదును. కల్యాణీ! నీవును యించుక ఓరిమి వహించుము. ధైర్యమూనుము. కాతరత్వము కార్య సాఫల్యమునకు సాధకము గాదు. అనతికాలమున మన కష్టము లంతరించును. కోరికలు ఫలించును. మరొక్కమాట! మధురాతిమధురజీవితమును గడపితిమి. ఆనందడోలికలనూగితిమి. ప్రణయరసధునుల ఓలలాడితిమి. ఆ రసమయమధురజీవన మెక్కడ! భీతిల్లకుండు మెట్లని భీతి నొందకుము. కష్టసుఖములు కలకాలము నిలిచియుండవు. ఎవరికిని అవి శాశ్వతములు గావు. అవి పర్యావర్తనములు. ఏ జీవియు నిరంతరసుఖ మనుభవించదు. దుఃఖసంతప్తయు గాదు. కష్టసుఖములు చక్రనేమి (చక్రపుటంచు) క్రమమున తిరుగుచుండును. అవి క్రిందుమీదుల ముందువెనుకల పరిభ్రమించును. ఒకప్పుడు సుఖము మఱియొకప్పుడు కష్టము. ప్రియతమా! జీవితచక్రమది. మానవజీవనసరళి ఎగుడుదిగుడుగా మారుచుండును.

భాసమహాకవి మాట- కాలక్రమేణ జగతః పరివర్తమానా చక్రారపంక్తిరివ గచ్ఛతి భాగ్యపంక్తిః (స్వప్నవాసవదత్తము). ఇందలంకారము అర్థాంతరన్యాసము.

అవ. యక్షుడు యక్షిణికి శాపాంతమున ఒనగూడు సుఖముల వర్ణించుట-

శ్లో. శాపాన్తో మే భుజగశయనా దుత్థితే శార్ఙ్గపాణౌ
శేషాన్మాసాన్ గమయ చతురో లోచనే మీలయిత్వా,
పశ్చాదావాం విరహగణితం తం తమాత్మాభిలాషం
నిర్వేక్ష్యావః పరిణతశరచ్చన్ద్రికాసు క్షపాసు. 50

అ. శార్ఙ్గ-పాణౌ =శార్ఙ్గధనువు హస్తమున గల శ్రీ మహావిష్ణువు, భుజగ-శయనాత్ =శేషతల్పమునుండి, ఉత్థితే సతి = లేచినవాడు కాగా, మే=నాయొక్క, శాప-అన్తః =శాపముయొక్క అంతము. అతః =అందువలన, శేషాన్ =మిగిలిన, చతురః= నాలుగగు, మాసాన్ =మాసములను, లోచనే =నయనములను, మీలయిత్వా =నిమీలించి, గమయ =గడపుము. పశ్చాత్ = అనంతరము, పరిణత -శరత్ చన్ద్రికాసు =పండిన శరత్కాల చంద్రికలు గల, క్షపాసు =రాత్రులయందు, ఆవామ్ =మనము, విరహ-గణితమ్ = వియోగము (ఎడబాటు)చే వృద్ధినొందిన, తం తం=ఆ యా, ఆత్మ-అభిలాషం =మనోభిలాషను, నిర్వేక్ష్యావః =అనుభవించగలము.

భా. ప్రియతమా! ఈ మన విరహవేదన నిరవధికము గాదు. ఈ దుఃఖమునకు అవధి యున్నది. అనతికాలమున ఆ యవధి (హద్దు) సమీపించనున్నది. శాపాదినుండి ఇంచుమించు ఎనిమిది మాసములు గడచినవి. ఇక మిగిలినవి నాలుగు నెలలు మాత్రమే. శేషశయనుడు శేషపాన్పునుండి బోధితు డగుటయే తడవుగ నా శాప మంతరించును. అదియే నా విరహావసానమునకు హద్దు. గడువు. కాన ఓ ప్రేయసీ! ఈ శేషించిన నాలుగునెలలను ఎట్లో నేత్రముల నిమీలించి (మూసుకొని) గడపవేడెదను. ఇవి అల్పదినములే గదా యను భావమున ధైర్యము గొని త్రుటిలో గడిచిపోగల వను తలంపున ఓరిమి వహించి ఈ శేషదినములను గడపెదవు గాక యని భావింతును. ఈ అల్పదినములు గడచినంతలో శార్ఙ్గపాణి శేషశయనమునుండి ఉత్థితుడగును. మన వియోగ మంతరించును. తిరిగి శుభదినముల కారంభమది. విరహదినముల ఒండొరులకు దూరమై ఎడబాటున అభిలాషలు పెంచుకొంటిమి. ఆశలు, ఆకాంక్షలు ప్రణయభావమున ద్విగుణీకృతములైనవి. హృదయమున మధురభావము లెన్నియో మెదలుచున్నవి. భోగలాలసత పెరిగి పెద్దదైనది. పునర్మిలనమున ఇట్లు చేయుదు మట్లు చేయుదుమని హృదయమున భవిష్యత్సు ఖముల నూహించుకొనుచు ఆశతో దినములు గడుపుచుంటిమి. మాటిమాటికి

మధురమనోరథము లావర్తితము లగుచున్నవి. ఓ సౌభాగ్యవతీ! పెరిగిన మన మనోభిలాషలు మనోరథము లీడేరు కాల మనతికాలమున సమీపించనున్నది. మన పూర్వానుభవవాసన లంతరించలేదు. నవనవోన్మేషముగ అవి చిగురించుచునే యున్నవి. శరత్కాలపు ఆ వెన్నెలతేటలు ఆ చల్లనిరాత్రులు ఎంత రమ్యములు! ఎంత హృదయాహ్లాదకరములు! ఎంత ఆనందదాయకములు! ప్రియతమా! ఆ శరచ్చంద్రికా ధవళితములగు వెన్నెలరాత్రులందు విరహమున పెంచి పోషించిన మనోభిలాష (కమ్మనికోరిక)లను అనతికాలమున మనము మనసార అనుభవించగలము. ఇందలంకారము ఉదాత్తము.

అవ. యక్షిణి విశ్వాసార్థము అభిజ్ఞానవర్ణన-

శ్లో. భూయశ్చాహ త్వమపి శయనే కణ్ఠలగ్నా పురా మే
నిద్రాం గత్వా కిమపి రుదతీ సస్వరం విప్రబుద్ధా,
సాన్తర్హాసం కథిత మసకృత్ పృచ్ఛతశ్చ త్వయా మే
దృష్టః స్వప్నే కితవ రమయన్ కామపి త్వం మయేతి. 51

అ. త్వద్భర్తా =నీ విభుడు, మన్ముఖేన =నా నోటితో, భూయః చ =మఱియును, ఆహ =పలికెను. పురా =ఒకప్పుడు, శయనే =తల్పమందు, మే =నాయొక్క, కణ్ఠ-లగ్నా-అపి= కంఠమందు లగ్నమైనదానవైనను, త్వమ్ =నీవు, నిద్రామ్ =నిద్రను, గత్వా = పొంది, కిమ్ అపి =ఏలనో , సస్వరమ్ =బిగ్గరగా, రుదతీ = రోదించుచు, విప్రబుద్ధా =మేల్కొంటివి. అసకృత్= మాటిమాటికి, పృచ్ఛతః =అడుగుచున్న, (కారణము) మే =నాకు, హే కితవ!= ధూర్తుడా! త్వం=నీవు, కామ్ అపి =ఎవతెనో, రమయన్ = రమించు (ఆనందపఱచు)చు, మయా =నాచే, స్వప్నే = స్వప్నమున, దృష్టః =చూడబడితివి, ఇతి = అని, త్వయా =నీచేతను, స-అన్తః-హాసం యథా తథా =హాసపూర్వకముగా, కథితం చ = చెప్పబడినది. (అని నీ ప్రియుడు నాపరముగా పలికెనని అన్వయము.)

భా. ఓ యబలా! అన్యుడను గాను. ఆప్తుడను. వంచకుడను గాను. నీ పతి కెంతయు కూర్చిన మిత్రుడను. అత్యంతసన్నిహితుడను. హితుడను. మాకు అరమరికలు లేవు. రహస్యము లంతకంటెను లేవు. నే జెప్పునది యథార్థము. విశ్వసింపుము. నీకు శుభ మొనరించువాడను. త్వత్ప్రియుడు మన్ముఖమున మఱియు గురుతుగా బంపిన మీ ప్రణయరహస్యము నాలకించుము. అది, యేమన "ప్రియతమా! మున్నొకనాడు ఏకశయ్యాగతుల మగు మన మధ్య జరిగిన మధురసల్లాపము (ఘటన) గుర్తుకు వచ్చుచున్నది. ప్రణయభావమున నన్ను బిగికౌగిట బంధించి నిదురించితివి. నీ రమణీయబాహుబంధముల నే చిక్కియుంటిని. కదలుటకు మెదలుటకు ఎట్లు సాధ్యపడును! నే నెచ్చటికి

పోగలను? అయినను నీవేలనో బిగ్గరగ రోదించుచు మేల్కొంటివి. అన్యులెవ్వరును లే రిచ్చట. ఎందుల కీ యేడ్పు. ఏల యీ రోదనము? ఏమి సంభవించినది యని గ్రుచ్చి గ్రుచ్చి యడిగితిని. ఏమి జరిగినదని ప్రాధేయపడి ప్రశ్నించితిని. అడుగగా అడుగగా ఎట్టకేలకు నీ వనినది జ్ఞప్తి యున్నదా! ఎంత ధూర్తుడవు? ఎంత వంచకుడవు? ఎంత శఠుడవు? అన్య నెవతెనో రమించుచుంటివని కలగంటినంటివి. అదియు అంతర్హాసమున పైకుబుకు హాసమును బిగబట్టి ముసిముసినవ్వుల సందడిలో చిరునవ్వును చిలకరించుచు అన్నమాట యది. తరితీపుల మూట యది. ఎట్లు మరతును. మరతుమన్నను మరపురాదు. ఓ ప్రమదా! ప్రియతమా! ఇప్పుడా సుమధురఘట్టము నా మనమున మెదలుచున్నది. నా కన్నులయెదుట కదలుచున్నది.

అవ. యక్షుని ప్రేమాతిశయవర్ణన-

శ్లో. ఏతస్మా న్మాం కుశలిన మభిజ్ఞానదానాద్విదిత్వా
మా కౌలీనా దసితనయనే మయ్యవిశ్వాసినీ భూః,
స్నేహా నాహుః కిమపి విరహే ధ్వంసిన స్తే త్వభోగా
దిష్టే వస్తున్యుపచితరసాః ప్రేమరాశీభవన్తి. 52

అ. హే అసిత-నయనే=కృష్ణనయనీ! ఏతస్మాత్ = పూర్వోక్తమగు, అభిజ్ఞాన-దానాత్ =మన ప్రణయరహస్య ఉదాహరణవలన, మామ్ =నన్ను, కుశలినమ్ =కుశలుడనుగా, విదిత్వా =తెలిసి, కౌలీనాత్=లోకప్రవాదమువలన, మయి =నాయందు, అవిశ్వాసినీ = విశ్వాసము లేనిదానవు, మా భూః=కాకుము. విరహే =వియోగమున, స్నేహాన్ =ప్రేమలను, (మమతలను) కిం అపి=ఏలనో, ధ్వంసినః = భ్రష్టమైనవానినిగా, అహుః =చెప్పుదురు. తు =కాని, తే = అవి, అభోగాత్ =అనుభవరాహిత్యమువలన, ఇష్టే = అభిలషణీయమగు, వస్తుని = విషయమున, ఉపచిత-రసాః సన్తః= వృద్ధినందిన రసము కలవగుచు, ప్రేమ-రాశీ-భవన్తి = ప్రేమరాశి యగుచున్నవి.

భా. ఓ అసితకృష్ణనయనా! పూర్వోక్త అభిజ్ఞానమున కుశలుడనని భావింపుము. సంకేతముగా నే నంపిన మన ప్రణయరహస్యకార్యకలాప(మూలము)న సజీవుడనని వేరుగ నుడువబనిలేదు. అయినను లోకులు పలుగాకులు. అపవాదములకు లోటుండదు. యక్షుడు సజీవుడైన ఇంతకాల మేల రాకుండును? మృత్యుడై యుండనోపు. లేనిచో ప్రియసతి నేల విడిచియుండును? అట్లు గానియెడల అన్యకాంతాసక్తుడైన గావచ్చును. వియోగమున స్నేహము చంచలము. అస్థిరము. ఎడబాటున ప్రేమ అస్తమించును. స్నేహ మంతరించునని

ఏమేమియో గుసగుసలు బయలుదేరును. వాటి నెవ రడ్డగలరు! ఎవ రాపగలరు! ఓ విశాలకమలనేత్రీ! జనాపవాదములు నమ్మి మోసపోకుము. నాయం దవిశ్వాసినివి గాకుము. నా హృదయము నీకు తెలియనిది కాదు. మచ్చలేనిది నా మనసు. మన ప్రణయము కళంకరహితము. మన అకళంకప్రణయహృదయమున చోటులే దితరులకు. జనాపవాదములు నమ్మి భీతి జెందకుము. అన్యోన్యవిశ్వాసమును సడలనీయకుము. అచంచలమగు మన ప్రణయజీవితమున అవిశ్వాసమునకు చోటు లేదు. వియోగమున స్నేహ మస్థిరమని కొందరు విరహు లన్యోన్యము దూరులగుట అనాసక్తిభావ మతిశయించి ప్రేమ అంతరించునని మరికొందరు ఏమేమియో అందురు. కాని అదెంత మాత్రము నిజము కాదు. ప్రణయినీప్రణయుల కలయికకు వియోగ మడ్డుపడు ననునది యథార్థము. ప్రవాసమున వారికి సహవాసము పొసగ దనునదియు నిజము. వియోగమున భోగానుభవమునకు తావు లేదనునది కాదనను. కాని భోగాభావమున ఇష్టవస్తువునం దాసక్తి అతిశయించునే కాని కొరవడదు. ప్రేమపాత్రయందలి ప్రీతి తృష్ణ యధికమగునే కాని కుంటువడదు. రాగ మతిశయించి భావి యనుభవమునకు ప్రోది చేయును. వియోగమున అన్యోన్యభోగాసక్తులగు సతీపతుల ప్రేమ, అభిలాష, సంగబుద్ధి తొణికిసలాడ దినదినప్రవర్ధమానమై ఉవ్వెత్తుగా బెరిగి రాశీభూతమగును. ప్రవాసాంతమున భావిభోగానుభవముల కది మూలమగును. అలంకారము అర్థాంతరన్యాసము- "స్నేహప్రేమ్ణో రవస్థాభేదాద్భేదః. తదుక్తమ్- 'ఆలోకనాభిలాషౌ రాగస్నేహౌ తతః ప్రేమా, రతిశృంగారౌ యోగే వియోగతో విప్రలమ్భశ్చ'. ఇతి. తదేవ స్ఫుటీకృతం రసాకరే-ప్రేమా దిదృక్షా రమ్యేషు తచ్చిన్తా త్వభిలాషకః, రాగస్తత్సఙ్గబుద్ధిః స్యాత్ స్నేహ స్తత్ప్రణయక్రియా, తద్వియోగాసహం ప్రేమ రతిస్తత్సహవర్తనమ్, శృంగార స్తత్సమక్రీడా సంభోగః సప్తధా క్రమాత్' ఇతి.

అవ. ప్రియురాలి సందేశము గొనిరమ్మని యక్షుడు మేఘుని అర్థించుట.

శ్లో. ఆశ్వాస్యైవం ప్రథమవిరహోదగ్రశోకాం సఖీం తే
శైలాదాశు త్రినయనవృషోత్ఖాతకూటాన్నివృత్తః,
సాభిజ్ఞానప్రహితకుశలై స్తద్వచోభిర్మమాపి
ప్రాతః కున్దప్రసవశిథిలం జీవితం ధారయేథాః. 53

అ. ప్రథమ-విరహ-ఉదగ్ర-శోకామ్=ప్రథమవియోగముచే నుత్కటమైన వేదన గల, తే=నీయొక్క, సఖీం =చెలిని, ఏవం= ఈప్రకారము (నే జెప్పిన విధమున) ఆశ్వాస్య =ఊరడించి, త్రి-నయన- వృష-ఉత్ఖాత-కూటాత్=త్రినేత్రుని వృషభముచే నవదారితములగు కూటములుగల, శైలాత్=కైలాసమునుండి, ఆశు =శీఘ్రముగా,

నివృత్తః సన్ =వెనుదిరిగినవాడ వగుచు, స-అభిజ్ఞాన-ప్రహిత-కుశలైః = సలక్షణముగా పంపబడిన క్షేమసమాచారముగల, తద్వచోభిః=ఆమె వాక్కుల చేత, ప్రాతః =ప్రభాతసమయమున, కున్ద-ప్రసవ-శిథిలమ్ = కుందప్రసవమువలె శిథిలమైన, మమ అపి =నాయొక్కయు, జీవితమ్ = జీవితమును, ధారయేథాః =నిలుపుదువుగాక.

భా. జలదా! హితుడవు, చతురవచోనిధివి, ఉదారచరితుడవు, జీవనప్రదాతవు ప్రాణదాతవు. మత్సందేశము నెఱప సమర్థుడవు. నాకు ప్రియసతి. నీకా! సఖి, నెచ్చెలి యగు ఆమెకు నామాటగా హెచ్చుతగ్గులులేక మత్సందేశము వినిపింపుము. ప్రథమవియోగము, అమితసంతాపకరము. ఎంత యావేదన! ఆ విరహభారమున అణగి యణగి, క్రుంగి క్రుంగి బ్రతుకు నామెకు అతిశయోక్తి ఎంత బాధాకరము? ప్రాణాంతక మది. నా ప్రణయవేదనను కుదించి చెప్పిన అన్యాసక్తుడనను అనుమానమున కాస్పదమగును. తత్కారణమున ఉన్నదున్నట్లు వాక్రుచ్చి ఓదార్చి ఆశలు చిగురింపజేసి త్వత్సఖి ప్రాణము ఉద్ధరింపుము. జీవనప్రదాత వను సార్థకత్వమును చేజారనీకుము. మిత్రమా! అంతటితో నీ కార్యభారము ముగియదు. అచట నీ కచ్చెరువు గొలుపు ముచ్చట ఇంకొకటి గలదు. మహాదేవుని వృషభరాజము. శంకరుని శ్వేతవాహనము. నంది. ఆ వృషభరాజగమన మెంత ఠీవి? దాని యౌన్నత్యము మాట చెప్పనేల? దాని యాఖేలన మెంత ముచ్చట! మిత్రమా! ఆఖేలనమున తన శృంగము (కోర)ల గిరిశృంగములు భేదించి శిలలను చెదరగొట్టిన ఆ మనోహరదృశ్య మెంత హృదయరంజకము! అత్యంతకమనీయదృశ్య మది. చూచుట కెంత ముచ్చట గొల్పును! దాని వీక్షించి ఆ శివనివాసము కైలాసమునుండి వెంటనే వెనుదిరుగుము. మఱియు అభిజ్ఞానపూర్వకముగ ఏదేని చిహ్నమాధారముగ ఆమె కుశలవార్తను గూడ గొని తెచ్చి నాకు ప్రాణదాతవు కమ్ము. జీవన మిమ్మని ప్రార్థింతును. మిత్రమా! ఏదేని గుఱుతు తెమ్మంటి నని బాధపడకుము. అన్యథా భావించకుము. అపనమ్మిక కది హేతువు గాదు. జలదా! మోడువారిన బ్రతుకు నాది. నిరర్థకమగు నిక్కృష్టజీవితము నాది. సలక్షణమగు నా పతి కుశలవార్త నా మది కెంతయో యూరట గొల్పును. అది నా తపన కెంతయో ఉపశమనము. నిరంతరవిరహవేదనాసంతప్తమగు నా హృదయము ప్రాతఃశిథిలకుందకుసుమసదృశము. ప్రభాతమున పట్టుసడలిన మొల్లపూవువంటిది. అట్టి నా ప్రాణము నిలిపి ప్రాణదాతవు కమ్మని ప్రార్థింతును. అలంకారము ఉపమ.

అవ. ప్రార్థన అంగీకృతమని యక్షుని భావన-

శ్లో. కచ్చిత్సౌమ్య వ్యవసిత మిదం బన్ధుకృత్యం త్వయా మే
ప్రత్యాదేశా న్న ఖలు భవతో ధీరతాం కల్పయామి,
నిశ్శబ్దోఽపి ప్రదిశసి జలం యాచిత శ్చాతకేభ్యః
ప్రత్యుక్తం హి ప్రణయిషు సతా మీప్సితార్థక్రియైవ. 54

అ. హే సౌమ్య! =ఓ సాధుసత్తమా! సౌమ్యస్వరూపా! ఇదమ్ = ఈ, మే =నాయొక్క, బంధుకృత్యం =మిత్రకార్యము, త్వయా = నీచే, వ్యవసితం కచ్చిత్=అంగీకృతమే గదా!, ఖలు=యథార్థమునకు, ప్రత్యాదేశాత్ =చేయుదు నను సమాధానమువలన, భవతః= నీయొక్క, ధీరతామ్=ధీరత్వమును, న కల్పయామి =సమర్థించను, (ఏలయన) యాచితః సన్ =అర్థించబడినవాడనై, నిశ్శబ్దః అపి = గర్జించకున్నను, చాతకేభ్యః =చాతకములకు, జలమ్ =జలమును, ప్రదిశసి =ఇచ్చుచున్నావు. హి =ఎట్లన, సతామ్ = సత్పురుషులకు, ప్రణయిషు =ఆప్తులయందు, ఈప్సిత-అర్థ-క్రియా ఏవ =అభీష్టకార్యనిర్వహణయే, ప్రత్యుక్తమ్ = సమాధానము.

భా. మిత్రమా! నీవు సౌమ్యుడవు, సాధుచిత్తుడవు. నేను ఆప్తుడను, ఆర్తుడను, అర్థితుడను. చేయునది మిత్రకార్యము, బంధుసహాయము. నీ పరమున సందేశ మంపి మత్ప్రియసతి క్షేమ మరయకోరితిని. గాఢవియోగ పరితాపసంతప్త యగు నామె యూరాట ముదుపగోరితిని. ఏమందువు? మిత్రకార్యసాధన కిష్టపడితివా? మత్సందేశము నెఱప సమ్మతించితివా? ఇష్టమే నెఱపెద నను ప్రతివచనము మాత్రమే ధీరత్వమునకు హేతువు కాజాలదు. సమ్మతించితి నను సమాధానము గాంభీర్యమును తెలుపజాలదు. అది ప్రతిష్ఠకు హేతువు గాదు. మౌనమును అనంగీకారముగ భావించను. తూష్ణీంభావమే నీ కెంతయు తగియున్నది. చాతకములు నీ రాకకు వేచియుండును. నీ చినుకులు తక్క వాటికి ప్రాణధారణకు వేరు మార్గము లేదు. అవి నీ రాకకై వేచి యర్థించుచుండును. ప్రతివచన మీయకయే నిశ్శబ్దముగ వాటికి జలకణము లందింతువు. నీ యౌదార్యమునకు తార్కాణ మిది. అది నీకు సహజగుణము. అవును! సజ్జనులు పలుకకయే అర్థిజనప్రయోజన మీడేర్తురు. సత్పురుషులు ఆప్తకార్యములు మౌనముగనే స్వీకరించి నెరవేర్తురు. చేతలే వారి ప్రత్యుత్తరములు. గర్జించిన మేఘము వర్షించదు. నిశ్శబ్దమగు మేఘము వర్షించు నందురు. అల్పునికి వాగాడంబర మధికము. కార్యశూరత్వము శూన్యము. సజ్జనుడు చెప్పకయే కార్యసాధన కుద్యమించును. ఇది లోకవిదితము. ఇం దలంకారము అర్థాంతరన్యాసము.

అవ. యక్షుడు మేఘునికి తన శుభాకాంక్ష తెలుపుట.

శ్లో. ఏతత్కృత్వా ప్రియ మనుచితం ప్రార్థనాదాత్మనో మే
సౌహార్దాద్వా విధుర ఇతి వా మయ్యనుక్రోశబుద్ధ్యా,
ఇష్టాన్ దేశాన్ జలద విచర ప్రావృషా సంభృతశ్రీ
ర్మా భూదేవం క్షణమపి చ తే విద్యుతా విప్రయోగః. 55

అ. హే జలద!= ఓ మేఘుడా! సౌహార్దాత్ వా =సుహృద్భావము వలనగాని, విధురః ఇతి =వియుక్తు డను కారణమున గాని, మయి = నాయందు, అనుక్రోశ-బుద్ధ్యా వా =కారుణ్యబుద్ధిచే గాని, ఆత్మనః = నీకు, అనుచితమ్ అపి =దూతకార్యము తగనిదైనను, మే =నాయొక్క, ఏతత్ =ఈ, ప్రియమ్ =ఈప్సితార్థమును, ప్రార్థనాత్= అభ్యర్థనవలన, కృత్వా =నిర్వహించి, ప్రావృషా =వర్షముచే, సంభృతశ్రీః సన్= వృద్ధినందిన శోభ కలవాడవై, ఇష్టాన్ =అభిమతమైన, దేశాన్ =దేశముల, విచర =సంచరింపుము. క్షణమ్ అపి = క్షణకాలమైనను, తే =నీకు, విద్యుతా =మెఱుపుఇల్లాలితో, ఏవమ్ =ఇట్టి అత్యంతసంతాపకరమైన, విప్రయోగః =వియోగము, మా భూత్ = కలుగకుండుగాక.

భా. జలదా! చెప్పవలసిన దేదియో నీకు తెలియజెప్పితిని. ఇక కర్తృత్వము నీ యధీనము. అది నీ యిష్టానిష్టములపై ఆధారపడియున్నది. ఉదారత్వము నీ సహజగుణము. రసహృదయము నీది. దూతకార్యము నీకు తగదనుట ఎరుగుదును. నీ యంతస్థున కది యోగ్యమైనది కాని విషయము యథార్థము. విరహసంతప్తులకు యుక్తాయుక్తవివేక మెక్కడిది? వియుక్తుడను, విప్రలబ్ధుడను, ప్రణయపీడితుడను. అమరోధించి ప్రార్థింతును. మిత్రకార్యమను సుహృద్భావమున గాని లేక విధురుడు యుక్తు డను కారుణ్యబుద్ధి గాని విరహసంతప్తుడ నను సానుక్రోశము (దయ)న గాని ఏవిధముగ నైనను నాయెడల ఔదార్యము వహించి, దూతకార్యము నెరపి నా యభీష్టము నెరవేర్తు వని ఆశింతును. ఈ యిడుమలనుండి నన్నుద్ధరింప ప్రార్థింతును. తదుపరి ప్రావృట్ శోభాపరిపూర్ణుడవై యథాభీష్టముగ దేశదేశముల విహరించుము. మఱొక్కమాట! వర్షముల వృద్ధినొందిన పూర్ణశోభను సంతరించుకొని నీవు కోరిన ప్రదేశముల యథేచ్ఛగా నిరాటంకముగా సంచరించుము. మఱొక్కమాట! నావలె నీకును క్షణకాలమైనను నీ ప్రియసతి విద్యుత్కాంతతో వియోగ మొదవకుండుగాక యని ప్రార్థించెద. నీ ప్రణయిని సౌదామినితో నీ కెన్నడును నే ననుభవించుచున్న భూరిసంతాపసంభరితమగు నెడబాటు సంభవింపకుండుగా! యని కాంక్షించెదను. ఆశించెదను. ఇందు విద్యున్మేఘములయం

నాయికానాయకవ్యవహార ఆరోపణమున సమాసోక్తి యలంకారము.

శ్లో. ఇత్యాఖ్యాతే సురపతిసఖః శైలకుల్యాపురీషు
స్థిత్వా స్థిత్వా ధనపతిపురీం వాసరైః కైశ్చిదాప,
మత్వాఽగారం కనకరుచిరం లక్షణైః పూర్వముక్తైః
తస్యోత్సఙ్గే క్షితితలగతాం తాం చ దీనాం దదర్శ. (ప్రక్షిప్తము.)

అ. ఇతి =పూర్వోక్తప్రకారము, ఆఖ్యాతే సతి = చెప్పబడినది కాగా, సురపతి-సఖః =మేఘుడు, శైలకుల్యాపురీషు = పర్వతనదీతీరనగరములందు, స్థిత్వా స్థిత్వా =ఆగి యాగి, కైశ్చిత్ = కొన్ని, వాసరైః=రోజులలో, ధనపతి-పురీమ్ =కుబేరనగరమును, ఆప =చేరెను. పూర్వం =ముందు, ఉక్తైః =చెప్పబడిన, లక్షణైః =చిహ్నములచే, కనక-రుచిరమ్ =స్వర్ణకాంతి గల, ఆగారమ్ = భవనమును, మత్వా =గుర్తించి, ఉత్సఙ్గే =సౌధోపరిభాగమున, క్షితితల-గతామ్ =పుడమి నాశ్రయించిన, దీనామ్ =దీనురాలగు, తామ్ = ఆ యక్షపత్నిని, దదర్శ =వీక్షించెను.

భా. యక్షుడు పూర్వము విశదీకరించిన మార్గమున నదీనదముల, గిరికాననముల అందందు ఆగి యాగి ఆ యా రమణీయ దృశ్యముల వీక్షించుచు కొన్ని వాసరములకు ఇంద్రసఖుడగు మేఘుడు, కుబేరనగరమున అలకాపురిని జేరి అందు పూర్వోక్తలక్షణముల స్వర్ణదీప్తుల భాసిల్లు యక్షభవనమును గుర్తించెను. తదుపరి భవనోపరిభాగమున పుడమి నాసీనయై యున్న దైన్యమూర్తి యక్షపత్నిని దర్శించెను.

శ్లో. తస్మాదద్రేర్నిగదితు మథో శీఘ్రమేత్యాలకాయాం
యక్షాగారం విగలితనిభం దృష్టచిహ్నైర్విదిత్వా,
యత్సన్దిష్టం ప్రణయమధురం గుహ్యకేన ప్రయత్నా
త్తద్గేహిన్యాః సకల మవదత్ కామరూపీ పయోదః. (ప్రక్షిప్తము.)

భా. అపీ=అనంతరము, కామరూపీ =ఇచ్ఛాధీనవేషభాషలు గల, పయోదః =మేఘుడు, సన్దేశమ్ =వార్తను, నిగదితుమ్ =వినిపించుటకు, తస్మాత్ =పూర్వోక్తమగు, అద్రేః = చిత్రకూటాద్రినుండి, శీఘ్రమ్=వెంటనే, ఏత్య =వచ్చి, దృష్ట-చిహ్నైః =గుర్తించిన చిహ్నములు గల, విగలిత-నిభమ్ =గతించిన శోభ కల, యక్ష-అగారం =యక్షభవనమును, విదిత్వా =తెలిసి, యత్= ఏ విషయము, గుహ్యకేన =యక్షునిచేత, ప్రయత్నాత్ = యత్నపూర్వకముగా, సన్దిష్టమ్ =సందేశింపబడినదో, తత్ =ఆ , ప్రణయ-మధురమ్ =ప్రణయమధురమగు,

సకలం = సమస్తమును, గేహిన్యాః =యక్ష (పత్ని) గృహిణికి, అవదత్ =విశదీకరించెను.

భా. యక్షునివలన సందేశము వినినపిమ్మట కామరూపధారి యగు మేఘుడు తా నెఱపు సందేశము వినిపింప రామగిరినుండి శీఘ్రముగ పయనమై మున్ను విశదీకరింపబడిన చిహ్నములచే గృహిణీగృహస్థుల వియోగమున చెన్ను దరిగిన యక్షభవనమును గుర్తించి, యత్నపూర్వకముగ యక్షు డంపిన ప్రణయమధురమగు సందేశమును యక్షపత్నికి సాకల్యముగ వివరించెను.

అవ. మేఘుడు యక్షపత్నికి సందేశము వినిపించుట-

శ్లో. తత్సన్దేశం జలధరవరో దివ్యవాచాఽఽ చచక్షే
ప్రాణాం స్తస్యా జనహితరవో రక్షితుం యక్షవధ్వాః,
ప్రాప్యోదన్తం ప్రముదితమనాః సాపి తస్థౌ స్వభర్తుః
కేషాం న స్యా దభిమతఫలా ప్రార్థనా హ్యుత్తమానామ్. 56

అ. జల-ధర-వరః =జలధరముల నుత్కృష్టుడగు మేఘుడు, తస్యాః= ఆ విరహపీడితయగు, యక్ష-వధ్వాః =యక్షపత్నియొక్క, ప్రాణాన్ =ప్రాణములను, రక్షితుమ్ =రక్షించు నిమిత్తము, జన-హిత- రవః సన్ = జనుల కింపైన ధ్వని కల వా డగుచు, తత్ సందేశమ్ =యక్షుని కుశలవార్తను, దివ్య-వాచా=దేవ వాక్కుతో, అచచక్షే =విశదపఱచెను. సా అపి =ఆమెయు, స్వ-భర్తుః =తన భర్తయొక్క, ఉదన్తమ్= సమాచారమును, ప్రాప్య =పొంది, ప్రముదిత-మనాః సతీ =అత్యంత ఆనందమనస్క యగుచు, తస్థౌ =ఉండెను. తథాహి =అవును, ఉత్తమానామ్=ఉత్తములకు (నివేదించిన), కేషామ్ =ఎవరియొక్క, ప్రార్థనా =ప్రార్థన, అభిమత-ఫలా =అభిలషించిన ఫలముగలది, న స్యాత్ =కాకుండును.

భా. జలధరుడు ఉత్తమకులోద్భవుడు, పేరు వడిసిన పుష్కలావర్తకవంశసంభవుడు నిరంతర పరోపకార దీక్షాపరతంత్రుడు. ప్రాణికోటి కత్యంతఆప్తుడు. ఆప్తుడే కాదు. జీవనప్రదాత. మేఘుని సహాయ మందని వారెవరు? అతని యాగ్రహము లోకములకు హాహాకారము. అతని ప్రసన్నత లోకములకు చల్లని వెన్నెల హాయి. అత డాగ్రహానుగ్రహదక్షుడు. అతని యనుగ్రహము సకలచరాచరప్రాణికోటికి శ్రీరామరక్ష. అతని యాగ్రహము ప్రళయభయంకర విలయతాండవము. వేయేల! సృష్టిస్థితిలయములు అతని యధీనములు. అతడు రసార్ద్రహృదయుడు. కరుణా తరంగిత అంతరంగుడు. సహజసేవాతత్పరుడు దివిజాధిపతికి కూర్చిన సన్మిత్రుడు, సచివుడు, సహాయకుడు, అతని నర్థించినాడు మన యక్షుడు. ప్రథమవియోగ పరితాపసంతప్త, ప్రణయిని, అబల, నిజపతి ప్రాణము లుద్ధరింప జలదుని అర్థించినాడు. విలపించినాడు. విరహసంతప్తుడు.

వియోగి. విధివంచితుడు. ప్రవాసితుడు. అంతగా అత డపరాధి కాడు. అయినను పశ్చాత్తప్తుడు. విరహపీడితులగు ఆ నవదంపతుల దయనీయస్థితికి మేఘుని హృదయము ద్రవీభూతమైనది. దయాతరంగితమైనది. కారుణ్యపూరితమైనది. అతిశీఘ్రముగ అతని కుశలవార్త ఆమె కందించి ఆమె యసువులు నిలుప లక్షించినాడు. దేవజాతి యగుట దైవవాణీ సాహయ్యమున ప్రియపతి ప్రేమ వార్తను, క్షేమవార్తను ప్రియసతికి అందించి, వారి మన్ననలకు పాత్రమైనాడు. యక్షపత్నియు ప్రియతముని కుశలవార్తలు విని ఆనంద భరితాంతరంగయై స్వస్థచిత్తయై ఊరట జెందినది. ఇట్లు యక్షయక్షిణుల కృతజ్ఞత లందుకొని జలధరుడు వారి ఆదరాభిమానములు చూరగొని ప్రేమకు పాత్రుడైనాడు. అవును! ఉత్తముల నర్థించినవారి అభ్యర్థన వ్యర్థము గాదు. సత్పురుషుల నాశ్రయించిన మనోరథము లీడేరకపోవు. సుజనుల ప్రార్థించిన ప్రార్థనాఫలము దక్కకపోదు. మేఘు డందుకు తార్కాణము. ఇందు సామాన్యముచే విశేషసమర్థనరూపమగు అర్థాంతరన్యాసాలంకారము.

అవ. శాపాన్తము పునస్సమాగమము-

శ్లో. శ్రుత్వా వార్తాం జలదకథితాం తాం ధనేశోఽపి సద్యః
శాపస్యాన్తం సదయహృదయః సన్నిధాయాస్తకోపః,
సంయోజ్యైతౌ విగళితశుచౌ దమ్పతీ హృష్టచిత్తౌ
భోగానిష్టానభిమతసుఖాన్ ప్రాపయామాస భూయః. 57

అ. ధన-ఈశః =ధనాధిపతియగు కుబేరుడును, జలద-కథితామ్ =మేఘునిచే జెప్పబడిన, తాం వార్తామ్ =ఆ యక్షుని క్షేమవార్తను, శ్రుత్వా =విని, సద్యః =ఆ క్షణముననే, స-దయ-హృదయః= దయతోకూడిన హృదయము కలవాడును, అస్త-కోపః చ సన్ =అస్తమించిన రోషముకలవాడును అగుచు, శాపస్య =శాపముయొక్క, అస్తమ్ = అంతమును, సన్నిధాయ= సమీపింపజేసి, విగళిత-శుచౌ=ఉపశమించిన దుఃఖముకలవారును, హృష్టచిత్తౌ =సంతుష్టాంతరంగులును అగు, ఏతౌ =పూర్వోక్తులగు, దంపతీ =భార్యాభర్తలను, సంయోజ్య = సమీకృతుల జేసి, అభిమత-సుఖాన్ = అభీష్టసుఖములు గల, ఇష్టాన్ = అభిమతవిషయకములగు, భోగాన్ =భోగములను, భూయః = తిరిగి, ప్రాపయామాస =ప్రాప్తింపజేసెను.

భా. విషయ మంతయు కుబేరుని చెవిని సోకినది. అతడు సహజ కోపి గాడు. సరళహృదయుడే. అయిన నేమి! విధివశముననో యక్షుని ప్రేమలంపటత్వము హేతువుగనో లేక అతని అలక్ష్యము కారణముగనో తన ఈశ్వరపూజ కంతరాయ మేర్పడినది. శివపూజాధురంధరు డతడు. యక్షుని

ప్రణయలంపటత్వమే శివపూజ కంతరాయముగ భావించి విప్రలంభము శిక్షగా విధించినాడు. ప్రేమవిహ్వలులకు అంతకంటె కఠినశిక్ష మరేమి గలదు! ఏమైనను అతడు తన కొలువుకూటమున కర్మచారి. అధికాంశము శిక్ష పూర్తియైనది. ఇక మిగిలినవి స్వల్పవాసరములు. యక్షుడును పశ్చాతప్తుడు. పాపమునకు ప్రాయశ్చిత్తము పశ్చాత్తాపమే గదా! అతడు మేఘుని ద్వారా ప్రియసతి కంపిన క్షేమవార్త ప్రేమసందేశము యక్షపతికి తెలిసినది. జలదుడు కారుణ్యభావమున గొనివచ్చిన ప్రణయసందేశ మది. దైన్యమున యక్షు డంపిన క్షేమవార్త యది. ధనపతిహృదయము ద్రవీభూతమైనది. ఆ నవదంపతుల దైన్యస్థితి కెంతయు చింతించినాడు. అతని క్రోధ మంతరించినది. యక్షునియెడల అతని హృదయము ప్రసన్నమైనది. జాగుచేయక వెంటనే శాప మంతమొందించినాడు. వారియెడబాటునకు స్వస్తి పలికినాడు. తన శాపము కారణముగ ఆ నవదంపతులు ప్రేమైకజీవులు, ప్రణయమూర్తులు, ఆనందకాములు విరహతాపమునకు గురియై అత్యంతసంతప్తులైరి. ఎడబాటున విరహపీడితులైరి. జలదానమున ప్రాణికోటి యార్తి చల్లార్చి ప్రాణదాన మొనర్చు జలదుడు వారి దుస్థితికి జాలి నొంది, రాయబారము నెరపి, వారికి స్వస్థత చేకూర్చి అసువులు నిలిపినాడు. ఇక తానో ధనదుడు. ఐశ్వర్యములకు అధిపతి. భోగముల ప్రదాత. ఇపుడు తానిక చేయవలసినది వియోగులగు జాయాపతులను, ఏకమొనర్చి ఇష్టభోగములు సమకూర్చుట. వారిప్పుడు స్వస్థచిత్తులు, దుఃఖరహితులు, సంతుష్టాంతరంగులు. ధనదుని కృపవలన ఆ జాయాపతులకు పునః యథాపూర్వముగ సమస్తసుఖములు సమకూడినవి. అభీష్టమనోరథములు సిద్ధించినవి. ఇపు డా నవదంపతులు, ప్రేయసీప్రియులు, సతీపతులు తామరతంపరగ ఇష్టభోగము లందగలరు. ప్రణయజలధుల నోలలాడుదురు. ధనదజలదులకు వారెంతయు కృతజ్ఞులు.

మహాకవి శ్రీకాళిదాస విరచిత మేఘసందేశమహాకావ్యమున
ఉత్తరమేఘ మను ద్వితీయసర్గ సమాప్తము.

శ్లో. ఇత్థంభూతం సురచితపదం మేఘదూతాభిధానం
కామక్రీడావిరహితజనే విప్రయోగే వినోదః,
మేఘస్యాస్మిన్నతినిపుణతాబుద్ధిభావః కవీనాం
నత్వాఽ ఽ ర్యాయాశ్చరణకమలం కాళిదాసశ్చకార. (ప్రక్షిప్తము).

భా. కాళిదాసు భగవతి కాళికాంబ చరణకమలములు నుదుటసోక న[illegible] ఆనందాశ్రువులు చింద మృదుమధురపదగుంభనలు మేళవించి, మేఘసందేశమన మహాకావ్యమును అత్యంతమధురరమణీయముగ రచించి, భరతఖండమున కెనలేని

కీర్తిసౌందర్యముల సమకూర్చెను. శారదాంబ కంఠమున వ్రేలు వేయిదీప్తుల వెలుగు అనర్ఘమణిహార మది. అందు ప్రణయచేష్టావంచితులగు వియోగిజనుల మానసికప్రవృత్తి వినోదములు, మహాకవుల బుద్ధికుశలత, ప్రతిభావ్యుత్పత్త్యౌచిత్యాదివిశేషములు మేఘుని దౌత్యచాతుర్యము, ఔదార్యసౌశీల్యాదిసుగుణసంపత్తి పుష్కలముగా వర్ణింపబడినవి. విశదీకరింపబడినవి.